# కాదంబరీ రసజ్ఞత

పేరాల భరతశర్మ
సంస్కృతోపన్యాసకుఁడు
పీఠికాపురాధీశ ప్రభుత్వకళాశాల
కాకినాడ

ప్రకాశకులు
బాలకృష్ణ పబ్లికేషన్సు
7-3-17 ప్రకాశంవీథి
రామారావుపేట
కాకినాడ-4

"కాదంబరీ రసజ్ఞత"

పేరాల భరతశర్మ

ముఖచిత్ర రచన :
శ్రీ బాలి (ఆంధ్రజ్యోతి)

ప్రథమముద్రణము
నవంబరు 1978
ప్రతులు వెయ్యి

ముద్రణ :
శ్రీపతి ప్రెస్
కాకినాడ

వెల 15/- రూపాయలు

ప్రతులకు :
పి. యస్. బాలకృష్ణ
బాలకృష్ణ పబ్లికేషన్స్
7-3-17 ప్రకాశం వీధి
రామారావుపేట, కాకినాడ-4.

శ్రీయుత వేంకటాచల
　　　　నిషేవితదివ్యపదాబ్జసక్తభృం
గాయితభక్తబృందకలి
　　　　కాలజదోషతుషారసంహార
ర్చీయుతభానుబింబ
　　　　ధృతశేషసమాకృతిరమ్యసప్తశై
లాయతనాభిరామ
　　　　సదయన్ గనవే మము వేంకటేశ్వరా !

ఎదలో మెదలెడు స్వామివి
అదనున కాపాడుచుందు వబ్బురముగ నీ
సదయాలోకన చాంద్రీ
మృదుధారల నాదు బ్రతుకు మెలపుము తండ్రీ !

శ్రీః

ఆ

మా భరతశర్మ కాయుః
శ్రీభాగ్యములిచ్చుఁ గాక శేషాహి శిరః
శ్శోభారత్నచ్ఛవి మ
ల్లోభాపఘనుండు లక్ష్మిలోలుఁడు కరుణన్.

5 మార్చి 1970 సంస్కృతికేంద్ర
అవధాన వేదిక **నుం**డి.

శూరాధ్యానుగునిన్ నిరంతరిత శుశ్రూషా సమాత్తోజ్జ్వల
ద్ధీరోచిష్ణుని సాధుశీలరచనాతృప్తున్ ప్రియోహాక్రియున్
పేరాలాన్వయ బాలచంద్రముని మత్ప్రేయః పథీను**న్** పురా
ప్రారూఢప్రతిభామతిన్ భరతశర్మన్ నేను దీవించెదన్.

డిసెంబర్ 1968
విజయవాడ శ్రీ రాజారంగయ్యప్పారాయ
ప్రభుత్వకళాశాల అవధాన వేదికనుండి
(సం) విశ్వనాథ సత్యనారాయణ

# గురుపాద ప్రణతి

ప్రావిర్భూతాః పునరపిచ కిం లోకభాగ్యోదయాత్తే
వాల్మీక్యాద్యాః సకల కవితాతీర్థసంస్థానభూతాః
ధృత్వారూపం విమలరుచిరం సత్యనారాయణాఖ్యం
వందేఽహం తం వివిధకవితా విశ్వనాథం మహాన్తం.

తనకున్ తానొక జ్ఞానపీఠమయి సత్కావ్యార్థనిర్ణేతృతా
ఘనమేధాపరితర్పితోత్తమరసజ్ఞస్తోత్రపాత్రుండునై
యినవంశోత్తమ సత్కథాసురధునీహేలాపరిష్కార నూ
తన భావాంబరవిశ్వనాథుడగు సత్యప్రఖ్యునెంతున్ గురున్.

# నివేదనము

మహాకవి భట్టబాణుని "కాదంబరీ" కావ్యముతో నాకిట్టియను బంధమేర్పడునని నేనెన్నడు నూహింపనైనలేదు. కాదంబరీకావ్యాను శీలనము నాకు అలవిగానిపని. కాని యే కొంచెమైనను నేటికిట్లు వ్రాయగలిగితినన్నచో అది దైవప్రేరణము; గురుదేవుల ఆశీస్సు. అంతకుమించి ఈ గ్రంథనిర్మాణములో నా సామర్థ్యకృతమేమియు లేదు.

పూజ్యపాదులు అస్మద్గురుదేవులు శ్రీ విశ్వనాథ సత్యనారాయణమహోదయులకు నాపైనగల ప్రేమను దయను వెల్లడించుటకు భాష చాలదు. ఏ లోకమున నుండిరో! నా రచనావ్యాసంగమున ఆయన అనుగ్రహదృక్ప్రసారము నా యనుభవైకవేద్యము.

పూజ్యపాదులు గురుదేవులు శ్రీ జటావల్లభుల పురుషోత్తము గారికికూడ నాయందు అట్టి అనుగ్రహమే కలదు.

ఈ మహనీయులను స్మరించి అంజలిఘటించుట నా ప్రథమ కర్తవ్యము.

కాదంబరీకావ్యపరమార్థము సమగ్రముగ తెలిసికొనుటకు మరియు కృషిచేయవలసి యున్నది. ఈ గ్రంథరచనకై నేను చదివిన గ్రంథముల పట్టికను అనుబంధము-2 లో నిచ్చితిని. ఆ గ్రంథరచయితల ఋణమెట్లు తీరును? వారి గ్రంథముల సదవగాహనమే వారి ఋణము మనము తీర్చుకొను మార్గము. ఆ ప్రయత్నములో ఏ కొంచెము సాధింపగలిగినను నేను ధన్యుడనే!

అనేకవిషయము లున్నవి. ఒక్కొక్క విషయమును అనేక కోణములలో చూడవచ్చును. ఏ కోణములో చూచినను మనకు తెలియునది యేకొంచెమో! అది తెలిసికొనుటకే మనకు సాధ్యము కాకున్నది. నేను కాదంబరీకావ్యమునుగూర్చి తెలిసికొన్న కొంచె

ములో కొంచెముమాత్రమే యిందు ప్రకటింప గలిగితిని. ఈ నా కృషికి లభించు ప్రోత్సాహమునుబట్టి ఈ కావ్యమునింకను అనుశీలించుటకు నాకు పూనికకలిగినచో నది సహృదయుల అనుగ్రహావిశేషముగా భావింతును.

పూజ్యపాదులు విద్వత్కవిశేఖర కవితావిశారద బ్రహ్మశ్రీ వెంపరాల సూర్యనారాయణశాస్త్రిగారి "సమీక్ష",

అభినవభారతి, దర్శనాచార్య, మహోపాధ్యాయ బ్రహ్మశ్రీ జమ్ములమడక మాధవరామశర్మగారి "భట్టారకభారతి", సాహిత్య సమ్రాట్, మహాకవి బ్రహ్మశ్రీ మధునాపంతుల సత్యనారాయణశాస్త్రి గారి "స్వాదమాధురి" ఈ నా కృతికి శిరోభూషణములు. మిత్రులు సువిచక్షణులైన "స్ఫూర్తిశ్రీ" గారి "బాణవాణి" ఈ కృతివిపంచిని మీటిన పాణి.

నాయందు సోదరభావముతో మాగురుకుటుంబములోని మల్లంపల్లి శరభయ్య అన్నగారు పంపిన ఆశీస్సు శిరసావహించితిని.

ఈ మహోదయులందరకు నా కృతజ్ఞతాపూర్వకనమస్సహస్రములు.

ఈ గ్రంథము పాఠకలోకమునకు అందించుటకు మూలకారణము బ్రహ్మశ్రీ మల్లాది వేంకటరామయ్యగారు. వారికి ఈ కృతి నంకితముచేసి నా కృతజ్ఞత కొంత వెల్లడించుకొంటిని. నేను అడుగకయే వారీగ్రంథమును ముద్రించుటకు ముందుకువచ్చిరి. ఆ ముందుకు వచ్చుటయే ఒక బాణమువలె వచ్చెను. వారి లక్ష్యసిద్ధికి ప్రత్యక్షసాక్ష్య మీకృతియొక్క ఆకృతి. వారికి నా నమస్సహస్రములు.

నా ఆరోగ్యమునుగూర్చి అనుక్షణము ఆందోళన చెందుచు గ్రంథరచనాసమయమున నా శ్రమకు మిక్కిలి తపించుచుండిన మా

అమ్మగారు నా శ్రమ ఈ రూపమున ఫలించినందులకు పొందిన ఆనంద మును అక్షరరూపమున అందించినది. అది ప్రకటింపకుండుటకు నామన సొప్పలేదు. ప్రకటించితిని ఎవరేమనుకొన్నను సరే!

ఈగ్రంథమును అందముగా సవరణపట్టిక అవసరము లేకుండ స్వల్పవ్యవధిలో ముద్రించియిచ్చిన శ్రీపతిప్రెస్ నిర్వాహకులు శ్రీ తోట గణేశ్వరరావుగారికి ఛందోమయకృతజ్ఞతలు.

వ్యాపారము భారతిపూ
జాపరమనియెడి పవిత్రసద్భావము ము
ద్రాపకులం దుండుట యన
శ్రీపతిప్రెస్సునకె చెల్లె శ్రీవరదంబై.

ముఖచిత్రమును అందముగా రచించిన శ్రీ "బాలి"ని (ఆంధ్ర జ్యోతి కళాకారులు) అభినందింతును.

గ్రంథరచనలో అనుక్షణము నన్ను ప్రోత్సహించిన నా సోద రుడు శ్రీ పేరాల లక్ష్మణరావు ఆశీఃఫల మీకృతి. వాని కుమారుడు చి॥ మల్లయ్యపంతులు బి. టెక్. 3 సం॥ విద్యార్థి ముఖచిత్రపు రూప కల్పనగూర్చి నాకు చేసిన సూచన మెచ్చదగిన ఫలిత మిచ్చినది. వానికి చిత్రకళాసిద్ధిని భగవంతుడు కల్పించుగాక! నాకు లేఖకుడుగానుండి గ్రంథము వ్రాయుటలో శ్రమించిన మా పెద్దవాడు చి॥ బాలకృష్ణ వాగ్దేవి కటాక్షపాత్రుడగుగాక!

సహృదయులు నాకృతిని చదివి దోషములను మన్నించి నాకు తెలిపినచో సవరించికొందును.

నమః సరస్వత్యై వాగ్దేవతాయై
—పేరాల భరతశర్మ



శ్రీః

శ్రీ మన్మోహన వేణుగానలహరీశృంగారలీలాబ్ధి బృం
దామందారవనాంతరాంతరమునన్ దళ్కొత్తు హేలాఘన
శ్యామాకారము రాధికాప్రణయినీసౌదామనీశ్లిష్టచి
ద్వ్యోమాధారము కూర్చు శ్రేయముల పెంపున్ మత్కృతిస్వామికిన్.

ఔరా! యెంతవిరాగి! భస్మమయమౌ నంగమ్ములందెల్ల నా
గౌరీరూపమె ముద్రముద్ర పడెనాన్ గంగావచోభంగి లీ
లారాజద్దరహాసభాసురముఖాలంకారుఁడౌ స్వామి ప్రే
మారంభంబులభీష్టసిద్ధు లిడుతన్ మల్లాది రామయ్యకున్.

ఆరంభించిన సర్వకార్యములయం దాద్యుండవై పూజ లిం
పారం బొందినఁగాని తృప్తిఁగనవయ్యా, విఘ్నరాజా! మదీ
యారంభంబులనెన్నఁడున్ సలుపకయ్యా విఘ్నమున్ మ్రొక్కెదన్;
మా రామయ్యను మత్కృతిప్రభుని సంపత్తౌఘునిన్ జేయుమా!

వాణిభజించుకోర్కెగలవాని, కవీంద్రుల నెన్ని వారి వి
న్నాణములందునన్ మనసునన్ రమియించెడు వాని, విద్యకున్
సాణెముగట్టువాని, కృతినాయకు వేంకటరామయాఖ్యు నో
వాణి కృపాకటాక్షములపాలన లాలనసేయు మమ్మరో!

శ్రీః



కృతిస్వీకర్త :

బ్రహ్మశ్రీ మల్లాది వేంకటరామయ్యగారు

ధర్మపత్ని మాణిక్యాంబగారు

తన చిర్నవ్వులు నిర్మలాత్మలతికన్ దళ్కొత్తుపూమొగ్గలై
తన కన్గోసలు వైదికాగ్నిచయనాంతర్ధూమ లేఖాళిగా
న్వినయాకారముతోడనొప్పెసగు మాణిక్యాంబికానాథుఁడౌ
ఘనునిన్ వేంకటరామయాఖ్యుని రమాకాంతుండు పాలించుతన్.

# వంశవైభవము

## కృతిపతి బ్రహ్మశ్రీ మల్లాది వేంకటరామ యశోభూషణము

శ్రీ మ"ల్లా"ది పదమ్ము పేరయిన ఓ! క్షీరాబ్ధికన్యామణీ!
శ్రీమల్లాది మహీసురోత్తమునకు నైల్వొప్పఁగాఁ గూర్చితే
శ్రీ మల్లాలిత సాహితీ విమల వార్ధిన్ద్రిచ్చి "కాదంబరీ"
ప్రేమోల్లాసమటన్న స్వామిహృదిలో శ్రీదేవి నన్నిల్పుతన్. 1

ఆ మృదుశీలియు వేంకట
రామయ్యాఖ్యుఁడు కృతిపతి; రాజిత తద్వం
శామల వృత్తము మత్కృతి
రామాహృదయోల్లసనకరమభినుతింతున్. 2

కమలాక్షు వరనాభికమలగంధము వేని
జన్మవాసనఁదెల్పు జగజగాల;
శ్రుతులు నాలుగుఁబూని సురవాణి యెవ్వాని
తలలోననాల్కయై తనరుచుండు;
సృష్టితొల్తటినుండి జీవకోటులనెల్ల
కడుపార నెవ్వాఁడుఁ గన్నవాఁడు;
శతకోటి సురకోటి సతము గారాబాల
తగసాగనిచ్చు నే తాత తాత;

అఖిలనిగమనినదముఖరాయితాస్య
వివరములు నాల్గుగుహలుగా వెలయు మేరు
పర్వతంబననొప్పు నవ్వాఁడు బ్రహ్మ-
అతనిపేరఁ దగు మహీసురాన్వయములు. 3

ఆదిమహీసురాన్వయములందు ప్రసిద్ధము నార్ష సంప్రదా
యాదివిశిష్టమున్ హారితసాఖ్యము గోత్రముపొల్చు; నందు "మ
ల్లాది"సువంశవార్ధి నొకలక్ష్మియొ! రత్నమొ! కామధేనువో!
యేదొ ప్రసిద్ధమైన యదియే పరిపాటిగఁ బుట్టుచుండెడిన్.

వేదవిదగ్రగణ్యుఁడును విశ్రుతసద్గుణశాలి మున్ను మ
ల్లాదికులాబ్ధిచంద్రుఁడయి రాణఁ జెలంగిన మంత్రిసత్తముం
డాదిజుఁడైన బ్రహ్మవలె నాది నవీనతరాన తానయై
యాదరణీయధీవిభవమందెను రామవధాని పూజ్యుఁడై

రామావధాని ఘనుఁ డల
శ్రీమతి శేషాంబకొలువ శేముషిఁ దుంబా
లా మంత్రివరేణ్యుండై
శ్రీమహితుఁడు కులమునకు కిరీటముఁ బెట్టెన్.

ఘనుఁ డాభాసురుఁ డాత్మజుంగనియె ప్రజ్ఞామూర్తి నాత్మానురూ
పుని వేదోదితధర్మకర్మనిరతున్ బుణ్యాత్ముఁ విద్యానిధిన్
వినయాబ్ధిన్ నరసింహశాస్త్రియనువానిన్ వాణిపూజింపనే
ర్చినవానిన్ బకులున్ గుకుల్ నిలిపి కీర్తిన్ గొన్నవానిన్ ఘనున్. 7

పరగ గరిమెళ్ళ వేంకటేశ్వరునకు సతి
శేషమాంబకు గారాబు చిన్నిబిడ్డ
సూరమాంబ ఆమెయె పెద్ద చూరగొనియె
సిద్ధగార్హస్థ్యమున నరసింహశాస్త్రి. 8

నిజభక్తి భావాన నిష్ఠమై నెలకొల్పె
మండపమ్ములు దైవమందిరములు;
నిజసంతతిన్ బోలె నిలిపె తటాకాలు
పల్లెపల్లెను తానె తల్లికాగ;

నిజభావసంశుద్ధి నిరతమ్ము ప్రకటించె
సధ్యాత్మరామాయణాదిసేవ;
నిజదానధర్మాది నిర్మలగుణలతల్
దివిఁదాకఁ బ్రాకించె నవనినుండి;

ఇప్పటికిని "గంగ్రేడు" "మహేంద్రవాడ"
కన్నకొడుకు వేంకటరామఘనుఁడుఁ గూడ;
పొల్చు ప్రత్యక్షసాక్ష్యాలు పూతచరిత
మైన సూరమ్మయాత్మధర్మానురతికి. 9

అంబికవంటిధర్మసతి అంచితసద్గుణకల్పవల్లి సూ
రాంబికకొల్వఁ గాంచె నతఁ డార్వురుపుత్త్రుల నొక్కపుత్రికన్
పంబినవేడ్క సప్తవిధభాసురసంతతితో గృహస్థధ
ర్మంబునుఁ బ్రోదిచేయుటిదిరా ! యనగా నరసింహశాస్త్రియున్.10

ఆరు ఋతువులందు నందగించు వసంత
మట్టు లారు రుచులయందు తీపి
పెంపుఁ గనినయట్లు వేంకటరామయ్య
ఆర్వురు సుతులందు నధికుఁడయ్యె. 11

వరధనుర్లగ్నదృష్టిమై భవ్యతర ము
హూర్తమందనూరాధసంయుక్తి జ్యేష్ఠ
శుద్ధమౌ త్రయోదశి నిట్టిసుతు నొసంగె
శోభనాస్త్రమ్ము శాస్త్రికి శోభకృత్తు. 12

అరయగ జయంతివారింటి ఆడపడుచు
రామకోట్యవధాన్లు వీరమ్మయుఁ గడు
పారఁగన్న "మాణిక్యాంబ" భార్యగాగ
వెలసె వేంకటరామయ్య విభవమెల్ల. 13

ణిక్యమనమ్మతోఁ బలుకులందునఁ జేతలయందు సాధ్వి "మా
ణిక్యము" తోడునీడయయి నిల్వఁగఁ బట్టినదెల్ల "చేతిమా
ణిక్యముఁ"గాగ సంపదల నిచ్చలు మించి గృహస్థధర్మరా
సిక్యమునందె సత్సుతునిఁ జెందియు వేంకటరామయాఖ్యుడున్. 14

బింబమునుండియేర్పడిన బింబములట్టుల పుత్త్రపౌత్రరూ
పంబుల వంశవృద్ధిగనుభావముతో నరసింహశాస్త్రియుం
చుంబిలచెన్ నిజాత్మజుని శోభిలవేంకటరామయాఖ్యుఁ డా
లంబనఁజేసి తండ్రిగుణలక్షణ మాతఁ డొకండెపుత్త్రిఁడై. 15

అతనికిఁగల్గె నొక్క సుతుఁ డాతఁడు వేంకటరామయాఖ్యుడై
మతివిభవమ్ము తాతకనుమాదిరిఁ జెందుతమంచు దీవనల్
జతపడ వృద్ధిఁగాంచుతను సజ్జనబంధుహితైకబుద్ధియై
యతనికి నప్పగారొకరు నన్నువచెల్లి యొకర్తయై తగన్. 16

తమ్ములఁబెంచెఁ దా గుణశతమ్ములతోడ; విశేషధర్మజా
తమ్ములతోడుతన్ ధనశతమ్ములఁ బెంచె; నిరంతరమ్ము వే
దమ్ముల తోడదైవతశతమ్ములఁ గొల్చె; పునర్భవమ్ము నీ
పిమ్మట నుండరాదనుచు వేంకటరామయ సమ్మదమ్మునన్. 17

లలితసౌభాగ్యవతి సుబ్బలక్ష్మి పెద్ద
మనుమరాలు తనకు మునిమనుమనిచ్చె
వాఁడుఁ దనయంతవాఁడుఁగాఁ బరగవలయు
తనదు పేరుతోఁబాటుగా ఘనతకలిగి. 18

మునిమనుమరాండ్రు మువ్వురు ముత్తియములు
తాతముద్దులమూటలు తళుకులతలు
జానకియును "మాణిక్యాంబ సాధ్వి"పేరఁ
బరగు నిద్దరు సౌభాగ్యభావకళలు. 19

చిన్ని మనుమరాలు చిన్నారి పొన్నారి
నాగమణి సుగుణగణాలరాణి
తనదు వరునితోడ తాత యాశీస్సులఁ
గాంచుఁగాఁక ! అచిరకాలమందె. 20

మనుమఁడు మునిమనుమలు తన
మనమున కనుగుణమగు మతిమాన్యులుఁ గాగన్
ఘనుఁడై వేంకటరామయ
మనుత మనుచును బుధులరయ మన్ననకెక్కన్. 21

రహిమీఱ కావ్యాలు "రామడుగుల రామ
దుర్గశాస్త్రుల" వారితోడఁ జదివి
తత్త్వార్థవిజ్ఞానధర్మసూక్ష్మము "సదా
నందతీర్థుల" సేవలందుఁ దెలిసి
సత్యాగ్రహోద్యమసంరంభముల గురు
బుద్ధి "బులుసు సాంబమూర్తిఁ" గొలిచి;
తనబుద్ధిసూక్ష్మత తనరార నాయుర్వే
దమ్ముఁ జేపట్టి వైద్యమ్ముఁ జేసి;
వివిధమార్గాల జీవితవిధమెఱింగి
"కాకినాడపంతుల"నఁగ ఘనతకెక్కి
వేణుగోపాల సంస్కృతవీథులందు
పెంచె వేంకటరామయ్య మంచికీర్తి. 22

షాహుకారులు తనముందు సాటికారు
ధనము నార్జించునట్టి సాధనములందు
వేదవేదాంతవిదులును వెలకురారు
ధర్మమాచరించెడునట్టి మర్మమందు. 23

భారతస్వాతంత్ర్యభండనంబునఁ దన
వీపు లాఠీలపిచ్చోపులంది;
యావదాంధ్రమునందు వ్యాపారసరణిలో
పట్టుగా తనబుద్ధి పదనుఁదేల్చి;
వర జటావల్లభ పురుషోత్తముని బోధ
సద్వ్యాసనల్ గుండె సంతరించి;
గోసేవలో రక్తిఁగొనుదృష్టి గోలోక
పర్యంతమునునిల్పి భద్రపఱచి;

తనదు సర్వాత్మచేతను తనియఁజేసి
లౌకికము పారలౌకిక మేకమతిని
రాణ మల్లాది వేంకటరామయాఖ్యు
డరయ జీవితశిల్పమ్ము నమరఁజేసె; 24

వర జటావల్లభుల వంశపావనుండు
పూరుషోత్తము బోధమ్ము పొంది పొంది
తనదు చిత్తవిత్తములకు ధన్యమైన
మార్గమరసె వేంకటరామమహితుఁ డరయ. 25

సంగీత సాహిత్య సరసగోష్ఠులటన్న
చెవికోసికొని ముందుఁ జేరువాఁడు;
వేదార్థవిజ్ఞానవిదులు వచ్చిరటన్న
నెదురేగి సత్కృతి నెఱఁగువాఁడు;
దేవభాషాయోష తేజరిల్లఁగఁ జేయ
దీక్షఁబూనిన మేటి తెలివివాఁడు;
వ్యవహారములచిక్కు లవలీలఁ దీర్పంగ
పొల్చిన చుఱుకైన బుద్ధివాఁడు

పరమున కిహము సోపానసరణి కాగ
బ్రతుకుబాటనుఁ దీర్చెడు రాగియును వి
రాగి మల్లాది వేంకటరామయాఖ్యుఁ
డభిలషించె కాదంబరియందు రసము. 26

కాదంబరీరసజ్ఞుల
కోదనమేనియు రుచింపదూహకు మఱివే
ఱేదియుఁ బట్టదనుట మ
ల్లాదిమహీసురునెడల వెలసె సత్యంబై. 27

అల ధనుర్లగ్నసంజాతుఁడైన కతమొ
బాణవేగమ్ముతోఁ బైకిఁ బైకిఁ బోవొ
బాణకృతము కాదంబరిపైన మనసు
నిలిపె తత్త్వమ్ముఁదెలిపెడి పలుకువలచె. 28

సతతం బీభువి జన్మసార్థకతఁగాంచన్; ధీరతన్ భారతీ
యత కాపాడుకొనంగ; వాగ్విభవమత్యంతమ్ము పెంపార; స
మ్మతమౌ సంస్కృత మభ్యసింపుడని ప్రేమన్ వేణుగోపాలసం
స్కృత సంసత్పరిపోషణన్నెఱపు విస్తారమ్ము రామయ్యయున్. 29

స్వాధ్యాయము సంస్కృతకా
వ్యాధ్యయనము శాస్త్రపాఠ మమరఁగఁజేసెన్
విధ్యుక్తము ఛాత్రాళి క
సాధ్యంబేముండు కార్యసాధకున కిలన్. 30

పరులకు ధర్మబోధలనుఁ బట్టుగఁజేసెడు దిట్ట లెందఱో
ధరణినిఁ దాము ధర్మమునుఁ దాల్పరు నిల్పరు జంక రీసుచే
నొరులకుఁ గీడుసేయు; నటులొప్పక వేంకటరామయాఖ్యుఁ డా
చరణమె ముఖ్యమంచు తన సత్కృతులందు నెఱాలె ధర్మముల్. 31

మాటలా! ధనములమూటలు ధర్మకా
ర్యాలకై వెచ్చించుటన్న నేడు;
ఎవరయా? సంస్కృత మేపారఁగాఁజేయ
వేలకు వేలిచ్చు పెద్దలిపుడు;
కలరొకో! యొరులెవ్వరిల పరాభ్యుదయైక
లక్ష్యమ్ముఁగలవారు లక్షకొకరు;
అగుగాక! ఇంత నిరాడంబరంబుగ
నింతవాఁ డుండునే యెందునైన;

ననగ వేంకటరామయ్య తనరుచుండు
మూడుమూరల పంచెయు మునిమునిసగ
వార్ధకపు చూపు లానతమైన మేను
నొప్ప కాకినాడపురపు గొప్పమనిసి. 32

ఇంత రసజ్ఞుఁడౌటయును నింతటిశ్రోత్రియుఁడౌట చిత్రమా
నెంతటి శ్రోత్రియుండయిన నింతటి దాతయునౌట చిత్రమా
నెంతటి దాతయైన మరి యింతవినమ్రుఁడు నౌట చిత్రమా
నెంత వినమ్రుఁడైన మరియింత వివేకియునౌట చిత్రమా! 33

ఆ మల్లాది మహీసురోత్తముడు రామయ్యాఖ్యుఁ డాప్తుండు వి
ద్యామాధుర్యమెఱింగినట్టి ధనికుం డాశ్లేయవిజ్ఞాన లా
భామేయార్జన చిత్తవిత్తముల నత్యంతమ్ము నర్పించుఁ దా
నై మత్ప్రేమముతోఁ గృతింగొనుటకై యానందమున్ జెందుచున్

"అంబకటాక్షమబ్బి కవితాంబరమందుచరించు నిండు డెం
దంబున భట్టబాణుఁడు సుధామధురోక్తులఁ జేసినట్టి కా
దంబరి నీవిమర్శమునఁ దాల్చిన దైన రసజ్ఞతాచ్ఛవిన్
సంబరమొప్పఁగైకొనఁగ శర్మరో! యువ్విళులూరుచుంటి నేన్. 35

భరతుఁడు రసచర్యాచరతుఁ
డరయఁగ నాచార్యుఁ డనఘుఁ డామునిపేరం
బరగుట కస్తురిపెట్టిన
బరిణకువలె పట్టెనట్టి వాసన నీకున్. 36

మోహనమైన యాకృతిని ముద్దుగ నీకృతి దిద్దుకొందు; నీ
సాహితిఁ జేతులార బుధసంతతి కందఁగఁజేసికొందు నీ
స్నేహము ముద్రవేసికొని చేకొనెదః కృతినిమ్మటన్న నా
యూహను మానుషాకృతినినొప్పిన దైవముపొల్చె వానిలో. 37

ముచ్చట దైవతమ్ములకె మున్ను కృతుల్ పొనరించినాడ నే
నచ్చపుభక్తి; నీ మనసునందున దైవమెనిల్చి పల్కఁగా
నిచ్చుట ముచ్చటే! ధనమునిమ్మని కోరనివానికిచ్చు నీ
సచ్చరితమ్ముఁగూర్చె నిటు సత్కృతి వేంకటరామయాభిదా ! 38

వృద్ధుండవు గుణములచే
వృద్ధుండవు జ్ఞానమందు; విదితమ్మౌ వయో
వృద్ధుండవు నిట్టులెసగు
వృద్ధుండవు గాన కృతికి ప్రియుడైతివయా ! 39

ఏవం విధగుణఖనికిన్
శ్రీవరకరుణాకటాక్ష సిద్ధార్థునకున్
[illegible] స
ద్భావునకున్ రామయాఖ్య వరలెడునీకున్. 40

ఇదిగో నా వ్యాఖ్యాకృతి
మదిగోరిన నీకు తనదు మనమున్ దెలుపున్
పదిలంబగు నీ కిహపర
ముదితాఖిలకీర్తి మహితమూర్జస్వలమై. 41

ఇది పద పద వివరణ సం
పదల మదికి ముదముఁగూర్చు భావాలయ అ
భ్యుదయాభివృద్ధిరస్తని
యిదిగో కృతి నిచ్చెద గొనవే! రామయ్యా ! 42

పెరాల భరతశర్మ

శ్రీ గురుమూర్తయే నమః

# సమీక్ష

శ్రీ వెంపరాల సూర్యనారాయణశాస్త్రి

"కాదంబరీరసజ్ఞానాం ఆహారోపి న రోచతే" యని యొకసూక్తి. కాదంబరి యన "మద్యము" గాఁ జెప్పవినుచున్నాము. మద్యమునందలి రుచి నెఱిఁగినవారికి ఆహారమును రుచింపదు. అనుటచే ఆహారముతోబాటు నిద్రకూడ రుచింపదు— అనవలసివచ్చును. కాని యీ కాదంబరి యేమి ! ఇది గ్రంథరూపముగాని, మాదక మగు వస్తువుకాదే ! మద్యమునందువలెనే దీనియందును రసము ఉన్నదికాఁబోలు ! ననిపించినది. ఆ రసము రుచ్యర్థకముకాక శృంగారాది రసపరమగు నర్థముగా గ్రంథ మనుటచే తెలియవచ్చినది. గ్రంథపరముగా నెంచినపుడు కాదంబరి భారతీదేవిగా నెఱుఁగవలెనను కొంటిని. ("కాదంబరస్తు దధ్యగ్రే మద్యభేదే నపుంసకం స్త్రీ) వారుణీ పరభృతా భారతీ సారికాసుచ" అని మేదినీ నిఘంటువు.) ఈ భారతి ఎవరిది ?

వాత్స్యాయన గోత్రభవుఁడు వేదవేదాంగ వేత్తయయి యజ్వయైన కుబేరు డను పండితునకు మునిమనుమడు— పెక్కుఱు వటువులకు వేదశాస్త్రములను బోధించిన అర్థపతియను విబుధుని మనుమడు విద్వాంసుడై సకలదిక్కులందుఁ బ్రఖ్యాతివహించిన చిత్రభానునకు కొడుకు, నయి నరాకృతి దాల్చిన భారతి యని పించికొనిన భట్టబాణునిది.

కాదంబరియను పేరుగల ఈ రచన "కథ" అని నాడు. కాళిదాసు రఘువంశ మున తన్నుగూర్చి "మందుఁడను" అని చెప్పికొనినట్లే

"ద్విజేన తేనాక్షతకంఠ కౌంఠ్యయా
మహామనోమోహ మలీమసాంధయా
అలబ్ధ వైదగ్ధ్య విలాసముగ్ధయా
ధియా నిబద్ధేయ మతిద్వయీ కథా."

అని చమత్కారముగా తన వినయమును ఆత్మస్తుతి కానట్లు వెల్లడించిన గడుసరి బాణుఁడు: "ఇష్టార్థమును ధ్వనింపచేసెడు శక్తిలేనిదియై మనన శక్తిలేక మలినమై గ్రుడ్డిదైపోయిన బుద్ధిచేత అతిద్వయియైన కథ చెప్పుచున్నాను" అనినాఁడు.

కథారచనమున కంత నిరుపయోగమగు బుద్ధితో నంత ఎట్లు చెప్పగలిగెను? అంతట్లతో ఆఁగిపోవలసినదేగదా ? ఆఁగినాఁడా ?

"అతిద్వయి" అనగా ప్రతిభావ్యుత్పత్తులులేని బుద్ధియని కాని కావ్యమని కాని అనుకోరాదు.

"అద్వితీయము" అనగా సాటిలేనిదియని అర్థము.

ఇపుడావెనుకటి విశేషణముల కర్థము కథచెప్పుటలో ఝరీ సదృశమగు వాక్కుతో మహామోహవిధ్వంసకమగు భావములను మిగులనేర్పుగల ప్రతిభతో చెప్పఁగలవాఁడనియే గ్రహింపఁదగును.

అంతవాఁడు అట్టివాఁడు అగు బాణుని "కాదంబరి యందలి రసమును చక్కఁగా నెఱుఁగఁగలవారి కాహారము రుచింప" దనుట స్తుతిమాత్రము కానేరదు.

ప్రకృతమునకు వత్తము. "కాదంబరీ రసజ్ఞత" యని పేరుపెట్టి యీగ్రంథము రచించిన శ్రీ పేరాల భరతశర్మగారు నిద్రాహారము లెంతకాలము లేకుండ నింత గ్రంథము రచించిరో యనుకొంటిని. కాని ఆహారనిద్రలకు దూరముకాకుండనే పిఠాపురరాజా ప్రభుత్వకళాశాల (కాకినాడ) లో సంస్కృతోపన్యాసకత్వము యథాపూర్వము నడుపుకొనుచునే రసజ్ఞులగు పెద్దలు అవధానార్థ మాహ్వానించినపు డష్టశతావధానములు చేయుచునే యింత విపులమైన విమర్శనముతో అసాధారణ కవితాధురంధరుఁడైన భట్టబాణ మహాకవియొక్క నిరుపమమైన కాదంబరీ గద్య కావ్యసాగరమును మథించి యందలి యమృతమును ఆంధ్రలోకమున కెట్లందింపఁ గలిగిరో ! అని ఆశ్చర్యపడితిని. ప్రతిభాశాలి కసాధ్యమేముండును ! అనుకొంటిని.

కాదంబరి యన కల్లుకాదు. సరస్వతి అని యనుకొంటిమికదా ! బాణుని సరస్వతియన అతని రచనయగు కథాకావ్యము అన్నమాట. దానియందు రసమున్నదని ఆ రసము నెఱిఁగినవారు కాదంబరీ రసజ్ఞులు అనుకొన్నాముకదా! అట్టి రసజ్ఞులలో నొకరైన శ్రీ భరతశర్మగారు తనకుఁ గలిగిన రసజ్ఞానమును గాలికిఁబోవు వాగ్రూపముగాఁగాక అక్షరరూపముగా నిట్లువెలువరించి తామేకాక యావదాంధ్ర వసుంధరను ధన్యమొనర్చి ధన్యులైనారు.

కవితారంగమున కెక్కినవారు బాణుని సారస్వతము నంతనుగాని కొంత గాని యెఱుఁగకపోయినను అతనిపేరైన వినియుండకపోరు. దానికిఁ గారణము ప్రాచీనులు బాణునిస్మరింపని వారాంధ్రవాఙ్మయమున లేక పోవుట. కవిత్రయము

మాట నటుపెట్టి బాణుని శబ్దార్థముల ననుకరించిన వారిలో ముఖ్యుఁడు శ్రీనాథ మహాకవి. ఆతని దృష్టిలో బాణుఁడు అద్భుతశాస్త్ర కలాపారీణుఁడు, నిరవద్యగద్య పద్యనిబంధ పరితోషితస్థాణుఁడు-కావున అతనినేకాదు మయూరునిఁగూడఁజోడించి భట్టబాణమయూర భారతీసంపర్క సౌభాగ్యగరిమంబు సంగ్రహించుకొనినవాఁడు— శివరాత్రి మాహాత్మ్యమున—

సీ. బాణునద్భుత శాస్త్ర బహుకలాపారీణుఁ దలతునెపుడు (శివ.రా. 1-12)
అనియు

సీ. భట్టబాణమయూర భారతీసంపర్క సౌభాగ్యగరిమంబు పరిగ్రహించి
(నైష 1-7) అనియుఁ జెప్పుకొనినాఁడు.

ఆతఁడేకాదు. ఆతని తరువాతివారు పూర్వకవులను స్మరించునపుడు పెక్కుఱు బాణుని స్మరింపకమానలేకపోయిరి.

మ. "వనజాక్షోపము వామలూరు తనయున్ ద్వైపాయనున్ భట్ట బాణుని భాసున్."

ఇత్యాదిగా ఆంధ్రకవితా పితామహుఁడు వచశ్శుద్ధికై పేర్కొనెను.

సీ. బాణవేగంబును భవభూతి సుకుమారతయు మాఘునైత్యంబు,
దండిసమత నీక కలదు"

అని కృతిపతిచే మూర్తికవి మెప్పొందినట్లు నరసభూపాలీయమునఁ జెప్పుకొన్నాడు. సంస్కృతముననో- ఒకకవి—

కవితాకామినికి- చోరపంచాశత్తు రచించిన కవి చికురనికురము (కొప్పు) మయూరుఁడు కర్ణపూరము (చెవుల తాటంకము) భాసుడుహాసము కవికుల గురువగు కాళిదాసువిలాసము (అనగా శృంగారచేష్టావిశేషము. తాత్కాలికో వికారఃస్యాత్ విలాసో నయితేక్షణాత్ అని ప్రతాపరుద్రీయము.

"పతిఁగన దాత్కాలికమగు నతులవికారము విలాసమగు" అని నరసభూపాలీయము.)

శ్రీహర్షుఁడు హర్షము. బాణుఁడన్నచో కవితాకామిని హృదయమును విడువక నివసించుచున్న పంచబాణుఁడే యనెను.

తక్కిన మహాకవులు కవితావిలాసినికి అలంకారప్రాయులును మనోవికార ప్రాయులును గాని బాణుఁడుమాత్రము రసాధాయకుఁడైన మన్మథుఁడే యనినాఁడు.

శ్లో. యస్యాశ్చోరశ్చికురనికురః కర్ణపూరోమయూరో
భాసోహాసః కవికులగురుః కాళిదాసోవిలాసః
హర్షోహర్షః హృదయవసతిః పంచబాణస్తుబాణః
కేషాంనైషా కథయకవితా కామినీకౌతుకాయ.

(చూడు సుభాషితరత్నభాండాగారము.)

ఇంకను బాణుని యీ కాదంబరీ కావ్యము పద్యకావ్యముకాదు. సందర్భానుసారము రెండుపద్యములున్నను కేవల గద్యకావ్యము. గద్యమున (వచనమున) మొదలేదో తుదియేదో తెలియనట్లుగా కథనల్లుచు నందు పద్యకావ్యములనుమించిన శబ్దాలంకారములతో "బాణోచ్ఛిష్టం జగత్సర్వం" అను మెప్పునొందగల సంస్కృత భాషారహస్యము లెన్నియో ప్రదర్శించుచు ''గద్యం కవీనాం నికషం వదంతి''అను సూక్తి నుత్పాదించినాఁడు. హర్షచరితాది కావ్యము లాతఁడెన్ని రచించినను కాదంబరి మూలముననే యాతఁడు మహాకవుల కోవకుఁ జెందినాఁడు. నల్లని కాఱుమబ్బును చూచి యొడలుపులకించి నాట్యమున కుపక్రమించెడు నెమిలివిప్పిన పింఛము కాదంబరి. అందులేని వర్ణములులేవు. ఇంద్రధనువును నెమిలిపింఛమును కన్నులున్నవారి కెవరి కానందదాయకములు కావు ? అట్లే పాఠకులకుపారవశ్య మాపాదించునది కాదంబరీ గద్యకావ్యము. ఇసుకలోనుండి రసముపిండినాడు. అయ్యది అనన్యసాధ్యము. దైవదుర్విపాకమున అతఁడు కాదంబరీ కథ పూర్తిచేయకుండనే దివంగతుఁడుకాఁగా— 'ఆత్మావై పుత్రనామాసి' అను సూక్తికి తార్కాణగా జనించిన యాతని కొడుకు పుళిందబాణుఁడు పూర్తియొనర్చి యేవిధముగాను అతుకు తెలియకుండ పితౄణము పూర్ణముగా తీర్చుకొనినవాఁడు. లేకున్న ఆకథ ఎవరు పూరింపఁగలరు ? అంతటి ప్రతిభయు వ్యుత్పత్తియుఁ గలవాఁడు పుళిందబాణుని తరువాత మరొకకవిపుట్టినాఁడా ?– సంస్కృత సరస్వతి పుణ్యమున బాణునియనంతరము పుళిందబాణుఁడు పుట్టెననుకోవలెను, కాదంబరీకథ– జాబాలిమహర్షి తన కొడుకగు హారీతుని ప్రార్థనమున వెన్నెలరాత్రియందుఁ జెప్పినట్లు అరంభముకదా! అట్లే వెన్నెలరాత్రులందు కొడుకు పుళిందబాణుని ప్రార్థనమునఁ దాను రచించుచున్న కాదంబరీ కథనంతయు కొంతకాలము చెప్పఁగా విని బాగుగా మననము చేసికొనినవాఁడు కావుననే పుళిందబాణుఁడు అతుకు తెలియకుండ కథలోకథ కలిపి పూరించినాఁడని నాయూహ.

శ్రీ శర్మగారు ఆ కావ్యమును "అబ్ధిర్లంఘిత ఏవ వానరభటైః" అనునట్లుగాఁక "అపాతాళనిమగ్నపీవర తనుర్జ్ఞానాతి మంథాచలః" అనినట్లు బాణకర్తనయ సృష్ట మగు వాఙ్మయాంబుధిలో మునిఁగి మంథాద్రివలె మథించి ఎన్నియోరత్నములతో పాటు దుర్లభమైన కావ్యామృతరసమును విబుధులకు పంచియిచ్చినారు అనిన అతి శయోక్తి కాదు.

శ్రీ శర్మగారి గ్రంథము అష్టమూర్తియగు పరమేశ్వరునివలె ఎనిమిది విభాగములతో వెలసినది. అందు మొదటివిభాగమున కాదంబరియే బాణుఁడనినాడు. అన్నిటికంటె చిత్రము కాదంబరియే బాణుఁడు బాణుఁడే కాదంబరి. బాణునివలె క్కావ్యముతో తాదాత్మ్యము పొందినకవి మఱియొకఁడు ప్రపంచవాఙ్మయమున నెక్కడనైనసుండునా ? అని సవాలుచేసినారు; చేయఁదగ్గ కవి కానఁ జేసినారు.

రెండవ విభాగము- అతుకుతెలియకుండ పోఁతపోసినట్లు కథనంతయు నడిపి శిఖరప్రతిష్ఠచేసి తండ్రిని మఱపించిన- కాదుకాదు-తండ్రియే తన్నావహించి రచన కావించినట్లు గ్రంథసమాప్తి నొందించిన పుళిందబాణుని రచనాప్రావీణ్యము నకు దర్పణము.

మూఁడవ విభాగము "కాదంబరీ సంకేతము" అను శీర్షకముతో వెలసినది. శ్రుతిస్మృతి సమ్మతముగా- కాదంబరీ కావ్యములోని యితివృత్తమంతయు సోప పత్తికముగా నిర్ధరించుట యెంతయు శ్లాఘ్యము. వేదధర్మములే పురాణమున మిత్ర సమ్మితముగాను, కావ్యమునఁ గాంతాసమ్మితముగాను నుండవలెనను శాస్త్రమునకు కాదంబరీకావ్యమును లక్ష్యమొనర్చుటలో శ్రీ శర్మగారి పరిశ్రమమంతయు ముక్తా హారమువలె సహృదయ హృదయరంజక మగుచున్నది. కథాస్వరూపము దివ్యా దివ్యమని చక్కఁగా సాధింపఁబడినది.

నాలుగైదు విభాగములు అక్షరశిల్పము, వర్ణచిత్రములును. అవి అలంకార శాస్త్రసిద్ధాంతముల కనుకూలముగా బాణునిచేనెట్లు సృష్టింపఁబడినవో మిక్కిలి లోతుగా విమర్శింప బడినవి. వానినిగూర్చి వివరించుచో మూలముకంటె నావివరణము హెచ్చు గుటయే కాదు. చాదస్తముగాఁగూడ కనఁబడును.

హెచ్చైనను చాదస్తమని యెవరనుకొనినను నాలుగుమాటలు వ్రాయక మానజాలనిది "కథాతత్త్వము" అనెడి విభాగము. ఇందు కాదంబరి కథయంతయు

"శ్రీవిద్యా" పరముగా భరతశర్మగారు కామకళావిలాసము మున్నగు శాక్తమత గ్రంథముల యాధారమున నిరూపించుట మెచ్చదగినది. 122 వ పుటలో బాణుడు కాదంబరీకథావస్తునిర్మాణమున నొకనిగూఢమైన తాత్త్వికరహస్యము నిమిడ్చెనని స్పష్టమగును. అది వేదసమ్మతము. శాస్త్రవిహితము. యోగసిద్ధము" అని యుప క్రమించి శ్రీమహాత్రిపురసుందరీ పరదేవతా తత్త్వప్రతిపాదకమైన "కామకళా విలాస" మనుగ్రంథమును బట్టి మనకు తెలియని యెన్నియో విషయముల నెత్తికొని ప్రకృతకథకు సమన్వయించుట యత్యద్భుతము.

బాణుడు కాశ్మీరదేశమందలి కన్యాకుబ్జపురమువాడని దేవిడీజమీందారుగారను ప్రసాదభూపాలుని "ఆంధ్ర విజ్ఞాన"మను బృహత్కావ్యమునఁగలదు. ఆ నిఘంటువుననే "కన్యాకుబ్జమునందు శాక్తేయులు, శైవులు, వైష్ణవులు నను మూడు మతములవారు కలరు" అని యుండుటచే బాణుడు శాక్తేయమతమువాడో తన్మత రహస్యవేత్తయోయయి యుండవచ్చు ననిపించినది.

శ్రీ భరతశర్మగారు చూపిన శక్తిమతవిశేషములు శాక్తేయులయొక్క స్థూలాకారమైననుఁ దెలియనిదే యవగతముకావని నాకుఁ దెలిసినంతలోఁ గొంచెముఁ దెలుపఁదలఁచితిని. మనదేశమున దేవీనవరాత్ర వ్రతముచేయు వారెందఱున్నను శాక్తేయము తెలిసినవారు లేరనియే యనవచ్చును.

సృష్టిస్థితిలయములకు నాదికారణము పరాశక్తి. ఆమెవలననే త్రిమూర్తులు సకల బ్రహ్మాండములును సకలజీవులును సృజింపఁబడునని శాక్తమతసిద్ధాంతము.

వేదాంతములనఁగా ఉపనిషత్తులు. అందుఁ జెప్పఁబడిన సృష్టిక్రమమునకు శాక్తమతమందలి సృష్టిక్రమమునకు, భేదములేదనియే పరమసిద్ధాంతమైనను ఆ యా యి మతప్రవర్తకులు చూపిన ప్రస్థానభేదమువలన జిజ్ఞాసువులకు సందేహము కలుగవచ్చును. కావున శాక్తేయముపనిషన్మూలకమని శర్మగారు చూపిన బృహదారణ్యకము మొదలగు నుపనిషత్తులలోని వాక్యముల సారమును శ్రీ శంకరభగవత్పాదులు తమ "ప్రబోధసుధాకరము" ననెట్లు వివరించిరో ముందుతెలిపి తరువాత శాక్తేయమతసిద్ధాంత సమన్వయమునుఁ దెలుప యత్నించెదను.

> "చిన్మాత్రః పరమాత్మా; హ్యాపశ్య దాత్మానమాత్మతయా
> అభవత్సోఽహం" నామా, తస్మాదాసీద్భదో మూలం
> ద్వేధైవ భాతి తస్మాత్పతిశ్చ పత్నీచ తౌ భవేతాం వై
> తస్మాదయ మాకాశ స్త్రియైవ పరిపూర్యతే సతతం.''

షో౽యమపీక్షాం చక్రే తతో మనుష్యా అజాయంత
ఇత్యుపనిషదః ప్రాహుర్ద్యయితాం వ్రతి యాజ్ఞవల్క్యోక్త్యా
చిరమానం దానుభవాత్ సుషుప్తిరేవ కాప్యవస్థా౽భూత్
పరమాత్మనస్తు తస్మాత్ స్వప్నవదేవోత్థితా మాయా
సదసద్విలక్షణాసౌ పరమాత్మసదాశ్రయో౽నాదిః
సావగుణత్రయ రూపాసూతే సచరాచరం విశ్వం."

— ప్రబోధసుధాకరము, మాయాసిద్ధి ప్రకరణము.

"పరమాత్మ చిన్మాత్రమై (జ్ఞానస్వరూపమై) తన్ను ఆత్మగాఁ దెలిసికొనెను. "అది నేను" అను భేదమునకు మూలమైనది. ఆ తెలిసికొనుట అనఁగా- ఏక మే వాద్వితీయముగానున్న బ్రహ్మపదార్థము భేదమునకు మూలమైనది. అట్లుభేదిల్లిన రెండు భాగములు. "పతి- పత్ని"గా నైనవి. ఆ దంపతులవలన ఈ యాకాశము శాశ్వతముగామూఁడువిధముల (సత్త్వరజస్తమోగుణముల)నిండిపోయెను.పతి పత్ని రూపముగానున్న ఆ పరమాత్మకు (అబుద్ధి పూర్వకమైన) యిచ్ఛకలుగఁగానే మను ష్యులు (నానావిధములగువారు) పుట్టినారు. అని ఉపనిషత్తులు బృహదారణ్యకాదులు చెప్పినవి." అని యాజ్ఞవల్క్యుడు తనభార్యకుఁ జెప్పెను.

అట్లు రెండుగానైన పరమాత్మకు చిరకాలానందానుభవముచే సుషుప్తి (నిద్ర) వంటి యొకఅవస్థకలిగెను. ఆ యవస్థయందలి పరమాత్మనుండి స్వప్నమువలె- (అబుద్ధిపూర్వకముగా) "మాయ" వెలువడినది. అది సదసద్విలక్షణమై పరమాత్మను ఆశ్రయించి అనాదియై యున్నది. ఈమాయ "సత్తు" అనుటకుగాని అసత్తు అను టకుఁగాని వీలుగాక విలక్షణస్వరూపమై గుణత్రయస్వరూపమై జగత్తు (సచరాచర మును) సృజించినది. అని యాజ్ఞవల్క్యుఁడు మైత్రేయికి చెప్పినవిషయము బృహదా రణ్యకమునయున్న "ఆత్మైవేదమగ్ర ఆసీ" దిత్యాదివాక్యములను భరతశర్మగా రుదాహరించియే యున్నారు. కాన దానిని నేను చూపమానితిని.

అద్వైతాచార్యులగు శంకరులవాక్యము లట్లుండ శాస్త్రీయులు ఆ పర బ్రహ్మపదార్థమునే యిట్లు వ్యాఖ్యానించుకొనిరి.

సృష్ట్యాదిని అఖండతేజోరూపమై త్రికాలాబాధితమైన సచ్చిదానందమయమైన పరమాత్మయొక్కఁడే యుండెనని ఆతేజస్సునకు నామకల్పన మంగీకరింపక ఆద్యంతరహితమగుటచే ఆయన నిరంజనుఁడు, అప్రమేయుఁడునైన చైతన్యరూప శివుఁడు. అబుద్ధిపూర్వకమగు సిసృక్షతనంతఁ దనయందుఁ బొడమినఁ బొడముఁగాక! ఏమిచేయఁగలఁడు? మాయారూపశక్తి సాహాయ్యము లేనిదే సృష్టిగాని స్థితిగాని లయముగాని ఏమియు చేయలేడు. అంతేకాదు కదలనైనఁ గదలలేఁడు. అని చమత్కరించినా రాచార్యులవారు.

చంద్రుఁడులేని వెన్నెలగాని సూర్యుఁడులేని యెండగాని యుండవు. వెన్నెల లేని చంద్రుఁడున్నప్పుడు వెన్నెలయేమైనది? చంద్రునిలో లీనమైనది. అట్లే ఎండ లేని సూర్యుఁడున్నప్పుడు ఎండ సూర్యునియందు లీనమైనది. అట్లే వేఱగుచో "శివుఁడు- శక్తి" యనుదురు. శక్తి తనయందు లీనమైనప్పుడా శివాత్మక ప్రకాశబిందువు పురుషుఁడా స్త్రీయా నపుంసకమా? "నోజాతిర్నైవవర్ణో నభవతి పురుషో వా నపుంసం నచస్త్రీ" సహజసమరసమగు తత్త్వమగునని శంకరుల సూక్తి. ప్రకాశవిమర్శాత్మక శివశక్త్యాత్మక పరబ్రహ్మస్వరూపముఁ దెలుపుటకే బాణమహాకవి కాదంబరీ కథాకావ్యమురచించెనని భరతశర్మగారు ఎంత చక్కఁగా లక్ష్యలక్షణసమన్వయమొనర్చి నారో సహృదయుఁడు హృదయమర్పించి యీ గ్రంథమున ఈ విభాగము జాగ్రత్తగా గ్రహింపవలెనని నావిన్నపము.

శ్వేతకేతువు బింబము. లక్ష్మి ప్రతిబింబగ్రాహియగు దర్పణస్థానీయమగు విమర్శబిందువు. దానినుండి పుండరీకమునందు ప్రసరించిన తేజస్సే పుండరీకుఁడట! ఆహా! ఎంత చక్కగా కుదిర్చినారు! అట్లే ప్రకాశరూపముగా ఆ పుండరీకుఁడు మాఱఁగనే విమర్శరూపముగా మహాశ్వేత, చంద్రాపీడుడు ప్రకాశరూపముగాగా, కాదంబరి విమర్శరూపయైనదని యింకను సృష్టివైచిత్రి విశేషములెన్నియో మహాత్రిపురసుందరీ లీలలుగా నిరూపింపఁ గలిగిన మన భరతశర్మగారి మేధాశక్తిని మెచ్చుకొనుచు నాకంటె వయసున చిన్నవాఁడుకదా! యని యాశీర్వచనమాత్ర మొనర్చి ఆహా! యనుకొనుచున్నాను. శర్మగారీ మహావిమర్శనమునకుఁ బూనుకొననిచో బాణుని పరాశక్తి పారమ్యము మనకందదుగదా! అంతవాఁడు బాణుఁడు. ఇంతవాఁడు శర్మగారు. ఇది చదివినవారు శర్మగారి విమర్శనము అద్దమువలెనుండగా నీ చాపస్తుప్రవాత యేఁదులకు అని నన్ను విస్మరించిరా నాకు పరమానందము.

"కాదంబరీ రసోల్లాసము" అనెడి ఏడవ విభాగము శ్రీ శర్మగారి విమర్శన పాటవమునకు నికషమనకతీఱదు. ఆ భాగమునకు మొదట పెద్ద యక్షరములతో (1) "రసో వై సః (2) రసగ్ంహ్యేవాయం లబ్ధ్వానందీ భవతి" అను బ్రహ్మానంద వల్లీవాక్యద్వయము నుదాహరించుటయే దానికి నిదర్శనము.

ఆ రెండువాక్యములకును శ్రీ శంకరభగవత్పాదులవారు తమ ఉపనిషద్భాష్య మున:- రసమనఁగా తృప్తిహేతువును, ఆనందకరమునగు మధురామ్లాది (రుచులు) అని లోకవ్యవహారము. ఆ రసమును పొంది ఆనందముకలవాఁడగుచున్నాఁడు. (అని రెండవవాక్యమున కర్థము.) ఆనందమునకు హేతువుగా లోకములో ఏదో యొక వస్తువు తప్పకయుండునుఁగదా ! కాని అట్టి బాహ్యానందము లేనివారును, ఎట్టి కోరికలు లేనివారును బ్రహ్మజ్ఞానులునగు విద్వాంసులు బాహ్యవసరముల ననుభవించువారివలె ఆనందములోనున్నవారై కన్పించుచున్నారే: ఇదియెట్లు వారి యానందమునకు రసవద్బ్రహ్మమే కారణము కావున- అని వివరించిరి.

ఆ భాష్యముపై శ్రీ సురేశ్వరాచార్యులవారి వార్త్తిక మిట్లున్నది.

"రసః సారోఽమృతం బ్రహ్మ- ఆనందో హ్లాద ఉచ్యతే.
నిస్సారం తేన సారేణ సారవల్లక్ష్యతే జగత్" అని.

సారము అనగా స్థిరాంశము; అమృతము అన- వినాశరహితము అయినది బ్రహ్మము. ఆనందము అన- అహ్లాదము. ఇవి రసశబ్దపర్యాయములు. అసారమైన సంసారమున బ్రహ్మమే సారభూతము. ఆ బ్రహ్మముచేతనే జగత్తు సారభూతమగుచున్నది- అని కళ్యాణ వివరణవ్యాఖ్య.

ప్రకృతమునకు వత్తము. కాదంబరీకావ్యమునఁగల రసశబ్దవాచ్యమైన బ్రహ్మ సంబంధి ఆనందమును శ్రీ శర్మగారు చర్చింపఁదలఁచుకొన్నారు అని నే ననుకొన్నాను. ఉపనిషద్వాక్య బోధితమగు పరబ్రహ్మ పదార్థము కావ్యగతమగు రస మెట్లగును ? అని శంక కలుగక మానదు. కావ్యగతమగు శృంగారాదిరసము పరబ్రహ్మపదార్థమునకు అభిన్నమేయని శ్రీ జగన్నాథపండితరాజ సిద్ధాంతము.

రసస్వరూప నిరూపణమున "భగ్నావరణ చిద్విశిష్ట రత్యాదిః స్థాయీ" అని అభినవగుప్త మమ్మటాదులు అనఁగా "రత్యాద్యవచ్ఛిన్నా భగ్నావరణా చిదేవ రసః"- అని పండితరాజు. సచ్చిదానందరూపమగు పరమాత్మలోని చిదంశమే రసముగా

విశ్చితమైనది. బ్రహ్మానందము నిర్వికల్పము. రసానందము సవికల్పము.కావున రసానందము బ్రహ్మానంద సహోదరము. బ్రహ్మానంద సబ్రహ్మచారీ అనినారు.

కాదంబరి యందలి రసము బ్రహ్మపదార్థమైనది. ఉల్లాసమేమి ? ఉల్లాసశబ్దమునకు (1) ప్రకాశనము. (2) సంతోషము ఆనందము -అని రెండర్థములు కనఁబడుచున్నవి.

ఈ గ్రంథమునందు శ్రీ శర్మగారి విమర్శనమున కాదంబరియందు ఏ రసములుగలవో వానిని ప్రకాశింపఁజేయుట ప్రధానము అని తలంచియే యీ భాగమునకు "కాదంబరీ రసోల్లాసము" అని పేరిడినారని యనుకొన్నాను. కాదంబరిలో ప్రధానరసము శృంగారమేయయినను కరుణ శాంతరసములు తక్కిన రసములకంటె శృంగారరసమంత ప్రాధాన్యము వహించినవి కావున కోమలరచనాయత్తములైన శృంగారకరుణ శాంతరసములవలన చిత్తద్రుతి (మనస్సునకు ద్రవీభావము=మనస్సుకఅగుట,) కలుగును అనెడి ఆలంకారిక సిద్ధాంతమునకు ఈకావ్యము లక్ష్యమైనది.

ఈ కావ్యమున ప్రధానమగు రసములు మూడు. అవి మూడులోకములకు సంబంధించియుండుట, కథలోని పాత్రములకు మూడుజన్మములు; మూడు గుణముల ప్రాభవము, మూడు దాంపత్యములు- అద్దమునఁ జూపినట్లు చూపఁబడినవి. ఇట్లెత్తి చూపుటకు శర్మగారికి ప్రేరకము ఈగ్రంథారంభమున బాణుఁడొనర్చిన మంగళశ్లోకమందలి "త్రయీమయాయ త్రిగుణాత్మనే నమః" అనెడి దళముకావలెనని నను కొన్నాను. వ్యాఖ్యాత "త్రయీమయాయ=బ్రహ్మ విష్ణు శివస్వరూపాయ" యని చెప్పెను. ఇది వేదాస్త్రయస్త్రయీ అని అమరోక్తినిఁబట్టి వేదత్రయమూర్తి యనియు జెప్పవచ్చును. ఇది విషయాంతరము. ఆ మంగళశ్లోకమందలి త్రిత్వమే శ్రీ శర్మగారి దృష్టిలో మూడురెట్లయినది. (చూ. 81 పే)

నవరసభరితముగా కవులు సకలభాషలందును వ్రాసియుండవచ్చునుగాని బాణునివలె కల్పనములను ఆయారసములను స్వీకరించుటలో ఔచిత్యము మఱచినవారే ! పెక్కురనినట్లు బాణుని రసౌచిత్యప్రసంగమున శ్రీ శర్మగారు వ్రాసిన అక్షరములు సౌవర్ణములు.

"రసనిర్వహణమున అలంకారికులు చెప్పులక్షణములను పాటించి సహజత్వమునకు అనుచితమగు కల్పనఁజేయు— మడిఁగట్టుకొని కూర్చుండు కవుల

యందు లోకవృత్తానుగుణమైన కథారసనిబంధనముండదు." (చూ. 200 పుట) అనిరి.

బాణుని వర్ణనములు సుదీర్ఘములై యిక నెవరికిని నేమియు విడిచిపెట్టక సకలమును తమలోఁ బెట్టుకొన్నవి- అని కొందఱనినారు. కాని ఒకే విషయమును రెండు మూఁడు తావులవర్ణించు నావశ్యకత కలిగినపుడు రసభావాలంకారాదులలో పునరుక్తి యని యున్నదా ? విశకలితముగాఁ బ్రతివర్ణనము చేసినాఁడు కాని సంభోగము నెచటనైన వర్ణించెనా ? ఏలవర్ణింపలేదు. యౌవనము పొంగిపొరలిపోవుచున్న యువతీయువకుల దాంపత్యములనుఁ జెప్పెను. కాని వారి అయోగశృంగారమే గాని వారి సంభోగశృంగారము నాద్యంతము పరిహరించుట చూడ నెంతటి యౌచితీ ధురంధరుఁడో యనిపించును. ఆ విషయము ధ్వన్యాచార్యుల వివరణముతో 188 వ పుటలో శ్రీ శర్మగారు మృదువుగ మూఁదలించియున్నారు. కవియైనవాఁడెల్ల ఆ మూఁదలింపు తారకమంత్రముగా జపించుకోవలసినదే !

రసస్వరూపము పరిపూర్ణముగా జెప్పుటకు నీచపాత్రములు మధ్యమపాత్రములు కాక ఉత్తమములగు పాత్రములనే కవి స్వీకరింపవలయును. ఆ ఉత్తమత్వమునకై మహారాజులవంటివారిని స్వీకరించినపుడు వారివైభవము వెల్లడించుటకై ఉన్నను లేకున్నను ఆకారవిద్యాశౌర్యాదులతోపాటు వారికోటలు రత్నగృహములు మున్నగు అష్టభోగపదార్థములను పుష్కలముగా వర్ణింపకతప్పదు. అట్టి యెడ ఆ యుత్తమపాత్రముల శృంగారము వర్ణించుచో కామశాస్త్రమంతయు వారియందు లక్ష్యసమన్వయ మొనర్పనెంచుట యనుచితము అనుటలో తప్పేమున్నది? నిరంకుశాః కవయః అని మహాభాష్యకారుడు కాబోలు అనిన గుర్తు. అది నిందగాని స్తుతిగాదు- మరువరానిది.

అట్టి యుత్తములశృంగారము దర్శనాదిసుకుమారమార్గమున సాగింపవలెననియేకదా ధ్వన్యాచార్యుల తీర్పు !

ఇట్టి విశేషములెన్నియో యీగ్రంథమున అద్యంతము కలవు. అవి స్థాలీపులాకముగా సమీక్షింపకున్న నా యార్భాటము హెచ్చగునని జంకు. ఇప్పటికే హెచ్చయినదేమో, అని యనుకొనుచు రసోల్లాసమను నీవిభాగము గురుముఖతః తెలిసికొనుట లెస్సయని నాసలహా.

"బాణోచ్ఛిష్టం జగత్సర్వం" అనునది పరితోషితస్థాణుఁడగు బాణుని కాదంబరీ కథాకావ్యరూపుఁడు అష్టమూర్తి (శివుని) ఎనిమిదవమూర్తి. ధనాఢ్యులచిత్త

వృత్తి మొదలు నీచాతినీచుల భావములదాఁక కన్నులకుఁగట్టినట్లు వర్ణించునే! జరద్ద్రవిడ బ్రాహ్మణచరిత్రముకంటె హీనమగునది లోకమున నేమున్నది? ధనాఢ్యుల చిత్తవృత్తికి శుకనాసోపదేశము దర్పణము. శ్రీనాథాదులు తమకావ్యములలో ఇట్టి యుపదేశములు చేసినారు. కాని యవియన్నియు బాణోచ్ఛిష్టములే.

కాదంబరి హిమగృహమునకు చంద్రాపీడుడు వెళ్ళునపుడు ఆగృహమునకు ముందున్న పూలతోఁటలో నుండిపోవునపుడు ఆత్రోవలో బంగారుతో తయారుచేసిన పలుచని సున్నముతో కట్టబడిన కామపీఠముగల మంచిగంధపు నీటిబావులందు ఏతాము లమర్చబడియున్నవి. ఆ ఏతాములకు కలువపూల దండలే త్రాళ్ళుగాగల యాకు ధొప్పలు కుండలుగా కట్టఁబడియున్నవి. తోడిననీరు వెలుపలఁ బోసినప్పుడు ప్రవహించుటకుఁగాను దోనెపట్టెలకుమాఱు మొగలిఱేకు లమర్పఁబడియున్నవి- అని వర్ణించెను. ఎంతసుకుమారమో ! ఇంతకు ఆ నూతులలోని నీరు చందనోదకము. కాదంబరి పొందుచున్న విరహతాపశాంతికి నిర్మితములైనవి! ఏమియీకవిసృష్టి? ఇవి యన్నియు శీతలవస్తువులే! వానితో చందనోదకము తోడుడుటకు ఏర్పచిన కామ పీఠము అనగా నూతిగొట్టమో లేక నూతిచుట్టుననుండు కుట్టిమభూమియో (ఛప్టాయని) యనిపించుచున్నవి.

కామపీఠశబ్దార్థము వ్యాఖ్యలందును సరిగాఁగనరాదు. కావున ఆ సంస్కృత భాగము నిటఁ జూపెదను. బుద్ధిమంతులెవరైన దాని యర్థము సాధింతురని యాశ.

"క్వచిద్గంధోదక కూపేషుబద్ధ కాంచనసుధాపంక కామపీఠేషు స్థూల బిస లతాదండ ఘటితతారకాణి కృతకకేతకీదళ జలద్రోణికాని కువలయావళీరజ్జుభిః గ్రథ్యమానాని పత్రిపుటీ ఘటికాయంత్రాణి" అని ఆభాగమున బాణుని లోకజ్ఞత వెల్లివిరిసినట్లున్నది,

ఇట్టివర్ణనలు వసుచరిత్రాదులందు కనఁబడును. దానికి బాణుఁడే మార్గదర్శకుఁడనవచ్చును. వానినిఁజూడ నవి బాణోచ్ఛిష్టములుగాఁ గనఁబడును.

వీనికేమి కాని ఎవ్వరికిని అనుకరింపసాధ్యముకాని బాణునియొక్క యద్భుత శిల్పమునుఁజూపి యీ నా సమీక్ష ముగింతును.

కాదంబరీకావ్యమున బాణమహాకవి తుట్టతుది గ్రథనము. పత్రలేఖచేత చంద్రాపీడునకు పంపిన సందేశము. అది నిషేధముఖమైన విధివాక్యనిబిడము.

"జానామి తే గరీయసీం ప్రీతిం............జ్ఞాస్యసి మరణేప్రీతి మిత్యసంభావ్య మేవ" అని.

"గొప్పదగు నీప్రేమనే నెఱుఁగుదును. మిగుల మృదువగు దిరిసెనపువ్వువలె మెత్తని స్వభావముగల స్త్రీ జనమునకు ఇంతమాత్రము ప్రాగల్భ్య మెట్లుకలుగును? అందును బాల్యముననున్న కుమారికల కెట్లుగలుగును ? ఏయింతులు తామై భర్తలకు సందేశముసంపుదురో, భర్తలవద్దకు తెగించి వెళ్ళుదురో అట్టివారు సాహసకారిణు లగుదురు. అయినను సాహసించి సందేశము పంపుచున్న నేను సిగ్గిలుచున్నాను. ఇంతకు ఏమనివార్త నంపుట? "నీవు నాకు అతిప్రియుఁడవు'' అనినచో పునరుక్తి దోషము "నీకు నేను ప్రియురాలను" అనుట వివేకహీనమగుమాట. ''నీయందు నాకు గొప్ప అనురాగముగలదు" అనిన అది వేశ్యపలుకు అగును. ''నిన్ను విడిచి నేను బ్రతుకఁజాలను" అనినచో అనుభవవిరుద్ధమగు మాటయగును. "మన్మథుఁడు నన్నుపరాభవించుచున్నాఁడు అనినచో అది నాదోషము బయలుపెట్టుకొనిన తెలివి తక్కువయగును. అదికాదు. మన్మథుఁడు నీకు నన్ను ఇచ్చివేసినాఁడు" అనినచో అది నీదగ్గఱకు వచ్చుటకు పన్నినపన్నుగడ యగును. "బలాత్కారముగా హరింప బడినవాఁడవు''అనినచో అది కులటయొక్క పొగరు అగును. ''అవశ్యమురావలెను" అనినచో సౌభాగ్యమువలనఁగల్గు అహంకారమగును. "నాయంత నేనే వచ్చు చున్నాను" అనినచో అది స్త్రీచాపల్యమగును. "ఈ నీదాసి నీయందే తక్క యితరు లందు అనురాగములేనిది'' అనినచో అది మనసునందలి భక్తిని వెల్లడించుకొను తేలికతనమగును. "నిరాకరింతువేమో యను సందేహముచే వార్తనంపలేదు" అని నచో నిరాకరించుట యెఱుఁగనివానికి నిరాకరణము నేర్పినట్లగును. "నన్ననుస రించి జీవించువారు నాకై దుఃఖింతురేమోయని యెంచనట్టి కఠినురాలనగుదును." అనుట అత్యంతప్రణయ ప్రకటనయగును. "నేను మరణించినచో నాప్రేమను గుర్తింతువు అనుటకు గంధర్వస్త్రీని గావున మరణము నాకు ఊహింపరానిది. ''జ్ఞాస్యసి మరణేన ప్రీతిం" అను పాఠాంతరమునందు నా మరణముచే నీయందు నాకెంత ప్రేమగలదో తెలిసికోఁగలవు." అందునా? మరణము అనునది నాపట్ల ఊహింపరానిది. కావున ఏమనివార్త నంపుదును ? అని వెనుకటివాక్యముతో అన్వయము.

దీని తాత్పర్యమేమి ? "నీవు నాకతిప్రియుఁడవు. నీకునేను నతిప్రియురాలనే కదా ! నీయందు నాకెంతయో యనురాగముకలదు. నీవు లేనిదే నేను బ్రతుకలేను నీమీఁది వలపుచేఁగల్గిన పరితాపము దుర్భరముగానున్నది. ఈ వలపునన్ను బ్రదుక నిచ్చునట్లులేదు. సర్వదా నామనసులోమాత్రము నీవు నిలిచియున్నావు. తప్పక రావలెను. నీవు రానియెడ నేనే రావలసివచ్చును. ఒకవేళ నన్యునితలంతుననుకొను చుంటివేమో ఈ జీవితములో అది జరుగనిది. ఈ నావార్త నిరాకరించితివా నేనే కాదు నా పరిజనులు దుఃఖింతురు. మరణించియైనను నాప్రేమ నీకుఁ దెలుపుదునను కొనుటకు మరణములేని త్రిదశాంగనను అని సూటిగా విధిరూపముగాఁ జెప్పవలసిన

మాటలివ్వి. కాని నిషేధరూపమున కాదంబరినోట చెప్పించిన బాణుని యీరచనా విశేషము అనన్యసాధ్యము అనిపించి ఉచ్ఛిష్టదోషము తొలగించుకోఁగలిగెను. కాని "జ్ఞాస్యసి మరణేన ప్రీతిం" అనునంతిమవాక్యమాతని యంతమునకైనది యని నారు. మంగళాదీని మంగళమధ్యాని మంగళాంతాని ఇత్యాది భాష్యకారవచనమాతఁ డెఱుఁగఁడా? ఋషికావున ఆ వాక్కు అర్థవంతమైనదికాఁబోలు. "ఋషీణాంపు నరాద్యానాం వాచమర్థోఽనుధావతి" కదా! కీడులో మేల్లన్నట్లు సర్వవిధములఁ దన యంతవానిని తనపుత్రుఁడగు పుళిందబాణుని నిలిపి అస్తమించినాఁడు. కాన గ్రంథము సంపూర్ణరూపము నొందినది. అంతకే సంతసింతము.

భరతశర్మగారి కాదంబరీ రసజ్ఞత నీగ్రంథము చాటుచుండ నాసమీక్షయేమి ? ఆయన మాటలనే భంగ్యంతరముగా వెల్లడించితిని. అందునను కొన్ని కొన్ని మాత్రమే! వ్రాయవలెననుకొన్న వెన్నియో వార్ధకముచే మఱచియే పోయితిని.

"వృద్ధుల బుద్ధులు సంచలింపవే" అని నా దౌర్బల్యమును వెల్లడించుచు ఇంత నిశితవిమర్శన మొనర్చి ఆంధ్ర సరస్వతి కపూర్వమేకాక యసాధారణమగు నలంకారమును ఘటించిన భరతశర్మగారిని సకుటుంబముగా సంతతాభ్యుదయము నొంద వయోమాత్రవృద్ధుఁడ నగుటచే ఆశీర్వదించుచున్నాను.

ఒక్కమనవి. అపూర్వముగా అనన్యసాధ్యముగా రచించినయిట్టి గ్రంథము అస్మదాదులు పఠింప ముద్రింపించి యందించిన నిష్కామకర్మ శీలురగు శ్రీయుత మల్లాది వేంకటారామయ్యగారిని ముందే స్మరింపవలసియుండ నిపుడైన వారి నభినందించుట ధర్మముకదా !

ఆ యుదారచరితున కదేమో సంస్కృతమన్నను ఆంధ్రమన్నను గ్రంథకర్తలన్నను నెంతప్రేమయో! వేణుగోపాల సంస్కృతప్రచారసభ కాయన అధ్యక్షులు. షోడశమహాదానములు శాస్త్రీయముగాఁజేసి తులాభారము తూఁగి శ్రీ కందుకూరి శ్రీరామచంద్రమూర్తి కవి రచితమగు "నడిరేయి ముచ్చట్లు" మున్నగు కావ్యములను అంకితముగొన్న విద్యావ్యసనముగల యుదారాశయులు. గ్రంథ ముద్రణవ్యయమంతయు భరించి యాంధ్రదేశమున కందించిన యమ్మహనీయున కాంధ్రదేశము పక్షముననేను కృతజ్ఞత చెప్పుచున్నాను. సెలవు.

కాకినాడ
కాళయుక్తి కార్తికశుక్ల
దశమీ శుక్రవారము

ఇట్లు
(సం) వెంపరాల సూర్యనారాయణశాస్త్రి.

## ప్రేమస్పందన

శ్రీమద్భీమ ధనుర్విఖండనబలశ్రీనిర్జితోర్వీధవ
శ్రీమాణిక్యకిరీటరాజిత పదశ్రీపర్ణు డంచన్మహీ
రామానందన సన్మనః కమలమార్తాండుండు నిత్యంబు స
త్ప్రేమంబ్రోచుత నిన్ను సగృహిణినిన్ బ్రేమైకసంతానమున్.

అనుకోలేదుర! లక్ష్మణానుజుని సాహాయ్యంబుతో నిన్ను మే
కొని కాత్యాయని పాఠశాలకడకుం గొంపోవు ఆరోజులం
దున, నీవింత వధానవాణివయి ప్రాజ్ఞుల్ మెచ్చు గ్రంథంబు ల
చ్చునకీయందగువాని వ్రాయగలవంచున్ భ్రాతృవిద్వన్మణీ !

పరమపవిత్రమైన భువిభారత, మందున బ్రాహ్మసత్కృపన్
బరమపవిత్రశీలి, కవి, పండితవర్యుఁడు, బాలకృష్ణ ధీ
వరునకు, రాజ్యలక్ష్మికిని, బంగరుపంటవునైతి, సత్కళా
ధరులగు నగ్రజుల్ ముపుర దైవములట్టుజూచె, దష్టదు
ర్భరతరలక్షణాలుగల పండితకోటి మహావధాన సం
గరముననోర్చి, ప్రౌఢతర కావ్యకళాకమనీయమూర్తి యా
గురునకు విశ్వనాథునకు కూరిమిశిష్యుడవై యఖండమై
పరగెడు కీర్తిగాంచి గురువాంఛఫలింపఁగఁ జేయనెంచి, దు
ర్భరమగు భారముస్ప్రమదభావముననయికొంటి; కృష్ణు డం
బరమున కొండనెత్తుకొని బందుగులన్ భయమేదిరమ్మటం
చురహిని జీరుచందమున; చోద్యముచేసెను చూతమంచువ
చ్చిరి పురితత్పరీసర ప్రసిద్ధకులాధిప ధీ విశేష సుం
దరులగువార లెందరో వధానసరస్వతి; యింతెగాదు, ని
ర్జరులుభజింప తోషమున సద్గెరుడాడెడు విశ్వనాథుడం

బరమునచూడు; నీదు ప్రతిభావిభవంబులు వారిపైన ఆ
భరణము లేకదా! బరువుభారములన్ సహింపగల్గు ఈ
భరతుడటంచు తద్గురుడు పంచె "రసజ్ఞత" స్వప్నవీథిలో
భరతుడ సార్థకాఖ్యకవిపండిత నమ్రుడవై వెలుంగుమా!

సంబరమయ్యె నీవిటు "రసజ్ఞత" వ్రాయుటచూడబాణ కా
దంబరికి న్గవీశ్వరులు దక్షులు పండితు లబ్బురంబు చెం
దం బగవాడుగూడ "విదితంబగునొక్కొ రసజ్ఞతావినా
క్రొంబొగలీను నర్థములెరుంగగ" నంచని విస్మయంపడన్!

ఆయురారోగ్య భాగ్యంబు లమరఁజేసి
పుత్రపౌత్రాభివృద్ధినిఁ బొందజేసి
సప్తసంతాన సౌభాగ్య సరళిఁదేల్చి
శ్రీధవుడు నిన్ను బ్రేమ రక్షించుగాక!

**12-11-78**
సభావేదిక
కాకినాడ.

నీ
రాముడన్నయ్య
(పేరాల రామలింగేశ్వరరావు)
**Developement Officer, L. I. C., NARSAPUR.**

# స్వాదకాదంబరి

[తాము మన మిత్రుల ద్వారమున పంపిన, "కాదంబరీ రసజ్ఞత" వ్రాతప్రతి చేరినది.........సమాసక్తిమై చదువుచున్నాను. మీరు వేసి కొన్న ప్రణాళిక చక్కనిది. ప్రతి ప్రకరణము హృదయపులోతులకు కొనిపోవుచున్నది. అన్నింట మీ పరిశ్రమము గుర్తించికొనవచ్చును. "కాదంబరీ కథాతత్త్వము"లో శ్రీ మహాత్రిపురసుందరీ పరదేవతా తత్త్వవిషయికముగా చెప్పిన అంశములు అనేకములు గుండెకు పట్టుకొన్నవి.

మరల - ఒకసారి గ్రంథమంతయు ఏకతానముగా చదువుకొందును..........
మీ గ్రంథముపై నా హర్షమును అక్షరాల ఆవిష్కరించుకొందును. ........

రాజమండ్రి, 2-10-78 (సం) మధునాపంతుల సత్యనారాయణశాస్త్రి]

భట్ట బాణుని కాదంబరీ కావ్యము సారస్వతాంబరమున ధగద్ధగాయమానమైన దివ్యతార. హర్ష చరిత్రము దాని వెనుక మఱియొక మినుకు. ఈ కావ్య యుగళము గద్యసాహిత్య యుగ ప్రతిష్ఠకు ఒకటి సిరి; ఒకటి చుక్క.

ప్రాక్కాలికులైన మన కవులు పెక్కుమంది భావిచరిత్రకర్తలపై అనుగ్రహదృష్టి పెట్టినవారు కారైరి. భట్టబాణుడు అటులు కాదు. అంతగా స్వచరిత్రాంశగోపనము చేసికొని యుండని ఆయన ఔదార్యము నేటి పరిశీలకులకు కొంతలో కొంత హర్షదాయకము.

బాణుని చిననాటి యునికిపట్టు శోణా తరంగిణికి దక్షిణమున ఉన్న ప్రీతికూటము. ఆపస్తంబ వాత్స్యాయనులు ఆయన సూత్ర గోత్రములు. జననీ జనకులు రాజదేవీ చిత్రభానులు. సహోదరులు చంద్రసేన మాతృషేణులు. భాషాకవి ఈశానుడు ఆయన అనుంగు నెచ్చెలి.

బాణుడు సాంగవేదాధ్యేత, సాహిత్య సార్వభౌముడు; కవితా కళా ప్రియుడు; భోగభాగ్య సంపన్నుడు. కాన్యకుబ్జాధీశ్వరుడగు హర్షచక్రవర్తి బాణుని పిలిపించుకొని ఆమతించి తన కొలువుకూటమున ఆయనచే అమృతవర్షము కురిపించుకొనెను. కాదంబరీ హర్షచరిత్రములు రెండే కాక, చండీశతకము శివాష్టకము ముకుటతాడితకము బాణప్రణీతములే అని నిర్ణీతము. "పార్వతీ పరిణయ" కర్తృత మాత్రము నిరాకృతము. సూర్యశతకకర్త మయూరునకు బాణునితో దగ్గఱి చుట్టఱిక మున్నట్టి పిట్టకథకు కాలు తెచ్చినది "కుచప్రత్యాసత్త్యా హృదయమపి తే చండి! కఠినమ్" అన్న శ్లోక చరణము. బాణుడు కాదంబరీ కథాప్రబంధము పూర్వభాగము మాత్రమే రచింపగలిగి తనువు చాలించెను. ఉత్తర భాగము తత్తనయుడైన భూషణభట్టుచే పూరణము చేయబడెను. అంశ లేశములు కొన్ని చరిత్ర పథికునకు పండువు చేయవచ్చునే కాని కావ్య భావనా పరిణతాంతఃకరణుడైన రసజ్ఞుని దృష్టికి స్వాదసమయమున పానకములో పుడకలు.

భౌతికములైన వెలిమెఱుగులు కాక, తాత్త్వికమైన లోఁతు వెలుగుచూచి కావ్యరసమును ఆస్వాదించి ఆనందభోగము నందుట యన్నది కొందఱి గుండెలకే లభించు భాగధేయము. తత్రాపి పుక్కిలింతలైన రసానుభూతి భరమునుండి తేరుకొని, దానిని వాక్కులతో ఆవిష్కరింపగల వైఖరీ చాతురులు ఎక్కడో!

నేఁడు — 'కాదంబరీ కావ్యరసజ్ఞత' అన్న పరిశీష్టానుశీలన గ్రంథముతో శ్రీ పేరాల భరతశర్మగారు మధుకలశము నొక దానిని చదువరి చేతిలో ఉంచిన వారైరి. శ్రీ శర్మగారి అచ్చమైన సహృదయతకు, అకృతకమైన రసజ్ఞతకు, అవిచలితమైన భావసమన్వితికి ఈ విమర్శన కృతి విమలాదర్శము.

"సరస్వత్యాస్తత్త్వం కవి సహృదయాఖ్యం విజయతే."

భట్టబాణుని కాదంబరి; భరతశర్మగారి రసజ్ఞత; ఇతః
స్వాదమాధురి పఠిత్రు సహృదయ సాధారణము.

ఈ పరిశీలన గ్రంథము ఎత్తుగడ ఉదాత్తము! కాదంబరీ కథా
వస్తువు పూసగ్రుచ్చినటులు వ్రాసికొనిపోయిన చిట్టచివరి అనుబంధము-
ఉపకరించిన గ్రంథముల పట్టిక - అట్టెపెట్టుదము. ఇక, ప్రకరణాష్టక
ముతో ఈ గ్రంథము సందర్శింపబడినది.

1. బాణుడు - కాదంబరి
2. కుమారబాణుడు - కాదంబరి
3. కాదంబరీ సంకేతము
4. బాణుని అక్షరశిల్పము
5. బాణుని వర్ణచిత్రములు
6. కాదంబరీ కథా తత్త్వము
7. కాదంబరీ రసోల్లాసము
8. బాణోచ్ఛిష్టం జగత్సర్వమ్

ఇట్లు చేయబడుటలో ఆంతర్యము! కావ్యము పరమేశ్వర స్వరూ
పము; రసానంద ఘనము; అష్టమూర్త్యాత్మకము. తాదృశమైన కావ్య
మును భావించి సర్వాత్మనా తన్మయుడైన సహృదయుడు వెలువరించిన
రసోద్గారమునందు మూర్త్యష్టకము అనుబింబితమగుటయు ఇష్టాపత్తి.

"నాన్యత్కించన విద్యతే విమృశతాం యస్మాత్పరస్మాద్విభోః,"

సరసమైన మేధావైభవము, సహానుభవ ప్రాభవము కావ్య
రసజ్ఞతకు రాణ తెచ్చునవి. కాదంబరిలో ఒక్కొక మూర్తినే కనుగొని
అనుశీలకులు ప్రపంచించిన తీరుదీయములు చూడాడ వచ్చును. వారి
యవధాన కౌశలము నభినందింపవచ్చును.

౧

"బాణునకు పూర్వము కాదంబరి యనగా మద్యమనియే లోకము
నకు తెలిసినది. బాణుని కాదంబరి యుదయించిన తరువాత కాదంబరి
యనగా "కాదంబరీ" కావ్యము మాత్రమే రసజ్ఞుల నాకర్షించినది."

ఇటులు ప్రక్రాంతమైన ప్రథమ ప్రకరణము ప్రధానతః కవికి
కావ్యమునకు గల తాదాత్మ్యమును సూక్ష్మేక్షికతో దర్శించినది.

బాణునివలె కావ్యముతో తాదాత్మ్యమును పొందిన కవి మరియొకడు ప్రపంచ వాఙ్మయమున దుర్లభమని కీర్తించినది. కావ్యము శృంగార రస ప్రధానమగుట చాలదు. దానియందు అంతశ్శ్రవంతినియై భారతీయ తాత్త్విక చింతన నిరంతరధారగా జీవనాడియై యుండవలెనట! "ఇది కావ్య పరామర్శమున ప్రాణభూతమైన లక్షణము. కావ్యము నిలిచి యుండుటకు హేతువు దానియందలి ఆత్మ చైతన్యము. ఆ ఆత్మ కవి జీవలక్షణమునుండి కావ్యమున అవతరించునది. తన జాతి సంస్కృతిని తన దేశపు నైసర్గిక స్వరూపమును కావ్యమున సమున్మీలింపజేసినపుడే అది యావత్ప్రపంచమున ఆరాధ్యమైనది కాగలదు. వాల్మీకినుండి వ్యాసునినుండి కాళిదాసాదులైన మహాకవులు ఈ రహస్యము గ్రహించిరి. బాణుడీ రహస్యము మఱింత గాఢముగా మనస్సునకు పట్టించు కొనెను. బాణుడు "కాదంబరి" కల్పితకథను ఇతిహాసముగా భాసింప జేసెను. గద్యమున పద్యమునకు మించిన సౌందర్యము వెలయింపజేసెను. కాదంబరీ కావ్యగత సర్వ లక్షణములు కథాగత సకల సంవిధానములు బాణుని ఆత్మ లక్షణములకు ప్రతీకలు, పతాకలు." ఇట్లు వివరించుచు ఈ ప్రకరణమున "జ్ఞాస్యసి మరణే ప్రీతి మిత్యసంభావ్యమేవ" అను బాణుని పూర్వభాగాంతమునందలి వాక్యము— కథానాయిక కాదంబరి ప్రియునకు ప్రేమ సందేశము నంపుచు నన్నమాట— పేర్కొని, తరువాతి కథను అతనికుమారుడు పూరించెనని చెప్పుచు "మానవుడుగా బాణుడు మరణించెనేకాని కవిగా కాదంబరితో ఐక్యమందినా" డని వ్రాయుట అనుశీలకుల భావుకతకు మంచి గుఱుతు.

మఱియొక విశేషము, "సమగ్రజీవలక్షణ సంపుటియొక్క— మూడుజన్మలలోని ముచ్చటలను కథగాకల్పించిన కవి సృష్టిరహస్య ములకు సుందర వ్యాఖ్యానము" అనిచెప్పుచు ముగింపులో బ్రహ్మ వేత్త ముఖమునప్రవర్తిల్లెడు కావ్యమే లోకమున అమృతము, అదియే

నేత్రము. దానిని శ్రవణముచేసి ప్రవర్తించుటయే శ్రేయస్సు" అను నర్థముగల భారతోక్తి నుదాహరించుటఎంతో సొంపుగా ఉన్నది.

"కుమార బాణుడు - కాదంబరి" - ద్వితీయప్రకరణము. ఏ కావ్యమునందును ఇట్టి వైచిత్రి కన్పట్టదు. బాణుని ఆత్మశక్తి కుమారరూపమున కాదంబరీ కావ్యమును పునరుజ్జీవింప జేసినది. "ఆత్మావై పుత్రనామాసి" బాణుడు - కుమార బాణుడు కాదంబరీ కథానుసంధానము చేయుటయన్నది పార్వతీ పరమేశ్వర సంయోగము వంటిది. ఉత్తరార్థ ప్రారంభములోని కుమారబాణుని స్తుతి శ్లోకము 'దేహ ద్వయార్థ ఘటనా రచితం శరీరం' ఇత్యాది ననుసరించి చేసిన వివృతి యీ ప్రకరణమునకు వెల్గు. 'కాదంబరీ కావ్యనిర్మాణమున తండ్రి కొడుకుల ప్రమేయమే ఒక అర్ధ్రి సన్నివేశ"మని చెప్పుచు "తెలుగున మహాభారత రచనకు సమానధర్ములయిన కవులు సమకూడుటకు శతాబ్దులు పట్టినది. నన్నయ్యకు భారతమును పూరించగల ఆత్మజుడు లేడు. బాణుడే కొడుకు రూపమున కాదంబరిని ఒకేమూసలో పోసిన బొమ్మవలె అతుకులు తునుకలు కనరాకుండ అతికినాడు." అనుటలో పరిశీలకుల యొక్క సమయస్ఫురణము మనోగ్రాహిగా నున్నది. "తిలకమంజరీ" గ్రంథములో ధనపాలుడు బాణుని కుమారుని పేరు 'పుళిందభట్టు" అని పేర్కొనుట - అక్కడి శ్లోకములోని బాణ-పుళింద శబ్దముల శ్లేష చమత్కారము- ఈ ప్రకరణమున దర్శనీయము.

3

ఇక మూడవది కాదంబరీ సంకేతము. ఇది లోతులు తడవుచున్న ప్రకరణము. అభిజ్ఞాన శాకుంతలములోని 'మానుషీషు కథం వా స్యాదస్య రూపస్య సంభవః' 'న ప్రభాతరళం జ్యోతిరుదేతి వసుధాతలాత్' అన్న శ్లోకముతో ఆరంభమగును. విధాతయొక్క తొలిసొం

దర్యసృష్టి అపస్సులనుండియే ఆవిర్భవించినది. అప్సరసలు సృష్ట్యాది సౌందర్యమూలకందములు. ఆ కోవలోని మేనకకు జన్మించినది శకుంతల. "సృష్టిః స్రష్టురాద్యా". కాళిదాసుని కావ్యనాయికా తత్త్వసమున్మీలనము బాణుని భావనలో కాదంబరిగా ఉదయించెనట! శ్రీ భరత శర్మగారు వైదిక పరిభాషయందలి "స్త్రీసురా" అనుమాట నుదాహరించి "కావ్యకళయందు వైదికతత్త్వమును గర్భితముచేయు నైపుణ్యము కూడ బాణుడు కాళిదాసునుండియే భావించినట్లు తోచు"నని చెప్పుట సహృదయ సంవాదమైనమాట. కాదంబరి కథానాయిక. చంద్రాపీడుడు కథానాయకుడు. వారి నాయకల్పనౌచిత్యము, తద్రహస్యము ఈ ప్రకరణము వివరించినది. "యే విద్వాంసస్తే కవయః"అనుశ్రుతి యుదాహృతము. గుణాఢ్యుని బృహత్కథలోని మకరందికోపాఖ్యానము కాదంబరీ కథకు మూలమని చెప్పుటకు స్థూలలక్షణములుచూపి "నక్క ఎక్కడ! నాకలోకమెక్కడ!"అనుట వాడియైన సత్యము. కాదంబరీకావ్యములోని పాత్రలు ఆధ్యాత్మిక ఆధిభౌతిక ఆధిదైవికములతో ముడివడిన తత్త్వమునుగూర్చి యీ ప్రకరణము గంభీరార్థములు వెల్లడించుచు పరిశీలకుల పరిశ్రమమునకు దర్పణముగా వెలయుచున్నది.

౪

నాలుగవది బాణుని అక్షరశిల్పము. కథను గద్యములో చెప్పుటయే సరసమైన మార్గమనియు, గద్యమునందలి హృద్యతకవియొక్క చాతుర్యమున ఏర్పడుననియు వివరించుటయేకాక "బాణుడు గద్యకవులలో ఎంత అద్వితీయుడో పద్యమున అంత అద్వితీయుడు లేడని పేర్కొని సోడ్ఢలునిశ్లోక ముదాహరించుట సందర్భోచితమై యున్నది. "బాణంతు సర్వేశ్వర మానతోఽస్మి"— బాణుడు అక్షరముల కూర్పునుండి రస పరిష్కారమువఱకు తన గద్యరచనా ప్రణాళిక నొక విలక్షణముగా తీర్చికొనెననుటకు వామనునిరీతి సంప్రదాయము తత్కావ్యాత్మత సమ

న్వయముగా చెప్పబడెను. సాహిత్యదర్పణము పేర్కొనిన ముక్తక వృత్తగంధ్యుత్కలికా చూర్ణకములను గద్యలక్షణవైవిధ్యమును చూపి కాదంబరినుండి ఉదాహరణము లీయబడినవి. బాణుని అక్షరశిల్పము కథాముఖమున ప్రత్యక్షముచేయుట యన్నది అసామాన్యమైన అనుశీలకచాతుర్యముగా ఈప్రకరణము ద్యోతకముచేయుచున్నది. అక్షరబంధగతమైన ఋతమే లయ యనిచెప్పబడుచున్నదన్న ఆంగ్లచ్ఛందోవేత్తల వాక్యములుపేర్కొనుటయేకాక, "ఋతంభరమైన అక్షరబంధము వక్తృశ్రోతల చిత్తములందు సమాధిని సిష్పాదించి తన్మయత్వ మొదవించును. కావ్యపఠనకాలమున గలుగు తన్మయత్వము పాతంజలులు చెప్పెడి ఋతంభరవంటిది" అని శ్రీ విశ్వనాథ సత్యనారాయణగారు వ్రాసినదానిని స్మరించుకొనుట శ్రీ భరతిశర్మగారి ఆచార్య గౌరవమునకు పరమోదాహరణము. బహుళములైన ఆలంకారిక విశేషములు చూపుచు చివర ఈ ప్రకరణము ఏమనుచున్నది! "గద్యమునందు గాని, పద్యమునందుగాని పదసంఘటనారూపమైన విలక్షణత లేనిదే కావ్య శరీరాంతర్గత ఆత్మకు ఆశ్రయమే లేదు."

※

అయిదవది బాణుని వర్ణచిత్రములను మూర్తి కట్టించిన ప్రకరణము. బాణుని కాదంబరికథ దివ్య—సిద్ధ—మానుషలోకములనుండి పరివ్యాప్తమైనకథ. ఈ త్రిలోకములయందలి రామణీయకము సర్వము బాణుడు కావ్యమున వర్ణనలలో గుప్పించెను. బాణుడు ముగ్గురు రాజులను, ముగ్గురు మునికుమారులను, ముగ్గురు కన్యలను, మూడు నదులను, రెండు సరస్సులను, రెండు అడవులను, వర్ణించిన తీరు పేర్కొనుటయేకాక, రాజకుమారోదయ, దేవాయతన, మున్యాశ్రమ, పురహాయరత్నవర్ణనములు ప్రత్యేకముగా చెప్పి కథానిర్మాణ శిల్పమున ఈ వర్ణనముల పోహళింపులో భాసించుచున్న యొకానొక సౌష్ఠవమును ఉదా

హరణపురస్సరముగా ఎత్తిచూపుచున్న ప్రకరణమిది. చదువరికి సద్యః పారవశ్యము కలిగించుటకు ఈ భాగము ఒక జాలయంత్రము. వర్ణనముల నుండి శిల్ప వైభవము భావించుచు వ్రాసిన ఘట్టములు గంభీరములు. కాదంబరి కథానాయకుడు చంద్రాపీడుడై యుండగా, శూద్రక మహారాజు వర్ణనముతో కావ్యారంభము జరుగుటలోని రహస్యము–పూర్వోత్తర జన్మలకు వర్తమాన జన్మతో గల సంబంధము–చాల మెలకువగా సప్రమాణముగా విస్తృతము చేయబడినవి. అచ్ఛోదసరోవరతత్త్వమును గూర్చి చేసిన జీవవ్యాఖ్య సహృదయుని సుధాంశులోకమునకుకొంపోవు చున్నది. శ్రీ భరతశర్మగారి పరిశీలన వైశిత్యమునకీప్రకరణము సర్వోత్తమమగు దృష్టాంతము.

౬

కాంగా, కాదంబరీకథాతత్త్వము అన్న ప్రకరణముఅష్టమూర్త్యాత్మక మనుకొన్న యీ గ్రంథమున యజమాన స్థానము. పుండరీకుని జన్మలక్షణము పేర్కొనుటతో ఇది యారంభమైనది. లక్ష్మీదేవి శ్వేతకేతుమహర్షి సౌందర్యమును చూచినంతమాత్రన సురతసమాగమ సుఖము పొందుట–పుండరీకోదయము అగుట– ఆమె "ఇతడు నీ యాత్మజుడు గ్రహింపు" మని శ్వేతకేతునకిచ్చుట ఆయన కుమారునిగా స్వీకరించుట–ఈ కల్పనచేసిన కావ్యము అసత్యాఖ్యముగా బహిరంగ దృష్టికి తోచవచ్చును. ఇక్కడ బాణుడుకథా వస్తునిర్మాణమున నిగూఢ తాత్త్వికరహస్యము నిమిడ్చెననియు, అది వేద–శాస్త్ర–యోగ సిద్ధమైన దనియు ఈ ప్రకరణము ఉద్ఘాటన చేయుచున్నది. శ్రీ మహాత్రిపుర సుందరీ పరదేవతాతత్త్వప్రతిపాదకమైన "కా మ క ళా వి లా స" మను గ్రంథము ఈ సముద్ఘాటనమునకు మూలాధారము. ప్రకాశబిందువు–విమర్శబిందువు–మిశ్రబిందువు– ఈ విచారణముచేసి, శ్వేతకేతువు పరమేశ్వరునకు ప్రతీక–లక్ష్మి పరమేశ్వరీ ప్రతీక– పుండరీకుడు స్ఫుటశివశక్తి

సమాగమ బీజాంకురరూపము – అని యీ ప్రకరణమున చూపిన సమన్వయము హృదయస్పృశమై ఆనందలోకములో అడుగు పెట్టించుచున్నది. పుండరీకుని వాసనలు – మహాశ్వేత ఆకర్షణ – బ్రహ్మచర్యస్ఖలనము – అక్షగమాల, ఏకావళి – కాదంబరీ చంద్రాపీడులు – తత్తద్వాంఛ్యాలు లోలోతులను తడవుచున్నవి. అనుశీలకుల ఏకాగ్రదృష్టికి శీల వైభవమునకు ఈ ప్రకరణము చెప్పదగిన యుదాహరణము.

"కాదంబరివంటి లోకోత్తర సౌందర్యవతిని, చంద్రాపీడునివంటి సకల కళాప్రపూర్ణుని నాయికా నాయకులుగా ఎన్నుకొనిన బాణుడు తన కావ్యమునందు శృంగారరసమును మేరు శృంగోన్నతపీఠమున నిలిపి రసరాజ్యాభిషేకము చేసెను."— కాదంబరీ రసోల్లాస మన్న సప్తమ ప్రకరణము రససార్వభౌమముపై చేసిన వ్యాఖ్యారాజము. "లోకమునకు ప్రియమైనది శృంగారరసము. అనుభవించక తప్పనిది కరుణము. హితకారియైనది శాంతము. మిగిలినరసముల యనుభవము తత్తన్నిమిత్తానుగుణాపతితము. లోకవృత్తము సహజముగా చిత్రించవలెనన్నచో కరుణశాంతములనుకూడ సముచితప్రాధాన్యముతో నిరూపించవలెను. బాణుడీ విషయమున చాల అవధానచిత్తుడు"— గుర్తుపెట్టుకొనవలసినది. కథాముఖమున బాణుని రసపరిష్కారము పేర్కొన్న ప్రకరణమిది. తక్కినపాత్రల విషయము అటులుండగా, పత్రలేఖనుగూర్చి ఆమె ఉపేక్షితయన్న యాక్షేపణ మొకటి విశ్వమున వ్యాపించియున్నది. "పురుషునియందలి నిద్రాణమైయుండు రత్యాఖ్యమైన స్థాయీభావము పత్రలేఖ. రోహిణియొక్క అవతార మనగా కథానాయకుని మూలతత్త్వమందలి రతిస్వరూపమే." ఇత్యాదిగా ఆపాత్రయొక్కయు కేయూరకునియొక్కయు "అపేక్ష" సవిమర్శముగా స్థాపించి,"ఉపేక్షితా"

వాదము ఆక్షిప్తము చేయుటలో అనుశీలకుల సూక్ష్మదృష్టి ప్రత్యేక ముగా ప్రశంసార్హము.

"బాణోచ్ఛిష్టం జగత్సర్వమ్"— జగత్ప్రసిద్ధమైన ఈ యాభాణకము ఏర్పడుటకు తగిన కారణగుచ్ఛము ఈప్రకరణమున సర్వతస్సురభిళమైయున్నది. తరువాతి కవులైన దండి- సుబంధుడు- ధనపాలుడు- వాదీభసింహుడు- వామనభట్ట బాణుడు సోడ్ఢలుడు మున్నగువారు బాణుని ఎట్లు ఉపజీవ్యునిగాచేసి కొన్నదియు నిరూపితము. సంస్కృత కవులేగాక, ప్రసిద్ధాంధ్రమహాకవులగు సోమనాథుడు, శ్రీనాథుడు, పెద్దన బాణునెట్లులనుకరించిరో యిందు చెప్పబడుట బాగున్నది. బాణుని సర్వతోముఖవిజ్ఞానమునకు ఉదాహృతులు ఈయబడినవి. "కాదంబరి ఎన్నివిషయములతో జతపడియున్నను, కథను మ్రింగివేయునన్ని వర్ణనములున్నను, బహుశబ్దపాండిత్యపటుత్వమున్నను పాఠకుని ప్రతిమలుపు నుండియు రసమువైపునకే గొనిపోవును." అని మంగళోక్తి పలికి శ్రీ శర్మగారు తమ సమీక్షాకృతికి "భరతవాక్యము" చెప్పుచున్నారు. వారి కల్యాణకాంక్ష సహృదయస్పృహణీయము.

> "పెండ్లిచేసికొనినగదా పెండ్లికూతురు శయ్యకు చేరునది !
> కావ్యమును చదివినగదా; చూచినగదా; భావించినగదా !
> తద్రసము తెలియునది."-

త్యాగరాజనగరు
రాజమండ్రి
25-10-78

చిత్తగింపుడు,
(సం) మధునాపంతుల సత్యనారాయణశాస్త్రి.

# "భట్టారక భారతి"

జమ్ములమడక మాధవరామశర్మ

బాణభట్టారక! శ్రీమన్! భావత్కృతిసేవినే
తాం దివ్యామాశిషం దేహి తస్మై భరతశర్మణే.

శ్రీమాన్ భరతశర్మ భట్టారక భారతీశర్మ, బాణవాణీ వర్మ. కాదంబరీగ్రంథరసజ్ఞత నావిష్కరించుటకు తద్వైశిష్ట్యమును స్వవైదగ్ధ్యముతో ప్రకాశింపజేయుట కీ లఘుకృతి నిట్లు నిబంధించెను. ఇందు ప్రధానముగా పది విషయముల పరామర్శన మున్నది. ఈ దశలక్షణిలో వివక్షితము వ్యక్త మొనరించుటకు యతన మొనరించెను. ఇంకను ప్రకాశ్యము కలదని భరతశర్మయు భావించి యుండెను. కాదంబరీరసజ్ఞుల కన్యము రుచిరము కా దందురు. ఇది యొక యర్థవాదమై భట్టారకభారతీ వైభవము సూచించును. కాదంబరీ వైశిష్ట్యము రసజ్ఞులకు భాసించుటను భావకులు స్వామోదమున స్ఫుట మొనరించిరి. బాణభట్టారకుని హృదయ మమృతసాగరము. అం దాతని మననమథనమున నుదయింప వలయు నవి యన్నియు నుదయించినవి. అం దావిర్భవించిన క్షీరహాలాహలమును భట్టారకుడే శివభావుడై ప్రత్యభిజ్ఞామృతముగా నాస్వాదించినాడు. సర్వము శివభావభావనాస్పద మయినది. సచేతోభావనావాసితుడు భరతశర్మ రసజ్ఞత నావిష్కరించుటకు బాణవాణీ సమారాధనము చేసెను. దీనిని వ్రాసెను. బాణ భరత భావభార భావనముతో దీనిని భావించి భావకులు స్వసంవాదముదితులు కాగలరు.

బాణభట్టారకు డుపాసకుడు. చండీదాసుడు. పార్వతీభక్తుడు. బ్రహ్మవంశసంభూతుడు. బహుశ్రుతుడు. ఆర్ష సాగర దివ్య గంధర

సంస్కృతి సంస్కృతాత్ముడు. పదే పదే సాధుధ్వని మనోహరముగా తన గ్రంథము రచించెను. ఇది సర్వము సుభాషితహారి. స్ఫురత్కలాలాప విలాస కోమలము. "రసేన శయ్యా మభ్యుపాగతా కథా" ఇది నవపదార్థోపపాదితకథ. ఇది "అతిద్వయీ కథా". కేవల మితి వృత్తరమ్య మొకటి. ప్రత్యక్షరశ్లేషయమక చక్రవర్తితా స్ఫోరకము వేరొకటి. ఇది యది కాదు. అదియు గాదు. ఇది యిదియె. వాని భావ సంభావనమున ప్రత్యుత్పన్నవివేకప్రాచుర్యమున సమాసాదితాలోక లోచనుడు శ్రుతిశాంతకల్మషుడు సోమకషాయితోదరుడు సమస్త శాస్త్ర స్మృతిబంధురముఖమున సరస్వతి ప్రకాశింపగా దీనిని వెలార్చెను. భట్టారకుడు సరస్వతీ పాణిసరోజ సంపుట ప్రమృష్టశ్రముడై సంతుష్టుడయ్యెను. భరతశర్మయు బాణవాణీ సంఫుల్ల హృదయవాణి. నేనును బాణభరతభావుడ నయితిని.

ఈ కథాప్రబంధ మనన్యశక్యము. ఇది గంభీరము సతాపము. సపరిహాసము. సాభ్యర్థనము. సాభిమానము. సావహేలము. సప్రసాదము. సనిర్వేదము. సానురాగము. సకోపము. సనిర్విశేషము. సావష్టంభము. సోత్ప్రాసము సోపాలంభము. సానుక్రోశము. సస్పృహము. సావధారణము. ఏవంప్రాయములయిన వైశిష్ట్యద్యోతు లీ ప్రబంధమున నున్నవి. ఇందు సచేతసులు విశ్రాంతులై లగ్నులై ఉల్లిఖితులై మగ్నులై ఉల్లసితులై ఆరూఢులై కృతపదులై ముక్తాత్ములై ఆశ్లిష్టులై ప్రవిష్టులై ఉత్కీర్ణులై సమున్మీలితులై చమత్కారవాసితు లగుదురు. భరతభావు డెట్టి వా డయ్యెనో సచేతసులు చేతోర్పణమున భావింప గలరు. ఉత్పన్నాత్మీయబుద్ధులై నిర్భరభావార్ద్రచేతసులై ప్రబంధభావనులు గృహీతమౌను లయి యుల్లై యుందురు. చంద్రబింబము గోచరింపదు. వీణాధ్వనులు దూరముండును. ఇతరసుభాషితములు ప్రవేశింపవు. సుహృద్వచనములు రుచింపవు. బాంధవజనజల్పితములు సుఖమీయవు.

బాణవాణి నిట్లు భావింపవలసి యున్నది. నిరంతర శ్లేషఘనము ఉజ్జ్వలదీపకోపమము రసైకఘనము సర్వవిధసాహిత్యసామగ్రీసంవాసి తము నయిన బాణుని గద్యప్రబంధము ననేకు లనేకవిధముల ప్రశంసించిరి. "గద్యం కవీనాం నికషం వదంతి" అను సూక్తి బాణకృతి నిబంధనకము. వర్ణము పదము వాక్యము రచన ప్రబంధము సర్వము వ్యంజక ధర్మవాసితమై యిందు గలదు. రచన యను సంఘటన విషయౌచిత్యమున నుండుట వక్తృవాచ్యౌచిత్యమున నుండుట దీని యాధారమున సమున్నేయము. రసబంధాభినివేశము కల కవికి అలంకారము లన్నియు అహమహమికతో ప్రసరించుననుట యిందే యున్నది.

కథలో కథ కథలో కథ బృహత్కథలో నున్నది. కాని వాని కైకాన్వయము సుఘటముకాదు. పరస్పరసంబంధ మిందు గలదు. నానాపాత్రస్వభావ చిత్రచిత్రణమున విశ్వవిశ్వప్రకృతి యిందు చిత్రిత మయినది. బాణగ్రంథమున నున్నవన్నియు సుశ్లిష్టములు. భట్టారకుడు రాజకులసంచార చతురమతి. సాంప్రదాయిక సముదాచారవివేకవిభవుడు, రాజనీత్యుపదేశమున శుకనాసుడు. వింధ్యాటవీసంచారమున శబరయువ. ఆశ్రమపవిత్రతాప్రతిపాదనమున జాబాలి. దివ్యవైభవ వైశిష్ట్యమున శ్వేతకేతువు. చండాలకన్యకా మహార్ఘనిరూపణమున మాతంగకన్య. విద్యాసంపత్సిద్ధిలో వైశంపాయనుడు. బాణుడు స్రష్ట-ద్రష్ట. తెలియ వలయునవి యన్నియు బాణునకు దెలియును. బాణునకు దెలిసినవి ఈ దినములలో గూడ నేరికిని దెలియవు. బాణుని కృతి లుప్తములు గుప్తములు నయిన వానిని మన కుద్బోధింపగలదు. బాణ గ్రంథాధ్యాపనశక్తి కతిపయాంతర్వాణినిష్ఠము. తదధ్యయనము లుప్త మయినచో కవిత విలుప్త మగును. ఇట్టి భావభారమును మోసి మోసి భరతశర్మ తన యీ కృతిలో కొంతదించెను. భరతశర్మకు వేదన మున్నది. అది యిందు సంవేదనాత్మకముగా సంవిదాకృతి వహించినది.

అచ్ఛోదసరోవరము బాణహృదయము. అది యమృతసాగరము. తత్పరిసరమును కథాప్రబంధము భద్రపీఠము చేసికొనినది. ఈ గ్రంథ మచ్ఛభావ మయినది. మహాశ్వేతావృత్తాంత ప్రాముఖ్యమును బాణ వాణీభావమున భావించి భరతశర్మ ప్రతిపిపాదయిష కలవాడయ్యెను. ఆరంభమున శూద్రకసన్నిధిలో వైశంపాయనశుకము

స్తనయుగమశ్రుస్నాతం
సమీపతరవర్తి హృదయశోకాగ్నేః
చరతి విముక్తాహారం
వ్రతమివ భవతో రిపుస్త్రీణాం.

అని పలికిన పలుకులలో చమత్కారగుప్తగా మహాశ్వేత యున్నది. పుండరీకుడు వైశంపాయనుడై; వైశంపాయనుడై పుండరీకు డగుట గ్రంథమున నున్నది. రాగబంధము జన్మజన్మాంతరానుగత మగుట యిందు గలదు. పరస్పరాస్థాబంధాత్మక మయిన రతిభావ మెట్లు నిబంధింప దగునో బాణకృతి పాఠము చెప్పును. శబ్దచమత్కారము అర్థానుగతమై అది భావానుగతమై సర్వము రసప్రవణమగుట- చమత్కారము చమత్కారాంతర మనుధావనముచేయుట యిందేభావనీయము. అపున రుక్తమయిన వర్ణనావైశద్యము పాండిత్యవైదగ్ధ్యాద్వైతమూర్తియయిన భట్టారకునకే సుసాధము.

భారతదేశీయ మయిన సాంస్కృతికచ్ఛత్రచ్ఛాయ భట్టారకో భారతియందే కలదు. నాగరసంస్కృతి ఆర్షసంస్కృతి దివ్యసంస్కృతి వేరు వేరుగా నుండుట యుక్తము కాదు. వాని సమన్వయవిధానము సామరస్యసంపత్తి ఏనాటి కయినను సర్వాపేక్షితము. కావున బాణ కాదంబరి సర్వకాలాపేక్షిత మహాకావ్యము. ఇట్టి భావనము శ్రీ వేరాల భరతశర్మ భావనకు గలదు. కాదంబరీవైశిష్ట్య సూచన

మునకు రసజ్ఞతావిష్కారమునకు ఈ గ్రంథమును శ్రీశర్మ రచించెను. నేను నా జన్మదాతసన్నిధిలో బాణకాదంబరి నధ్యయనము చేసితిని. నా జనకునకు ఈ బాణకృతి వచోవిధేయము. కంఠలగ్నము. హృదయ ధృతము. నే నట్లు కృతి భావింపగలిగితినా? వర్ధమానలోకము బాణ ప్రబంధము నితోధికముగా వ్యాసంగ మొనరించుటకునై శ్రీమాన్ భరతశర్మ తనకృతి నింత చేసెను. భరతశర్మ భావనము నభినందింతును. తత్సర్వావిష్కృతికి ఈ లఘుకృతి గురుదర్పణము కాదు. భావకుల హృదయదర్పణములో సర్వము సంగత మగును. అస్తు.



# బా ణ వా

స్ఫూర్తిశ్రీ

"జాతా శిఖండినీ ప్రాగ్
యథా శిఖండీ తథావగచ్ఛామి
ప్రాగల్భ్య మధిక మాప్తుం
వాణీ బాణో బభూవేతి"

పూర్వము శిఖండిని శిఖండియైనట్లుగా అధిక ప్రాగల్భ్యమును పొందుటకై వాణి బాణుడయ్యెనని ఆర్యాసప్తశతి రచించిన ఆచార్య గోవర్ధనుల **అ**భిసంధి. వ బ లకు అభేదమును అనుసంధించుకొని వాణికి బాణునకు అభేదమును సాధించుట యొక చమత్కారము. "త్వమేవాహ" మ్మనినప్పుడు సరస్వతి సరస్వతిగానే **యు**న్నది. స్త్రీ ప్రకృతి కనుగుణముగా మాధుర్య సౌకుమార్యాది గుణములనే ప్రదర్శించినది; వైదర్భీరీతినే ప్రవర్తించినది. కాని, ఓజోగుణ ప్రధానము గద్యము; సమాసముల **యా**వశ్యకత**యు** గద్యమునకు హృద్యతను కల్పించును. "ఓజస్సమాస భూయస్త్వ మేతద్గద్యస్య జీవితమ్." కావున గద్యరచనా నిర్బంధమునుబట్టి పురుష ప్రవృత్తి యవసరము. వాణి పుంస్త్వమును పొంది బాణత్వమును గ్రహించినదనుట యిందువల్లనే.

కొందరు కవులు శ్లేష ఘటనాసిద్ధులు. కొందరు శబ్దగుంఫన సమర్థులు. కొందరు రసనిర్వహణపారీణులు. కొందరు సముచితాలంకార సంపన్నులు, కొందరు కథావర్ణనాది కౌతూహలులు. కొందరకు కొన్ని విషయములందే పాటవ ముండును. అందరకు నన్ని విషయములందు నట్టి పాటవ ముండదు. బాణుడు మాత్రము సర్వవిషయములందును సమధిక నిపుణత కలవాడు. కవి కుంభికుంభ భిదురుడైన పంచాననుడు.

"శ్లేషే కేచన, శబ్దగుంఫవిషయే కేచిద్, రసే చాపరే౽,
లంకారే కతిచిత్, సదర్థవిషయే చాన్యే కథావర్ణనే
ఆః! సర్వత్ర గభీర ధీరకవితా వింధ్యాటవీ చాతురీ
సంచారీ కవికుంభికుంభ భిదురో బాణస్తు పంచాననః"

ఇన్నింట నెన్నిక కెక్కినవాడు బాణభట్టారకుడు. ఆయన రచించిన గ్రంథములలో చండీశతకము, హర్షచరితము, కాదంబరి ప్రసిద్ధములు. ముకుటతాడితకము, పద్యకాదంబరి యను గ్రంథములను రచించెనని యందురు కాని, అవి యుపలబ్ధములు కాలేదు. 'పార్వతీ పరిణయ' మన్న నాటకము బాణునిపేర నొకటి ప్రసిద్ధి నొందినది. కాని, తత్కర్త పదునేడవ శతాబ్దికి చెందినవాడని కాదంబరీకర్త కాడని పండితుల యభిప్రాయము.

బాణభట్టారకుని యశశ్శిఖరి కాదంబరి. 'కాదంబరీ రసజ్ఞానా మాహారో౽పి న రోచతే' అన్నకీర్తికి కారణమైనది. బాణుడే 'అతి ద్వయీ కథా' అని దీనిని పేర్కొనియున్నాడు.

పేరాల భరతశర్మగారు సంస్కృతాంధ్రములందు గట్టిపండితులు; మంచికవులు. కాదంబరివంటి కావ్యమును– ఏకావ్యమునైనను– సమీక్షించుటకు భావుకత్వము కావలయును. అనేక గ్రంథపాండిత్యముతో పాటు సరసకవిత్వరచనాచణత్వముతోపాటు విమర్శకుని కవసరమైన నిశితదృష్టియు భావనాపుష్టియు భరతశర్మగారికి సమృద్ధిగా నున్నవి. తరచి చూడగల యోర్పు విడమరిచి చెప్పగల నేర్పు శర్మగారికి స్వాభావికములు.

'కాదంబరీ రసజ్ఞత' యన్న యీ గ్రంథమునందు తొమ్మిది ప్రకరణములు కలవు. మొదటి రెండును కాదంబరిని రచించిన బాణ భట్టారకుని కాదంబరీపూరణము గావించిన తత్తనయుడైన పుళింద భట్టును పరిచయము చేయుచున్నవి. చివరిదైన 'కాదంబరికథావస్తువు'

సంగ్రహముగా కథను పరిచయము చేయుచున్నది. 'సతి కుడ్యే చిత్రలేఖన'మ్మని యాభాణకము కథయే తెలియనినాడు ఇంకెన్ని చెప్పినను వృథయే; ఏమి చెప్పినను వృథయే. చివరనే చెప్పినను మొదటనుండి చివరవరకు వ్యాపించియుండునది కథయేకదా!

'కాదంబరీ సంకేతము' నుండి 'కాదంబరీ రసోల్లాసము' వరకు నున్న అయిదు ప్రకరణములు కవితాపంచాననుడైన బాణుని పంచాననములను ప్రత్యక్షీకరించుచున్నవి. బాణకాదంబరీ విశిష్టతను పట్టియిచ్చుటయేకాక శ్రీ భరతశర్మ సమీక్షణ సమర్థతను ఎత్తిచూపుచున్నది యీ ప్రకరణపంచకము.

ఎనిమిదవదైన 'బాణోచ్ఛిష్టం జగత్సర్వమ్' అన్నది అనంతర కాలికులపై నున్న బాణుని ప్రభావమునకు వెలకట్టుచున్నది.

కాదంబరి యనగా మద్యమని యర్థము. 'ఇట్టిపేరు బాణుని కెట్లు రుచించెను?' అని పాఠకుడై శ్రీ భరతశర్మ ప్రశ్నించుకొనెను. దానికి 'పుమాన్వై సోమః, స్త్రీసురా, తన్మిథునమ్' అను తైత్తిరీయబ్రాహ్మణమునందలి మంత్రమును సందర్శించి, ప్రదర్శించి సమాధానము నొందెను. కాదంబరి స్వతంత్రకథయే యైనను వేదతత్త్వగర్భితమన్న విషయము 'కాదంబరీ సంకేతము' నందు నిరూపితమైనది.

పుండరీకుని తల్లి లక్ష్మీదేవి. శ్వేతకేతువును చూచినంతలోనే యామె బిడ్డతల్లియైనది. ఈవిషయము లక్ష్మీ కపకర్షకముగా నున్నదనిపించును. అట్లే యనిపించి భరతశర్మగారు పరిశీలనము సాగించి 'కామకలా విలాసము' నందు సమాధానము నొందగలిగిరి. శ్వేతకేతువు శివస్వరూపుడు, ప్రకాశబిందువు. లక్ష్మీ శక్తిస్వరూపిణి, విమర్శబిందువు. పుండరీకుడు సృష్టి, మిశ్రబిందువు. జగదుత్పత్తికి శివశక్తులిద్దఱును సమాన కారణములు. బృహన్నారదీయము శక్తి, లక్ష్మీ,

ఉమ, భారతి, గిరిజ, అంబిక- అను పేరులను పర్యాయములుగానే పలికినది. కావుననే, యిచ్చట శక్తి లక్ష్మియైనది. ఇట్లు 'కాదంబరీ కథాతత్త్వము'న సృష్టిరహస్యము సాంగోపాంగముగా నిరూపితమైనది.

'బాణుని అక్షరశిల్పము' నందు చూర్ణకాది గద్యభేదములు, ప్రసాదమాధుర్యాది గుణములు, ఉపమారూపకాద్యర్థాలంకారములు, యమకానుప్రాసాది శబ్దాలంకారములు సోదాహరణముగా ప్రదర్శింపబడినవి. వృత్తి, రీతి, ధ్వన్యాదులు నిరూపితములైనవి.

వర్ణన, సంభాషణ, పాత్రచిత్రణ, భావశబ్దచిత్రాదులు ఔచిత్యముఖముగా వ్యాఖ్యాతములైనవి. కాదంబరియందు సర్వరసములు సముచితముగా సమాదృతములు. కాని, అవి యన్నియు నంగరసములు; శృంగార మొక్కటియే అనంగరసము. మన్మథుడు దర్పకుడునైన అంగజుడు పరిశుద్ధుడైనప్పుడు మాత్రమే అనంగుడు (ప్రధానుడు) కాగలడు. అనంగత్వము బహుజన్మసంపాద్యము. రజోగుణ విశిష్టుడైన పుండరీకుడు వైశంపాయనుడై చిలుకయై తిరిగి పుండరీకు డగును. అప్పుడే మహాశ్వేతా సమాగమము. శాపదూషితుడైన చంద్రుడు చంద్రాపీడుడై శూద్రకుడై తిరిగి చంద్రాపీడు డగును. అప్పుడే కాదంబరీ కరగ్రహణయోగము. ఇది యిట్లుగా స్వచ్ఛశృంగార దర్శనము.

కాదంబరికి తెనుగులో పద్యానువాదము లున్నవి; వచనానువాదములుకూడ నున్నవి; ఏకదేశములు నున్నవి. విమర్శనగ్రంథము మాత్ర మింతవరకు రాలేదు. భరతశర్మగారి యీగ్రంథమే ఆద్యము. 'కాదంబరీ రసజ్ఞత' ఆంధ్రరసజ్ఞలోకమునకు ఆమెతల నందిచ్చుటలో అగ్రగణ్యము కాగలదని నా ఆకాంక్ష.



శ్రీః

తమ్ముడు చిరంజీవి భరతశర్మకు
గురుస్మరణపూర్వకమైన ఆశీస్సు.

నీ గ్రంథమును ప్రత్యక్షరము చదివితిని.

నీ యవగాహనము అనుభవము సూక్ష్మవివేచనము నిరూపణశక్తి సహృదయప్రమాణము నధిరోహించినవి.

నీ విచారణము తలస్పర్శిగానున్నది.

సహృదయునకు కాదంబరి యేయనుభవమును కల్పించునో యథాతథముగ నీ విమర్శ ఆ యనుభవమును స్థిరీకరించుచున్నది.

కాదంబరి గిరాందేవతయొక్క స్వప్నము!

ఆ కథ శూద్రకునకు జన్మాంతరస్మృతితోనైకకాలికముగ బంధవిముక్తిపూర్వకమైన అమృతపరిష్వంగము నందు ప్రబోధమును కల్పించినట్లు నీ గ్రంథము సహృదయునకు స్వరూపస్మృతిని కల్పించి రసపరిష్వంగమునందు సమ్మోహమును కల్పించుచున్నది. నీవన్నట్లు "మనస్సే చంద్రుడు. అందులోని అమృతమే కాదంబరి."

గురుకులక్లిష్టుడవైన నీ యందు ఇతోఽధికముగా వాగ్దేవతా కటాక్షము సఫలమగుగాతమని యాశంసించుచున్నాను.

ప్రేమతో—

రాజమహేంద్రవరము
కాళయుక్తి కార్తిక శుద్ధ
షష్ఠీ సోమవారము

మల్లంపల్లి శరభయ్య

ఓం శుభం

శ్రీరామ సహాయం

# మాతృహృదయము

కాకినాడ,

8—11—78.

చిరంజీవి భరతశర్మకు,

నీవు వ్రాసిన "కాదంబరీరసజ్ఞత" ఆవిష్కరణ సందర్భంగా మీ అమ్మ మనఃపూర్వకమైన శుభాశీఃకుసుమములు.

పేరాలవారివంశంలో గౌతమసగోత్రమందు శ్రీలింగరాట్కవి మనుమడివిగా శ్రీ బాలకృష్ణకవిగారి కుమారుడివిగా జనించి సరస్వతీ కటాక్షమువలన తాతను తండ్రిని మించినకవిగా గుంటూరుజిల్లా, కృష్ణాజిల్లా, రాయలసీమ, తూర్పుగోదావరిజిల్లా, వరంగల్లు, సిద్దిపేట, కంభంమెట్టు, మధిర మున్నగు ప్రాంతములలో యావదాంధ్రములోనేగాక కర్ణాటకరాష్ట్రం ఇతరరాష్ట్రాలలో పెక్కు అవధానములను ఉపన్యాసములను ఇచ్చి నీపేరుప్రతిష్ఠలను వంశప్రతిష్ఠను గౌరవమును పెంపొందచేసినావు. ప్రస్తుతం కాదంబరీ కావ్యమును సంస్కృతమునుండి ఎల్లరకు విశదమగునట్లు తెలుగులో విమర్శించిచెప్పి పెద్దలనందరిని అలరింపచేసి వారి ఆశీస్సులను పొందుచున్నందులకు నా ఆనందమును వెలువరించుచున్నాను. ఇకముందుకూడ ఇట్లే పెక్కు గ్రంథములను వ్రాసి సరస్వతీకటాక్షమునకు పాత్రుడగుదువుగాక! సరస్వతి; లక్ష్మి; పార్వతి, శివరామకృష్ణులు నిన్ను కాపాడి సకల ఐశ్వర్యములను ఆరోగ్యమును ఇచ్చి పుత్రపౌత్రాభివృద్ధిగా ఆశీర్వదించుటకు ఎల్లప్పుడు వారిని ప్రార్థించుచున్నాను. తండ్రివంశంలో తాత తండ్రియొక్క కవితా ప్రతిభను పొందినావు. నీ ప్రధానమైన అదృష్టము శ్రీ విశ్వనాథ సత్యనారాయణగారి శిష్యుడవగుట. ఆయన ఆశీస్సు నీకు వాగ్దేవికూర్చిన

శ్రేయస్సు. తల్లివైపునకూడ నీకు కొంత సంక్రమించినది ఈ కవితా వైభవం.

నాతల్లి చెల్లెలు నాపినతల్లి కనుపర్తి వరలక్ష్మమ్మగారు వచన రచనలో పుస్తకములను రచించినది. నీ లాగానే అన్ని జిల్లాలలో ఎక్కువ ఉపన్యాసములను ఇచ్చి సన్మానముల పొందినది. ఆంధ్రప్రదేశ్ రాష్ట్రప్రభుత్వము జరిపిన ప్రపంచ తెలుగు మహాసభలలో మహిళలలో ఉన్నతమైనపేరునుపొంది ప్రప్రథమంగా సన్మానింపబడినది. ఆమె మీ నాన్నగారిని మిమ్ములనుచూచి చాలా ఆనందపడేది. అమ్మా! నీ కుటుంబం కవికుటుంబమే! సంగీతం సాహిత్యంగలిగి నీపిల్లలు ఉన్న తోద్యోగులుగా గొప్ప పేరుపొందినారని ఎంతోసంతోషపడేది. ప్రస్తుతం ఆమెలేనిలోపం ఈ వేడుకచూచి ఆనందించకపోవుట నాకు చాలా బాధాకరంగా వున్నది. నీకు తండ్రి తల్లివైపుకూడ ఈ కవితాప్రతిభను పొందుటకు అవకాశం కలిగినది. నాపినతల్లికి గృహలక్ష్మి సంపాదకులు కేసరిగారు నెల్లూరులో వర్ధమానసమాజంవారు స్వర్ణ కంకణం స్త్రీలలో ప్రథమంగా కనుపర్తి వరలక్ష్మమ్మకే యిచ్చినారు. శారదలేఖలు వసుమతి నవల ఇంకా కొన్ని చిన్నపుస్తకములను ఆమె రచించినది. అన్నీ అచ్చుయి ప్రజాదరణను పొందినవి. ఇటువంటి వంశంలో పుట్టి నీవు ఇట్టి కావ్యములనువ్రాసి నీ పెద్దలందరిని పరలోకగతులైన తాతను తండ్రిని అన్నను మాతామహులను తరింపచేసినావు. ఇది మనవంశమునకు గొప్ప గర్వకారణంగా ఎంచుకొని ఆ చదువులరాణి వీణాపాణి నీరూపంలో నాకు ప్రత్యక్షమయినట్లుగా తలచి ఆమెకు అనేకమైన ప్రణామములను అర్పించుచున్నాను.

ఈ కావ్యకన్యకను శ్రీ మల్లాది వెంకట్రామయ్యగారు వరించి చేపట్టుట మన అదృష్టం. కావ్యంలోని రసజ్ఞతను గ్రహించి ఆనందించ

గల పండితులగుటవల్లనే నీకృతి ఇంతత్వరలో వెలువరింపగలిగినావు. ఇదంతా వారి సౌజన్యఫలమే. వారికి నా శతాధిక ప్రణామములు.

నా మనస్సున రాత్రి పగలు విహారంచేస్తున్న ఈ వాక్కులను ఈ కాగితంమీద వ్రాయకుండిన మనస్సుకు ఊరటకలిగేట్టు లేదు. తప్పులున్న క్షమించి మంచినే పెద్దలు గ్రహించెదరు గాక!

ఈ కావ్యావిష్కరణ సందర్భములో నా కుమారునికి సహకరించిన పెద్దలందఱకు సభ్యులకు నా ప్రణామములు, వందనములు, నమస్కారములు.

సుజనవిధేయ

పేరాల రాజ్యలక్ష్మమ్మ



# అనుక్రమణిక

విషయము

శ్రీః

# బాణుఁడు - కాదంబరి

"యుక్తం కాదంబరీం శ్రుత్వా కవయో మౌనమాశ్రితాః
బాణ ధ్వనావనధ్యాయో భవతీతి స్మృతిర్యతః."

[కీర్తికౌముది]

కాదంబరీకావ్యము చెవినిబడిన తరువాత కవులు అట్టి కావ్యము రచించుట తమతరమా అని మౌనమునే చిత్తగించిరి. అవును— బాణధ్వని చెవినిబడిన అధ్యయనము మానవలెనని కదా స్మృతివాక్యము.

# బాణుడు - కాదంబరి

బాణునకు పూర్వము కాదంబరి యనగా మద్యమనియే లోకమునకు తెలిసినది. బాణుని కాదంబరి యుదయించిన తరువాత కాదంబరి యనగా "కాదంబరీ" కావ్యము మాత్రమే రసజ్ఞుల నాకర్షించినది. మద్యమను అర్థమును చెప్పు కాదంబరీశబ్దము కవి వాక్కునబడి అలౌకిక రసానుసంధాయకమైన కావ్యనామమైనది. లోకమున తత్పూర్వము ఆ శబ్దమునకు లేని శుచియు రుచియు ప్రచురతయు కలిగి కవియొక్క రమణీయార్థ ప్రతిపాదక శబ్దఘటనానైపుణ్యమునకు నిదర్శకమైనది.

"కాదంబరీ రసజ్ఞానా మాహారోపి న రోచతే"– అన్నసూక్తి కాదంబరీ కావ్యముతో కాదంబరీ పానీయమును గూడ లోకమున ప్రశంసాపాత్రము చేసినది. "కాదంబరి" ప్రధానముగా శృంగారరసాలంబనమైన కావ్యము. అయినను జీవితతత్త్వమును సూక్ష్మేక్షికతో దర్శించిన కవి ప్రతిభాప్రవాహమున నవరసములునందు తరంగనృత్యము చేసినవి. రససామగ్రీసముల్లసితమైన ఈ గద్యకావ్యసుందరి గజ్జెకట్టి సహృదయుల హృదయరంగమున సర్వాంగభంగీనృత్యవిలాసముల రసములు జాలువార జేసినది.

వట్టి శృంగారరసప్రధానమైన మాత్రమున కథకు కావ్యమునకు చిరస్థాయి యయిన ప్రాచుర్యము సిద్ధింపదు. అందు అంతశ్శైవలినివై [illegible]క చింతన నిరంతరధారగా జీవనాడియై యుండవలె. కాదంబరి విశిష్టతను గూర్చి చర్చించుటలో ప్రధానముగా ఈవిషయమును పరామర్శించినగాని ఆ గ్రంథమునకు ప్రాణభూతమైన లక్షణమును కనుగొనినట్లు కాదు.

ప్రపంచమునందు ఏ కావ్యమైనను ఆయా సారస్వతములకు అలంకారప్రాయముగా నిలిచియుండుటకు హేతువు ఆ కావ్యము నందుగల

ఆత్మచైతన్యము. ఆ ఆత్మ, కవి జీవలక్షణము నుండి కావ్యమున అవత రించును. ఏ దేశముకవియైనను ఏ కథ కల్పించినను తన జాతి సంస్కృతిని తన దేశపు నైసర్గికస్వరూపమును కావ్యమున సమున్మీలింప జేయును. అప్పుడే అది ఆ జాతికి ఆ దేశీయులకు మాత్రమే కాక యావత్ప్రపంచ మునకును సమారాధ్యమైన సారస్వతసృష్టిగా, భగవంతుని సృష్టిలోని మహాపర్వతములతో మహానదులతో సమానమైన యస్తిత్వము గలిగి నిలిచియుండును.

"యావత్ స్థాస్యంతి గిరయః సరితశ్చమహీతలే
తావద్రామాయణీకథా లోకేషు ప్రచరిష్యతి."

[రామాయణం- 2వ స- 36, 37 శ్లో.]

అనుటలోని ఆంతర్యమిదియే.

కాళిదాసాదులైన మహాకవులు వాల్మీకి నుండి వ్యాసునినుండి ఈ రహస్యమును గ్రహించియే తమ కావ్యములను తీర్చిదిద్దిరి. బాణుడు ఆ రహస్యమును మరియు గాఢముగా మనసునకు పట్టించుకొన్నవాడు.

కల్పితకథను ఇతిహాసముగా భాసింప జేసినాడు. గద్యము నందు పద్యమునకు మించిన సౌందర్యము సంతరించినాడు. రసజగత్తు నందు "కథా" సాహిత్యమునకు సమున్నతపీఠమును వేసినాడు. కవిబ్రహ్మయై కాదంబరిని సుందర కావ్యసృష్టిలో అగ్రగణ్యను చేసినాడు.

కాదంబరి సంస్కృతవాణికి రెండు అపూర్వములైన అలంకార ముల సమకూర్చినది. ఒకటి, హృద్యమైన గద్యము. రెండు, అపూర్వ మైన మనోహరమైన కథ. ఆ గద్యమును మించిన గద్యము గాని, ఆ కథను మించిన కథగాని సంస్కృతమున మరియొకటి లేదు. ఆ గద్యము నందొక విలక్షణమైన జాతీయత, కథ యందు ఒక సమగ్రజీవితచిత్రణము నిగూఢములై యున్నవి.

కాదంబరియే బాణుడు - బాణుడే కాదంబరి :- కాదంబరి శబ్దముచేత అర్థముచేత శయ్యాలంకారపాకరీతులచేత సంస్కృతమును

సంస్కృతీకరించినది. కావ్యనామము కాదంబరి. కథానాయిక కాదంబరి. తద్గతరసము కాదంబరీసమము. అన్నిటికంటె చిత్రము కాదంబరియే బాణుడు- బాణుడే కాదంబరి. బాణునివలె కావ్యముతో తాదాత్మ్యము నొందినకవి మరియొకడు ప్రపంచవాఙ్మయమున నెక్కడనైన నుండునా ? కావ్యగతసర్వలక్షణములు కథాగత సకలసంవిధానములు బాణుని ఆత్మలక్షణములకు ప్రతీకలు, పతాకలు. బాణుని భాష భావము కల్పన అన్నియు ఆర్షములైన వాసనలతో, దివ్యములైన అనుభూతు లతో ప్రాపంచికములైన సత్యములతో, భారతీయములైన సంప్ర దాయములతో ఆసేతుశీతాచల మనోహర ప్రకృతిసౌందర్య సంభావన ముతో, పిపీలికాది బ్రహ్మపర్యంత సకలజీవచైతన్య వైవిధ్య నిరూపణ ముతో హిమాలయమువలె సమున్నతము, సముద్రమువలె గంభీరము, మహారణ్యమువలె దుర్గమము, గంగానిర్ఝరిణివలె స్వచ్ఛము, ఉజ్జయి న్యాది మహానగరములవలె సుందరమునై అచ్చముగా భరతఖండము నకు అద్దము పట్టినట్లున్నవి.

బాణునివలె దేశసంచారముచేసి లోకానుభవము గడించి జీవిత తత్త్వముల మథించిన కవులు అరుదేమో ! శ్రవ్యకావ్యత్రయము దృశ్యకావ్యత్రయము కాళిదాసునకు సంతరించిన కీర్తిని కాదంబరి యొక్కటియే బాణునకు సమకూర్చినది. పద్యకావ్యనిర్మాణమున అద్వి తీయుడైన కాళిదాసువలె గద్యకావ్యనిర్మాణమున బాణుడు అద్వితీయు డైనాడు. దృశ్యకావ్యములందు అభిజ్ఞానశాకుంతలమువలె గద్యకావ్యము లందు కాదంబరి నిరుపమానమైనది. బాణునిగూర్చిన ప్రశంసలు ప్రశం సలుకావు. సత్యప్రతిపాదనములు. బాణుని గూర్చి యెన్ని ప్రశంస లున్నవో కాదంబరిని గూర్చి అన్నిప్రశంస లున్నవి. అవియును అట్టివే.

ఇంతటి భావుకుడైనకవి, యింతటి యుదాత్తమైన కావ్యము రెండును తమ జీవితములనుగూడ సమానముగా ననుభవించుటచిత్రము.

"జ్ఞాస్యసి మరణే ప్రీతి మిత్యసంభావ్యమేవ"— కథానాయిక కాదంబరి ప్రియునకు ప్రేమసందేశమంపుచు ననిన మాట యిది. "నీ విరహమును తట్టుకొనలేని నా ప్రేమ నీకు నామృతివలన తెలుపుదునన్నచో మృతిలేని నాగంధర్వజన్మకు అది అసంభావ్యముకదా !" అనెను. గంధర్వజన్మ గల కాదంబరికి అది అసంభావ్యమేగాని మానుషజన్మమెత్తిన బాణునకు కాదుగదా! ఆ వాక్యము వ్రాసిన తరువాత బాణుడు మరి బ్రతుక లేదు. అతడు వ్రాసిన కావ్యభాగమంతటితో ముగిసినది. తరువాతి కథను అతని కుమారుడు పూరించెను. మానవుడుగా బాణుడు మరణించెనే గాని కవిగా కాదంబరితో నైక్యమందినాడు. గంధర్వజన్మ పొందిన అమృతమయములయిన కీర్తికిరణములచే అమృతకిరణ సంజాతయైన గంధర్వాప్సరోరత్నముతో ఆచంద్రతారార్కమైన అస్తిత్వమును పొందినాడు.

"కవిర్మనీషి పరిభూః స్వయంభూః"- ఈ శా. ఉ. 8.

ఇత్యాది ఉపనిషద్వాక్యములు కవిస్స్వయంభువు అనిచెప్పుచున్నవి. సర్వవ్యాపియని చాటుచున్నవి. సృష్టిశిల్పరహస్యవేత్తయయిన మనీషి యని చాటుచున్నవి. ఇందలి యాథార్థ్యమేమి ? లౌకికముగా నాలోచింతము. కవియనగా ఉపనిషత్తు చెప్పినది పరమాత్మనే. లోకమున కవికి ఆ పరమాత్మ లక్షణమెట్లు పొసగును ?

కవియొక కథ కల్పించుచున్నాడు. అందు పాత్రలను సృష్టించుచున్నాడు. వారి జన్మవృత్తాంతములు అతని సంకల్పసంజనితములు. సంఘటనలన్నియు అతని భావనానుగుణములు. అతని కావ్యప్రపంచమున కతడే స్రష్ట. అందు మహానగరములు వర్ణింపబడినవి. సూర్యచంద్రోదయాస్తమయము లున్నవి. ఆ పాత్రల జీవితములపై వాని ప్రభావము లున్నవి. అన్నియు పరమేశ్వరుని సంకల్పసంభవమైన సృష్టికి ప్రతిసృష్టులు. ఇది యిట్లుండవలెనని నియమించువాడిచట కవియే. ఈసృష్టి

శిల్పము. పరమేశ్వరుని సృష్టి శిల్పమునకు వ్యాఖ్యానము. మానవజీవిత విశ్లేషణాత్మకమైన వివరణము. ఆ స్థాయియందునిలచిన కావ్యము కావ్యము. ఆ కవి కవి.

సృష్టిలోని ప్రతిజీవియు నిహలోకమున బ్రదికిన కాలము మాత్రమే వాని సమగ్రజీవితకాలము కాదు. ఇహమున వానిజీవితము వర్తమాన కాలానుబంధి. దీనికి పూర్వమునందు ఆ జీవి ఏ దేవతాపశు పక్ష్యాది రూపమును పొందినాడో అక్కడినుండి ఏ సంస్కారములు ఏ వాసనలు మూటగట్టుకొని వచ్చినాడో అది యంతయు భూతకాలికవిషయము. ఇకముందు ఏ జన్మమెత్తనున్నాడో ఏ రూపమైన శరీరము ధరింపనున్నాడో అది భవిష్యద్విషయము. ఈ భూతభవిష్యములు తెలిసినవాడు సర్వసృష్టి శిల్పరహస్యవేత్తయైన ఆ పరమేశ్వరుడే !

వర్తమానజీవితవిషయికమైన మానవుని కథ భూతభవిష్యజ్జీవితానుబంధియైనప్పుడు అది వాని సమగ్రజీవలక్షణ సంపుటిచేత ఒక సంపూర్ణపరిధిలో గోచరించును. ఆ జీవుడనేక జన్మము లెత్తవచ్చును. కాని మూడుజన్మలలోని వాని జీవితానుబంధము ఒక త్రికాలానుస్యూతమైన సూత్రమున సమగ్రవలయమగును. ఆ సమగ్రజీవలక్షణ సంపుటియొక్క మూడుజన్మలలోని ముచ్చటలను కథగా కల్పించినకవి సృష్టిరహస్యమునకు ఏమి వ్యాఖ్యానము చేసియుండును? అన్న ఆలోచన మనకు కలిగినప్పుడు ఆ కావ్యము వట్టి కావ్యముగా కాక మనకు ఆత్మీయమైన ఆప్తవాక్య సంపుటివలె తోచును.

పుండరీకవియోగ దుఃఖార్తయైన మహాశ్వేతను ఓదార్చుచు కథానాయకుడు చంద్రాపీడుడు పలికిన పలుకులు గమనార్హములు.

"అచింత్యోహి మహాత్మనాం ప్రభావః। బహుప్రకారాశ్చ సంసారవృత్తయః, చిత్రం చ దైవమ్।ఆశ్చర్యాతిశయ యుక్తాశ్చ తపస్సిద్ధయః। అనేక విధాశ్చకర్మణాం శక్తయః"

[కాదంబరి- 509వ పుట]

కవి తన కథానిర్మాణమునకు మూలసూత్రములను చెప్పినట్లున్న వాక్యము లివి. తన తండ్రిమార్గము నవగతము చేసికొనియే కుమార బాణుడు కాదంబరీ ఉత్తరార్ధమును పూరించెను. ఇట్టివాక్యములనే అతడు శుకనాసునిచే పలికించును. తారాపీడుని సమాశ్వాసించుచుననినమాట లివి:—

"దేవ! విచిత్రేస్మి న్సంసారే సంచరత్సు సుఖదుఃఖమయేషు దేవతిర్య గ్యోని మానుషేషు త్రిగుణాత్మనః ప్రధానస్యాపి పరిణామాత్పరమాణ్వాదేర్బ్రహ్మాండ పర్యంత స్యోత్పత్తిస్థితి ప్రలయకారణస్యేశ్వర స్యేచ్ఛయా ధర్మాధర్మసాధనానా మిష్టానిష్టఫల సంబంధకారిణాం కర్మణాం వా శుభాశుభానాం విపాకస్వభావాద్వా స్వయమేవానేక ప్రకార ముత్పద్యమానస్య తిష్ఠతో వా నియతవృత్తేః స్థావరజంగ మస్య న కదాచిదవస్థా సా యా న సంభవతి."

(చూ. కాదంబరి. ఉత్తరార్ధము. 171 పుట)

ఈ వాక్యము పైసూత్రములకు విపులవ్యాఖ్యానముగా నున్నది. కవులిరువురును కథను మలచిన తత్త్వము భావించుటకు కావ్యమందాం తరమైన యాధారవాక్యములివి.

వేదవేత్తయైన మహావిద్వాంసుడు ప్రతిభాసంపన్నుడై కావ్య మును రచించినచో నంతకంటె నమృతము మరియుండదు. సంప్రదా యజ్ఞుల పాండిత్యము శ్రుతి, మతి, బుద్ధిలక్షణమైనది. "సేయం విద్యా శ్రుతిమతి బుద్ధిః"— నిరుక్తము. "తే విద్యావంతః యే శ్రుతిం జానంతి। తే మతిమంతః యే అర్థేన తర్కాన్ వినిశ్చిన్వంతి। తే బుద్ధిమంతః యే బ్రహ్మజానంతి।... సేయం విద్యా శ్రుతిమతిబుద్ధి రిత్యుచ్యతే." అని దాని వ్యాఖ్య.

బాణుడట్టి విద్యాసంపన్నుడు. మహాకవియు. అతడు కల్పించిన కథలో చంద్రుని, పుండరీకుని జంటగాచేసి వారిని మూడుజన్మలనెత్తించి నాడు. వారి మూడుజన్మలలోని మూడుకథలలో ఒకజన్మలోని ఒక

కథలో వారి ప్రణయవృత్తాంతమును శృంగారరసాలంబనము జేసి రస వంతమైన కథాకావ్యము కల్పించినాడు.

కథా ప్రధానవృత్తాంతము శృంగారరసాశ్రయమే! జన్మాంతర ముల కథ సర్వరసాశ్రయమైనది. సారస్వతసృష్టిలో సరసమైన ఈ శృంగారకావ్యమున జీవసృష్టికి నిగూఢమైన వ్యాఖ్యయున్నది.

కావ్యము కావ్యమే! రసము రసమే! కథ కథయే! పాత్రలు పాత్రలే! అన్నియు బంగారములే! బంగారము బంగారముగానున్నచో చైతన్యముండదు. అందులో జీవప్రతిష్ఠ జేసినాడు. ఆ జీవశక్తి చేత ఆ బంగారములన్నియు రూపరేఖలు పొంది కళ గట్టినవి.

సాధారణముగా కావ్యసౌందర్యమునకు ముగ్ధులమైన మనము బాణునియందలి యుక్తివైచిత్ర్యములను, వర్ణనల మనోహరత్వమును, రసపరిష్కారమును పరామర్శించి సాహిత్యప్రయోజనముల సంభావించి సంతృప్తి పొందుదుము. కావ్యవిమర్శనములో తావన్మాత్రసారస్వతాను శీలనము కవియొక్కయు కావ్యముయొక్కయు ఘనతను మిక్కిలిగా చాటును. కాని వానిని ప్రాణవంతముచేసిన కవియొక్క భావనలోని తత్త్వము తెలిసికొన్నప్పుడు ఆ కవికిని కావ్యమునకును అజరామర త్వము ఎట్లు సిద్ధించెనో ఎందుకు సిద్ధించెనో అవగతమగును. అది తెలి యుటయే ముఖ్యము.

"కాదంబరి" యందుగల సర్వవిధసౌందర్యమును సాహిత్య దృష్టితో అనుశీలించి తద్వైశిష్ట్యమును ప్రకటించుటయే యీ గ్రం థముయొక్క ప్రధానోద్దేశ్యము. యథార్థమునకు ఏవంవిధమైన విశిష్టతను కాదంబరినిగూర్చి పలువురిదివరకే చర్చించియున్నారు. ఆ విషయమున అంతకుమించి మనమేమి చెప్పగలమనిపించును. కాని అదిచెప్పియు చెప్ప వలసినది యేమి? అన్నదే ప్రశ్న. ఆ ప్రశ్నకు సమాధానము సులభము

కాదు. ప్రయత్నించినచో కాదంబరి విశిష్టత మరికొంత తెలిసికొని నట్లగునని యుత్సహించుచున్నాను.

కాదంబరిలో రసగ్రహణమేగాని వేదాంతపారాయణము సముచితముకాదు. కాని కాదంబరి అలౌకికపరిధులకు మనలను గొనిపోయి నపుడు మనమచట పొందునది అలౌకికానందమేకదా ! ఆ ఆనందమే రసము కదా ! రసము భగవంతుని స్వరూపముగదా ! ఆ భగవంతుని దర్శించుటయే వేదాంతసారముకదా ! భారతీయసాహిత్యము రసమార్గమున ఆ పరమార్థమునే కదా సహృదయున కందించునది !

"ఏత త్పృథివ్యా మమృతమ్
ఏత చ్చక్షు రనుత్తమమ్
యద్బ్రాహ్మణముఖే కావ్య
మేతచ్ఛ్రుత్వా ప్రవర్తతే"— [భారతము - శాంతిపర్వము 124-38.]

బ్రహ్మవేత్త ముఖమున ప్రవర్తిల్లెడు కావ్యమే లోకమున అమృతము. అదియే నేత్రము (జ్ఞాననేత్రము). దీనిని శ్రవణముచేసి ప్రవర్తించుటయే శ్రేయస్సు.



2

# కుమారబాణుఁడు - కాదంబరి

'దేహద్వయార్ధ ఘటనారచితం శరీర
మేకం యయో రనుపలక్షిత సంధిభేదమ్
వందే సుదుర్ఘట కథాపరిశేష సిద్ధ్యై
సృష్టేర్గురూ గిరిసుతా పరమేశ్వరౌ తౌ"

[కుమారబాణః కాదంబరీ - ఉ 1 శ్లోకం]

## కుమారబాణుఁడు - కాదంబరి

గాఢభావనాశీలియైన వానిజీవితమే ఒక ఆశ్చర్యము. బాణుని రక్తగతమైన సంస్కారము కుమారబాణునియందు జన్మనిష్ఠమైనది. కుమారబాణుడు తండ్రి వ్రాయుచున్న కాదంబరిని ఆయన మరణముతో మూసిపెట్టలేదు. తాను చేపట్టినాడు. బాణుడే మరల యౌవనముపొంది తనకావ్యమును తానే ఆసాంతము వినిర్మించెనా? "ఆత్మావై పుత్ర నామాసి" అన్నదే వేదప్రామాణ్యము.

కాదంబరి విశిష్టత తండ్రితో ప్రారంభమై కుమారునిచే నిర్వహింపబడుటలోకూడ నున్నది. ఏ కవి కావ్యమునందును ఇట్టి వైచిత్రి కన్పట్టదు. బాణుని ఆత్మశక్తి అంతగొప్పది. అతడు కారణజన్ముడు. కుమారరూపమున కావ్యమును పునరుజ్జీవింపజేసిన మనీషి.

కాదంబరీ ప్రణాళికానుసారము బాణుడు, కుమారబాణుడు కథానుసంధానము జేయుటయున్నది పార్వతీపరమేశ్వర సంయోగము వంటిది. కాదంబరీశేషమును పూరించుటకు పూనుకొని కుమారబాణుడు పార్వతీపరమేశ్వరులను స్తుతించినవిధము గమనార్హము.

"దేహద్వయార్ధ ఘటనారచితం శరీర
మేకం యయో రనుపలక్షితసంధిభేదం
వందే సుదుర్ఘట కథాపరిశేషసిద్ధ్యై
సృష్టేర్గురూగిరిసుతా పరమేశ్వరౌ తౌ"

[కాదంబరి ఉత్తరార్ధ మంగళ 1 శ్లో]

"రెండు శరీరములలోని సగములు కలిసి అతుకులుకనరాకుండ ఒకే శరీరమైయున్న జగత్పితరులగు పార్వతీపరమేశ్వరులను సుదుర్ఘటమైన కథాశేషమును పూరించుశక్తి నాకు కలిగించుటకై ప్రార్థించుచున్నాను."

కాదంబరీకథ రెండు భాగములయినది. ఒకసగము తండ్రిపూర్తి చేసెను. రెండవసగము తాను పూరించవలె. రెండుసగములు కలిసి అతికినట్లు కనరాకుండ ఒకే చేతిమీదుగా వ్రాసినట్లుండవలె. ఇట్టి ఐక్యము సంఘటింపజేయుశక్తి శరీరార్ధములను ఏకాకారముగ ఘటింప జేసికొనిన పార్వతీపరమేశ్వరుల వలననే తెలిసికొనవలసిన రహస్యమని కుమారబాణుని భావన. ఇది యథార్థభావన. అర్ధస్వరూపుడు శివుడు. వాగ్రూపిణి పార్వతి.

"అర్థజాతమఖిలం చ ధత్తే అర్ధేందుశేఖరః
శబ్దజాలమఖిలం చ ధత్తే శర్వస్యవల్లభా."

[వాయుసంహిత]

పూర్వార్ధము వ్రాసిన బాణుడు సంపూర్ణముగా కథార్థము భావించియే యుండెను. ఆ అర్థమునకు సగమే వాగ్రూపమేర్పడెను; మిగిలినయర్థమచటనే యున్నది. దానిని వాక్కుచే ఆవిష్కరించవలెను. అదియే కుమారబాణునకు మిగిలినది. ఈ వాగర్థముల సంయోజనము నకు పార్వతీపరమేశ్వరుల ఏకాకారాకారసంయోజనము నందలి అనుపలక్షితసంధిభేదముగా కాదంబరీ పూర్వార్ధపరార్ధ సంయోజనము జరుగవలెను. కుమారబాణుని శక్తియుక్తులు ఈ ప్రార్థనములోనే వ్యక్తములైనవి. బాణుని రచనలలోను కుమారబాణుని రచనలలోను భేదముండకపోదు. కాని ఆ భేదము స్థూలముగా చూచినచో కన్పించదు. వైమర్శకదృష్టితో చూచినపుడు మాత్రము గోచరించవచ్చును. అంత విమర్శ చేయువారెవరు ?

"కాదంబరీ రసభరేణ సమస్త ఏవమత్తో
న కించిదపి చేతయతేజనోఽయం
భీతోఽస్మి యన్నరసవర్ణ వివర్జితేన
తచ్ఛేషమాత్మ వచసాప్యను సంధధానః"

[కాదంబరీ ఉత్తరార్థ- మంగళ 6వ శ్లోకం.]

కాదంబరీ రసాస్వాదనతో (కాదంబరియను మద్యపానముతో) జనము మత్తిల్లియున్నారు. వారు నేనందించు కాదంబరియందు (మద్యమున) రసవర్ణశోభ (పాళమైన మద్యపూరంపు) లేకున్నను మత్తులో గమనింప జాలరని యీ శేషమును పూరించుటకు సాహసించితిని." అన్నాడు కుమారబాణుడు.

కాదంబరీ కావ్యనిర్మాణమున ఈ తండ్రీకొడుకుల ప్రమేయమే యొక ఆర్ద్రసన్నివేశము. ఈ సన్నివేశ పూర్వాపరార్థ కథాసంవిధానౌచిత్యములగూర్చి మరల ప్రస్తావింతును.

సాధారణముగ నిట్టి విఘాతమేర్పడినప్పుడు కొన్నివందలయేండ్లు ఆయాగ్రంథములు అసంపూర్ణముగా పడియుండుట మనమెరిగినదే. తెలుగున మహాభారతరచన మల్లె మూడు ముక్కలయినదికదా! సమానధర్ములయిన కవులు సమకూడుటకు శతాబ్దములు పట్టినది. నన్నయ్యకు భారతమును పూరించగల ఆత్మజుడు లేడు. కుమారరూపమున బాణుడే కాదంబరి ఉత్తరార్ధమును పూరించెను. పూర్వార్ధోత్తరార్ధములు ఒకే మూసలోపోసిన బొమ్మవలె తునుకులు అతుకులు కనరాకుండ అతికినాడు. ఈ విఘాతమునకు కారణము బాణుని వాక్కునకుగల తీక్ష్ణత యన్నది మాత్రము మనము మరువరాదు. "జ్ఞాస్యసి మమ మరణేన ప్రీతిం" అన్న కాదంబరీ వాక్కును అనువదించిన తరువాత ఆయన బ్రతుకలేదు. కాదంబరితోడి ఆయన తాదాత్మ్యమంత గాఢమైనదా! ఆయన వాక్కునందలి లక్షణము భవభూతి చెప్పినట్లు అర్థమును సమాకర్షించినదా!

"ఋషీణాం పునరాద్యానాం వాచమర్థోऽనుధావతి" ఋషులన్నమాట అనినట్లే జరుగును. వారి వాక్కునుబట్టి అర్థముండును. బాణుని వాక్కు ఋషివాక్కు. కట్టుకథయయిన కాదంబరియందు ఆర్ష

మైన ప్రాభవము సహజసంపన్నమగుట సంస్కృత సారస్వతము చేసి కొన్న పుణ్యము.

బాణుని కుమారుని పేరు పుళిందభట్టు అని ధనపాలుడు తన 'తిలకమంజరి' గ్రంథమున పేర్కొనెను. ఈతడు వివిధశాస్త్రార్థతత్వజ్ఞుడు, వైయాకరణ కేసరియన్న బిరుదు వహించినవాడు. సంస్కృతగద్య కవులలో బాణునితో సమానమైన స్థానమునుపొందు భాగ్యముగన్నవాడు. ఈతని శక్తి తండ్రియొక్క శక్తిని మించినదని ధనపాలుడు చేసిన స్తుతి సహజోక్తియేగాని అతిశయోక్తిగాదు. తండ్రి కథను ఎట్లుభావించెనో తానునట్లే భావించెననుటకు వెనుకటిప్రకరణమున ఉదాహరించిన శుకనాసవాక్యములు తార్కాణములు. పుళిందుడనగా బోయవాడనియు నర్థము. శ్లేషతో ధనపాలుడు చమత్కారముగా వట్టి బాణమే మెరయగా కవులమదములు రాలిపోయినవి. ఇక పుళిందుడు ఎక్కుపెట్టిన బాణముసంగతి చెప్పవలెనా? అనెను. కాదంబరి సమగ్రస్వరూపము ఆతనివలననే లోకమునకు వ్యక్తమైన సత్యము ఈ స్తుతియందలి యాథార్థ్యమును నిరూపించునదియేకదా!

"కేవలోఽపిస్ఫురన్ బాణః కరోతి విమదాన్ కవీన్
కిం పునః క్లుప్తసంధాన పుళిందకృత సన్నిధిః"



# 3

# కాదంబరీ సంకేతము

"సోమ గ్రహాంశ్చ సురాగ్రహాంశ్చ గృహ్ణాతి
పుమాన్వై సోమః స్త్రీసురా తన్మిథునమ్."
[కృష్ణ యజుర్వేదీయమ్- తైత్తిరీయ బ్రాహ్మణమ్
1-3-3-4]

# కాదంబరీ సంకేతము

"మానుషీషు కథం వా స్యా దస్యరూపస్య సంభవః
న ప్రభాతరళం జ్యోతి రుదేతి వసుధాతలాత్"

[అభి. శాకుంతలమ్. 1వ అం.]

"ఇంతటి లోకోత్తర సౌందర్యము మానుష స్త్రీల యందెట్లు సంభవించును? వెలుగులు జిమ్ము మెఱపు తీవె నేలనుండి పుట్టునా? శకుంతలా సౌందర్యమునకు ముగ్ధుడైన దుష్యంతుడు చేసిన వ్యాఖ్యాన మిది. అప్సరస్సంభవమైన యామె సౌందర్యము దివ్యము, అమాను షము. భౌమమైన సౌందర్యమున కాదీప్తి యుండదేమో! లేక విధాత యొక్క తొలి సౌందర్యసృష్టి జలములనుండియే యావిర్భవించినదా! "అద్భ్యః సరంతీతి అప్సరాః" అప్తత్త్వమగు పారమేష్ఠ్యమైన శక్తి సముద్రమునుండి అవతరించిన అప్సరసలే సృష్ట్యాదిసౌందర్యమూాల కందములా! ఆ కోవలోని మేనకకు జన్మించిన శకుంతల "సృష్టిః స్రష్టు రాద్యా" బ్రహ్మయొక్క తొలిసృష్టి సౌందర్యము రాశిపోసినట్లుం డెను. అట్టి సౌందర్యము శృంగారరసాలంబనమైన నాయికయందు మహాకవి భావించును. కాళిదాసుని కావ్యనాయికాతత్త్వసముస్మీల నము బాణుని భావనలో కాదంబరిగా ఉదయించెనా? కాదంబరీ సౌం దర్యమేమి?

కావ్యనాయిక నెన్నుకొనుటలో బాణుడు కాళిదాసు ననుసరించి నట్లు తోచును. శకుంతములచేత లాలింపబడినది శకుంతల. ప్రకృతి కన్నులగని పెంచినబిడ్డ. కాదంబరి యనగా కదంబపుష్పముల ఆసవ మని. ఇదియు ప్రకృతి కనిపెంచిన లక్షణముకలదే! శకుంతల స్వచ్ఛ మైన ప్రేమమూర్తి. కాదంబరియు నట్టిదే! కదంబము పార్వతీప్రియ నివాసము. ఆ కదంబము నందలి మాధుర్యము యొక్క మూర్తి కాదంబరి. ఎంత అర్థవంతమైన నామధేయము!

స్త్రీ సురా-పుమాన్ సోమః : వైదిక పరిభాషయందలి "స్త్రీ సురా" అను మాటకు కావ్యమున సరసమైన తత్సమానార్థకమైన శృంగార నామము కాదంబరి.

"సోమగ్రహాంశ్చ సురాగ్రహాంశ్చ గృహ్ణాతి ।
పుమాన్వై సోమః । స్త్రీసురా తన్మిథునమ్ ।"

[చూ. కృష్ణయజుర్వేదీయం తైత్తిరీయ బ్రాహ్మణమ్ ప్రథమ కాండ - తృతీయప్రపాఠకం-తృతీయ అనువాకం - చతుర్థమంత్రం]

కావ్యకళయందు వైదికతత్త్వమును గర్భితముచేయు నైపుణ్యముకూడ బాణుడు కాళిదాసు నుండియే భావించినట్లు తోచును. కావ్యమునందు పాత్రసృష్టి కవియొక్క సంస్కారమునకు తాత్త్విక చింతనకు పాండిత్యమునకు తగినట్లుండును. పాత్రల యొక్క పేర్లు రూపరేఖాది విలాసవర్ణనములు బహిస్సౌందర్యము నావిష్కరించును. ఆ పాత్రలయందు ప్రాణభూతమైనది కవియొక్క తాత్త్వికచింతనానుగుణమైనభావన. కాదంబరీ సౌందర్యము ఈ ద్వివిధమైన బహిరంతర సౌందర్యసముజ్జ్వలమైనది. బహిస్సౌందర్యము కవియొక్క సాహిత్యశక్తిచే కల్పితమైనది. అది వాఙ్మయమైన ఆకారము. దీనిలోపల కవి ఆ పాత్రనుగూర్చి చేసిన భావనామయమైన సంస్కారము నిగూఢమైయుండును. ఈ భావనామయమైన ఆంతరమైన సంస్కారమును స్ఫురింపజేయు శబ్దార్థాలంకార గుణసంయోజనమే కవి తీర్చిన వాఙ్మయాకృతి. దీపశిఖను లోనదాల్చిన గాజుకుప్పె వంటిది వాఙ్మయమైన సౌందర్యము. లోపల వెలుగులేనిదే ఎంతఅందమైన గాజుకుప్పెయు దీప్తము కాజాలదు. ఎంత చిక్కని శిఖయైనను గాజుయొక్క ఆవరణములేనిచో గాలిలో పెట్టిన దీపము వలె నిలిచి వెలుగు నీయజాలదు.

బాణుడు తన కథానాయికకు 'కాదంబరి' యని పేరు పెట్టుటలోనే, కథానాయకునకు 'చంద్రాపీడుడు' అని పేరు కల్పించుటలోనే

వేదవిదుడు జీవితపరమార్థజ్ఞాతయు సకలశాస్త్రనిష్ణాతుడునైన పండితుడుగా తాను చెప్పదలచిన కథాతత్త్వమును స్ఫురింపజేసినాడు. ఈ దృష్టితో చూచినచో కావ్యనామకరణము నందలి సొగసు తెలియును. కావ్యతత్త్వము నందలి సౌందర్యముగూడ నింత మనోహరమే.

చంద్రుని అంశతో జన్మించిన ఉజ్జయినీ రాజకుమారుని చంద్రాపీడుని సమాకర్షించిన యీ సౌందర్యముయొక్క తత్త్వమేమి? చంద్రుడు విరాట్పురుషుని యొక్క మనస్సంజాతుడు. "చంద్రమా మనసో జాతః". వేదమున "పుమాన్ సోమః" అని చెప్పబడిన పురుషుడు. ఈకావ్యమున చంద్రాపీడుడు. సమస్తపురుష లోకమునకుప్రతీక. "స్త్రీ సురా" అన్న సంకేతముచే వైదిక పరిభాషయందు చెప్పబడిన స్త్రీ యిచ్చట కాదంబరి. ఈమె యున్న కన్యాంతఃపురమెట్లున్నది?

"అంగనాద్వీపమివాపూర్వ ముత్పన్నమ్";"పంచమమివ నారీ యుగావతారమ్" స్త్రీమయమపర మివ జీవలోకమ్"

[చూ. కాదంబరి-పూర్వార్థ-526 పే]

సమస్తప్రాణి లోకమునందలి స్త్రీత్వమునకు ప్రతీక. పుంజీభూతమైన సకలజీవలోక స్త్రీ సౌందర్యము కాదంబరి. పుంజీభవించిన సకలజీవలోక పురుష సౌందర్యము చంద్రాపీడుడు.

స్త్రీ-పురుషుడు : తనను ద్విధాకరించుకొనిన పరమాత్మ సగము పురుషుడు సగము స్త్రీ ఆయెనని మనుస్మృత్యాదులు చాటుచున్నవి.

"ద్విధాకృత్వాత్మనో దేహ మర్ధేన పురుషోఽభవత్
అర్ధేన నారీ తస్యాం సవిరాజమసృజత్ప్రభుః"

[మనుస్మృతి-1-2]

సత్యశివసుందరమైన పూర్ణతత్త్వముయొక్క స్త్రీ పుంరూపమైన సౌందర్యముల సంయోగమునందుగల ఆనందమే రసమైనచో ఆ రసము యొక్క సమగ్రతత్త్వము ఈ కావ్యనాయికా నాయక సంయోగము.

ద్విధాకృతమైన పరమేశ్వరుని స్త్రీ పుం తత్త్వముల సంయోగమునకు ప్రాపంచికమైన మాయావరణము నందేర్పడిన వాసనాపరంపరల ప్రభావముచే విఘాతము కలుగుటయే దుఃఖము. తత్పరిహారమే సుఖము. దానికై ప్రయత్నపడుటయే జీవలోకపు కథ.

ఈ ప్రయత్నములో జీవులు బహుజన్మలలో బహుదేహముల ధరించుట వాసనలు పొందుట, తద్వాసనాక్షయముచే తదేకాకారాకారితమైన అఖండతత్త్వమున లీనమై ఆనందము పొందుట జీవితపరమార్థము. ప్రకృతి యందంతర్లీనుడగు పరమాత్మ సందర్శనమున యోగి బ్రహ్మానందము పొందుచున్నాడు. కావ్యమునందంతర్లీనమైన రసము నాస్వాదించి సహృదయుడు రసానందము పొందుచున్నాడు.

జీవయాత్రాపరంపరలో మానవుడు మాయావరణములో పడి వెనుకజన్మమును ముందు జన్మము నెఱుగక బ్రదికియున్న జన్మలో తనకు తెలియకుండగనే బహుజన్మల కర్మల ఫలము ననుభవించుచు మరల కర్మల జేయుచు రాబోవు జన్మలకు వాసనలు పేర్చుకొనుచున్నాడు. ఈ మాయావరణము తొలగించు అమృతస్పర్శనే పొందుచో నాతనికి ఆనందమే సిద్ధించును. చంద్రాపీడుని యందట్టిది సహజముగా నేర్పడినది. పుండరీకునియందు పితృకృతయోగసాధనముచేత నేర్పడినది. చంద్రాపీడుడు పుండరీకుడు కర్మలకు మూలమైన జీవలోకపు మనస్తత్త్వములు. చంద్రాపీడుడు పరమేశ్వరుని మనస్సుకుప్రతీక– సాక్షిచైతన్యము. పుండరీకుడు తత్ప్రతిబింబము– జీవచైతన్యము.

కావ్యమున నామరూపములతో నాయక, ఉపనాయకులుగా కనిపింతురే గాని వీరు ప్రతిమానవునిలోని ద్వివిధ మనస్తత్త్వములకు ప్రతీకలు. ఇది ప్రతివానికథ. ప్రతివాని యీ జన్మపుకథగాదు. జన్మపరంపరలకథ. కనుకనే యిది భారతీయమైన ఆలోచనాత్మకమైన బుద్ధిమంత

మైన సహృదయ జీవలోకమునకు ఆత్మీయమైన కథగా చిరస్థానము సంపాదించినది.

కథాస్వరూపము : ఇది దివ్యాదివ్యమైనకథ. దివికి భువికి మధ్య జరిగినకథ. మానవుని మనస్సు నావరించిన ఇహపరముల కామనములకథ. ఇహజీవిత వలయమునకు పై వలయము పరజీవితము. ఈ యిహపరజీవిత ములనావరించి యుండునది విధివలయము. ఐహిక వలయము జీవునకు కర్మ భూమి. కర్మలలో తగుల్కొనునదిచటనే. పరవలయము భోగభూమి. పాప ఫలముగాని పుణ్యఫలముగాని అనుభవించుట భోగభూమిలో జరుగు నది. అది ఇహమున జేసిన కర్మలఫలమునకు పరిమితము. "క్షీణే పుణ్యే మర్త్యలోకం విశంతి" పుణ్యపాపక్షయముకాగా మరల ఐహికవలయ ములో పడుదురు. ఈ కర్మల అనుభవించుట– మరల కర్మలలోబడుట– ఈ చర్విత చర్వణమునకు అంతు ఎక్కడ ? దానిని నియమించునదియే విధివలయము. ఈ విధి సత్త్వగుణప్రధానమైనది. జ్ఞానమయమైనది. పర మాత్మతో అభిన్నమయినది. ఋషిప్రకృతి ఈ విధివలయమును పాటించు శక్తి. ఈ ఋషులలో దివ్యఋషులు విధిని నియమించగలరు. వశము చేసికొనగలరు. ఐహికవలయములోని కర్మభూమియందలి ఋషులు విధిని తెలిసికొనగలరు.

పుండరీకుని తండ్రియైన శ్వేతకేతువు దివ్యఋషి. జాబాలి భౌమర్షి (భూలోకమహర్షి). కాదంబరీ కథాసూత్రము ఈ మూడు వలయములను అల్లుకొని గిజిగాని గూడువలె నున్నది. ఈ కథాసూత్ర మిట్లుండుట పరమేశ్వరుని సంకల్పమునకు ప్రతీక. ఇట్టి కథాసంభావ నము బాణునకుండుట ఆతనికి గల వైదికవిజ్ఞానముయొక్క ప్రాబ ల్యము. శాస్త్రపురాణాది పాండిత్యముయొక్క ప్రాభవము. జీవిత తత్త్వరహస్యవేత్తృత్వముయొక్క నైశిత్యము. సంప్రదాయజ్ఞుడైన కవి కనుకనే తాను ఏ పథకమును వేసెనో, ఏ యే శాస్త్రముల సంకేత

ములు కథయందు పాత్రలమూలమున సన్నివేశాదులచే స్ఫురింపజేయ దలచెనో వానికి తగిన శబ్దముల నెన్నుకొనెను. "యే విద్వాంసస్తే కవయః" [శ. బ్రా 7-2-2-4] విద్వాంసులే కవులు అని శతపథశ్రుతి.

మకరందిక- కాదంబరి : బాణుడిట్లూహించె ననుటకు మన కాధారమేమి? ఆధారమున్నది. కాదంబరికథకు మూలము గుణాఢ్యుని బృహత్కథ. క్షేమేంద్రుడు విరచించిన బృహత్కథామంజరి అన్నిటికి మూలకథ. బృహత్కథలోని మకరందికోపాఖ్యానము. ఆ మకరందికోపాఖ్యాన కథాసంవిధానము బాణునిచే అనుశీలింపబడి సంస్కరింపబడి పరిష్కరింపబడినది. అచటి మకరందిక బాణుని భావనలో కాదంబరి అయినది. మనోరథప్రభ మహాశ్వేతయైనది. సోమప్రభుడు చంద్రాపీడుడైనాడు. రశ్మిమంతుడు పుండరీకుడైనాడు. అచటి చండాలకన్య ముక్తాలత. బాణుడు కాదంబరిలో ఆమెకు పేరుపెట్టలేదు. చండాలత్వమును మాత్రమామె పాత్రలో ప్రధానభాగముగా స్వీకరించెను. మూలమునందలి ఆమెస్వరూపమును పూర్తిగా మార్చివేసెను. అచటి మంత్రి ప్రభాకరుడు కాదంబరిలో శుకనాసుడైనాడు. అశ్వశ్రవము అను గుఱ్ఱము ఉచ్చైశ్రవము సంతతిదిగా చెప్పబడినది- కాదంబరిలో ఇంద్రాయుధమన్న పేరుపొంది ఒకవిలక్షణమైన శాపవృత్తాంతముతో కథయందు ప్రాముఖ్యము వహించి చంద్రాపీడుని వాహనమైనది. ఈరీతిగా మూలకథయందలి పాత్రలపేర్లు మార్చెను. కథలో చాల మార్పులు జరిగినవి. కథ విస్తరింపబడినది. కథనములో ఎంతో మార్పున్నది. అసలు బాణుని కాదంబరికి ఆకథమూలమని చెప్పుట నట్టిపై స్థూల లక్షణముతో. నక్క ఎక్కడ ? నాగలోక మెక్కడ ?

ఆ కథను అనుశీలించిన బాణుని దృష్టి ఎట్టిది ? దాని పరమార్థమేమి ? తాను కథ చెప్పుటలో తీర్చిన శిల్పము నందు ఏ రహస్యము నిమిడ్చెను? కాదంబరి అతని భావనాప్రపంచము నుండి లోకమున అవత

రించి నప్పటినుండి కాదంబరీ రసజ్ఞులకు ఆహారము పై కూడ మనసు పోక తద్రసాస్వాదన పరమైన మత్తు ఎట్లు కలిగెను ? ఈ విషయము లను గమనించినచో కాదంబరి విశిష్టత మరియు స్పష్టపడును. ఉన్న కథను మార్చుటలో ఏదియో ప్రయోజనముండవలె. అది వట్టి సాహిత్య పరమైనది, కథ యొక్క కూర్పుకు సంబంధించినది యైనచో నింత ప్రతిష్ఠ పొందునా ?

అది వట్టి కథ కాదు. రసతరంగిణి. సౌందర్యనిర్ఝరిణి. వేదసంప్ర దాయప్రవర్తకమయిన విజ్ఞానాంతశ్చైతన్యవలిని అందులోనున్నది. అది త్రివేణీ సంగమము. రామాయణ మహాభారతాది కథల లోని ఆర్ష తేజము, సత్యశీలము, జీవము, జాతీయత ఆ కావ్యమున పుంజీభవించి యున్నవి. కుంతకుడనినట్లు—

"నిరంతర రసోద్గార గర్భ సౌందర్యనిర్భరాః
గిరః కవీనాం జీవంతి న కథా మాత్రమాశ్రితాః"

రసములు చిప్పిలు సరససుందరములైన కవుల వాక్కులచే లోకమున కథలు నిలుచును గాని వట్టి కథ లోకమున నిలువదు.

సంసారము నుండి మానవుని కథ పుట్టుచున్నది. సంసారమెంత యనాదియో మానవుని కథయు అంత అనాదియే ! ఈ సంసారమునకు మూలము దాంపత్యము.

"స్త్రీ పుమాంసౌ పరిష్వక్తౌ
పతిశ్చ పత్నీ చాభవతామ్" [బృ. ఉ. I-4-3]

ఈ దాంపత్యభావము జీవలోకమునకు సనాతనమైనది. సదాతన మైనది. అనగా నిత్యమైనది. స్థిరమైనది. ఇది లేనిది సృష్టిలేదు. పరమే శ్వరుని యందలి రెండు భాగములయిన ఈ స్త్రీ పుం విభాగములు వైదికతత్త్వమున సంసారమూలములు. కళాతత్త్వమున నాయికానాయ కులు రసకందములు. పురుషార్థసాధనలో దాంపత్యము ధర్మపరిధిలోనిది.

రసావిష్కారములో కావ్యమున కామపరిధి లేనిది. ప్రేమమూలమైనది. రామకథయైనను భారతకథయైనను స్త్రీమూలమున జరిగినదే. Helen of Troy కూడ అంతే. ఈ దాంపత్యతత్త్వమునందలి రహస్యము, ఆకర్షణ, పావిత్ర్యము— ఇవి మానవునకు ఆత్మీయములయిన అభీష్టములైన అంశములు. మానవహృదయములోని సౌకుమార్యమంతయు నిచట గూడుగట్టియుండును.

"బహుస్యాం ప్రజాయేయ" అన్న పరమేశ్వర సంకల్పము దీనికి మూలమైనది. ఈ జాతి యొక్క వేదశాస్త్రపురాణాది వాఙ్మయమంతయు పరమార్థమున పరమేశ్వరుని తత్త్వమును గవేషించుటకే. ఈ గవేషణము అంతర్ముఖమైనప్పుడు అది యోగపరము— వైదికము. ఆ గవేషణమే బహిర్ముఖమైనపుడు అది కళాత్మకము. అచట బ్రహ్మానుసంధానము. ఇచట రసానుసంధానము.

కాదంబరీ చంద్రాపీడులు; మహాశ్వేతాపుండరీకులు— బాణుడు చిత్రించిన దాంపత్యకళలోని అమృతాంశములు. చిత్రరథుడు మదిర; హంసుడు గౌరి— దాంపత్యము యొక్క దివ్యాంశములు. విలాసవతీ తారాపీడులు; మనోరమాశుకనాసులు— లౌకిక దాంపత్యధర్మప్రతీకలు. లక్ష్మి శ్వేతకేతువు దాంపత్యములోని తేజోంశములు. దైహికమైన స్పర్శ లేదచట. మకరందికోపాఖ్యానములో దంపతులున్నారు. కాని బాణుడు తనకథలోని దంపతులను పరమేశ్వరునిలోని స్త్రీ పుం విభాగములకు ప్రతినిధులనుజేసినాడు. వాని వలయములను తీర్చినాడు.

ఈ పాత్రల సృష్టికి మూలమయిన తత్త్వములు జీవసంస్కారముల నుండి కల్పించి సన్నివేశములకు ప్రాతిపదికలువేసినాడు. మకరందికోపాఖ్యానములో వట్టికథమాత్రమే చెప్పబడగా ఆ కథలోని తత్త్వమును బాణుడు మానవజీవితమునకు వ్యాఖ్యగా రూపొందించినాడు.

మానవజీవితము ఆధ్యాత్మిక ఆధిభౌతిక ఆధిదైవికములతో ముడివడి యున్నట్లే కావ్యజీవితము కూడ ఈ మూడుతత్త్వములతో పెనవేసినాడు. అప్పుడు అది కథామాత్రము కాదు. దాని యందు జీవ చైతన్య లక్షణ మేర్పడినది. ఆ జీవచైతన్యమునకు అచ్ఛోదసరోవర మును కేంద్రముగా చేసినాడు. అది అచ్ఛోదము. అచ్ఛ మయిన సృష్టికి మూలమైన ఉదము- జలము. దాని యందు సృష్టికర్త తన తేజ మును నిక్షేపించినట్లే యీ కవిబ్రహ్మ తన కథాబీజమును నాటినాడు. అచటనుండి పెరిగిన కథావృక్షము పలుశాఖలుగా విస్తరించి గంధర్వ లోకమునకు చంద్రమండలమునకు ఉజ్జయినీనగరమునకు విదిశాపట్టణ మునకు స్వర్గమునకు వ్యాపించినది. అందులో ఆ శాఖలకు వివిధ పాత్రలు ఫలములు. వాని లోని రసములు సంస్కారములు. ఈ మహా వృక్షము యొక్క ఒక కొమ్మ విదిశాపట్టణమున ఉన్నది. అచట శూద్రకుడన్న రాజున్నాడు. ఆ కొమ్మను మాత్రమే మొదట కన్పింప జేసినాడు. ఆ కొమ్మనెక్కిన తరువాత చెట్టంతయు సహృదయుడు కను గొన గలడు. కథ మాత్రము కావలసిన వాడు పండ్లను మాత్రము వెదకికొనుచు పోవును. కథాసౌందర్య దిదృక్షువైనవాడు చెట్టు నంతయు పదపదము ఆగి ఆగి పరిశీలించుచు పులకించుచు పోవును. ఈ చెట్టు పోలిక యెందుకు ? భగవద్గీత ఏమిచెప్పుచున్నది ?

ఈ సంసార వృక్షమునకు మూలము ఊర్ధ్వమున నున్నది. దీని శాఖలు క్రిందుగ నున్నవి. కర్మకాండ రూపములగు వేదములు దీని పత్రములు; అనాదియును క్షణికమును అగు ఈ సంసారము వేదశాస్త్ర పురాణములలో మాయామయవృక్షమని చెప్పబడియున్నది. ఇట్టి సం సారవృక్షమును తెలిసికొనిన వాడే వేదజ్ఞుడు.

ఈ కథావృక్షమునకు మూలము శ్వేతకేతు. పుండరీకుడు మహా శ్వేత, చంద్రుడు, చంద్రాపీడుడు, శూద్రకుడు, వైశంపాయనుడు

శాఖలు. వారి శాపములు జీవితములు. అవి ప్రవాహరూపమున యథార్థములుగా గోచరించును. వారి శాపపరిహారములు వేదోదితకర్మానుష్ఠానస్థానీయములు. అవి పత్రములు. కర్మానుబంధమునకు మూలము మనుష్యలోకము. ఈ మూలమును అసంగశస్త్రముతో నరికి వేయవలెను. అప్పుడు కథలేదు. చేరవలసిన బ్రహ్మపదమునకు చేరుచున్నాడు. అటనుండి పునరావృత్తి లేదు. అచట పురుషుడు స్వతంత్రుడు. ఆనందమే అతనికి మిగిలినది.

> "ఊర్ధ్వమూల మధశ్శాఖ మశ్వత్థం ప్రాహురవ్యయమ్
> ఛందాంసి యస్యపర్ణాని యస్తం వేద స వేదవిత్."

[భగవద్గీత-15వ అ- 1శ్లో]



4

# బాణుని అక్షరశిల్పము

"రుచిరస్వరవర్ణపదా రసభావవతీ జగన్మనోహరతి
సా కిం తరుణీః నహి నహి వాణీ బాణస్యమధురశీలస్య."
[విదగ్ధముఖమండనమ్- ధర్మదాసు]

చక్కని స్వరవర్ణపదములతో రసభావబంధురమై
జగన్మనోహారిణియైన ఈమె తరుణియా !
కాదు- కాదు. మధురశీలియైన బాణుని వాణి.

# బాణుని అక్షరశిల్పము

"కథాయాం సరసం వస్తు గద్యైరేవ వినిర్మితమ్"

సా. ద. 6వ. ప.

కథను గద్యములో చెప్పుటయే సరసమైన మార్గము. సాహిత్య లక్షణమును బట్టి కాదంబరి "కథ" అను పరిభాషతో చెప్పబడు గద్య కావ్యము. సాహిత్య లక్షణకారులు శ్రవ్యకావ్య దృశ్యకావ్యములకు ప్రసిద్ధమైన ఇతివృత్తమును; "కథ"కు కల్పితేతివృత్తమును కావలెననిరి. కథ కవి కల్పితమైనది. ఈ కల్పితమైన కథ మనసుకు నాటవలెనన్నచో సూటిగా చెప్పవలెను. సూటిగా తేటగా చెప్పిన కథ మనసున నాటును. ఈ విభాగము మానవమనస్తత్త్వమునకు అనుకూలమైనది.

కావ్యము గానము చేసి, నాటకమును ఆడించి, కథను చెప్పి కవి సహృదయుని మెప్పించును. గానమునకు పాదబద్ధము, అక్షరస మము, తంత్రీలయసమన్వితము నైన ఛందోమార్గము నందలి పద్యము హృద్యతను ఘటించును. ప్రదర్శనకు వేషము, అభినయము, మాటయు, పాటయు కావలె. అచట వట్టి మాట కూడ అభినయాదులచే రసవంత మగును. "కథ"ను చెప్పవలసినదే. ఈ చెప్పుట ముచ్చటగా నున్న ప్పుడే వినగలుగుదుము. ఆ ముచ్చట గొలుపుట కథ చెప్పువాని ప్రతిభ పై నున్నది. పద్యమునందు ఛందోగతమైన సౌందర్యము సహజముగ నుండును. నాటకమునందు వేషభాషల అభినయ వైఖరులుండును. ఇట్టి సౌందర్యపోషకసామగ్రి గద్యకావ్యమున సహజసంపన్నమై లేదు. దీనిని గద్యకవి సంతరించుకొనవలెను. హృద్యమైన గద్యము చెప్ప గలవాడే నిజమయినకవి. గద్యమునందలి హృద్యత యంతయు కవి యొక్క చాతుర్యమున నేర్పడునది. అందుకే "గద్యం కవీనాం నికషం వదంతి" అన్న ఆభాణక మేర్పడినది.

సంస్కృతమున గద్యకవులలో బాణుడు అద్వితీయుడు. పద్యమున అంత అద్వితీయుడని చెప్పదగిన కవి మరి లేడన్నచో కాళిదాసు కూడ హర్షించును గాని కోపించడు. ఈ ప్రశంస ప్రాచీన పండితపరంపర నుండియే గ్రహింపబడినది. సోడ్ఢలు డనెనుగదా !

"వాగీశ్వరం హంత! భజేఽభినంద మర్థేశ్వరం వాక్పతిరాజమీడే
రసేశ్వరం స్తౌమి చ కాళిదాసం బాణం తు సర్వేశ్వరమానతోఽస్మి."

అభినందుడు పదప్రయోగ పరమేశ్వరుడు. వాక్పతి రాజు ఉచితార్థ సంయోజనమున సిద్ధహస్తుడు. రసప్రకల్పనమున కాళిదాసు ప్రభువు. బాణుడుమాత్రము సర్వమునకు (వాక్ అర్థ రసములకు) పరమేశ్వరుడు.

గద్యము వ్రాసి యింత ప్రతిష్ఠ పొందుట సామాన్య విషయము కాదు. వామనుడు కావ్యలక్షణములు చెప్పబోవుచు "కావ్యం గద్యం చ పద్యం చ" అని ప్రారంభించినాడు. గద్యమునే ముందుగా ఏల పేర్కొనె ననగా గద్యము పద్యమున కంటె దుసాధమైనది. కవి శక్తికి నికషమైనది. అచటనే కావ్యము యొక్క ఘనత. అదియే కావ్యమార్గమున తొలుతగా పేర్కొనదగినదని సూత్రకారునిహృదయమును వార్తికము వివరించినది.

ఇతివృత్తము : బాణుడు గద్యము చేపట్టుటయే కాదు. అప్రసిద్ధమైన యితివృత్తమును కూడ నిర్వహింపబూనెను. సాధారణముగా కవులు ప్రసిద్ధేతివృత్తమునే ప్రఖ్యాతనాయకచరిత్రమునే కావ్యవస్తువుగా స్వీకరింతురు. కవి యొక్క రచనలో పసలేకపోయినను లోకోత్తరగుణోత్తరుడైన నాయకుని కథ వ్రాసినచో విద్వాంసులకు విందు గొలుపునని భోజరాజనినాడు.

"కవే రల్పాపి వాగ్వృత్తి ర్విద్వత్కర్ణావతంసతి
నాయకో యది వర్ణ్యేత లోకోత్తరగుణోత్తరః."

ఇట్టి సౌలభ్యమును గూడ బాణుడు గ్రహింపలేదు. తన కవితా శక్తికి గద్యమును, "కథ"ను గూడ నికషముగా గైకొనెను. అనల్పమైన తన వాగ్వ్యుత్పత్తిచేత "కథ"కు ఇతివృత్తమునకు ప్రసిద్ధి ఘటించినాడు. "బాణోచ్ఛిష్టం జగత్సర్వం" అన్న ప్రశస్తి పొందినాడు.

గద్యలక్షణము – గద్యభేదములు :– ఈతని తరువాత వచ్చిన ఆలంకారికులు గద్యకావ్యమునకు కల్పించిన లక్షణములు ఈతని కావ్యమును లక్ష్యముగా గొనిచెప్పినవే!

''అపాదః పదసంతానో గద్యమ్'' (కావ్యాదర్శము 1-23)

అని దండి గద్యలక్షణము చెప్పెను. గద్యమును "వృత్తగంధి చూర్ణ ముత్కలికా ప్రాయంచ" అని వామనుడు మూడుభేదములతో పేర్కొనెను. సాహిత్యదర్పణకారుడు చతుర్విధమైన గద్యమును పేర్కొనెను.

"వృత్తబంధోజ్ఝితం గద్యం ముక్తకం వృత్తగంధి చ
భవే దుత్కలికాప్రాయం చూర్ణకం చ చతుర్విధమ్"
"ఆద్యం సమాసరహితం వృత్తభాగయుతం పరం
అన్యద్దీర్ఘసమాసాఢ్యం తుర్యం చాల్పసమాసకమ్"

అనిచెప్పెను. (1) ముక్తకము (2) వృత్తగంధి (3) ఉత్కలిక (4) చూర్ణకము. ఇవి యన్నియు గద్యమునందలి అక్షరములయు, పదములయు, సమాసములయు కూర్పులకు సంబంధించినవి.

(1) ముక్తకము :– ఈ గద్యము వృత్తబంధోజ్ఝితము. సమాస బంధము లేనిది.

ఉదా:- “ఇతశ్చేతశ్చ స్వేచ్ఛయా పరిభ్రమన్; నమయన్నున్నతాన్
ఉన్నమయన్ ప్రణతాన్; ఆశ్వాసయన్ భీతాన్; రక్షన్ శరణాగతాన్;
ఉన్మూలయన్ విటపకాన్; ఉత్పాటయన్ కంటకాన్ .... .... ....
జనయన్ జనానురాగమ్; ప్రకాశయన్ విక్రమమ్ .... .... ....”

[చూ. కాదంబరి. 362 పు]

ఇట్టి వ్యస్త పదముల తోడి గద్యరచన ముక్తకము.

(2) వృత్తగంధి :- పద్య వృత్తము లందలి పాదముల వలె నున్న పదబంధముగల గద్యము. “పద్యభాగవద్వృత్తగంధి” అని వామనుని నిర్వచనము.

ఉదా:- “నిమ్నతర గండగర్తమ్, ఉన్నతతర హనుఘోణమ్
అంతరాల తారకమ్, అపనీయమాన విరలనయన పక్ష్మమూలమ్”

(చూ. కాదంబరి. 132 పు]

“వ్యాధగీతి రింద్రియమృగాణాం
పరామృష్టమానులేఖా సప్తాంశచిత్రాణాం” [చూ. కాదంబరి. 325]

(3) ఉత్కలికాప్రాయమ్:- “ఆవిద్ధోద్ధతపద ముత్కలికాప్రాయమ్” అని వామనుని నిర్వచనము. ఉద్ధతములైన పదములతోడి దీర్ఘసమాసబంధురమైన రచన ఉత్కలికాప్రాయము.

ఉదా:-“కులిశ శిఖర ఖర నఖర ప్రచయ ప్రచండ చపేటా పాటితమత్త మాతంగ
కుంభస్థల గలన్మదచ్ఛటా చ్ఛురిత చారుకేసరభార భాసురముఖే కేసరిణి”

[కా. సూ. వృత్తి. 1-3-25]

“కృతాపరాధ బాలక పలాయమానానుష్ఠ పశ్చాత్ప్రధావిత
స్ఖలితాధోముఖ పాతస్ఫుటిత శిరఃకపాల భగ్నగ్రీవేణ”

[చూ. కాదంబరి-346 పు]

(4) చూర్ణకమ్ :- “అనావిద్ధలలితపదం చూర్ణమ్” అని వామనుడు. విడి విడిగానున్న లలితపదములు గల దీర్ఘసమాసములు లేని గద్యబంధము చూర్ణము లేక చూర్ణకము.

ఉదా:- "అచింత్యో హి మహాత్మనాం ప్రభావః। బహుప్రకారాశ్చ
సంసారవృత్తయః। విచిత్రం చ దైవమ్। అప్రత్యాఖ్యేయ
యుక్తాశ్చ తపస్సిద్ధయః। అనేక విధాశ్చ కర్మణాం శక్తయః"
[చూ. కాదంబరి-509 పు]

సాధారణముగా బాణుని వర్ణనలు ఉత్కళికాప్రాయమైన గద్యముతో మొదలిడి, మధ్యలో శ్లేషానుప్రాణితోపమా విరోధాభాసాద్యలంకారములతో వృత్తగంధి గద్యమును గ్రహించి; అక్కడక్కడ భావ విచ్ఛిత్తిని ముక్తక గద్యములో జల్లుకొనుచు; చూర్ణక గద్యముతో ముగించును. ఈ క్రమము నియతముగా పాటించె నని కాదు. తన గద్యమునందలి వైవిధ్యము చే వర్ణనము నందలి వివిధ భావములకు శబ్దచిత్రములు గీయును.

అర్థము నందు నవనవత్వము; అగ్రామ్యమైన జాతి; ఝఢిత్యర్థావబోధముగల శ్లేష - రెండర్థములు వెంటనే స్ఫురించుట, రసోన్ముఖత్వము; అక్షరముల సొగసైన నడక; ఇవి యన్నియు నతని గద్యబంధము నందలి వివిధ గతులచే పరిణతులచే నేర్పడునవి.

వామనుడు "రీతి రాత్మా కావ్యస్య" అని ఆలంకారిక సంప్రదాయమున తొట్టతొలుతగా కావ్యమునకు శరీరమునకు వలె ఆత్మ యున్న దనినాడు. "విశిష్టా పదరచనా రీతిః" అని రీతిని నిర్వచించెను. కవ్యుద్దిష్ట భావనా విశిష్టార్థయుక్తమైన పదరచనయే రీతి. బాణుని గద్యము నందలి ఆత్మ యిదియే. కావ్య శోభా హేతువులైన గుణములను బాణుడు తన గద్యము నందు విలక్షణముగా ప్రయోగించెను. హర్ష చరితమున ప్రస్తావనలో—

"నవోఽర్థో జాతి రగ్రామ్యా శ్లేషోఽక్లిష్టః
స్ఫుటో రసః వికటాక్షరబంధశ్చ కృత్స్నమేకత్ర దుర్లభమ్"

అని బాణుడే చెప్పెను. ఇచట శ్లేష వట్టి అలంకారము కాదు. శబ్దగుణము, అర్థగుణము కూడ. వికటాక్షరబంధ మనగా నేమి? వామనుడు చెప్పిన లక్షణమును బట్టి "వికటత్వముదారతా" పదములు నాట్యకర్త్రుల లయానుగుణమైన కాలిగజ్జెల ఘుణం ఘుణాల వలెనెచట రవళించునో అది వికటాక్షర బంధము. ఈ శ్లోకమును గూర్చి మనము భావించినచో బాణుడు అక్షరముల కూర్పునుండి రసపరిపాకము వరకు తన గద్యరచనాప్రణాళిక నొక విలక్షణముగా తీర్చికొనెనని స్పష్టమగును.

వాక్కు సమ్యక్ప్రయుక్తమైనచో కామధేనువు వలె సకలార్థములను రసములను ప్రసాదించును. వాక్కు యొక్క ఈ లక్షణమును గ్రహింప లేనివాడు వట్టిగొడ్డు. వాని పశుత్వమును వాని అసమర్థమైన వాక్కే చాటుచున్నాడు దండి—

"గౌర్గౌః కామదుఘా సమ్యక్ప్రయుక్తా స్మర్యతే బుధైః
దుష్ప్రయుక్తా పునర్గోత్వం ప్రయోక్తుః సైవ శంసతి"

[కావ్యాదర్శము]

కవి గద్యము వ్రాసెనా పద్యము వ్రాసెనా యనికాదు. కవి వాక్యములందు శ్రవ్యతయే గొప్పది. ఆ శ్రవ్యత పద్యమునందు యతిచేత ప్రాసచేత గణమాత్రానియమముచేత సాధించుటకు ఒక మూస యున్నది. ఆ మూస గద్యమున కవి తన మనోధర్మమును బట్టి కల్పించు చున్నాడు. సంస్కృతమున విరామము విరతి, విశ్రాంతియే యతి. తెలుగున నియతస్థానముల అక్షరపునరావృత్తియే యతి. శ్రవ్యత రెంటి వలనను కలుగును. బాణుడు తన వచన పాదము లందు పదములను సమసమములను కొన్నిచోట్ల అప్పుడు. అనుప్రాసలతో పదగతిని సుందరము చేయును. శ్రవ్యతకు అనుకూలించు గురులఘువులసంయో

జనము చేయును. సువృత్తతిలకమున క్షేమేంద్రుడు "అవ్యభిచారేణ శ్రవ్యతైవ గరీయసీ" (2-5) అనినాడు. ఛందమునకు నిత్యముగా నుండ వలసిన ధర్మము శ్రవ్యత. అన్ని ధర్మములకంటె అదే గొప్పది. పద్యమున గురులఘువుల నియమమును పాటించినను కొన్ని అక్షరముల సన్నివేశము వికృతస్వరముల కల్పించును. కనుక శ్రవ్యత లేనిగణము గణ్యము కాదు. హృద్యమైన గణమే గణము.

సమాసగ్రంథుల చేత వాక్యము కుదించికొనినట్లుండును. విడివిడిగా నున్న పదములచేత వాక్యము విస్తరించినట్లుండును. బాణుని గద్యమును పరిశీలించుటకు కొన్ని విభాగములు చేసికొననిదే సాధ్యముకాదు. నేను ఈ మార్గము ననుసరించుచున్నాను.

(1) ఒక్కొక్కవర్ణనముగాని సన్నివేశము గాని ఒక్కొక్క ఘట్టము. యథార్థమునకు అన్నీ వర్ణనములే. ఇంచుమించు రెండువందల ఇరువదిరెండు వర్ణనములున్నవి.

(2) ఒక్కొక్క వర్ణనము నందు పెద్దవాక్యము లున్నవి. చిన్న వాక్యము లున్నవి.

(3) ఆ వాక్యములందు భిన్నభిన్నములైన ఖండము లున్నవి.

(4) ఖండ ఖండమునందు వ్యస్త సమస్తపదములున్నవి. ఒక వర్ణనమో ఘట్టమో యున్నచో బాణుడు సాధారణముగా తొలుత రెండు మూడు దీర్ఘసమాసములు గూర్చును. తరువాత ఉత్ప్రేక్షలతో ఉపమానములతో చిన్న చిన్న సమాసములు వ్యస్తపదములు కలిపి వ్రాయును. ఆ తరువాత శ్లేషలతో విరోధాభాసములతో వివిధరీతులలో సమాస అసమాసములతో ఒక సొగసైన రచన చేయును. వర్ణన ఉపసంహారమున పురాణములనుండి, శాస్త్రములనుండి శ్లేషానుప్రాణి తోపమాన పరంపరలతో గద్యశైలిలోని వృత్తగంధి, ముక్తక,

మూర్ణక, లక్షణములతో వ్రాయును. ఇది ఒక ప్రణాళిక— శైలిసిబట్టి. మొత్తముగా వర్ణనమును చూచినచో కొండపైనుండి జాలువారు నది నేలకు దిగి ప్రవహించునపుడు సాగరసంగమము వరకు నెన్ని సొగసులతో పోవునో అన్ని సొగసులు కూర్చును. (1) సమాసములచే వాక్యమును కుదించును. (2) విడిపదములచే వాక్యమును విస్తరింప చేయును. (3) ఉపమాద్యలంకారములను తరంగములవలె పరంపరలుగా నటింపజేయును. (4) రెండు సమాసముల మధ్య ఒక అలంకారమును శ్రీస్తనద్వయము మధ్య హారముగా నుంచును. బాణుని వర్ణనము యొక్క సంపూర్ణమైన రూపమిది—అంగి. తదంగములు వాక్యములు. ఆ వాక్యాంగములు వ్యస్తసమస్తపదములు. ఈ వాక్యాంగముల లోని స్వరవర్ణములు ప్రత్యంగకములు—చేతికి వ్రేళ్ళవంటివి, కంటికి ఱెప్పలవంటివి, నోటిలో దంతములవంటివి.

వాక్యసౌందర్య మెక్కడ నుండును? వీని యన్నింటిలో నుండును.

> "అంగ ప్రత్యంగకానాం యః
> సన్నివేశో యథోచితమ్
> సుస్నిగ్ధ సంధి బంధస్స్యాత్
> తత్సౌందర్య మితీర్యతే॥" [భరత నాట్యశాస్త్ర రస-౩౩]

అంగి నిర్మాణము నందు అంగప్రత్యంగములు యథోచితముగ సన్నివిష్టములు కావలెను. యథోచితముగా ననగా దేనికేది సదృశముగా నుండునో ఆ తీరుననని యర్థము. అంగప్రత్యంగముల పరస్పర సాదృశ్యము వలన వాని సన్నివేశము యథోచితముగ నుండును. యథోచిత సన్నివేశము వలన వాని భిన్నత్వము తిరోగతమై యంగి యందు ఏకత్వము భాసించును. సదృశములైన యంగప్రత్యంగముల సన్నివేశము అనగా సంధానము అంగి యందు పూర్ణత్వమును కల్పించును.

సన్నివేశము సుస్నిగ్ధసంధిబంధమైనచో విభాగము ప్రతీకల్పమై యంగి యందు అఖండత్వము సిద్ధించును. ఏకత్వము, పూర్ణత్వము, అఖండత్వము–సౌందర్య లక్షణములు. ఇవి సమాధిలక్షణములు. [చూ. ఛ శి. పుట 4]

The perfection of form resulting from the harmonious combi. nation of diverse elements in unity, that quality of objects that gratifies the aesthetic nature'' అని beauty అనుపదమును Standard dictionary వివరించినది.

ఏకత్వపూర్ణత్వాఖండత్వములు ఏ యంగియందు సిద్ధించునో దాని యందు సౌందర్యమను ధర్మము దీపించును. అట్టి దానియందు జీవుడు రమించును. అట్టి దానిని రమణీయము, సుందరము సరసము అని భావించును. [చూ. ఛ. శి. పు 4]

ఈ లక్షణములు బాణుని వర్ణనము నందలి గద్యనిబంధనమున నున్నవి. కాదంబరి కథయెంతసుందరమో అందలి పాత్రలంత సుందరములు. అవి యెంతసుందరములో అందలిరచన అంత సుందరము. ఈ త్రివిధమైన సౌందర్యము కాదంబరిలో నైక్యభావము నందినది. అందుచేతనే లోకమున కాదంబరి లోని పాత్రలు, కథ, గద్యము కూడ ఏకముఖముగా కీర్తి గడించినవి.

బాణుని గద్యము నందలి అక్షరశిల్పమును కథాముఖమున ప్రత్యక్షము చేసికొందము.

కాదంబరి కావ్యమున మొదట శూద్రక వర్ణనమున్నది. మహాసత్త్వుడు, అతిగంభీరుడు, క్షమావంతుడు, అవికత్థనుడునైన రాజును వర్ణించుటలో కవియొక్క విశిష్టపదరచన భావింతము.

| అలంకారము | | వాక్య ఖండము | శబ్ద గుణము | గద్యలక్షణము |
|---|---|---|---|---|
| శబ్ద | అర్థ | | | |
| యమక | ఉత్ప్రేక్ష | ఆసీ దశేష నరపతి శిరస్సముభ్యర్చిత శాసనః పాకశాసన ఇవా పరః | ఓజః | ఉత్కలికా |
| | రూపక | చతురుదధి మాలామేఖలాయా భువో భర్తా | ఉదారత | వృత్తగంధి |
| యమక | | ప్రతాపానురాగావనత సమస్త సామంత చక్రః చక్రవర్తి లక్షణోపేతః | ఓజః + ప్రసాద = సమాధి | ఉత్కలిక |
| శ్లేష అనుప్రాస | ఉపమ | చక్రధర ఇవ కరకమలోపలక్ష్యమాణ శంఖచక్ర లాంఛనః | కాంతి | వృత్తగంధి |
| శ్లేష | ఉపమా | హర ఇవ జితమన్మథః | ప్రసాద | చూర్ణక |
| ,, | ,, | గుహ ఇవాప్రతిహతశక్తిః | సమతా | |
| అనుప్రాస | విరోధాభాస | కమలయోనిరివ విమానీకృత రాజహంస మండలః | సమతా | చూర్ణక |
| | శ్లేష పూర్ణోపమ | జలధిరివ లక్ష్మీప్రసూతిః | ప్రసాద | చూర్ణక |
| | శ్లేష ఉపమ | గంగాప్రవాహ ఇవ భగీరథ ప్రవృత్తః | సమత | వృత్తగంధి |
| | పూర్ణోపమ | రవిరివ ప్రతిదివసోప జాయమానోదయః | ఉదారతా | వృత్తగంధి |

| అలంకారము శబ్దము | అలంకారము అర్థ | వాక్య ఖండము | శబ్ద గుణము | గద్య లక్షణము |
|---|---|---|---|---|
| | పూర్ణోపమ అతిశయోక్తి | మేరురివ సకలోపజీవ్యమాన పాదచ్ఛాయః | ఓజో | చూర్ణక |
| | శ్లేష పూర్ణోపమ | దిగ్గజ ఇవానవరత ప్రవృత్త దానార్ద్రీకృతకరః | ఓజో | ఉత్కలిక |
| | | కర్తా మహాశ్చర్యాణాం | మాధుర్య | ముక్తక |
| | | ఆహర్తా క్రతూనాం | + అర్థవ్యక్తి | ముక్తక |
| | రూపక | ఆదర్శః సర్వశాస్త్రాణాం | ” | ముక్తక |
| | ఉల్లేఖా | ఉత్పత్తిః కలానాం | ” | ముక్తక |
| | రూపక | కులభవనం గుణానామ్ | ” | ముక్తక |
| | | ఆగమః కావ్యామృత రసానామ్ | ” | వృత్తగంధి |
| | శ్లేష | ఉదయశైలో మిత్రమండలస్య | ” | వృత్తగంధి |
| | రూపక | ఉత్పాతకేతు రహితజనస్య | ” | వృత్తగంధి |
| | | ప్రవర్తయితా గోష్ఠీ బంధానామ్ | అర్థవ్యక్తి | చూర్ణక |
| | | ఆశ్రయో రసికానాం | ” | ముక్తక |

| అలంకారము | | వాక్య ఖండము | శబ్ద గుణము | గద్యలక్షణము |
|---|---|---|---|---|
| శబ్ద | అర్థ | | | |
| | | ప్రత్యాదేశో | అర్థవ్యక్తి | ముక్తక |
| | | ధనుష్మతాం | | |
| | | ధారేయః | ,, | ,, |
| | | సాహసికానాం | | |
| | | అగ్రణీర్విదగ్ధానాం | ,, | ,, |
| | శ్లేష | వైనతేయ ఇవ | మాధుర్య | చూర్ణక |
| | విరోధా | వినతానంద జననః | | |
| | భాస | వైన్య ఇవ చాపకోటి | ఓజో | ఉత్కళిక |
| | | సముత్సారిత సకలా | | |
| | | రాతికులాచలో | | |
| | | రాజా శూద్రకోనామ॥ | | ముక్తక |

ఇది ఏకైక వాక్యము. వాక్యమునందుగల స్వరవర్ణ పదముల రుచిరత్వము పృథగ్భూతముగా నేర్పడలేదు. అన్నింటియొక్క సమాహారరూపమైన యొక చారుత్వము భావితమగుచున్నది. ఈ వాక్యము నందు ముప్పది భాగములున్నవి. ఇవి పాదములుకావు. కాని వీని యందు ముప్పది గతులలో స్వరములు - అనగా అక్షరముల సవ్వడులు, హ్రస్వ దీర్ఘ గురు లఘు తత్త్వములైన సవ్వడులు; వర్ణములు - అనగా అచ్చులు, హల్లులలోని వివిధములైన వర్గాది వర్గయుక్, అనునాసికాది భేదములతో, ఊష్మములు మొదలగువానితో నొప్పిన వివిధ వర్ణములు; పదములు - వివిధములైన సవ్వడులుకల అక్షరములచే నేర్పడిన అర్థవంతములైన శబ్దములు సుప్ తిజన్తములు, ఇవి వాక్య శరీరావయవముల సౌందర్యసంపాదకము లగుచున్నవి. ఈ సౌందర్యము ఆ అవయవములందలి ప్రత్యణువున నున్నది. అక్షరము నకుగల స్వరమే ఇచట దృశ్యమానమైన అణువు, అక్షరము+దాని

నవ్వడి రెంటికి నవినాభావము. పదమునందివి భాగములు. పదమునకు వీనిని నవినాభావము. ఈ స్వర వర్ణపదములలో గోచరించెడి సౌందర్యము ప్రతి పదమునందు వరుసగా ప్రవాహరూపమున భాసించుచున్నది. ఇది ఒక సంతతధార. లోనగల జీవశక్తియొక్క స్పందనము. శబ్దగతమైన ఈ స్పందనము సహృదయ హృదయైకవేద్యము.

అపాదమైన గద్యమునందు ఈ స్వరవర్ణపదముల విలక్షణమైన కూర్పుగల ప్రతివాక్యపు తునుకయు స్వచ్ఛందమైన యొకపాదము. ఇచట కవి భావనయే ఛందము. "నాచ్ఛందః వాగుచ్చరతి" [నిరుక్తము 7-1-3] దానినే నాట్యశాస్త్రమున భరతుడు—

"ఛందోహీనో న శబ్దోఽస్తి
న ఛందః శబ్ద వర్జితమ్
ఏవం తూభయ సంయోగో
నాట్యస్యోద్యోతకస్స్మృతః" [నాట్యశాస్త్ర - 14-44]

అన్నాడు. "ఛందములేని శబ్దమున శబ్దములేని ఛందమున అందము లేదు. వీని సంయోగము కవి భావనాసిద్ధము. సహృదయ హృదయోద్దీపకము. అచ్ఛందమైన వాక్యము చెవికింపుగాదు. మనసున హత్తుకొనదు. గద్యమునందు ఛందము కవి భావమున బడి వచ్చుచున్నది. Gothe అనినట్లు "The measure flows, as it were, unconsciously from the mood of the poet." కవియొక్క చిత్తవృత్తినుండి యప్రయత్నముగనే ఛందోమయ వాక్యము నిర్గమించుచున్నది. ఉదాహృతమైన శూద్రకవర్ణనాపరమైన వాక్యము వ్యాకరణమునుబట్టి ఒకటే వాక్యము. కాని కవి చిత్తవృత్తి స్పందన రూపమైన ఛందమున ఆ వాక్యమున ముప్పది పాదములు (measures) కలవు. ఈదృష్టితో ఆ వాక్యము ననుశీలించినప్పుడు గద్యకవి హృదయ గత వాఙ్మయ భావనాస్వరూపము తేటపడును.

సర్వాలక్షణ లక్షితుడైన రాజును సర్వాలక్షణ లక్షితమైన గద్యమున చిత్రించెను. ఓజః ప్రసాదమాధుర్య సౌకుమార్యాది గుణములు రాజునందు వలెనే గద్యము నందును ప్రసంగోచితముగ ప్రవర్తిల్లినవి. "ఆసీదశేషనరపతి శిరః ... శాసనః పాకశాసన ఇవ" యతియు అనుప్రాసయు యమకము పదములకొక గమకమును గూర్పగా, దీర్ఘసమాసాఢ్యమైన శైలి ఉత్కలికాకోటికి చెంది ఓజోగుణ భాసురమైనది. ఉత్ప్రేక్షచే రాజు వైభవము ప్రకటితమైనది. రాజుయొక్క గంభీరాకృతి గంభీరమైన వాక్పరంపరలో మూర్తిగట్టినది. ఇన్ని లక్షణములును కవియొక్క పృథక్ప్రయత్నసిద్ధములు కావు. పరారూపమైన కవియొక్క భావన వైఖరి రూపమును పొందినప్పుడా యక్షరవిన్యాసమట్లుంచెను.

ఈ సమాసము కూర్పునకు రెండవపాదము నందలి సమాస రచనకు చాల భేదమున్నది. "చతురుదధిమాలామేఖలాయా భువో భర్తా" ఇచటి స్వర, వర్ణ పదములకూర్పు ఉదారతాగుణ సంపన్నమైనది. వృత్తగంధిశైలికి చెందినది. వృత్తపాదమే చెప్పనక్కరలేదు. వృత్తపాదముయొక్క నడకవంటిది. ఐదులఘువుల వెంటనే మూడు గురువులు మరల లఘువు ఆపై రెండు గురువులు ఒక లఘువు తరువాత మూడు గురువులు. ఈ హ్రస్వదీర్ఘలఘు గుర్వక్షరముల సవ్వడిలో మొదటి లఘువులగతి ద్రుతగతి. తరువాతి దీర్ఘముల ప్రస్తారము మంద్రము. ఖ-భు-భ అను వర్గయుక్కుల మహాప్రాణలక్షణముచే స్వరముల (అక్షరముల సవ్వడి) ఆరోహణక్రమమున సౌధశిఖరమునకు బోయి అచట సమతలమున విహరించి నట్లున్నది. ఇది చిత్తోత్తేజకమైన స్వర వర్ణ పద విన్యాస సరణి. ఇచట కవి అక్షరములతో ఒక స్వర ప్రవాహమును కూర్చినాడు. ఇది బాణుని వాగ్బాణ సరసగమనస్ఫూర్తి. "ఖ...భు...భ" ల ఒత్తులలో రాజగాంభీర్యస్ఫూర్తి. ఈ అక్షరము

లతో వాని సమాసములతో పదములతో బాణుడు వాగ్వృత్తిని క్షణ క్షణము విచ్ఛిత్తివిశేషములచేత సూక్ష్మ సూక్ష్మ బంధములతో ఉయ్యాలలూగించు చుండును. ఇది అతని రచనలో ప్రతిపాదరమణీయ తయని చెప్పదగును. దానిచే అవియే అక్షరములు, అవియే పదములు అవియే సమాసములు ఎప్పటికప్పుడు క్రొత్త పొత్తులతో రూపములతో నవనవముగ స్పందించుచుండును. ఈస్పందమున ఋతధర్మమున్నది.

ఋతమనగా కంపనము చలనము. "ఇయర్తి హృదయం ఇతి ఋతమ్ ఋ గతౌ" (అమరకోశ వ్యాఖ్య) హృదయంగమమైన గతియే ఋతము. అక్షరబంధగతమైన యీ ఋతమే లయ యనియు పిలువ బడుచున్నది. Rhythm ను గూర్చి గ్రీకుల యభిప్రాయమును T. S. Omand అను ఆంగ్లఛందోవేత్త చెప్పిన వాక్యములు గమనార్హ ములు.

"Philosophers have called Rhythm the pulse of the universe, the greeks said that its sire was God. At all events poetry in common with other arts, is wholly and absolutely conditioned by Rhythm; this is the breath and law of its being" విశ్వ చైతన్య స్పందమే ఋతము (Rhythm). భగవంతుడే దానికి ప్రభవస్థానము. సుందరనిర్మాణరూపములైన సర్వకళలకు Rhythm ప్రధాన ధర్మము. విశేషించి కవితకు అది ప్రాణభూతమైన పరమధర్మము.

"ఋతంభరమైన అక్షరబంధము వక్తృశ్రోతల చిత్తములందు సమాధిని నిష్పాదించి తన్మయత్వ మొదవించును. కావ్యపఠనకాల మున గలుగు తన్మయత్వము పాతంజలులు చెప్పెడి ఋతంభరవంటిది" అని శ్రీ విశ్వనాథ సత్యనారాయణగారు ఒకచో వ్రాసియున్నారు.

[మా. ఛం. శి. 26-27 పుటలు]

బాణుని వాణి "రుచిరస్వరవర్ణపద" యని అభినుతింపబడినది. స్వరమనగానేమి ? సంగీతరత్నాకర మిట్లు చెప్పుచున్నది.

"శ్రుత్యనంతర భావీ యః స్నిగ్ధో రణరణకమాత్రః
స్వతో రంజయతి శ్రోతృచిత్తం స స్వర ఉచ్యతే."

[సం. ర. 1-3-24]

చెవినిబడినంతనే శ్రోతృచిత్తమును రంజింపజేయు మృదువైన ప్రకంపనము కలిగించునది స్వరము.

"వర్ణము వక్తృచిత్తవృత్త్యాటోపమువలన వర్ణితమైన వాక్స్పందమే."

[ఛం. శి. 57 పే]

వక్తయొక్క అభిప్రాయమును వ్యంజింపజేయుటకై శబ్దము నానా వర్ణరూపములు పొందింపబడుచున్నది. అనగా వక్త ఉద్దేశించిన అర్థముయొక్క లక్షణము కలిగియుండుటయే వర్ణముయొక్క వర్ణత్వము. వక్త కవి- బాణుడు. ఏ భావమును ఏ రసోన్ముఖముగ చెప్పదలచెనో అట్టి రసభావములకు ఉచితమైన పరుష, సరళ, ద్రుత దీర్ఘ మహాప్రాణ, ఊష్మ, అంతస్థాది బహురూపమైన వర్ణముల సమాహారముగల పదముల నెన్నుకొనును. అట్టి పదములు (వ్యస్తములు, సమస్తములు) సహృదయ హృదయంగమములగును. అప్పుడు స్వరవర్ణపదాత్మకమైన వాణి రసభావవతి యగును. ఈ రసభావనా భావితమైన స్వరవర్ణపదరచనయే రుచిరమైనది. వట్టి పదరచనయందు ఎన్నిగుణములు, అలంకారములు రీతులున్నను ఈ రసభావవ్యంజన లేనిచో సహృదయ హృదయావర్జకము కాదు. అట్టి గద్యము కవిప్రతిభకు నికషము కాదు. బాణుని వాణి రుచిరస్వరవర్ణపదయగుటకు మూలము ఆమె రసభావవతి.

బాణుని గద్యములోనున్న గొప్ప చమత్కార మేమనగా వైవిధ్యము. "నావిష్ణుః పృథివీ పతిః" అన్న సాంప్రదాయికమైన భావమును చెప్పుటలో నారాయణమూర్తియందుగల దేవతలను వారి గుణములను వ్యస్తపదములతో వేలుపెట్టి చూపినట్లు చూపును. ఈ విడి పదములచే వాక్యము విస్తరించును. వ్యాపన శీలిమైన విష్ణుని యాకృతి

లోని విస్తృతిని వైవిధ్యమును చూపుటకాయన్నట్లు "ముక్తక" గద్యమును వాడును.

"యశ్చమనసి ధర్మేణ, కోపే యమేన, ప్రసాదే ధనదేన, ప్రతాపే వహ్నినా, భుజే భువా, దృశి శ్రియా, వాచి సరస్వత్యా ముఖే శశినా, బలే మరుతా, ప్రజ్ఞాయాం సురగురుణా, రూపే మనసిజేన, తేజసి సవిత్రాచ వసతా సర్వదేవ మయశ్చ ప్రకటిత విశ్వరూపాకృతే రనుకరోతి భగవతో నారాయణస్య" [కాదంబరి - 14 పు]

ఈ బంధమునందు శ్లేషయను శబ్దగుణమున్నది.

"మసృణత్వం శ్లేషః" అని వామనుని నిర్వచనము. మసృణత్వమనగా అనేక పదములు విడివిడిగా నున్నవియే ముడివడియున్నట్లు ఒకచే మొత్తముగా కన్పించుట. వ్యస్తత్వములో సమస్తత్వము గోచరించుట పలువురు దేవతలు ఒకే యాకృతిలో నిముడుటలోని చమత్కృతి ఈ పదరచనములో మూర్తి కట్టినది.

ఇట్టి వివిధ లక్షణ సంపన్నత చెప్పవలసినప్పుడు ఈ ముక్తక గద్యమునే మసృణమైన శబ్దగుణముతో తీర్చును. జాబాలిముని వర్ణనమున కూడ నిట్లే— "స్థైర్యేణాచలానాం, గాంభీర్యేణ సాగరాణాం, తేజసా సవితుః......నిర్మలతయా అంబరతలస్య సంవిభాగమివ కుర్వాణం" [కాదం. 134 పు] అని వ్రాయును.

రాజులలోని వీరత్వము, మునులలోని శాంతము, ఆటవికులలోని క్రౌర్యము మున్నగు గుణములు; ఆశ్చర్యము దుఃఖము సంతోషము మున్నగు మనోభావములు బాణుని గద్యబంధములలో అక్షరాకృతులను బొందినవి.

గాఢబంధమైన ఓజోగుణముగల గద్యగతిచే వీరత్వమును మూర్తి కట్టించును.

“యస్యాచ మదకల కరి కుంభపీఠ పాటన మాచరతా లగ్న స్థూలముక్తాఫలేన, దృఢముష్టి నిష్పీడన నిష్ఠ్యూత ధారాజల బిందు దంతురేవ......అభిసారికేవ సమరనిశాసు సమీపమసకృదాజగామ రాజలక్ష్మీః” [కాదం. 14-15] వీరుని కృపాణములోని పదునంతయు నీ యక్షరములకూర్పులో మెరయుచున్నది. మునియొక్క శాంతమైన లక్షణమును చెప్పుటకు—

“ఏష ప్రవాహః కరుణా రసస్య సంతరణ సేతుః సంసారసింధోః ఆధారః క్షమాంభసాం, పరశుస్తృష్ణాలతా గహనస్య, సాగరః సంతోషామృతరసస్య, ఉపదేష్టా సిద్ధి మార్గస్య......ప్రాసాదో ధర్మ ధ్వజస్య తీర్థం సర్వవిద్యావతారాణామ్......” [139 పు - కాదంబరి]

ఇచట భాషతో భావము, భావముతో భాషయు ప్రసన్నమధుర గమనముతో సాగుచున్నవి. ఇందు ప్రతి విశేషణము రెండు భాగములుగానున్నది- “ప్రవాహః కరుణారసస్య” మధ్య విరామము ఒక అనిర్వచనీయమైన ప్రసన్నతను కూర్చుచున్నది. శుకనాసుడు చంద్రాపీడునకు చేసిన ఉపదేశములో చూర్ణక గద్యమును, మసృణమైన శ్లేష యను గుణమును పొందుపరచును. “విదిత వేదితవ్యశ్చ అధీత సర్వశాస్త్రస్య తే నాల్పమప్యుపదేష్టవ్యమస్తి”......అపరిణామోపశమో దారుణో లక్ష్మీ మదః”... మునులను గురువులనుగూర్చి చెప్పుటలో వారి సర్వవిధ ప్రభావములను ధ్వనింపజేయు వివిధములైన గద్యబంధములు భావానుగుణముగ తీర్చును.

“ఏష ప్రవాహః కరుణారసస్య...” ఇత్యాది గద్యములో ముని ప్రభావమును మాటలలో చెప్పుటలో ప్రసాదగుణనిచితమైన వచన రచన అల్పసమాసములతో చూర్ణకగద్యమునకు లక్ష్యమైనది. మునియందలి ఓజస్సు ప్రసన్నతయు గద్యమునందు కనిపించును. మునిని వర్ణించుటలో పదబంధమిట్లుండును.

శబరసేనను వర్ణించుటలోగూడ బంధమున నొక విలక్షణత జూపును. "అర్జున భుజదండసహస్రవిప్రకీర్ణమివ నర్మదాప్రవాహమ్, అనిలచలితమివ తమాలకాననమ్ ......" ఈ రీతిగా గద్యమును నడపును. ఈ వాక్యఖండములు దీర్ఘములు. సమాసబహుళములు. ఇచట కూడ ప్రతిఖండము రెండుగా విడగొట్టబడి మధ్య విరామము కలిగి యున్నది. కాని ఈ రెండుభాగముల క్రమము మునివర్ణనలోని వాక్య ఖండములకంటె భిన్నము. అచట విరామమునకు అటు నిటునున్న శబ్దములకు ప్రసాదగుణమే యున్నది. ఇచట మొదటిభాగమున అక్షరవిన్యాసము ఆరోహణక్రమముననున్నది– "అర్జునభుజదండ సహస్రవిప్రకీర్ణ మివ"– రెండవభాగము "నర్మదాప్రవాహమ్" అవరోహణక్రమమున నున్నది. ఆరోహణమున ఓజోగుణము అవరోహణమున ప్రసాదగుణము మొత్తము రెండుఖండములకూర్పు ఓజః ప్రసాదగుణముల కలయికతో సమాధి గుణముకలది. చిత్తోత్తేజకమైన పదబంధము ప్రసన్నతాజనకమైన పదబంధము చిలుకపలుకులలో భయజనితమైన సంభ్రమమును తద్విరతిని– ఈమిశ్రభావములతోడి దానిచిత్తవృత్తిని ధ్వనించుచున్నది.

ఇట్లే దట్టమైన అడవిలోని లక్షణము శబ్దములతో రూపుకట్టు నట్లు చేయును. వింధ్యాటవి యున్నది. అందు మనల ప్రవేశింపజేయు నప్పుడు "అస్తి పూర్వాపరజలనిధివేలావలగ్నా మధ్యదేశాలంకారభూతా మేఖలేవ భువః" అని అడవియొక్క విస్తీర్ణతను దీర్ఘసమాసములతో చాటును. అడవిలోపల దానిగహనత్వము దట్టమైనలక్షణమును లఘువులు బహుళముగా పొదిగిన సమాసములలో కుదించిన వాక్యఖండముల మొత్తములతో గుబురులుగా, చెట్లతోపులుగా అడవితీగెలతో గజిబిజిగానున్న దుబ్బులుగా చిత్రించును. ఇది స్వరవర్ణపదములలో అడవి యొక్క చిత్రము—

"వనకరికుల మదజలసేకసంవర్ధితై రతివికచధవళకుసుమనికర మత్యుచ్ఛ్రతయా తారాగణమివ శిఖరదేశలగ్నముద్వహద్భిః పాదపై రుపశోభితా మదకల కురరకుల దశ్యమాన మరిచపల్లవా కరికలభకర మృదిత తమాలకిసలయామోదినీ మధుమదోపరక్త కేరళీకపోల కోమల చ్ఛవినా సంచరద్వనదేవతా చరణాలక్తకరసరంజితేనేవ పల్లవచయేన సంఛాదితా ......" ఇత్యాదిగా వర్ణించును. ఇచట పదముల అక్షర ముల కూర్పులో రమణీయతకు అనుప్రాస—

"మదకలకురరకుల దశ్యమానమరిచపల్లవా
కరికలభకరమృదిత తమాలకిసలయామోదినీ"

వంటి పద్యపాదములా! అనిపించు వృత్తగంధి గద్యబాధములు

"కేరళీకపోల కోమలచ్ఛవినా"

"దేవతాచరణాలక్తక రసరంజితేన"—వంటి సంగీత మధురస్వరముల వలె గురులఘువుల యొయ్యారపుగతులు, దట్టమైన అడవిలో బడియు కవితాత్మగలవానికి అడవిలోని రమణీయతయే మనసునకు పట్టునట్లు సరసతను గొలుపును. అడవి తొలుత ఎట్లు ప్రవేశింతుమా అన్నంత చిక్కగా నుండును. ప్రవేశించి కొంతవరకు అలవాటైన తరువాత అడ విని గురించిన భావములు శ్లేషలతో ఉపమానములతో కథలతో విస్తరించును. అప్పుడు అడవిలోని అందము (శ్లేషవంటి శబ్దాలంకార ములతో) లక్షణము (ఉపమావిరోధాభాసాద్యలంకారములతో) చరిత్ర (పురాణేతిహాసకథాపరిచయములతో) మనసునకు పట్టించును. చిత్రకారుడును తన గీసిన గీతలలో పూసిన రంగులలో చూపలేని ఈ చిత్రమును బాణుడు తన స్వరవర్ణపదములతో చూపును.

"ప్రేతాధిపనగరీవ సదాసన్నిహిత మృత్యుభీషణా మహిషాధిష్ఠితా చ-
సమరోద్యత పతాకినీవ బాణాసనారోపిత శిలీముఖా విముక్తసింహనాదా చ

కాత్యాయనీవ ప్రచలిత ఖడ్గభీషణా రక్తచందనాలంకృతా చ. యమనగరివలె ఈ యడవి నిత్యము మృత్యువునకు (యమునకు) నివాసమే కాక వాని వాహనమైన దున్నలతో కూడ నిండియున్నది. ఇచట మృత్యు మహిష శబ్దముల లోని శ్లేషను బట్టి అడవి యొక్క భీకరత్వము మనసునకు తట్టును. ఈ వర్ణనల లోని అర్థము పరామర్శించుట ప్రస్తుత లక్ష్యము కాదు. ఇచట శబ్దగత శ్లేషాది అలంకారములు బాణుని గద్యమునకు తీర్చిన అలంకారమునే భావింతుము. తరువాత ఉపమానములు గుప్పించుచు గద్యమునడకలో అడవియొక్క బహు రూపములు చలనచిత్రములను వలె పరంపరగా ప్రకటించు శైలి గమనార్హము.

"క్వచిత్ ప్రళయవేళేవ మహావరాహదంష్ట్రాసముత్ఖాతధరణిమండలా
క్వచిత్ దశముఖనగరీవ చటులవానరబృందభజ్యమానతుంగశాలాకులా
క్వచిత్ అచిరనిర్వృత్త వివాహభూమిరివ హరితకుశసమిత్కుసుమ
శమీపలాశశోభితా
క్వచి దున్మత్తమృగపతినాదభీతేవ కంటకితా,"

ఇట్టివి మరి పదునొకండు వాక్యఖండములలో అడవి యొక్క చిత్రములను మూర్తి కట్టించును.

వర్ణనలోని పదజాలముతో అడవిని జూచి యున్నట్లు ఉద్విగ్నమైన హృదయమును ముగింపులో ఆపదములతోనే ప్రసన్నపరచును. "బహుళపత్రసంచయాపి సప్తపర్ణభూషితా క్రూరసత్వాపి మునిజన సేవితా, పుష్పవత్యపి పవిత్రా వింధ్యాటవీ నామ." అని ముగించును.

"అస్తి ... ... వింధ్యాటవీనామ" అను క్రియాపదము నామవాచకములమధ్య విశేషణపరంపర యున్నది. ఇది వ్యాకరణమును బట్టి ఒకే వాక్యము. వింధ్యాటవి యంత పొడుగైన వాక్యమిది. ఇందు మొత్తము 38 ఖండము లున్నవి. ఈ ఖండములు ఛందోవృత్తముల లోని పాదముల వంటివి. వీనిని పేర్చుటలో వింధ్యాటవీప్రవేశమున పాఠ

కనిచిత్తవృత్తియై అక్షరములతో అడవిలోని గహనత్వభావనకు తగి నట్లుత్తేజపరచును.

ఉజ్జయినీ వర్ణన మున్నది. సాధారణముగా బాణుని వర్ణనా ప్రణాళిక లోని అక్షరవిన్యాసము వింధ్యాటవీ వర్ణన క్రమములోనే యుండును. "అస్తి" అని ప్రారంభించును. చివర "ఉజ్జయినీనామనగరీ" అనును. ఈ మధ్యలోని వాక్యఖండములు ఉజ్జయినీ విశేషణములు. వింధ్యాటవి వర్ణన కూడ యిట్లే కదా! అయినను ఇతివృత్తములోని ఏ అంశము ఆ వర్ణనకాస్పదమో అందుకు తగిన చిత్తస్పందమును పాఠకునకు కల్పించు శబ్దములతో గద్యబంధమును గూర్చును. వింధ్యాటవి యందు వైశంపాయను డన్న చిలుక కష్టదశను పొందెను. అచట దానికి కలిగిన భయము ఆపద యీ మున్నగు భావములన్నియు ఆ వర్ణన చదువు నప్పుడు పాఠకుని హృదయము లోనికి ప్రవేశించునట్లు చేయును.

ఉజ్జయినీ వర్ణనము చూతము. ఉజ్జయిని యందు ఒక దివ్యలక్షణ మున్నది. ఉదాత్తత యున్నది. ఒకరాజునకు రాజ్యముండును. రాజధాని యుండును. రాజు యొక్క లక్షణ ముండును. వీనిలో కథకు ఏది ముఖ్యమో కథ చెప్పు వానికి తెలియును. అతడు ఆ అంశమును శ్రోత లేక పాఠకుని చిత్తమున కెక్కునట్లు చేయును.

కథాముఖారంభములో శూద్రక వర్ణనమున్నది. కథారంభ మున ఉజ్జయినీ వర్ణన మున్నది. శూద్రకరాజగుణము ముఖ్యముగా కథకు ఆవశ్యకమైనది. అచట విదిశాపట్టణమునకు గల ప్రాముఖ్యము కథకు పట్టదు. కథారంభమున ఉజ్జయినీ వర్ణనమున్నది. తరువాత రాజ వర్ణన మున్నది. ఇచట ప్రాముఖ్యము నగరమునకు. ఇది కథానాయ కునకు మూలాధారమైనది. బాణుని వర్ణనముల రహస్యము గూర్చి చర్చించునపుడు ఇంకను ఈ విషయ మాలోచింతము. ఇచట అక్షర శిల్పమును గూర్చియే ప్రధానచర్చ గదా!

ఉజ్జయిని దివికి దగ్గరైన లక్షణము గల పట్టణము. మహాకాళ నాథ రూపమున శివుడు వేంచేసి యున్న పట్టణము.

"శ్మశాన మీశ్వరం క్షేత్రం వనం పీఠం ఏకైవ చ
పంచైకత్ర న లభ్యంతే మహాకాలపురం వినా"

మహాకాళశ్మశానము, మహాకాళశివుడు, మహాకాళక్షేత్రము, మహాకాళవనము, మహాకాళపీఠము- ఈ అయిదును ఒకేచోట నుండుట ఉజ్జయినీ ప్రత్యేకత. శ్రీ సూర్యనారాయణవ్యాస్ అను వారి విషయమును తెలిపినట్లు శ్రీ అగర్వాల్ పండితులు తమ కాదంబరీ అధ్యయన గ్రంథమున తెలిపిరి. ఉజ్జయిని యొక్క ప్రాముఖ్యము నాధారముగా గొని కథానాయకుని జీవితముతో ముడివెట్టుట బాణుని కల్పనలో ఒక ముఖ్యాంశము, ఇది రాజుయొక్క రాజధాని మాత్రమే కాదు. పరమేశ్వరానుగ్రహమునకు పాత్రమైన నగరము. ఆ లక్షణము నచట వర్ణనలో ప్రారంభము నుండి శ్రోతకు తట్టునటుల చెప్పుటకే అక్షరవిన్యాసమునను భావప్రకటనమునను కవి శ్రద్ధ చూపెను.

ఉజ్జయినిని వర్ణించిన గద్యమున "అస్తి సకలత్రిభువనలలామ భూతా ప్రసవభూమిరివ కృతయుగస్య" అని ప్రారంభించును. ఇది చూర్ణకగద్యము. ప్రసాదగుణము కలది. తరువాత "ఆత్మనివాసోచితా భగవతా మహాకాళాభిధానేన భువనత్రయ సర్గస్థితిసంహారకారణేన ప్రమథనాథేనాపరేవ పృథివీసముత్పాదితా, ద్వితీయ పృథివీశంకయా చ జలనిధినేవ రసాతల గంభీరేణ పరిఖావలయేన పరివృతా" ఇత్యాదిగా వ్రాయును. చిన్న చిన్న సమాసములు ఎక్కువగా దీర్ఘాక్షరములు మంద్రముగను గంభీరముగను సాగు అక్షరగమకము. ఇవి యన్నియు ప్రసాదగుణముతో సమాధిగుణముతో మాధుర్యముతో నొప్పినవి. పాంచాలీరీతితో విశిష్టమైన పదరచన యిది. "శబ్దార్థయోః సమోగుంఫః పాంచాలీరీతి రుచ్యతే" శబ్దార్థముల సమమైన గుంఫనము

పాంచాలీకీతి. ఏ అర్థమునకు ఏ శబ్దము సముచితమో అదికూర్చినప్పుడే ఆ శబ్దము శబ్దము, ఆ అర్థము అర్థము.

మృదువర్ణములతో అసమాసములు అల్పసమాసములు కల రచన శృంగారకరుణశాంతరసవ్యంజకము. మధ్యమ వర్ణములతో మధ్యమసమాసములతో నొప్పిన రచన హాస్యాద్భుత భయానక రస వ్యంజక మైనది. వికటవర్ణములతో దీర్ఘసమాసములతో కూర్చిన రచన వీరబీభత్సరౌద్రరసవ్యంజకమైనరచన యని యాలంకారికుల యోజన. ఈవాగ్విన్యాసమిట్లుండ వలెనన్న శాస్త్రమట్లుండగా కవి ప్రతిభచే అక్షరముల సంయోజనము అనేకమార్గముల బట్టిరసవ్యంజ కతా సామర్థ్యము కలది యగును. ఈ వర్ణబంధము బహుప్రకారము లైనది. "అస్త్యనేకో గిరాం మార్గః" (దండి–కా. ద–1–40). ఉజ్జయినీ వర్ణనమున దీర్ఘసమాసములును కలవు. ద్రుతగతిగల లఘ్వక్షరముల బాహుళ్యముగల వాక్యఖండములును గలవు. కాని వానియొక్క సం యోజనమున నొకవిలక్షణతచే బాణుడు మాధుర్యమును పుట్టించును.

"సతత ప్రవృత్తాధ్యయన ధ్వని ధౌతకల్మషా, స్తిమితమురజరవ గంభీరగర్జితేషు సలిలశీకరాసారరచితదుర్దినేషు పర్యస్తరవికిరణరచితసుర చాపచారుషు ధారాగృహేషు మత్తమయూరమండలై ర్మండలీకృత శిఖండై స్తాండవవ్యసనిభి రాబధ్యమానకేకారవకోలాహలా" ఇత్యాది వాక్యబంధములలో దివ్యలక్షణము గల యుజ్జయినీ నగరమనోహరత్వ మును చిత్తమోహనముగ వ్యంజింప జేయు సరసత యున్నది. ఈ బంధము నందు సరసతయే గోచరించును.

ఇట్టి బంధము తోడనే వింధ్యాటవిలో శబరమృగయావర్ణన మున ద్రుతగతిగల లఘ్వక్షరములను దీర్ఘసమాసములను సంయోజించు టలో చిత్తోద్వేగమును వ్యంజించు పరుషత యుండును. ఆ బంధము నందు రాజసతామసలక్షణములు గోచరించును. వేటగాండ్ర తొందర

వ్యక్తమగును. "ఇయమున్మదగంధగజగండకండూయన పరిమలనిలీన ముఖరమధుకర విరుతిః ఏషానిపతితరుధిర బిందుసిక్త శుష్కపత్రపాటలా రురుపదవీ ఏతద్ద్విరదచరణమృదిత విటపపల్లవ పటలమ్ ... ఏషనఖ కోటి విలిఖిత వికట పత్రలేఖో రుధిరపాటలః కరినాక్రాంతదంతురో మృగపతిమార్గః" (కా 84పే)

ఉజ్జయినీ గద్యములో ర, ల, మ, గ, అను అక్షరములచేత "సుర చాప చారు షు ధారా" వంటి సమాసములందలి దీర్ఘముల చేతను "మండలైర్మండలీకృత" వంటి యమకముతో "కేకారవకోలాహాలా" వంటి సంగీతస్వరముల సరసతతోను నొక మోహనమైన స్వర సంపుటి భావిత మగుచున్నది. వేటగాండ్ర గద్యములో "ఇయ మున్మద గంధ గజ గండ కండూ" వంటి ప్రారంభము ఖర-కర, సిక్త-శుష్క, రురు, వంటి అనుప్రాసచే, ట, ట, విట, పట, నఖ, లిఖి, కట, ట, క, క, వంటి అక్షరముల కటుత చేతను గద్యము నందలి స్వరసంపుటి యుద్వేజకమైన లక్షణము కలది యగుచున్నది.

ఈ సూక్ష్మమైన భేదము సమాసములను పరిశీలించిన వ్యక్త మగుటయే కాదు గద్యమును పైకి చదువునపుడా విభేదము చెవి పసి కట్టగలదు. సహృదయునకు ఆ వినిన వెంటనే చిత్తవృత్తి యందను భూతమైన స్పందము కావ్యార్థభావనానుగుణమై యుండును.

ఇది యొక వరుస. మార్దంగికుడు మృదంగముపై పలికించు వట్టి ధ్వనులలో మనము ఉద్విగ్నత, ప్రసన్నత, కటుత గ్రహించగలుగు చున్నాము. వానిలో లయ యున్నపుడు కటుశబ్దముకూడ తద్విషయిక మైన అనుభవమునకు సహకారి యగును. లయలేనిచో ఏ భావమును మూర్తికట్టదు. మనము వినము. పట్టించు కొనము.

"సత్యర్థే సత్సు శబ్దేషు సతి చాక్షరడంబరే
శోభతే యం వినా నోక్తిః స పంథా ఇతి ఘుష్యతే"

శబ్దము అర్థము అక్షరడంబరము నెంతగా నున్నను పంథ లేకున్న శోభ లేదు. ఆ సంపద బాణుని అక్షరశిల్పమున నున్నది.

స్వరవర్ణపదములతో భావమును రసమును వ్యంజింప జేయు శిల్పము కాదంబరి యందు ప్రత్యణువున స్ఫుటమగును. ప్రతిపుష్పము నందు మధువుండును. పుష్పము యొక్క ఆకారము రంగు వివిధముగా నున్నను లోన మధువుండవలెను. అది గ్రోలియే భ్రమరములు మత్తిల్లును. ఈ పదబంధములు వివిధవిధములు. వీనిలో తత్తద్రసాభివ్యంజకతాలక్షణమున్ననే సహృదయులకు సంతర్పణము. కవికి చారితార్థ్యము.

శబ్దార్థగుణాలంకారసంయోజనమున నొకరీతి లేనిదే భావము మూర్తి కట్టదు. రసము స్ఫురించదు. ఈ రీతి విశిష్టపదరచనయే. విశిష్టమనగా నేమి? కావ్యార్థభావనానుకూలమైన పదరచన. కావ్యార్థము ఏ రసాశ్రయమైన తద్రసాభివ్యంజక సమర్థమైన పదరచన. బాణుని వాణి రసభావవతి యనుటలో నిదియే చమత్కారము.

"కావ్యార్థభావనాజన్మ చిత్తవృత్తివిశేషో రసః" అని రసమునకు చక్కని నిర్వచనము. అట్టి చిత్తవృత్తి విశేషమును స్వరవర్ణపదములతో పోషించుట బాణుని వైదగ్ధ్యము. ఉదాహరించిన ఉజ్జయినీ; మృగయా వర్ణనములందు సహృదయచిత్తప్రసన్నతోద్వేగములకు తగిన పదబంధము నట్లు భావించితిమి. Sound echoing the sense అనునది యిదియే నేమో!

ఇక పాత్రల సంభాషణల పదరచనను పరిశీలింతము. కథలో వర్ణన కవి చేయునది. సంభాషణ పాత్రలు చేయునది. కవి పలికించువాడు. శ్రోతకు కథయందు తన్మయత్వము కలుగవలెనన్నచో సంభాషణములు పాత్రోచితములు ప్రసంగోచితములునై యుండవలెను. అప్పుడవి సహృదయుల చిత్తములకెక్కును.

కాదంబరిలో (1) రాజులమాటలు (2) చిలుకలపలుకులు (3) మంత్రుల ఉపదేశములు (4) విరహులశాపములు (5) మునులప్రవచనములు (6) భావుకులమనోవితర్కములు (7) ప్రేమికుల సరసాలాపములు (8) గురువుల సందేశములు (9) సంసారుల సల్లాపములు (10) ఆటవికుల వేటలఅడవులు (11) దుఃఖితులకు ఓదార్పులు ఎన్నెన్నో ప్రసంగములుకలవు. ఏ ప్రసంగమున కా ప్రసంగమునకు తగినశైలి యుండును.

కథాముఖమున వైశంపాయను డన్న పేరుగల చిలుక శూద్రక మహారాజు నాశీర్వదించునపుడు ఆర్యావృత్తమును చదివెను. చిలుకలు పలుకునా? పలికినను స్పష్టముగా పలుకునా? దానికి సంస్కృతము వచ్చునా? ఈ సందేహములు రాకుండ కవి దానిప్రభావమును చండాలకన్యచేత చెప్పించినాడు. మంత్రిచేత ఒప్పించినాడు. ఆ చిలుక మాటలు చాల విలువైనవి. ముచ్చటైనవి.

"స్తనయుగ మశ్రుస్నాతం సమీపతరవర్తి హృదయశోకాగ్నేః
చరతి విముక్తాహారం వ్రతమివ భవతో రిపుస్త్రీణాం"

[కాదంబరి-పూర్వార్థము-38 వ పుట.]

ఈ చిలుకకు చాలశాస్త్రములు వచ్చును. స్పష్టముగ మాటాడ గలదు. కాని చిలుక చిలుకయే కదా! దాని పలుకులు పంచదార చిలుకల వలెనే యుండవలెను. అది నియతమాత్రాకమైన పాదబద్ధమైన అలతి అలతి సమాసములతో తునుగుచు నుండు ఒక ఛందమున పలుకుటయే సరసము. అందునను ఆశీస్సు ఛందోమయము గానుండుటయే సంప్రదాయము. గద్యకథలో అందందు ఆర్యా అపరవక్త్రాది వృత్తములలో శ్లోకము లుండనగునని సాహిత్యకారులన్నారు. ఈఛందము నల్లెన్నుకొను నవకాశమున్నది. ఆర్యావృత్తము దీర్ఘమైనది కాదు. బహుదీర్ఘమైన వృత్తము చిలుక చేత పలికించుటలో

ఔచిత్యము లేదు. ఇచట అవస్థౌచిత్యము, వృత్తౌచిత్యము, గుణౌచిత్యము, సకలశిక్షౌచిత్యములు పాటింపబడినవని చెప్పవలెను. కాదంబరీకథకు మూలమైన కథాసరిత్సాగరమున మకరందికోపాఖ్యానములో చిలుకయు రాజునాశీర్వదించుఘట్టము గలదు. ఆ చిలుక శార్దూలవిక్రీడిత వృత్తమున రాజు నాశీర్వదించును.

చిలుకచే శార్దూలవృత్తమును పలికించుటలో ఔచిత్యము లేదు. బాణుడు ఆర్యావృత్తములో పలికించెను. తన పాత్రల స్వరూప స్వభావములకు తగిన పలుకులే పలికించుట బాణునికి పరిపాటి. ఈ చిలుక పలుకులెట్టివో శూద్రకమహారాజు వ్యాఖ్యానించును. ఆ విధముగా చిలుక పలుకుట ఆశ్చర్యము గదా! రాజు ఆ ఆశ్చర్యము నిట్లు ప్రకటించెను. "శ్రుతో భవద్భి రస్య విహంగమస్య స్పష్టతా వర్ణోచ్చారణే, స్వరే చ మధురతా ప్రథమం తావ దిదమేవ మహదాశ్చర్యం యదయమసంకీర్ణవర్ణప్రవిభాగ మభివ్యక్తమాత్రానుస్వార స్వరసంస్కారయోగాం విశేషయుక్తాం అతిపరిస్ఫుటాక్షరామ్ గిరముదీరయతి. తత్ర పునరపరం అభిమతవిషయే తిరశ్చోపి మనుజస్యేవ సంస్కారవతీ బుద్ధిపూర్వా ప్రవృత్తిః"— ఈ చిలుక వర్ణోచ్చారణములో స్పష్టత యున్నది. స్వరమున మాధుర్యమున్నది. వర్ణములు గబిబిజిగానుండ విడివిడిగా తేటతెల్లముగా మాత్రలు అనుస్వారములు స్వరములు వ్యాకరణపద్ధతిలో నిక్కలిస్ఫుటోచ్చారణముతో పలుకుట మొదటి ఆశ్చర్యము. మరియొక ఆశ్చర్యము చెప్పవలసిన విషయము నెట్లు చెప్పవలెనో అట్టి శబ్దార్థసంస్కారముతో అభినయసంస్కారముతో మనుష్యులవలెనే చెప్పుట." రాజు వెల్లడించిన యీ యాశ్చర్యములో ఒక రహస్యమున్నది. కథకు సంబంధించినవరకు రాజు చిలుక మాటల కాశ్చర్యపడుటయే. ఈ ఆశ్చర్యమును ఆయన ఎటువంటి పదముల తో వ్యక్తముచేసెను? ఏ సంస్కారము మాటాడు వాని మనో

భావములనుబట్టి వాని మాటలు ఎట్టుల ప్రసాదమాధుర్యాదిగుణ యుక్తమై యుండునో అట్టిరీతినే బాణుడు కూడ తన ఆశ్చర్యభావమును పదముల కూర్పువలనే వెల్లడించెను. ఇందులో బాణుడు తన శైలిని గూర్చిన లక్షణమును సూచించెను. భావప్రకటనకు వలయు స్వరవర్ణ పద సంస్కారమును గూర్చి ధ్వనింపజేసెను. తన శైలి (1) అసంకీర్ణవర్ణ ప్రవిభాగము. (2) అభివ్యక్తమాత్రానుస్వారస్వరసంస్కారయుక్తము. (3) అతిపరిస్ఫుటాక్షరమునై యుండుటను సూచించినట్లు గ్రహింపగలము. బుద్ధిపూర్వకమైన మానవప్రవృత్తిచే తత్త్వాభావానుకూలమైన స్వరవర్ణముల సంయోజనము మాటాడుట యందుండునని అదియే సముచితమైన కావ్యశైలి యని అతని భావము. ఈ ప్రకరణము మొదటి నుండి చర్చింపబడిన బాణుని శైలి యందు ఈ లక్షణమే విశదీకరింప బడినది. కావ్యశైలిని గూర్చి బాణుని భావనకిది తద్గ్రంథాంతర్గతమైన సాక్ష్యము.

ఈ శ్లోకమును క్షేమేంద్రుడు తన ఔచిత్యవిచారచర్చలో కారకౌచిత్యమునకు లక్ష్యముగా ఉదాహరించెను. శత్రుస్త్రీలు వ్రత మాచరించు చున్నారు. కాని వారి స్తనయుగము వ్రతము నాచరించు చున్నదని చెప్పబడినది. బాష్పసలిలస్నానము, శోకాగ్నిసమీపవర్తనము, విముక్తాహారము ఇవి స్తనయుగము యొక్క వ్రతానుష్ఠాన లక్షణములు. స్తనయుగమును కర్తృపదముగా చెప్పుటయే ఇచటగొప్ప ఔచిత్యము.

సంభాషణమనగానేమి? "నీవు" "నా"తో "నేను" నీతో ఎవనిని గూర్చియో దేనిని గూర్చియో మాటాడుట. అప్పుడు మాటాడువాని భావమును బట్టి వాని మాటలలో ఆ మాటల సవ్వడులలో ప్రసన్నతయో మాధుర్యమో పారుష్యమో ఉద్వేగమో యుట్టిపడు పద విన్యాస ముండును. మామూలుగా నిత్యవ్యవహారములలో మాటాడు

కొను మాటలలోనే యీ విధమైన సంస్కారముండును. మాటాడు [illegible] ఆశ్చర్యమును కనుబొమ లెగురవైచుచు గొంతులో నుండి ఆశ్చర్యాభివ్యక్తి కల ధ్వని పుట్టించుచు కాకుస్వరాదులతో తన భావమును తేట పరచును. ఆ ఆశ్చర్యాది భావములను ప్రకటించకుండ మాటాడుట మానవస్వభావములోనే లేదు. ఈమానవ స్వభావమునే కావ్యమున కవి పాత్రల చిత్త ప్రవృత్తులను ప్రకటించు వాగ్విన్యాసములచే నిరూపించును.

వ్రాసిన మాటలు చదువుకొనునపుడు మాటాడిన వాని మనోభావమును తెలిసి కొనుటకు ఆ మాటలే ఆధారములు. మామిడిపండు పక్వమునకు వచ్చినప్పుడు తినుటకది యెంతరుచికరముగా నుండునో పాకమున బడిన శైలి కావ్యమున ఆ యా భావముల రుచులతో సహృదయుని చిత్తమున కెక్కును. బాణుని సంభాషణాశైలి యట్టిది.

> "గుణస్ఫుటత్వసాకల్యే కావ్యపాకం ప్రచక్ష్యతే
> చూతస్య పరిణామేన స చాయ ముపమీయతే"

[కావ్యాలంకారసూత్ర వృత్తి – 3–2]

అన్న వామనుని యభిప్రాయమదియే. వామనుడు బహుశః బాణుని శైలిని కూడ భావించియే యట్లు వ్రాసెనేమో !

అట్టి పాకమున పడుటచేతనే కాదంబరిలో శుకనాసోపదేశము, కపింజలుడు పుండరీకుని హెచ్చరించిన విధము కావ్యము వలెనే విలక్షణమైన ప్రచారమును పొందినవి.

ఉపదేశపరమైన భావపరంపరను చెప్పుటలో శుకనాసోపదేశము లౌకిక వాఙ్మయమున అద్వితీయమైన స్థానమును పొందినది. ఉపదేశము నీతివాక్యమయము. దానిని రమణీయముగా చెప్పవలెను. ఉపదేశవాక్యము లందెంత రమణీయత కల్పింపవలెనో యెంత మనసునకు

నాటుకొనునట్లు చెప్పవలెనో అన్ని విధములయిన మార్గములు శుక నాసుని వాగ్వైఖరిలో బాణుడు సమకూర్చెను.

"తాత! చంద్రాపీడ! విదితవేదితవ్యస్య అధీతసర్వశాస్త్రస్య
తే నాల్పమప్యుపదేష్టవ్యమస్తి"

నాయనా చంద్రాపీడా! తెలిసికొనవలసిన దంతయు తెలిసికొని చదువవలసిన శాస్త్రములు అన్నియు చదివిన నీకు వేఱే యుపదేశింప వలసినది యేమియు లేదు అని శిష్యుని మనస్సును మెత్తపరచును.

"అభానుభేద్యం అరత్నాలోకోచ్ఛేద్యం అప్రదీపప్రభాప నేయం అతిగహనం తమో యౌవనప్రభవమ్" యౌవనమువలన కలిగిన చీకటిని సూర్యుడు పోగొట్టలేడు. మణుల కాంతులు బాపజా లవు. దీపకాంతులు తొలగింపజాలవు. అది చాలదట్టమైన చీకటి.

ఈ వాక్యము చిన్నవాక్యము. తొమ్మిదిముక్కలుగా దీనిని విభాగించ వచ్చును. అట్టి ముక్కలలో మిక్కిలి చిన్నది "ఏవ" పెద్దది "అప్రదీపప్రభాపనేయం". ఈవాక్యమును విశ్లేషించి చూచినచో

కేవలం చ నిసర్గత ఏవ (సమగతి)

అభానుభేద్య మరత్నాలోకోచ్ఛేద్య మప్రదీపప్రభాపనేయ మతిగహనం తమో యౌవనప్రభవమ్ (ఆరోహణ)

"అపరిణామోపశమో దారుణో లక్ష్మీమదః" (అవరోహణ).

ఆరోహణలో ఓజోగుణము అవరోహణలో ప్రసాదగుణము రెండు వాక్యముల మొత్తములో సమాధిగుణము. గురువు విషయము బోధించునపుడు శిష్యుని మనసు నాకర్షించు మార్గమిది. ఇట్టి అనేకము లైన శబ్దవిన్యాసవైఖరులు ఈ శుకనాసోపదేశ వాక్యరచనలో నున్నవి. బోధలో స్పష్టత సూటిగా విషయమును చెప్పుటయు నుండును.

"గర్భేశ్వరత్వం అభినవయౌవనత్వం అప్రతిమరూపత్వం
అమానుషశక్తిత్వం చేతి మహతీయం ఖల్వనర్థపరంపరా"

ఈ వాక్యములు పదములు స్వాద సంగమములు.

చమత్కారాత్మకమైన లక్షణముతో విషయవివేకము కలిగించునపుడు వాక్యగమకము—— "అకారణం చ భవతి దుష్ప్రకృతే రన్వయః శ్రుతం వా వినయస్య. చందనప్రభవో న దహతి కిమనలః? కిం వా ప్రశమహేతునాపి న ప్రచండతరీ భవతి బడబానలో వారిణా."

ఇచట శబ్దమునందు "అర్థవ్యక్తి" అర్థమునందు "మాధుర్యము" గుణములు.

"అర్థవ్యక్తిహేతుత్వ మర్థవ్యక్తిః" అని వామనుని లక్షణము. ఝటిత్యర్థప్రతిపత్తిహేతుత్వము. మాటవెంటనే అర్థము పొడగట్టుటకు తగిన పదబంధము అర్థవ్యక్తి యను గుణము కలది.

"ఉక్తివైచిత్ర్యః మాధుర్యమ్" అని అర్థగుణము. వర్ణ్యమానార్థమును స్ఫుటీకరించుటకు భంగ్యంతరముగా చెప్పుట అర్థమునకు మాధుర్యమును గూర్చును.

చిలుకపలుకులలో కూడ నిట్టి మాధుర్యమున్నది. శూద్రక మహారాజు చిలుకను "మా అంతఃపురమున నీకిష్టమైన యాహారమా స్వాదించితివా?" అనగా చిలుక రాజాంతఃపురమున తన యాహార భోగము నిట్లు వర్ణించును.

"దేవ ! కిం నాస్వాదితమ్ ! ఆమత్తకోకిలలోచనచ్ఛవి ర్నీలపాటలః కషాయ మధురః ప్రకామమాపీతో జంబూఫలరసః; హరి నఖరభిన్నమత్తమాతంగకుంభ ముక్త రక్తార్ద్రముక్తాఫలత్వింషి ఖండితాని దాడిమబీజాని నలినీదళహారింతి ద్రాక్షాఫల స్వాదూని చ దళితాని స్వేచ్ఛయా ప్రాచీనామలకీఫలాని"

వట్టి శబ్దములచేత వానిసవ్యాజిచేత యిచట చిలుక యాహార సేవలోని తృప్తిని ఆస్వాదమాధుర్యమును ఆ ఆహారపదార్థములందలి ఉత్తమత్వమును స్ఫురింపజేయును, ఆ పలుకులలో కాంతి (దీప్త రసత్వం) మాధుర్యము (ఉక్తివైచిత్ర్యం) ప్రసాదము (అర్థవైమల్యం) అను

అర్థగుణములు; కాంతి (బంధము యొక్క ఔజ్జ్వల్యం) ఉదారతా (క్రమశోవర్ధమానాక్షరపదత్వం, పదప్రథమాన్త్యాక్షరాణాం పదాంతరప్రథమాద్యాక్షరైః సాదృశ్యం చ—"మత్తమాతంగకుంభముక్త రక్తార్ద్రముక్తాఫలత్వింపి"– సమాధి అను శబ్దగుణములు మేళవించి వృత్తగంధి ప్రాయమైన గద్యబంధమైనది. ఇచట చిలుక ఆహారవర్ణన స్వరవర్ణపదములలో వ్యక్తమై దానితృప్తి రసభావముల దీప్తము గావించినది.

కామపరవశుడైన పుండరీకుని హెచ్చరించుచున్న కపింజలుని ప్రశ్నములు బాణపరంపరగా వెలువడును. ఆ వాక్యవిన్యాసము మిత్రునికి కలిగిన ఆపదను తొలగించుటకు సాటిమిత్రుడు పొందిన ఆరాటమును ఆవేదనను వెల్లడించును.

"యదేత దారబ్ధం భవతా కిమిదం గురుభిరుపదిష్టం
ఉత ధర్మశాస్త్రేషు పఠితమ్, ఉత ధర్మార్జనోపాయోఽయం
ఉతాపరస్తపసాం ప్రకారః ఉత స్వర్గగమన మార్గోఽయం"
ఉత, ఉత, ఉత అని ప్రశ్నలగొలుసుల నైరంతర్యమును ఘటించి
"గురుభి రుపదిష్టం ధర్మశాస్త్రేషు పఠితం –

ఇట్టి ప్రశ్నలలో మహాప్రాణాక్షరములను సంయుక్తాక్షరములను వాక్యఖండము యొక్క ఆదిమధ్యాంతములందు నిబంధించుటచే ప్రశ్నయొక్క గాఢత్వము వక్త యొక్క మనఃక్షోభమును చనువుతో మిత్రుని గట్టిగా హెచ్చరించు లక్షణమును ధ్వనింపజేసినాడు. లోకములో నెవనినైన చివాట్లు పెట్టునపుడు ఈ మానసికోద్వేగములు మాటల సవ్వడులలో వినిపించుచునే యుండును. కావ్యమున పదబంధమున ఆ లక్షణమును గూర్చుటలో బాణుడు సిద్ధహస్తుడు.

సంసారము లేదన్న చింతలో కుమిలిపోవుచున్న తనరాణి విలాసవతిని తారాపీడుడోదార్చును. ఆ ఓదార్పులోని అర్థమట్లుంతము. ఆ పలికిన పలుకులలో రాజు తన రాణి హృదయమును ప్రసన్నపరచునాదమున్నది.

స్వరమున్నది. "దేవి! కిమత్ర క్రియతాం దైవాయత్తే వస్తుని అలమతిరు దితేన! న వయమనుగ్రాహ్యా నా ప్రాయో దేవతానాం......అధికాం కురు దేవి సుమహ [illegible] నా ముపపాదయ దేవగణేషు పూజాం" ఈ రీతిగా నూతి [illegible] చేటు కెల్లనుగా విలాసవతి చిత్తమును సమాధానపరచును. ఆ తరువాత సంతానదోష పరిహారమునకై తాను చెప్పినవన్నియు చేసినచో తప్పక ఋషులు దేవతలు అనుగ్రహింతురను విశ్వాసమామెకు కలిగించుటకై బృహద్రథ దశరథాదుల సంతాన కథల నుదాహరించును. ఆ కథల నొక్కొక్క వాక్యమున చెప్పెను. ఆ వాక్యములందు పదబంధ మెట్లుండెను ? ఓజః ప్రసాదగుణమేళనముతో చిత్తమునకు తేజమును విశ్వాసమును రేకెత్తించునట్లు ఫలసిద్ధి యందు దృఢవిశ్వాసము కలిగించుటకు ఏ శ్లోకములో అక్షరములపోహళింపు ఉండవలెనో అట్లున్నను.

"పురా చండకౌశికప్రసాదాత్ మగధేషు బృహద్రథోనామ రాజా జనార్దనస్య జేతారం అతులభుజబలమప్రతిరథం జరాసంధం నామ తనయం లేభే"

"దశరథశ్చ రాజా పరిణతవయాపి విభాండకమహామునిసుతస్య ఋష్యశృంగస్య ప్రసాదాన్నారాయణభుజానివాప్రతిహతా నుదధీనివా శ్చోభ్యానవాప చతురఃపుత్రాన్" ఇచట నింతవరకు చర్చించిన విధముగానే దీర్ఘాక్షరముల చేత హ్రస్వాక్షరములచేత సంయుక్తాక్షరములచేత వానిమధ్య ఎడములచేత ఒకనాదము వచ్చును. ఆ నాదమే వక్త యొక్క మనోభావము. ఆ కథ యందాతని కెంత నమ్మకమున్నదో అదియెంత ఆశ్చర్యమో! ఆ కథను తానెట్లు భావించుచున్నాడో తమ ప్రయత్నమున కది యెట్లు ఆదర్శమో అన్నియు ఆ నాదము నుండి వెల్లడియగును. బాణుని ప్రసంగోచితమైన యిట్టి శైలీవిన్యాస మెంత చెప్పినను నంతుండదు. ప్రతివాక్యమునందును శబ్దము యొక్క ఈ

లక్షణ మనుసంధింపబడి యుండుటచే వర్ణనమునగాని సంభాషణమున గాని మానవమనోభావవైఖరీవిన్యాసమునకు తగిన గుణాలంకారయోజ నము కలదు.

అదియే మానవహృదయస్పృశమైన శైలీలక్షణము. అదియే కావ్యమునకు జీవము. అంతియే కాని "దశదాడిమాని షడపూపాః కుండమజాజినం పలలపిండః" ఇత్యాది వాక్యము మనస్సునకు పట్టదు. శ్వేతకేతు మహాముని పలికినపలుకులలో సత్త్వగుణమే భాసించును.

ఇంద్రాయుధమును జూచి చంద్రాపీడుడు చేసినభావన పదము లలో రూపుకట్టించెను. హయరత్నములలో నింద్రాయుధము వంటిది మరియొకటిలేదు. ఆ ఇంద్రాయుధమును గూర్చి చంద్రాపీడుడు చేసిన భావనకు సాటియైన భావన మరియొకటియుండదు.

విరహాసంతప్తుడైన పుండరీకుడు మన్మథుని చంద్రుని తిట్టుట, జాబాలి మహాముని వైశంపాయనుని కథ చెప్పుట కాదంబరి తన ప్రేమను ఉజ్జయినిలో నున్న చంద్రాపీడునకు నివేదించుసందేశము, వింధ్యాటవిలో వేటకు వచ్చిన శబరులు ఆ యా మృగముల పట్టులను వెదకికొనునప్పుడు చేసిన హెచ్చరికలు, అరచిన అరుపులు మహాశ్వేత కరుణరసభరితమైన తనగాథను చంద్రాపీడునకు పూసగ్రుచ్చినట్లు చెప్పినవైఖరి— ఒకటేమిటి మానవులు తమ జీవితమునంతటను ఏ యే భావములు పొందుదురో ఆ యా భావము లన్నింటికి బాణునిలో శబ్దచిత్రము లున్నవి. ఆ శబ్దచిత్రము లనువదించుట కనువైనవికావు. విమర్శించి చెప్పగలిగినంత చెప్పితిని. సంస్కృతమును స్పష్టముగా నుచ్చ రించగల చక్కని కంఠస్వరముగల పదవిభాగ మెరిగిన యెవడైనను ఆ వాక్యములను పైకి చదివినచో అందలి అనుస్యూతమైన నాదలక్షణము సహృదయుని హృదయవీణపైగల అన్ని భావతంత్రులను మ్రోగించును.

ఆ హృదయతంత్రీనాదమున సహృదయుడు పొందిన ఆనందమే కాదం బరీ కావ్యమును లోకమున విశిష్టగ్రంథముగా ప్రతిష్ఠించినది.

కథామాత్ర దృష్టులైన కొందరు పాశ్చాత్యవిమర్శకులు బాణుని శైలిని చీమలు కూడ దూరలేని చిట్టడవిగా పోల్చిచెప్పిరి.

"An Indian wood where progress is impossible through the undergrowth until the traveller cuts out a path for himself and where even then he is confronted by malicious wild beasts in the shape of unknown words to terrify him.''

అది దుర్గమమైన భారతదేశపు అడవి. అందులో అడుగు ముం దుకు సాగదు. ప్రవేశించుకొనదలచినవాడు తిన్నగా త్రోవ చేసికొన వలెను. ఎంత త్రోవ చేసికొన్నను అర్థము కాని మారుమూలపదము లనెడి ఘోరమృగాల బారినుండి తప్పించుకొని బయటపడుట అంతంత మాత్రపు పనిగాదు" అన్నారు.

సంస్కృతము రానివారికి బాణుడు కథ చెప్పలేదు. బాణుడు మూడువైపుల సముద్రము, ఒకవైపు మహోన్నతమైన హిమాలయము చుట్టియున్న భారతదేశములో పుట్టినవాడు. కవి యైన వాడు. పండి తుడు. వేదవేదాంగవేత్త. మధురశీలి. రససిద్ధుడు. తన జీవసంస్కారము నందు, నెత్తురులో, మాంసములో ఈ దేశపు సర్వలక్షణమును దేవ భాషలోని సమగ్రశక్తిని నింపుకొన్నవాడు. జాతితో దేశముతో తాదాత్మ్యముచెందినవాడు. "సముద్రఇవగాంభీర్యే ధైర్యేణ హిమ వానివ" అన్నట్లు ఈ దేశమును చుట్టియున్న సముద్రమువలె గంభీరుడు, హిమాలయమువలె సమున్నతుడు. అతని కావ్యమును తెలిసికొనుటకు ఆ శక్తితో సామగ్రితో ప్రయత్నించవలెను. అందుకు పూనుకొనినచో బాణుడు కొంచెమైనను నందుబాటులో నుండునేమో !

బాణుడింతగొప్పవాడే ! మరి యాతని కుమారు డీ గ్రంథము పూరించెగదా ! అతని వాగ్లక్షణము కూడ నిట్లే యుండునా ? అని

ప్రశ్నించినచో లోకమున భూషణబాణుడని పుళిందబాణుడని చెప్పబడు చున్న ఆ కుమారబాణుని గూర్చిన ప్రతిష్ఠ ఆతని శక్తికి తార్కాణమని చెప్పవచ్చును. ధనపాలుడు వ్రాసిన తిలకమంజరిలో పుళిందబాణుని ప్రశంస యిట్లున్నది.

> "కేవలోఽపి స్ఫురన్ బాణః కరోతి విమదాన్ కవీన్
> కిం పునః క్లుప్తసంధానః పుళిందకృతసన్నిధిః"

"వట్టిబాణమే కవుల మదములను దులిపివేయుచున్నది. ఇక పుళిందుని (బోయవాని) చే నెక్కుపెట్టబడి వదలబడిన బాణము సంగతి చెప్పవలెనా ?" పుళినభట్టబాణుడు ఉద్భటవైయాకరణకేసరియని ప్రశంసితుడైనవాడు. "శక్తిర్నిపుణతాలోకశాస్త్రకావ్యాద్యవేక్షణమ్ కావ్యజ్ఞ శిక్షయాభ్యాస ఇతి హేతుస్తదుద్భవే" అని మమ్మటుడని నట్లు పుళినభట్టునందు వివిధశాస్త్రపరిజ్ఞానము లోకస్వభావానుశీల నము సమృద్ధిగానున్నవి. జన్మచేతను సంస్కారముచేతను నాతడు కాదంబరీ రసజ్ఞుడు. కాదంబరీ ప్రణేతయునైనాడు. ఆలంకారికముగా నాతడు చెప్పినమాటయే గ్రహింతము.

> "గద్యేకృతేఽపి గురుణాతు తథాక్షరాణి
> యన్నిర్గతాని పితురేవ సమేఽనుభావః
> వీకప్లవామృత రసాస్పద చంద్రపాద
> సంపర్క ఏవ హి మృగాంక మణేర్ద్రవాయ."

"నాతండ్రి యెట్టి యక్షరములు పలికెనో అట్టి యక్షరములే నేనును పలుకుట అది నాతండ్రియొక్క ప్రభావము. చంద్రుని యమృతమయములైన కిరణములే చంద్రకాంతమణిని ద్రవింపజేయును. రాతివంటి నాలో ఈ ద్రవీభవనలక్షణము నా తండ్రినుండియే సంక్ర మించినది."

"నాగద్యము ఆయమున గద్యములో కలిసి గంగలో కలిసినసామాన్య ప్రవాహ మునకును గంగయొక్క లక్షణమే యబ్బినట్లైనది. ఆ నా వాక్ప్రవాహమును తండ్రి కావ్యములో కలిసి రసవంతమైనది" అని మరియొక శ్లోకమునన్నాడు.

అతడు యథార్థముగా నిచట చెప్పినదేమనగా— "నాతండ్రి గద్యమువంటిదే నాగద్యము. అందెన్ని లక్షణములు కలవో అన్ని లక్షణములు నాగద్యమునందు నేను భావించి కూర్చితిని." సహృదయులు ఆతని ఆత్మవిశ్వాసమును కావ్యమునందలి యథార్థలక్షణమును సమ్మతించిరి. ప్రశంసించిరి.

కాదంబరి పూర్వభాగమున చివరివాక్యము లివి—

"అతిప్రియోఽసీతి పౌనరుక్త్యం, తవాహం ప్రియాత్మేతి జడ ప్రశ్నః త్వయిగరీయాననురాగ ఇతి వేశ్యాలాపః....ప్రత్యాఖ్యాన శంకయా న సందిశామిత్య ప్రబుద్ధ ప్రబోధనమ్, జ్ఞాస్యసి మరణే ప్రీతి మిత్యసంభావ్యమేవ"-

ఇది బాణుని రచన. వెంటనే కుమారబాణుని రచన యిట్లున్నది. "అపిచేదాసి మానీతస్యాపి కుమారస్య న దదాతి తరలతాలజ్జితా లజ్జైవ దర్శనమ్ మనోభవ వికారవేదనా విలక్షణం వైలక్ష్యమేవ న పునస్తి ష్ఠతి" తండ్రికొడుకుల గద్యములు రెండును ఇట్లు కలిసికొన్నవి.

గద్యమునందు ప్రత్యక్షరశిల్పభావన చేయుట యది బాలునకే చెల్లినది. అతనికుమారుని రచనలో తండ్రియొక్క గద్యలక్షణము దీర్ఘ సమాసములచే విలక్షణములైన పదములచే గోచరింపవచ్చును. స్థూల దృష్టికి గద్యములు రెండును సమలక్షణములు కలవిగా ననిపించును. కాని అది వేఱు. ఇది వేఱు. ఎట్లు ? సూక్ష్మేక్షికతో చూచినచో భేదము గోచరించును.

వాక్యమునందు గుణాలంకారయుక్తమైన శబ్దార్థయోజనమే కావ్యమను దృష్టి యున్నప్పుడు శబ్దమునందట్టి శక్తిని గూర్చుటకే కవి సర్వయత్నమును జేయును. ఆ గుణాధానాది పరమ ప్రయోజనము రసవ్యంజకము కావలెనన్న దృష్టి యున్నప్పుడు వాని సంయోజనమున దీప్తి యుండును. ఆ శబ్దములచే చెప్పినభావములను శబ్దముల ధ్వనులు (sounds) భావముల కనుగుణములైన స్పందనమును సహృదయ హృదయముల కల్పించునపుడే అది రసభావవతి యగును. పుళింద బాణుడు తన గద్యమును అవయవలక్షణముచేత తండ్రి గద్యమును వలెనే తీర్చెను గాని జీవలక్షణమున తండ్రి సంస్కారము తండ్రిదే. కొడుకు సంస్కారము కొడుకుదే. ఆ గద్యములువట్టే. పోలికలు తండ్రివే. అచ్చు తండ్రివలెనే యుండును. అది యాకారముచేత. బాణుని గద్యము పుళిందబాణుని గద్యము కలిసి ఏక గంగాప్రవాహ మగుటలో నదియే రహస్యము.

ఎందరో సంస్కృతమున బాణునకు ముందున, తరువాతను గద్య కావ్యములు వ్రాసిరి. వారికి బాణునకు వచ్చినంత ప్రతిష్ఠ రాలేదు. వచ్చినను బాణునిముందు ఆగలేదు.

సుబంధుడు "ప్రత్యక్షర శ్లేషమయ ప్రపంచ విన్యాస వైదగ్ధ్య నిధి" యైన ప్రబంధమును వ్రాయుదునని వాసవదత్తా గద్యప్రబంధమును వ్రాసెను. తన ప్రతిజ్ఞను నూటికి నూరుపాళ్ళు నతడు నిర్వహించెను. ప్రత్యక్షరశ్లేష ఘటించుట యాతని పాండిత్య ప్రదర్శనమే. కవిత్వము వేరు పాండిత్యము వేరు. పాండిత్యము కవియొక్క విజ్ఞానకోశము. కవిత్వము ఆనందమయకోశము. విజ్ఞానము తనమెదడు పదునుజూపును. తన ఆశ్రితుల మెదడుకు పదునుబెట్టును. కవిత్వముచే తాను ఆనంద మును పొందును. తాను పొందిన యానందమును సహృదయులకం

దించును. కవి హృదయమునుండి సహృదయహృదయమునకుగల యను బంధమే కవిత్వము. ఆ హృదయసంవాది లక్షణమున్నచో పాండిత్యము యొక్క ప్రసక్తి లేకయే కావ్యము రసజ్ఞుల హృదయములో చిరప్రతిష్ఠ పొందును.

సుబంధుడు శబ్దశ్లేషను అర్థశ్లేషను ఎన్ని సొగసులతో ప్రదర్శించవలెనో అన్ని సొగసులతోను ప్రదర్శించెను. అది శ్లేషప్రదర్శనము. సుబంధునిపేరు పండితులలో నిలచినది. ఆతని శ్లేషలోని కవితా పరమార్థమును బాణుడు గ్రహించెను. సుబంధుని శ్లేష ప్రత్యక్షరమున నిలిచినది గాని కవితాధర్మము వ్యంజకతాలక్షణమందు మృగ్యము.

దండి దశకుమారచరితమును గద్యమున చెప్పెను. గద్యమును గూర్చిన యాతని భావన "ఓజః సమాసభూయస్త్వమేత ద్గద్యస్య జీవనమ్" అని. కవి చిత్తవృత్తి ఎటు ప్రసరించునో కావ్యము అటు పోవును. దండి లోకమున పొందిన ప్రతిష్ఠ పదలాలిత్యముతో సరి పోయినది. దండి గద్యమునందొక మహాలక్షణమును సాధించుటచే "దశకుమారచరితము" కథాజగత్తున నిలచినది. కాదంబరినుండి ప్రక్కకు వైదొలగినది.

బాణుని తరువాత వచ్చిన కవులు అతని శైలి ననుకరించుచు గద్యప్రబంధములు వ్రాసిరి. కాని వారాప్రయత్నమున కృతకృత్యులు కాలేదేమో ? వారిలో "తిలకమంజరి" వ్రాసిన ధనపాలుడు పేర్కొన దగినవాడని కొందరి ప్రశంస.

వాదీబసింహ ఓడ్డదేవుడు గద్యచింతామణి వ్రాసెను. అగస్త్యుని కృష్ణచరితము, శృంగారలాలుని చంద్రప్రభాచరితము, అంబికాదత్త వ్యాసుని శివరాజ విజయము, గద్యకావ్యములే. కాని యవి వాసవదత్త, దశకుమారచరిత, తిలకమంజరీ కావ్యములవలె లెక్కలోనికి రాలేదు.

వాసవదత్తా, దశకుమారచరిత, తిలకమంజరులైనను బాణుని కాదంబరిముందు నిలువజాలవు. సుబంధుడు, దండి అల్పశక్తిమంతులు కారు. అల్పకవులును కారు. కాని వారు బాణునివలె గద్యముయొక్క ప్రత్యక్షరమునందు మానవహృదయ స్పృశమైన జీవలక్షణమునందు దృష్టి నిలుపలేదు.

దండిలో కథ చాల పట్టుయినది. సమకాలీన జీవనప్రతిబింబమైనది. బహు కథలు బహు చిత్రములతో గుదిగుచ్చబడినవి. అచట కథావిషయగత చాతుర్యము పదలాలిత్యముతో ముడివడినది. ఇట్టి సూక్ష్మ సూక్ష్మ భేదములు కవులకు సాహిత్యమున వారి వారి స్థానములను వారికి కేటాయించినవి.

బాణుని కుమారుడు పుళింద బాణుడు తండ్రి చాటున నిలిచినాడు. తన రచనాప్రవాహమును కాదంబరీ రసమున గలిపినాడు. పూర్వార్థమునగల రుచిని పసికట్టినవారికి ఉత్తరార్ధమునందు రుచి కొంచెము పలుచబడినదని యనుకొనక తప్పదు.

పాండిత్యము విషయమున పుళిందబాణుడు వివిధ విజ్ఞానమును తన రచనలో ప్రదర్శించెను. కథాకథనములో తండ్రి పెట్టిన యొరవడినే యనుసరించెను. లోకమాతనికి ఋణపడియున్నది. కాదంబరియొక్క సమగ్రస్వరూపమునకు హేతువతడు. రసజ్ఞులకు గమ్యము చేరువరకు ప్రయాణమాగలేదు.

ఈ ప్రకరణమున బాణుని గద్యబంధమునగల అక్షరశిల్పమును సమీక్షించుటలో ప్రధానముగా వామనుడు చెప్పిన రీతిమార్గము ననుసరించి విశిష్ట పదరచనచే బాణుడు రసభావములను వ్యంజించిన విధము వివరించుట యైనది. ఇట్టి గద్యబంధము కవి ప్రతిభకు నికషమై సాహిత్యమున నతని వన్నెను తేల్చి పెట్టినది. బాణునినాటికి కావ్యమున రససిద్ధాంతము పరిష్కృతము కాలేదు. శబ్దార్థములకు గుణములకు

అలంకారములకు కావ్యమున ప్రముఖస్థాన ముదాహరింపబడినది. అట్టి స్థితిలో కావ్యప్రపంచమున రసవ్యంజకమైన స్వరవర్ణ పదవిన్యాసమును తన కాదంబరియందు లక్ష్యముగా కూర్చి పెట్టినవాడు బాణుడు.

యథార్థమునకు వామనుడు శబ్దగుణములకు, అర్థగుణములకు చెప్పిన లక్షణములన్నియు రసవ్యంజకతా ప్రధానముగా నిరూపించెను. అనేకవిధములైన వాక్యముల నిర్మాణమునకు వివిధములైన గుణము లెన్నియో చెప్పవచ్చును. దండి "అస్త్యనేకో గిరాం మార్గః సూక్ష్మభేదః పరస్పరమ్" అన్నాడు. ఇది రీతుల విభాగమును చేయుచు చెప్పెను. ఆధునికులైన యాలంకారికులును ఈ గుణరీతి విభాగమును రసధ్వని పరిపోషకమైనంతవరకు నంగీకరించిరి. ఓజః ప్రసాదమాధుర్యములు అను మూడే గుణములను, వైదర్భీగౌడీయ పాంచాలీ అను మూడే రీతులను ఆనందవర్ధనుడు లంగీకరించినను కవి కావ్యరచనలో ఎన్నికూర్పులు చేయునో అవి యన్నియు రసవ్యంజకతా సమర్థములైనచో కావ్య పరమార్థము నెరవేరినట్లే యనిరి.

"విచ్ఛిత్తి శోభినైకేన భూషణేనేవ కామినీ
పదద్యోత్యేన సుకవేర్ధ్వనినా భాతి భారతీ" [ధ్వన్యా-3-పరికరశ్లో.]

విచ్ఛిత్తివిశేష శోభాస్పదమైన ఒక చక్కని నగతో కాంత కెంత యందమొదవునో ధ్వనికి ఆస్పదమైన సత్కవియొక్క ఒక్క పదముచే సరస్వతి అంతగా ప్రకాశించును.

ఏయే వర్ణసంయోగము ఏరసమున కుపస్కారకమో ఏది భంగకరమో ఆనందవర్ధనుడు నిరూపించి చూపెను. ప్రధానముగా ఓజః ప్రసాదమాధుర్యములని చెప్పి రేగాని రసవ్యంజకతలో కవి ప్రతిభచే పెక్కు గుణములు చూపవచ్చును. అన్నియు నీమూడుగుణములలో నంతర్భవించునవియే. బాణుని గద్యబంధమునందలి వివిధ లక్షణములకు వామనుడు గుణ నిర్వచనములు చేసెనాయని తోచును.

బాణుని గద్యము నందలి విశిష్టత మరియు నున్నది. శబ్దము, అర్థము. వీనియందు గుణాధానము దోషవర్జనము,అలంకార యోజనము ఇవి యన్నియు లేనిది కావ్యము లేదు. ఇవియన్నియు నుండియు ఔచిత్యము, ధ్వని, రసము లేనిచో దానికి అస్తిత్వము లేదు. ధ్వని మతస్థాపనానంతరము కావ్యలక్షణమును చెప్పిన మమ్మటుడును "తదదోషౌ గుణౌ సాలంకారౌ శబ్దార్థౌ కావ్యమ్" (కావ్యప్రకాశము-ప్ర.ప్ర.)అనెను. ధ్వనియో రసమో గాలిలో లేదు. అది శబ్దములనుండియే వచ్చుచున్నది! ఎట్లువచ్చును ? అది కవిప్రతిభపై నున్నది. అందుచే కవి ప్రతిభను పద్యమునందుకంటె గద్యమునందు అధికముగా సమీక్షింపదగును. గద్యమునందు అక్షరము, పదము, వాక్యము నన్నియు కవి పోతపోసినవే. దానియందు కవి వ్యంజకతాసామగ్రిని ఎట్లు సమకూర్చెనని పరామర్శింతుము. అచట సర్వకావ్యమర్మము తెలియును.

సత్తుగిన్నెపై కొయ్యముక్కతో కొట్టినచో వచ్చిన సవ్వడికి, కంచుపైనుండి వచ్చినదానికి భేదము తెలియుచునే యుండును. సింహము కనపడలేదు. దాని గర్జనము వినబడినది. భయము దానియంతనది పుట్టును. అట్లే సముచితనాదము (Sound) శబ్దము (word) నుండి వచ్చినంతనే ఆశ్చర్యాదిభావములు ! శృంగారాది రసములు ధ్వనించవలెను. అంతయు సింహము ఆకారమే కదలదు. మెదలదు. చూచినవెంటనే సింహమే యనిపించినది. అప్పుడును భయము కలిగినది. ఆ భయము భ్రాంతిజనితము. వట్టి శబ్దముల గలబరింత నుండి యేదియోభావము ధ్వనించినట్లుండి యదికానిచో నచట శబ్దము రమణీయముకాదు.

పలువురు కావ్యములు వ్రాయుచుందురు. కొందరి కావ్యములే సహృదయుల నాకట్టుకొనును. దానికి కారణ మిదియే.

వట్టి శబ్దములతో విశిష్టపదరచనతో రసభావములను ధ్వనింప జేయు బాణుని వివిధగద్య విన్యాసము కాదంబరికి కావ్యజగత్తున విశిష్ట స్థానమును సమకూర్చినది. పదరచన బాహ్యాసంఘటనమే. సహృద యుని యాంతరంగికమైన చిత్తవృత్తి స్పందనమునకు హేతువగుచో అట్టి పదరచనా సంఘటనమున బాణుడు బాణుడే.

బాణము ధనుస్సున ఎక్కుపెట్టబడుట తోడనే లక్ష్యము భేదింపబడుట ధనుర్విద్యకు పరాకాష్ఠయైన ప్రయోజనము. కాదంబరీ కావ్యరసకోశమును భేదించుటకు బాణుడు గద్యము నట్టి బాణముగా చేసెను.

ధ్వన్యాచార్యుడు అలక్ష్యక్రమవ్యంగ్యము, అసమాసమధ్యమ సమాస దీర్ఘసమాసత్రివిధరూపమైన శబ్దసంఘటన నుండి యుదయించు చున్నదని నిరూపించెను.

"గుణానాశ్రిత్యతిష్ఠంతి మాధుర్యాదీన్వ్యనక్తి సా
రసాం స్తన్నియమే హేతురౌచిత్యం వక్తృవాచ్యయోః"

[ధ్వన్యా-3-6]

అంగియొక్క యర్థమును అవలంబించినవే గుణములు. అంగికి ఉపస్కారకములు కానివి గుణములుకావు. అలంకారాదులు అంగముల నాశ్రయించినవి. ఏగుణమైనను రసోన్ముఖమైనప్పుడే చారుత్వహేతు వగును.

బాణుని కాదంబరి రీతినాశ్రయించినదనుట ఈవిశిష్ట పదరచనను పురస్కరించుకొనియే.

కావ్యమున కాత్మ రీతియన్న వామనునిలో ధ్వనిసిద్ధాంతము అస్ఫుటస్ఫురితముగ నున్నదని ధ్వనికారు లంగీకరించిరి. అసలు విష యము కాదంబరిలో రసవ్యంజకమైన విశిష్ట పదరచన లక్ష్యముగాగొని

వామనుడు కావ్యాత్మను భావించి యుండునని యన్నచో సత్యమునకు దూరము కానేరము.

భరతముని "భారతీవృత్తి" "సాత్త్వతీవృత్తి" "కైశికీవృత్తి" "ఆరభటీవృత్తి" ఋగ్యజుస్సామాథర్వణ వేదములనుండి జనించినవని చెప్పెను. నాటకమునందలి యభినయమున వివిధరసభావముల ప్రతీతికి ఈ వృత్తులు తోడ్పడునని చెప్పెను. ఇవి సామాజికుల చిత్తవృత్తిని యథావసరముగా సమయసముచితముగా మార్పు నందించుచుండెనని గ్రహింపనగును. శబ్దార్థములనుండియే ఈ గుణవృత్తి రీతులు రసభావ వ్యంజకము లగుచున్నవి.

"తస్మాద్వాక్యతత్త్వవిదాంమతేన తావద్వ్యంజకత్వ లక్షణః శాబ్దో వ్యాపారో నవిరోధి ప్రత్యుత అనుగుణ ఏవలక్ష్య తే। పరినిశ్చిత నిరపభ్రంశ శబ్ద బ్రహ్మణాం విపశ్చితాం మతమాశ్రిత్యైవప్రవృత్తోఽయం ధ్వని వ్యవహారః" [ధ్వన్యా—3-443 పు] ధ్వని వ్యవహారము నేలవిడిచిన సాముకాదు. శబ్దములనుండియే తద్వివిధవ్యాపారాశ్రితమై జనించినది. దానికి మొదటితత్త్వము శబ్దముయొక్క కూర్పు. గద్యమునందుగాని, పద్యమునందుగాని, పదసంఘటనారూపమైన విలక్షణత లేనిదే కావ్యశరీరాంతర్గత ఆత్మకు ఆశ్రయమే లేదు. అట్టి యాశ్రయమును సకలశిల్పభూమిని చేసినందుననే బాణుని శైలి లోకమున కాదంబరీ సౌందర్యమును స్థాపించినది.



# బాణుని వర్ణచిత్రములు

"దృష్టపూర్వా అపి హ్యర్థాః కావ్యే రసపరిగ్రహాత్
సర్వే నవా ఇవాభాంతి మధుమాస ఇవ ద్రుమాః"

[ధ్వన్యా - చతు - 4]

ఆ వృక్షములను మనము నిత్యము చూచుచునే యుందుము. కాని అవియే వసంతఋతువునందు నేదో క్రొత్తవిగా కనిపించును. అట్లే మనకు నిత్యానుభవములోనున్న విషయములు కూడ కావ్యము నందు రసవంతములై నవ నవముగా కన్పట్టును.

# బాణుని వర్ణచిత్రములు

సాహిత్యజగత్తున కాదంబరీవర్ణనములు చెరిగిపోని వర్ణచిత్రములు. చిత్రకారుడు భావించిన దృశ్యమునకు రేఖలు గీయును. ఆ రేఖలయందు తనభావమును స్ఫురింపజేయును. వస్తుగతబహిస్సౌందర్యమును చిత్రకారుడు, శిల్పి తీర్చినంత నిపుణముగా కవి తీర్చలేడని అందురు. వస్తుగతాంతరమైన సౌందర్యమును కవి వర్ణించినంత మనోహరముగా చిత్రకారుడు స్ఫురింపజేయలేడనియు ప్రతీతి. కాని యీ రెంటియందును సమానమైన నైపుణ్యముండుటయే కవికైనను చిత్రకారునకైనను శిల్పికైనను పరమధన్యత.

ఒక తాటిచెట్టున్నది. గాలికి దాని ఆకులు కదలుచున్నవి. భూమిపై నది నిటారుగా స్తంభమువలె నిలిచియున్నది. ఒక దేవాలయ ధ్వజమును నట్లే యున్నది. కాని యీ తాటిచెట్టునందు సహజమైన యొక చైతన్యమున్నది. ఆ దేవాలయధ్వజమునందొక పవిత్రభావాలంబనమైన లక్షణమున్నది. చిత్రకారుడు గీసిన చిత్రమునందు తాటిచెట్టుయొక్క కదలికను వర్ణవిన్యాసము కొంత చూపవచ్చును. దేవాలయధ్వజమునందు మానవభావముచే పవిత్రత భావితమగునట్లు చిత్రింపవచ్చును. అప్పటికిని అవి బొమ్మలే. ఎంతనిపుణుడైన చిత్రకారుడైనను గాలికి కదలుచున్న తాటిచెట్టు ఆకులకదలికను చిత్రములో చూపగలుగునా? గాలికి చిత్రమూగవలసినదే గాని గీసిన గీతలు కదలవు. కనుక తాటిచెట్టుచిత్రము నందొకలక్షణము లోపింపక తప్పదు. కవివర్ణనలయందు గూడ నిట్టి విలక్షణతయే యున్నది. ఆ వస్తువును యెంతయో వర్ణించి పోల్చిచెప్పును. ఎన్నిమాటలలోనైనను ఆ ఆకారము మనకు బొమ్మవలె కంటికి ముందు నిలువదు. తన వర్ణనములు వస్తువులను బొమ్మలవలె చూపుటకు కవిచేయుప్రయత్నమంతయు ఉప

మానములపై నాధారపడి యుండును. శ్రవణేంద్రియముచే గ్రహింప బడిన శబ్దము మనసునందు దృగింద్రియవిషయమైన మూర్తిని కన్పింప జేసినచో నది కవియొక్క ధన్యత.

బాణుడు భారతదేశ స్వరూపమును, జీవలక్షణమును నట్టి ధన్యతతో తీర్చిదిద్దెనన్నచో అతిశయోక్తి కాదు.

బాణుని కథ దివ్యలోకమునుండి సిద్ధలోకమునుండి మానుష లోకమునుండి పరివ్యాప్తమైనకథ. ఈ త్రిలోకముల యందలి సర్వ రామణీయకతయు బాణుడు తన వర్ణనలో గుప్పించెను.

సంప్రదాయానుసారముగా కావ్యము నానావిధవర్ణనాబంధురమై యుండవలెను.

నగర శైల సముద్ర ఋతు చంద్రోదయ సూర్యోదయ ఉద్యాన జలక్రీడా మధుపాన రతోత్సవ విప్రలంభ వివాహ కుమారోదయ మంత్ర దూత్య ప్రయాణ యుద్ధ నాయకాభ్యుదయములు మహాకావ్యమున వర్ణింపబడవలెనని దండి చెప్పెను. ఆయన పదునెనిమిదిచెప్పగా అప్పకవి ఇరువదిరెండువర్ణనములుండవలెనని వానితోబాటు వేట, మున్యాశ్రమము, కన్యాంగ సౌందర్యము, దౌహృదము (గర్భవతి లక్షణము) కూడ వర్ణనలలో చేర్చెను. సాహిత్యదర్పణకారుడు కన్యాంగ సౌందర్య దౌహృదవర్ణనములు వదలి, స్వర్గ యాగ సంధ్యా రాత్రి ప్రదోష ధ్వాంత వాసర వర్ణనములు కూడ కావలెననెను. అటుజేసి యిటుజేసి ఈ యిరువదినాలుగు వర్ణనములు మహాకావ్యమున నుండ వలెనని తేలగా "అలంకారశేఖరము" ముప్పదిరెండువర్ణనములు కావలెనని యొకజాబితా నిచ్చెను. కావ్యాదర్శము చెప్పిన కుమారోదయ, మంత్ర, దూత్యవర్ణనములు, అప్పకవి చెప్పిన కన్యాంగసౌందర్య, దౌహృదవర్ణనములు మినహాయించి, తక్కిన వర్ణనములతోబాటు, రాజ, రాజ్ఞీ, దేశ, గ్రామ, నదీ, సరో, వన, హయ, గజ, స్వయంవర,

పుష్పాపచయ, కళా, వయస్సంధి, ధాతు వర్ణనములు కలిపి మొత్తము ముప్పదిరెండు చెప్పెను.

బాణుడు తన కథయందు ఈ వర్ణనముల నన్నింటినే కాదు మరి వందలకొలది వర్ణనలు చేసెను. ఆలంకారికులు మానవమనోభావములను గూర్చిన వర్ణనలను రసపోషయుక్తములుగా కవి యెట్లును వర్ణింపకతప్పదని విడిగాచెప్పలేదు గాని కావ్యమున కవియొక్క ప్రతిభా ప్రవాహమున లోకమునందలి సమస్తసుందరప్రకృతియు రసమయాకృతులతో సాక్షాత్కరించుచునే యుండును.

బాణుడు మువ్వురు రాజులను వర్ణించెను. మువ్వురు మునికుమారులను వర్ణించెను. మువ్వురు కన్యలను వర్ణించెను. మూడు నదులను, రెండు సరోవరములను, రెండు అడవులను, వర్ణించెను. రాజకుమారోదయవర్ణనము, దేవతాయతనవర్ణనము, మువ్వురమునుల యాశ్రమముల వర్ణనము చేసెను. మూడుపురవర్ణనములను, ఒక హయరత్న వర్ణనమును చేసెను.

ఇవి యివి యననేల జీవితమున ప్రతియంశము బాణునికవితా దృష్టికి ఆలంబనమైనది. ఆయనదృష్టి మూడులోకములందు ప్రసరించినది. దివ్యలోకమున, సిద్ధలోకమున, మర్త్యలోకమున. దివిలో అమరావతి– నందనోద్యానము– ఆకాశగంగ– శ్వేతకేతువు– లక్ష్మి అచటి ప్రకృతి వారిభావములు నున్నవి, ఆకారము లున్నవి.

కైలాసగిరివద్ద: చైత్రరథోద్యానము– అచ్ఛోదసరస్సు– మహాశ్వేత– శివాలయము– హేమకూటనగరము– గంధర్వరాజులు– వారి రాణులు– వారికన్యలు– వారిమణిమందిరములు– హిమగృహములు– ప్రాసాదములు– అన్నియు– అదియొకలోకము.

భువిలో : ఉజ్జయిని- మహాకాలనాథాలయము - శిప్రానది- మహాకాలుడు (శివుడు)- తారాపీడమహారాజు- విలాసవతి- చంద్రాపీడుడు- వైశంపాయనుడు- శుకనాసుడు- ఇది ఒక కూటమి-

విదిశాపట్టణము- శూద్రకమహారాజు- చిలుక - చండాలకన్యక పంపాసరోవరము - జాబాలిఆశ్రమము - జాబాలిముని- హారీతుడు- వింధ్యాటవి- ఇదిమరొక కూటమి.

అతని కథానిర్మాణశిల్పమున ఈ వర్ణనల పోహళింపులో నొక సౌష్టవమున్నది.

ఒకరాజు అతనిరాజధాని అతనిఅంతఃపురము అతనిఉద్యానవనము అతనిరాజ్యము, అందు అడవులు నదులు తటాకములు, మునులు, వారిఆశ్రమములు మొదలగునవి ఇదియంతయు ఒకగుచ్ఛము. ఇటువంటివి మూడుగుచ్ఛములున్నవి. ఒక మూడంతస్తులమేడయున్నది. వానిలోని గదులు, ప్రతిఅంతస్తులక్షణము పైకి ఒకేరీతిగానున్నట్లు కన్పించును. లోన యే అంతిస్తున కా అంతస్తునప్రత్యేకమైన శిల్పముండును. ఈ రీతిగా కాదంబరిలో శూద్రకమహారాజు తారాపీడమహారాజు, చిత్రరథుడను గంధర్వరాజు, ముగ్వురు మూడు పరిధులలో నున్నారు. అన్నిటిలో సమానలక్షణములున్నవి. ప్రత్యేకలక్షణము లున్నవి. కథ యీ మూడు లోకములు లేక అంతస్తులందు వర్ణింపబడిన అంశముల నుండి ప్రసన్నమగును. ఈ మహాప్రాసాదమున ప్రవేశించుటకు మెట్లు ఎక్కడనున్నవో! అవి కనుగొన్నచో అంతయు విహారయోగ్యము.

రాజమందిరము ప్రవేశింతుము- అందు అనేకలక్షణము లుండును. "ప్రథమవేశ్యాసమాగమమివ అవిదితహృదయాభిప్రాయచేష్టావికారము" "గాంధికభవనమివ స్నానధూపవిలేపన వర్ణకోజ్జ్వలము" "తాంబూలిక భవనమివ కృతలవలీలవంగైలాకక్కోలపత్రసంచయము"

రాజభవనములోని నాగరకలక్షణము, రాగశైఖరి అట్లుండును. ఎంత విశాలముగ భగవంతుడు ఈశానుడు బారలు చాచి నిలిచినట్లున్నను ఆ భవనమునందు భోగలక్షణము కన్పించును— "ఈశానబాహువనమివ మహాభోగిమండల సహస్రాధిష్ఠితప్రకోష్ఠము." ఈశ్వరుని బాహువులందు మహాభోగులు (సర్పరాజములు) రాజుయొక్క భవన ప్రాంగణములందు మహాభోగులు (విలాసవంతులు). పురాణగోష్ఠులుండును. వ్యాకరణలక్షణము లుండును. ఒక మహాసముద్రమువలె నుండును. వేనితో పోలికలున్నను రాజభవనము నందలి రాగలక్షణమే కవి ధ్వనింపజేయును.

ఒక మునియాశ్రమమును ప్రవేశింతుము. అచట కూడ పురాణ గోష్ఠులు, మహాసముద్రలక్షణములు, భగవంతుని స్వరూపము లన్నియు కన్పించును. అచట శాంతభావమే హృదయమును స్పృశించును. "అర్ధపక్వపురోడాశపుణ్యపరిమళము" ఘ్రాణేంద్రియమును సోకును. "అవచ్ఛిన్నాజ్యధారాహుతిహుతభుక్ఛుంకారము" వినిపించును. "ఏణీజిహ్వోపలిహ్యమాన మునిబాలకులు" కన్పింతురు. "ఆగృహీత సమిత్కుశ కుసుమమృద్భిః అధ్యయనముఖరశిష్యానుగతైః సర్వతః ప్రవిశద్భిః మునిభిరశూన్యోపకంఠము" గానున్న ఆశ్రమమే కన్పించును. సమిధలు, దర్భలు, పూలు, మృత్తికలు తీసికొని వేదము వల్లించుచు శిష్యులు వెంటరాగా మునులు సరోవరములనుండి స్నానాదులు చేసి తిరిగి వచ్చుచున్న దృశ్యములే కన్పించును. అక్కడ నలుపు లేదు; ఉన్నచో హవిర్ధూమములందే. మొగమెఱ్ఱజేసికొన్న వారెవరునుండరు, ఉన్నచో చిలుకల మొగములే ఎఱ్ఱగా నుండును. అచట తీక్ష్ణత యుండదు. ఉన్నచో దర్భలకొనలయందే! ఈ దృశ్యములను లక్షణములను బాణుడు మనోహరమైన గద్యములో చిత్రించును.

"యత్ర చ మలినతా హావిర్ధూమేషు న చరితేషు, ముఖరాగః శుకేషు న కోపేషు, తీక్ష్ణతా కుశాగ్రేషు న స్వభావేషు" "చంచలతా కదలీదళేషు న మనస్సు" చంచలత అరటియాకులందే మనస్సులందు కాదు.

మరి అంతఃపురములకు బోవుదుము. అచట రాజస్త్రీసౌందర్య ప్రవాహము వర్ణనలలో పొంగులెత్తును. ఆ కన్యాంతఃపురములలో పురుషస్పర్శయుండదు. కాని అంతటి స్త్రీసౌందర్యమునకు పురుషసం యోగము లేనిదే రామణీయకత యుండదు. బాణుడు ఆ చిత్రములను విచిత్రవర్ణవిన్యాసముతో చూపును. "ఉచితవ్యాపారవ్యపదేశేన కుమారికాణాం సఖీహస్తావలంబేషు పాణిగ్రహణాని, వేణువాద్యేషు చుంబనవ్యతికరాః, వీణాసు కరరుహవ్యాపారమ్, కందుకక్రీడాసు కరతలప్రహారాన్... తాంబూలీవీటికావఖండనేషు దశనోపచారాన్, ఉపహారకుసుమస్థలనేషు సీత్కారాన్, అతిరిక్తం సురతమివాభ్యస్యంతీ నామపశ్యత్"—

కన్యలొకరిచేయి ఒకరు పట్టుకొని నడచుటే పాణిగ్రహణము, మురళివాయించుటయుందే చుంబనవ్యాపారము; గోటితో వీణమీటుటయే నఖక్షతములు చేయుచున్నట్లు; బంతిని కొట్టి ఆడుటే ప్రియునిపై చపేటములు చరచుచున్నట్లు, తాంబూలము కొరుకుటయే దంతక్షతములు చేయువిలాసము— వారిని చూడగా సురతక్రీడాభ్యాసము చేయుచున్నట్లున్నారు. ఈ సాపహ్నవక్రియోత్ప్రేక్షలు శృంగారరస వీక్షలు.

వారికి చెక్కిళ్ళ కాంతిచేతనే ముఖప్రక్షాళనము; కన్నులే చెవులలోని కలువలు (అనగా చెవిదాక విస్తరించిన కనులు చెవులలో విలాసమునకు పెట్టుకొను కలువలవలె కమలములవలె సహజమైన ఆభరణములు) హసితచ్ఛవయ ఏవ అంగరాగాః (వారినవ్వులకాంతులే మైపూతలు) ఆలాపా ఏవ తంత్రీనాదాః (వారిపలుకులే వీణాతంత్రులమ్రోతలు)

వారి చరణాలక్తకరసవిసరమే రాగసాగరాయమానముగా నున్నది.

ఒక దేవాలయమును ప్రవేశింతుము. ఆ ఆలయపరిసరముల నుండియు భక్తిభావములే. పూజార్థప్రచోదనమే.

కైలాసగిరి ప్రాంతములోని అచ్ఛోదసరోవరతీర మెట్లున్నది?

"శిలాశకల కర్కశవాలుకాప్రాయం విద్యాధరోద్ధృతసనాల కుముదకలాపార్చితానేకచారుసైకతలింగమ్"

విద్యాధరులు కాడలతో కలువలుకోసి తెచ్చి పూజించిన అనేక సైకత (ఇసుక) లింగములున్న తీరమది.

"అరుంధతీ దత్తదినకరార్ఘ్య పయఃపర్యస్త రక్తకమలశోభితమ్" అరుంధతీదేవి అచట ఎఱ్ఱతామరలతో సూర్యునకు అర్ఘ్యమిచ్చి వెళ్ళినది.

"అతి ప్రమాణ పాదానుమీయమాన తృషిత కాత్యాయినీ సింహావతరణమార్గమ్"— సింహపుకాలిగుర్తులు చాల పెద్దవి కన్పించు చున్నవి. అంతటి సింహము అమ్మవారివాహనమే యై యుండును. ఈ కొలనిలో దప్పిక తీర్చుకొనుటకు వచ్చియుండును.

నాయికానాయకుల సౌందర్యములు, మనోభావములు మున్నగు రమణీయములైన వెన్నియో బాణుని మనోహరవర్ణనములలో గోచరించును. రసమునుగూర్చి చర్చించునపుడు విపులముగా పరామర్శించ వలసిన విషయములనిట తడవుట ఏలయని ఆ వర్ణనములు ప్రస్తుత ముదాహరించుట లేదు.

బాణునిదృష్టిలో పడనిది లేదుగదా. ఉత్సవముల సమయము లలో రాజభవనములలో కిటకిటలో ఆభరణములు రాచుకొని రాలిన బంగారు పొడి యొక్క తళతళను కూడ నాతడు వర్ణించెను. బుజములు

రాచుకొనగా అంగదముల (భుజకీర్తుల) అంచులకు తగుల్కొని చిని
గిన రాజపురుషుల ఉత్తరీయములను; చెమటకు తడిసితుడిచిపెట్టబడిన
అంగరాగముల (మైపూతల)చే ఎఱుపురంగు పట్టిన వారిసిల్కు (Silk)
బట్టలను కూడ బాణుడు రాజభవనముల సంరంభమును కోలాహల
మును వర్ణించుటలో విస్మరించలేదు. అతనికన్ను ఒక సంచార ఛాయా
గ్రాహకము. Moving Camera.

కాదంబరీమహాకావ్యమునందన్నియు నిట్టి మనోహరవర్ణచిత్ర
ములే. ఇక ఆ వర్ణనలలో బాణుని శిల్పవైభవము భావించుటకు
యత్నింతము.

కాదంబరీకావ్యమును తెరువగనే శూద్రకమహారాజ వర్ణనము
వచ్చును. నిజమునకితడు కథానాయకుడు కాడు. "రాజవర్ణనమాదౌ
స్యాన్నగరీవర్ణనం తతః" అను లక్షణముననుసరించి మొదట రాజవర్ణన
ముతో కావ్యారంభము చేసెను. సరే! కథానాయకుడెవరు? చంద్రా
పీడుడు. ఆతని వర్ణనతోలుత లేదు. నాయకుని దర్శనముకాకుండ కావ్య
మున అన్యులను దర్శించుట న్యాయమా? కాని ఇచట మొదట శూద్ర
కుడే కనిపించెను. బాణుడిచట గొప్ప ఔచిత్యమును పాటించెనని
చెప్పవలెను. వర్తమానకాలము, భూతకాలము, భవిష్యత్కాలము
నున్నవి.

ఇప్పటివిషయమును మాత్రమే మనము చూడగలము. వెనుక
జన్మలవిషయము, ముందుజన్మలవిషయము తరువాత నుండును. కథా
నాయకుడెవడన్నది తరువాత తేలును. కవి కథ యెట్లు మొదలుపెట్టిన
యట్లే మనము వినుచుందుము. ఈ రాజును గూర్చి చెప్పును. ఈతని
గుణములు తెలిసికొందుము. వర్ణనలో కవి కథాంశములు నిగూఢ
ముగా నుంచునని కథ జాగ్రత్తగా వినువాడు గ్రహించును. ఆ కనిపించు
రాజునందు అతని హృదయ సంస్కారము జననాంతరములైన వాస

నలు స్ఫురించవచ్చును. ఈ స్ఫురణ కవి వర్ణనలో వాడిన శబ్దములను బట్టి యుండును. బాణుడు కథ యందలి పాత్రలోని అంతర్లక్షణమును ధ్వనింపజేయు పదములు కూర్చును.

శూద్రకుడు – "అశేషనరపతి శిరస్సమభ్యర్చిత శాసనుడు" రెండవ యింద్రునివంటివాడు. ఈతని మనసులో ధర్మము, కోపమున యముడు, అనుగ్రహమున కుబేరుడు, ప్రతాపమున అగ్ని......తేజమున సూర్యుడు...ఇట్లందరు దేవతలు ఈతనిలో కన్పింతురు. ఇట్టి సర్వదేవమయమైన ఆకృతితో విశ్వరూపమును ప్రదర్శించిన విరాట్స్వరూపుడగు నారాయణమూర్తిగా నున్నాడితడు. ఇట్టి రాజుండగా కథానాయకుడు మరియెవడుండును? సహృదయుడు ఈ రాజవర్ణనమును ఆసక్తుడై వినును. "ఆదర్శః సర్వశాస్త్రాణాం, ఆహర్తా క్రతూనాం; ఉత్పత్తిః కలనాం" – సర్వశాస్త్రములకు అద్దము, క్రతువులు చేయును. కళలకు పుట్టిల్లు. ఇది ఉల్లేఖాలంకారము వలె పైకి కన్పించును. యథార్థమునకు ఈతడే వెనుకజన్మలో చంద్రాపీడుడని, చంద్రుని యవతారమని కథ కొంత సాగిన తరువాత తెలియును. అప్పుడు ఈ వర్ణనలోని విశేషమును భావింతుము. "ఉత్పత్తిః కలానాం" "రవిరివ ప్రతిదివసోపజాయమానోదయః" ఇవి లౌకికముగా చూచినచో అలంకారములు. కాని యీతనిలోని జీవలక్షణముచే నివి స్వభావోక్తులు. సూర్యునివలె ప్రతిదినము ఉదయించుట కలవాడు. ఆలంకారికముగా నితని అనుదినాభ్యుదయ లక్షణమునకు సూర్యునితో పూర్ణోపమ చెప్పబడినది. కాని అభ్యుదయపదము వాడక యిచట ఉదయ శబ్దము మాత్రము వాడుటచే సూర్యునివలె ప్రతిదినము నుదయించువాడైన చంద్రుడని తోచును. అది జీవలక్షణముచే యథార్థము. తన వర్ణనములో బాణుడు జీవులను సృష్టించిన బ్రహ్మవలె సాముద్రిక లక్షణములను రేఖాప్రాయముగా తీర్చియే యుండును. ఆ రేఖల

తత్త్వము తెలిసినవారు లోపలి గుట్టును తెలిసికొందురు. "హర ఇవ జితమన్మథః" శివునివలె మన్మథుని జయించినవాడు. అంతేకాదు - "సురత సుఖస్యోపరి ద్వేష ఇవాసీత్" "వనితా సంభోగ సుఖ పరాఙ్ముఖః" స్త్రీ సంభోగ సుఖవిముఖుడై యున్నాడు. ఇది తరువాతి కథలో చాల ముఖ్యమైన విషయము. ప్రస్తుత మీతడు సంసారమున తగులొక్కని పద్మపత్రముపై నీటి బిందువువలెనుండు మానసయోగి. ఈతని తండ్రి యెవరో తల్లి యెవరో చెప్పడు కవి. విదిశాపట్టణ ప్రభువుగా మాత్రమే వర్ణించి చెప్పెను. ఆకాశమునుండి యూడి పడెనా? అది అంతయు నీతనియందు సంసారమున తగులొక్కని లక్షణమును ధ్వనింపజేయుటకు. మిగిలిన గుణములన్నియు వర్ణించెను. అవి యెట్టివి? సర్వరసములకు ఆస్పదుడైన వాని గుణములు. ముఖ్యముగా శృంగారరసమునకు ఆలంబనమే. కానియీతనినాయిక ఎక్కడనున్నది? ఆ నాయికావిరహమున నున్న యీతనియందు తదన్యస్త్రీ పరాఙ్ముఖత్వమున్నది. తదితరస్త్రీ సురత సంభోగ సుఖవైముఖ్యమున్నది. ఈతని యీలక్షణము ఈతనియందలి శృంగారరసాలంబనత్వమునకు పరిపుష్టి గూర్చునది. "న వినా విప్రలంభేన శృంగారః పుష్టిమశ్నుతే" అని కదా ఆలంకారికుల ప్రమాణము.

శూద్రకజన్మలో నాతనిలోని జీవుడు జననాంతర సౌహృదములను అబోధపూర్వముగా స్మరించుచున్నాడు. ఈ వర్ణనలో మనకు రెండు రూపములు కన్పించును. ఒకటి శూద్రకుని బహిః ప్రవృత్తి. రెండవది ఆతని జీవుని జన్మాంతరప్రవృత్తి. రెండవది అస్ఫుటము. మొదటిది స్ఫుటము. ఆతడు రూపవంతుడు, యువకుడు, మహాసత్త్వుడు. అతి విజిగీషువు- ఈ లక్షణములు కలవానికి స్త్రైణము తృణప్రాయము. కవి యిట్లు సమర్థించెను. ఎందుకాతడిట్లుండెనో అతని వెనుకజన్మ కథలో తెలియును. కథారహస్యము నిట్లు వర్ణనలయందు నిక్షేపించుటచే

కాదంబరిలోని వర్ణనలు కథయొక్క ప్రాణములకు ఉనికిపట్లుగానున్నవి. అందుచే ఈ వర్ణనలు కథకు భారములుకావు. అవరోధములు కావు.

ఉజ్జయినీ రాజు తారాపీడు డున్నాడు. అతనివర్ణన మున్నది. అచట రాజవర్ణనము కంటె ముందు రాజధానీవర్ణనమున్నది. ఉజ్జయినీ కథాంశము లను బట్టి అచట ఉజ్జయినికే ప్రాముఖ్యము. చంద్రుని యవతారమైన చంద్రాపీడజన్మలో నది మూలాధారము. అది తరువాత విచారింతము. తారాపీడ మహారాజవర్ణనము చూతము. ఏరాజు నందైనను సూర్యతేజము, అగ్నిప్రతాపము, బుద్ధియందు బృహస్పతి లక్షణము, కోపమున యముడుగా నుండుట సమానములే. కాని బాణుడట్లు వర్ణించడు. శూద్రకుని "ఆదర్శః సర్వశాస్త్రాణాం" అని చెప్పెను. తారాపీడునిగూర్చి "నీతిశాస్త్రాఖిన్నబుద్ధిః" అనును. "అధీత ధర్మశాస్త్రః" అనును. "ఉత్పత్తిః కలానాం" "రవిరివప్రతి దివసోప జాయమానోదయః" అని తారాపీడునిగూర్చి అనడు. "తృతీయ ఇవ తేజసా కాంత్యా చ సూర్యాచంద్రమసోః" అనును. "సుధా సూతేరివ జలనిధి రుద్భవోయశసః" చంద్రుని పుట్టుకకు సముద్రుడు కారణమైనట్లు కీర్తి యీతనివలన పుట్టుచున్నదనును. ఇచట "నావిష్ణుః పృథివీపతిః" అను సంప్రదాయము ననుసరించి విష్ణుత్వ లక్షణమునకు పోలికలు చెప్పను. సమస్తరాజులు నితనికి సామంతులైరి. ఎచ్చెచ్చటిరాజులు ఈతనికి సామంతులైనారో వారి యుత్కర్షను చెప్పి తారాపీడుని చక్రవర్తిత్వమును ప్రకటించును. ఆ సామంతరాజులను గూర్చిన వర్ణన యంతయు ఓజోగుణవిశిష్టమైన, ఉత్కలికాప్రాయమైన, అతిశయోక్త్యలంకార శోభితమైన యొక విలక్షణమైన రచనతో చేయును. ఈ వర్ణనలలో ఒకరాజునకు మరియొకరాజునకు గల స్వరూప స్వభావములలోని వైలక్షణ్యమును ధ్వనింపజేయును. బాణుని వర్ణనము

లను ఈ దృష్టితో ననుసంధించుకొనుచు పోయినచో కథాకథనమున బాణుని చాతుర్యము తెలియును.

ఇక బాణుని అద్భుతమైన భావుకతకు నిదర్శనములైన కొన్ని వర్ణనములు చూతము.

అచ్ఛోద సరోవర్ణనమున్నది. ఆ సరోవరము యొక్క ప్రసక్తి యెట్లు వచ్చెను? కథానాయకుడైన చంద్రాపీడుడు కిన్నెర మిథునమును పట్టుకొనవలెనన్న ఆరాటములో తనయశ్వముపై యేబది యోజనముల దూరము ఎక్కడను మజిలీ చేయక పోయి అలసి సొలసి నీటికొరకై యన్వేషించుచుండగా ఈ యచ్ఛోద సరోవర మతని కంట బడినది. ఎక్కడనైన గ్రుక్కెడునీళ్ళు దొరికినను తృప్తిపడు స్థితిలోనికి వచ్చెను. గ్రుక్కెడు నీళ్ళుకాదు. ఒక మహాసరోవరమే కన్పించెను.

బాణుని రూపచిత్రనిర్మాణకౌశలమును చూడవలెనన్నచో ఈ అచ్ఛోదసరోవరవర్ణనమును మనము భావించవలెను. చుట్టును చెట్లున్నవి. మధ్యసరోవరమున్నది. "త్రిలోకసుందరికి మణిదర్పణము వలె నున్నది. భూదేవి యొక్కస్ఫటికసౌధమువలె నున్నది. సముద్రములన్నియు దీనినుండియే వచ్చెనన్నట్లున్నది. దిక్కులన్నియు కరిగియున్నట్లున్నది. ఆకాశము జలాకారముగా నవతరించెనా? కైలాసగిరి ద్రవించి యీ రూపము పొందెనో! మంచుకొండ కరగి యిట్లయ్యెనో! వెన్నెలయొక్క రసస్వరూపమిదియేమో! పకపకానవ్విన శివునినవ్వు ఈ తెల్లని నీరైనదో! ముల్లోకముల పుణ్యములు సరోరూపమున మూర్తి కట్టినవో! వైడూర్యమణుల కొండల గుంపు సలిలాకారముగా మారెనో! శరత్కాలపు మేఘమాల కరగి నీరై ఒకచో గుమిగూడెనో! వరుణుని అద్దాలమేడయో! మునిజనమానసములు సజ్జనుల గుణములు కాంతల కన్నుల తళతళలు. ముత్యాలకాంతులు కలబోసి నిర్మింపబడినదా! నీటితో నిండియు తేటగా లోపలి విషయమంతయు స్పష్టముగా గోచ

రించుచుండుటచే అసలు నీరున్నట్లే యనిపించనిదిగా నున్నదా సరో వరము. వర్ణనమింకను నున్నది. ఇప్పుడు మనకు (1) సరోవరము యొక్క ఆకారము కనిపించుచున్నది. అందలి జలమెంత స్వచ్ఛముగా నున్నదియో ఆ యుపమానములు చెప్పుచున్నవి. అవి యుత్ప్రేక్షలుగా అలంకారశాస్త్రము రీత్యా చెప్పవలెను. సరోవరమును జూచిన కథా నాయకునకు ఆ సరోవరతత్త్వము తెలిసికొను వాసనాబలమున్నది. అతడు చంద్రుని యవతారము. శాపముచే చంద్రాపీడుడైనాడు. చం ద్రుడు పాలసముద్రమును చిలికిననాడు పుట్టిన సృష్ట్యాది తత్త్వము. ఆతని పుట్టినిల్లు జలాశయము. అమ్మ పుట్టినిల్లు మేనమామ దగ్గర పోగిడినట్లు చంద్రునకి సరోవరశోభ నెవరు చెప్పవలెను? అతడే భావించ గలడు. అతడు భావించినచో నతనికి జలాశయ మెట్లు కన్పించును? అచ్ఛముగా చంద్రుడే యైనచో ఆ చంద్రుడే సరోవరము. సరోవరమే చంద్రుడు. చూచుచున్నది అచ్ఛముగా చంద్రుడుకాడు. జీవ సం స్కారమున చంద్రత్వమున్నది. దాని కుపాధిగా చంద్రాపీడుడన్న శరీ రపు తొడుగు ఉన్నది. ఈ శరీరధారియైన జీవునియందు రమణీయమైన సరోవరదర్శనముచే నాతని కబోధపూర్వముగా తన స్వస్వరూపస్మృతి లీలగా కలిగినది. ఆ సంస్కారలక్షణముచే భావించినప్పుడు సరోవర మట్లు కన్పించినది. దృగింద్రియముచే తన మనఃఫలకమున సరోవరము యొక్క నిజతత్త్వము జీవునిలో ప్రతిఫలించినది. ఇచట కూడ నాంతర మైన ప్రవృత్తి చంద్రుని ప్రవృత్తి. బాహిరమైన ప్రవృత్తి చంద్రాపీడుని యనుభూతి. ఈ యనుభూతి కిది యుత్ప్రేక్షాలంకారము. ఆ అంతర మైన ప్రవృత్తి కది యుపమానప్రాయము.

ఒక జీవుని మూడుజన్మల కథలు చెప్పు కవి ఈ బహిరంతః ప్రవృత్తుల ధ్వనింపజేయు సూక్ష్మములైన భేదములను వర్ణనలో నిరూ పించనిచో కథాసంవిధానౌచిత్యము ఉండదు. ఆ యౌచిత్యము లేనిచో

నీ వర్ణనము కేవలము నొక బొమ్మ. కాని యిది బొమ్మ కాదు. ఒక జీవచైతన్య లక్షణ లక్షితమైన మనోహర సరోవరము.

ఆ సరోవరమింకను నెట్లున్నది?

"గాలికి రేగిన యలలు చిందిన నీటితుంపురులందు సూర్యకిరణములు ప్రసరించుటచే వన్నెలు వన్నెలుగా నున్న కొన్నివేల యింద్ర చాపములు ఆ సరోవరము చుట్టును దాని సంరక్షణకై నిలిచినట్లున్నవి." సూర్యుని కిరణములు నీటిగుండా పోవునప్పుడు శాస్త్రజ్ఞులు చెప్పు లక్షణముచే కాంతివిశ్లేషణము జరుగును. Dispersion of Light అందురు. దానివలననే ఇంద్రధనుస్సులోని వన్నెలు ఏర్పడుచున్నవని నేటి సైన్సు చెప్పుచున్నది. కవిభావనలో ఇది యుత్ప్రేక్షకాగా ప్రకృతిలోనిది సహజతత్త్వమైనది.

బాణుని వర్ణనములలో ఇంత సూక్ష్మమైన ప్రకృతి పరిశీలనము స్పష్టపడును. మరల వర్ణనము కథానుబంధియై యుండును. ఆ సరోవరమునే యింకొకరీతిగా వర్ణించినాడు.

"ప్రతిమానిభే నాంతః ప్రవిష్ట సకానన శైల నక్షత్ర గ్రహచక్ర వాలం త్రిభువన ముద్భిన్న పంకజేనోదరేణ నారాయణ మివ బిభ్రాణం" తనలో ప్రతిబింబరూపమున ప్రవేశించిన అడవులతో పర్వతములతో నక్షత్ర గ్రహచక్రవాలముతో ముల్లోకములు ఆవిర్భవించిన నాభి కమలము గల శ్రీమన్నారాయణుడు తనయందు శయనించినట్లున్నది.

కాదంబరీ కథాతత్త్వమునుగూర్చి ప్రసంగించుటలో పుండరీకుని జన్మ ప్రకారము అచ్ఛోద సరోవర లక్షణము పరామర్శింప బడినవి. ఈ వివరణము కూడ దానితో జతచేసి భావించుదము. ముల్లోకములు నారాయణుని నాభికమలము నుండి పుట్టినవే! కాదంబరీ కథ కంతకు మూలము అచ్ఛోద సరోవరము చెంత పుండరీకుడు చేరినప్పుడు ఏర్ప

డివది. అదియే బీజమైనది. అచటనుండియే మూడులోకముల మూడు జన్మలకథ ఉద్భిన్నమైనది. ఈ కథ యున్న నారాయణమూర్తికి అచ్ఛోద సరోవరమాధారమైనది. ఆ నారాయణమూర్తి – కథ – కేంద్రమునందు – పాత్ర – పుండరీకుడున్నాడు. వారినుండి మహాశ్వేత చంద్రుడు కపింజలుడు చంద్రాపీడుడు తారాపీడుడు శూద్రకుడు ఈ అనుబంధమంతయు సమకూడినది.

చంద్రాపీడుడు సరోవరమును చూచినప్పుడు దీనియందాతని భావమట్లుదయించుట లేదా ఆ రూపమున నున్న సరోవరము నాతడు చూచెనని కవి చెప్పుట కథాతత్త్వానుశీలనమున మనోహరముగా నుండును. కథకు వర్ణనములకు ఈ విడివడని లక్షణములు ముడిపెట్టుట బాణుని వర్ణనములన్నింటిలోను మనకు గోచరించుచునే యుండును.

అచ్ఛోద సరోవరమునే యిట్లు వర్ణించెను. వింధ్యాటవిలోని పంపాసరోవరము నిట్లు వర్ణించడే! అచటి వర్ణనమునందు కథ జతపడవలెను. అది కథానుగుణముగా నచటి పాత్రల భావనానుగుణముగా నుండును.

అచ్ఛోదసరోవరము వద్దనున్న స్వచ్ఛత దివ్యతదీప్తి పంపా సరోవరమునందు కన్పడదు. పంపాసరోవరము కథ లోకమునందలి అరిషడ్వర్గ విజృంభణమునకు మర్త్యభావములకు మనుష్య జీవితమందలి వివిధ పరిణామములకు సాక్షీభూతమైన ప్రకృతితత్త్వముగా వర్ణితమగును. ఈ సరోవరమునందు రజస్తమోగుణముల ప్రకోపము దాని పర్యవసానము తన్నియమనమునకు మునుల యాశ్రయము– ఈ లక్షణములతో ముడివడి యున్నది. ఈ సరోవరప్రసక్తి కథలో ఎక్కడ వచ్చెను?

వైశంపాయనుడన్న చిలుక తన వృత్తాంతములను శూద్రక మహారాజునకు నివేదించునపుడు వచ్చెను. అది పంపాసరోవరము ఒడ్డునగల యొక శాల్మలీ వృక్షమునందు గూటిలో తండ్రి సంరక్షణలో

నున్నది. ఆ పంపాసరోవరమును గూర్చి ఆ చిలుక వర్ణించి చెప్పెను. ఆ పంపాసరోవరము దానికి బాగుగా గుర్తున్నది. ప్రాణములు దక్కిం చినదది. ఆ సరోవరమెట్లున్నది. "అది యొకసముద్రమంత చెరువు. అగ స్త్యుడు సముద్రము నీరంతయు పీల్చివేసెనని వరుణునకు కోపము వచ్చి బ్రహ్మగారిని పురిగొలిపి ఆ అగస్త్యుని యాశ్రమము చెంత మరియొక మహాసముద్రమును సృష్టింప జేసినట్లుండెను. ప్రళయకాలమునందు అష్ట దిగ్విభాగముల సంధిబంధముల కోణములు విచ్ఛిన్నము కాగా ఏకాకార ముగా నాకాశము నేల వ్రాలినట్లుండెను. ఆదివరాహముచే భూమి పెల్లగింపబడగా ఏర్పడిన గుంట నీటిచే నింపబడినట్లున్నది." ఈ వర్ణన మేమి చెప్పుచున్నది. ఇవి యన్నియు నుత్ప్రేక్షలు కవి సంభావనా జనితములు. ఈ సరోవరోత్పత్తికి కవి చేసిన అభూతకల్పనలు. ఇట్టి అయథార్థములైన కల్పనలలో కవి చెప్పిన సత్యములేమి?

అగస్త్యునిపై వరుణునికి మాత్సర్యము. తన సొమ్మును ఆయన కొల్లగొట్టెనని ఆ కసి తీర్చుకొనుటకు బ్రహ్మగారిని పురిగొల్పి అగ స్త్యుని యాశ్రమము ప్రక్కనే పోటీగా మరియొక మహాసముద్రము సృష్టింపబడినదనుట కామక్రోధములతో సతమతమగు మానవలోకము లోని "కామ ఏషః క్రోధ ఏషః, రజోగుణ సముద్భవః" అనినట్లు చెల రేగెడు భావములచే కలుగు నూహలు. ఈ చిలుక యొక్క మానసిక మైన కల్లోలము ఆ సరోవరమునందలి వర్ణనములో సహజముగా ప్రతి ఫలించినది. అది "ప్రళయకాల విఘటితాష్టదిగ్భాగసంధి బంధం గగన తల మివ భువి నిపతితమ్". ఇట్టి యూహలతోనే సరోవర వర్ణనము ప్రారంభమైనది. ఇక దాని పరిసరములనుబట్టి దాని రమణీయత యుం డును. అందులో వచ్చి స్నానముచేయు వారెవరు? ఆటవికులు. వారి స్త్రీలు. వారు మదవతులు. వారి కుచకలశములతో లులితమైన జల మది. ఆ నీరు నల్లగానున్నది. కెలికినట్లున్నది. అందులో కొంత అంద

మున్నచో నది రాత్రులందు వికసించిన నల్ల, తెల్ల, ఎఱ్ఱ గలువలవలన. పగలు విచ్చుకొనిన పద్మములలోని మకరందములు చింది నీటిలోపడి నెమలి పింఛముల వలె తేలుచుండును. తెల్లని పద్మము లున్నవి. కాని ఆ తెలుపు నిలువదు. వానిపై తుమ్మెదలు వ్రాలి అవి చీకటి ముద్దలవలె నున్నవి. కలహంస లున్నవి. అంబురుహ మధుపాన మత్తములై యవి కలకలము రేపుచున్నవి. ఆ దగ్గరిలోని యాశ్రమము నందలి తాపసులు తమ వల్కలముల నచటనే ఝాడించుకొని పోవుదురు. ఆ మురికిచే నీరు ఎఱ్ఱనై యుండును. దట్టముగా నున్న చీకటి చెట్లవరుసలచే నిండిన యడవులు ఒడ్డును ఆకట్టియున్నవి. ఇది మరియొక సాగరమని నీరు త్రావుటకు వ్రాలిన మేఘముల వలెనున్న మిక్కిలి బురదగొట్టుకొనియున్న యేనుగులు ఎప్పుడు నచ్చటికి వచ్చి నీరు త్రాగి పోవుచుండును. పంపాసరోవర మిట్లున్నది. ఇది నలుపు. తమోగుణము ఎట్లుండునో అట్లున్నది. దీని పవిత్రత యంతయు నగస్త్యమహాముని ప్రాంతమున నుండుట. ఆయన కథా కాలమునాటికి లేడు. కొంచెము దూరమున జాబాలిముని యాశ్రమమున్నది. దప్పికగొన్న వైశంపాయనుడు (చిలుక) అజ్ఞానాంధకారమున నున్నాడు. ప్రాణసంకటమున నున్నాడు. తన దప్పిక తీర్చుకొను శక్తి తనకు లేదు. ఇట్టి యార్తిలోనున్నవారి నుద్ధరించువారు మునీశ్వరులే. హారీతుడు జాబాలి కొడుకు. ఆయన ఈ చిలుకపై జాలిపడి కొలనులో నీరుపట్టి తన యాశ్రమమునకు గొనిపోయెను. అచ్ఛోద సరోవరమున చంద్రాపీడుడే యాపని తీర్చుకోగలిగెను. ఆతని గమనము రజస్సునుండి సత్త్వమునకు. దీని గమనము తమస్సునుండి రజస్సునకు. సరోవర వర్ణనములందీ వైవిధ్యము కవి చూపెను. ఈ పంపాసరోవరమునకు గల చరిత్ర తన భావచిత్రము. చిత్రకారుడు సరోవరమును చిత్రించుటకు వలసినంత సామగ్రి యున్నది. అచ్ఛోదమును కూడ చిత్రించుటకు

వలసినంత సామగ్రి యున్నది. చిత్రకారుడు కుంచెతో పనితనము చూపవలెను. సహృదయుడైన పాఠకునకు హృదయమున్నది. అది చాలును. ఆ అద్దములో సరోవరములు తమ తమ విలక్షణములతో ప్రతిబింబించును. వారి తరంగములు, వర్ణములు, తుంపురులు, ఆ చెట్లు అందు స్నానముచేయు శబరకాంతలు, అప్సరసలు, నీరు త్రాగు ఏను గులు అన్నియు సజీవచిత్రములుగా హృదయమును స్పృశించును. చిత్రకారునివలన ఈ పనులు జరుగునా?

ఇట్లు ప్రతి వర్ణనమునుగూర్చి చెప్పుచుపోయినచో చాల గ్రంథ మగును. ఇప్పుడు కొన్ని సుందరములైన మనోహరములైన సన్నివేశ ములందలి వర్ణనలను చూతము.

తారాపీడుని రాణి విలాసవతి. ఆమె చిరకాలమునకు గర్భవతి యయ్యెను. ఈ వార్త యొక పరిచారిక రాజు చెవిలో నూదెను. రాజు విలాసవతిని చూడబోయెను. ఆమె నడిగెను "దేవీ! ఈ కులవర్ధన ఏమో చెప్పినది. అది నిజమేనాయని యిక్కడ మన శుకనాసుడడుగు చున్నాడు." దాని కామె సమాధానముచెప్పగలదా? సిగ్గు కదా! ఆమె యందలి లజ్జాభావమును కవి యెంత సొగసుగా వర్ణించెనో చూడుడు.

"అథావ్యక్త స్మితచ్ఛురిత కపోలాధరలోచనా లజ్జయావశనాంశు జాలకవ్యాజే నాంశుకేనేవ ముఖమాచ్ఛాదయంతీ విలాసవతీ తక్షణ మధోముఖీ తస్థౌ". "ఆమెలో చిరునవ్వు ఉబికినదిగాని వెలికిరాలేదు. లజ్జచే లోపల నదుముకొన్న యా సంతోషము ఆమె యెఱ్ఱవడిన చెక్కిళ్ళలో పెదవిలో కన్నులలో వ్యక్తమయ్యెను. ఆమె దంతకాంతి సమూహమే సిగ్గుచే మొగమునుగప్పికొను మేలిముసుగైనది. తల వంచి కొనినది. కాళిదాసుని పార్వతి "అధోముఖీ లీలా కమలపత్రాణి గణయామాస" అన్నాడు. అటువంటి వర్ణనమే యిది. గర్భవతియైన విలాస వతి యున్న యంతఃపురమునందలి కోలాహలము మరియొక చిత్రము.

.........మణిదీపములతో ఆమె నివాసగృహము ధగద్ధగాయమానముగా నుండెను. ఆ మందిరమున నామె యొక్క శయనము నలంకరించి యున్నది. ఆ శయనమెట్లున్నది? "నేలపై చుట్టును రత్నార్ఘము రంగవల్లులు దీర్చిరి. తలవైపున తెల్లని నిద్రాకలశము నుంచిరి. నానా విధమైన యోషధిజాలము, యంత్రములు పవిత్రతకై కట్టిరి. చుట్టును బ్రాహ్మీ కాత్యాయినీ వైష్ణవీ ఇత్యాది శక్తిస్వరూపిణుల రత్నావలయములు కల్పింపజేయబడెను. ఇటు నటు తెల్లని యావాలు చల్లబడియుండెను. సన్నని నారతో లోహఖండములను రావియాకులను వేపయాకులను కలిపి ప్రక్కచుట్టును పైభాగమున తోరణముగా గట్టిరి." ఇంకను చాలవర్ణనమున్నది. గర్భవతియైన యామెకు ఎన్ని మంగళాచారములు నెరపవలెనో వైదికాచారములు – లోకాచారములు – ఆనవాయితీలు – ఒక్కటియు వదలిపెట్టకు. అన్నియు వర్ణించును. ఆ శయనముపైన గర్భవతియైన విలాసవతి యున్నది. "కులశైలములు తనలో దాచుకొన్న భూదేవివలెనుండెను. ఐరావతము మునుకవేసి యున్న గంగానదివలె నున్నది. గుహలో సింహమున్న హిమాలయ మధ్యభాగమువలె నున్నది. సూర్యుని క్రమ్మియున్న మేఘసమూహముచే దినలక్ష్మివలె ప్రకాశించుచున్నది.

తూర్పుకొండ చాటున చంద్రమండలమున్న రాత్రివలెనున్నది. బ్రహ్మ కూర్చుండు పద్మము వికసించుటకు సిద్ధముగానున్న శ్రీమన్నారాయణుని నాభివలె నున్నది. అగస్త్య నక్షత్రోదయము కాబోవుచున్న దక్షిణదిక్కువలె నున్నది.

నురుగులుకట్టిన అమృతకలశముగల పాలసముద్ర తీరమువలె నున్నది."

బాణుని వర్ణనములలో ఇంతటి వైశద్యము, విపులత, వైవిధ్యము నుండును. గర్భవతి నిట్లు వర్ణించుటలో పుట్టబోయెడి కథానాయకుని లక్షణములకు సముచితమైన తత్త్వముకూడ సూచించబడినది. ఈలాగని వివరించుటకు అనువుగాని అనేక చిత్రములుగల వర్ణనములవి.

మానవ మనోభావానుగుణమైన ఉపమానములతో వర్ణనీయ వస్తువుల రూపములు భావింపజేయును.

దప్పిక గొనియున్న చిలుకకు కనిపించిన హారీతుడు – మునికుమారుడే –

"విటప ఇవ కోమల వల్కలావృత శరీరః"

మెత్తని నారబట్టలుదాల్చిన అతడు చెట్టుకొమ్మవలెనున్నాడు.

"నదీతట తరురివ సతతజలక్షాళన విమలజటః"

నిరంతరము స్నానములచే క్షాళితములై నిర్మలములైన జటలతో నదియొడ్డున చెట్టువలె నున్నాడు.

యౌవనాభిరామమైన మహాశ్వేతకు కనిపించిన పుండరీకుడు – మునికుమారుడే. మహాశ్వేత కంటితో చూచినచో మనకాతడు –

"యౌవన మివ ధర్మస్య – ధర్మముయొక్క యౌవనదశ
విలాస మివ సరస్వత్యాః – సరస్వతియొక్క విలాసము
స్వయంవర పతి మివ సర్వవిద్యానామ్– సర్వవిద్యలకు స్వయంవరపతి
సంకేతస్థాన మివ సర్వశ్రుతీనామ్ – సకలశ్రుతులకు సంకేత స్థానము
నిదాఘ కాలమివ సాషాఢమ్ – ఆషాఢము (మోదుగు దండముతో వేసవివలె)

హిమసమయ కానన మివ స్ఫుటిత ప్రియంగు మంజరీ గౌరమ్
శీతకాలమున విచ్చిన ప్రియంగు పుష్పగుచ్ఛమువలె తెల్లనివన్నెవాడు.

మధుమాస మివ కుసుమ ధవళ తిలకభూషితముఖమ్"
తిలకపుష్పములు విరివిగ వికసించు మధుమాసమువలె తెల్లని విభూతిని (తిలకముగా) దాల్చినవాడు-

విలాసము, యౌవనము, స్వయంవరపతిత్వము, వసంతఋతువు- ఈ పోలికలచే మునికుమారునియందు బ్రహ్మచర్య విరుద్ధములైన భావములు మహాశ్వేతయొక్క హృదయమును సూచించును.

పుండరీకుని చెవిలోని పూలగుత్తిని మరియు మోహనముగా వర్ణించును. "మలయమారుతాగమనార్ఘ లాజాంజలి మివ మధు మాసస్య" మలయమారుతమునకు స్వాగతము చెప్పుచున్న వసంత ఋతువుయొక్క లాజల దోసిలివలె నున్నదట!

"యౌవనలీలా మివ కుసుమలక్ష్మ్యాః" కుసుమలక్ష్మియొక్క యౌవనలీలవలె నున్నదట.

"సురత పరిశ్రమ స్వేద జలకణ జాలకావలీ మివ రతేః" సురత కేళిచే అలిసిపోయిన రతీదేవియొక్క చెమట బిందువుల జాలువలె నున్నదట!

యద్భావస్తద్భవతి యన్నట్లు లోకప్రవృత్తి నిట్లు చిత్రించును. ఇంతటి మదనపరవశభావనామహితయైన మహాశ్వేత పుండరీకుని ఎడ బాటుచే పాశుపతవ్రతధారిణియై దక్షిణామూర్త్యుపాసనలో నుండగా నామె లావణ్యాదులయందు శాంతరసోల్లాసియైన లక్షణమే కవి చిత్రించును. ఆమె యంగప్రత్యంగవర్ణనము చేయడు. "అతి ధవళప్రభా పరిగత దేహతయా స్ఫటికగృహగతా మివ; దుగ్ధ సలిల మగ్నామివ; విమల చీనాంశుకాంతరితామివ; ఆదర్శతల సంక్రాంతా మివ; శరదభ్ర పటల తిరస్కృతా మివ; అపరిస్ఫుట విభావ్యమానావయవామ్" - అనును. మిక్కిలి తెల్లని దేహకాంతి యామె నావరించియున్నది.

స్ఫటిక గృహములోనున్న కాంత ఆకృతియేగాని అవయవములు విస్పష్టముగా కనిపింపవు.

ఆమె పాంచభౌతికమైన శరీరలక్షణము పోయి కేవల సత్త్వగుణము రాశి పోసినట్లున్నది – "పంచమహాభూతమయమపహాయ ద్రవ్యాత్మక, మంగనిష్పాదనోపకరణకలాపం ధవళగుణేనైవ కేవలేనోత్పాదితమ్" హిమగృహమునందు మన్మథార్తయైన కాదంబరిని వర్ణించునప్పటి దృశ్యములు రాగమయములు.

"ఆయత శ్వాసపధుతి తరలితేన చ సంతాప భయపలాయమానేన దేహప్రభా వితానేనేవాంశుకేన విముచ్యమాన కుచకలశామ్, ఆపతత్ప్రిచల చామర ప్రతిబింబశ్చ కుచకలశయుగలం ప్రియాంతిక గమనోత్సుక్య కృతపక్ష మివ కరతలేన నిరుంధతీమ్,... ..." "విరహిణియైన యామె నిట్టూర్పుల గాలికి రెపరెపలాడుచున్న పయ్యెద సంతాపభయమున పలాయనము చిత్తగించుచున్న ఆమె శరీర కాంతి వలె కుచ కలశములనుండి తొలగిపోవుచున్నది.

ఆ రీతిగా ఆవరణము తొలగిన కుచ కలశములందు ఇరువంకల వీచుచున్న చామరముల ప్రతిబింబము పడి ఆ కుచములు ప్రియుని కడకు జనుటకై కదలుచున్నట్లుండగా నామె వాని గమనమును నిరోధించుటకేనో యనినటుల వక్షోజములపైన చేయి వైచికొనియున్నది."

ఈ రీతిగా బాణుని వర్ణనలు ప్రసంగోచితములు. రసనిర్భరములు. మున్యాశ్రమము వర్ణించిన నచట ముని జీవిత సర్వస్వమును ప్రకటించు దృశ్యముల చూపును. రాజకులమును వర్ణించినచో సమస్త రాజ సంప్రదాయములు లక్షణములు లాంఛనములు పోతపోయును. పురిటింటిని వర్ణించినచో పురిటింటి వాసనయే కొట్టును. సరోవరవర్ణనము చేయును, సరోవరము చుట్టును మనలను త్రిప్పును, సరోవరములో మునుకలు

వేయించును. ప్రకృతిలో నేయే జీవచైతన్యము భౌతిక లక్షణము స్వభావము నెక్కడెక్కడ నెట్లెట్లుండునో ఆ సర్వలక్షణమునకు శబ్దములతో చిత్రమైన రూపమును బాణుడు తీర్చును.

అది జాబాలిమునియొక్క ఆశ్రమము - దానిని దేవతల ఆకృతితో పురాణపురుషుల స్వరూపములతో అభిన్నముగా వర్ణించును. ఈ అభిన్నత్వమును సాధించుటకు అర్థశ్లేషను, శబ్దశ్లేషను, విరోధాభాసమును, తుల్యయోగితను, సమాసోక్తిని గ్రహించి యలంకరించును.

"శిలాశకల ప్రహార సంచూర్ణితాక్షాస్థి సంచయ" మై హనుమంతునివలె నున్నది. శిలలు చిమ్మి లంకలో హనుమంతుడు అక్షుని (రావణకుమారుని) అస్థులను (ఎముకలను) పిండిపిండి జేసెను. మునుల ఆశ్రమమున అక్షముల (తాండ్రకాయల) అస్థులు (మధ్యభాగములు) శిలలతో నలుగగొట్టబడి నూనె గ్రహింపబడుచుండును. హనుమంతునకు ఆశ్రమమునకు ఈ లక్షణము శబ్దముచే శ్లేషచే సాధింపబడినది.

ఖాండవ వినాశమునకు పూనుకొనిన యర్జునునివలె ప్రారబ్ధాగ్నికార్యము కలది.

"అసురారి మివ ప్రకటిత వరాహనరసింహరూపమ్" అడవిలో వరాహములు నరులు సింహములు ఉన్నవి. ముని ప్రభావముచే నవి పరస్పర మాత్సర్యము వీడి యచట సంచరించును. కనుక అది వరాహనరసింహరూపధారియైన అసురారి (విష్ణువు) వలె నున్నది. ఇటువంటి పోలికలు గుత్తులు గుత్తులుగా నెన్నో చెప్పును.

ఆశ్రమములో నొకవంక ధర్మశాస్త్రి గోష్ఠులు. మరొకవంక పుస్తకపఠనము. ఒక ప్రక్క సకల శాస్త్రార్థచర్చ, పర్ణశాలల లోపల మార్జన క్రియలు, పంచలు గోమయముతో నలికికొనుచుందురు. కొందరు ముంజెత్రాళ్ళు పేనుకొనుచుందురు. కొందరు సమాధి అభ్యాసమున నుందురు. మంత్రములను వల్లించువారుందురు. కృష్ణాజినము

లను కొందరు తయారుచేసికొనుచుందురు. ఆశ్రమమునందలి ఈ వాతావరణమునకు శానచ్ ప్రత్యయాంతములతోడి బహువ్రీహి సమాసములను ఆశ్రమమునకు విశేషణములుగా ఒక మాలవలె గ్రుచ్చును. "ఆలోచ్యమాన ధర్మశాస్త్రమ్ పఠ్యమాన వివిధ పుస్తకమ్, విచార్యమాణ సకల శాస్త్రార్థమ్...... అభ్యస్యమానయోగం ... ప్రక్షాళ్యమానవల్కలం......" శరపరంపరగా నిట్టి బహువ్రీహి సమాస మాలిక ఆశ్రమమునకు విశేషణ రూపమైన విశిష్టాలంకారముగా కూర్చును.

ఆ ఋషుల భూతదయ ఆరణ్యకమృగములతోడి వారి యనుబంధము చాల మనోహరముగా చెప్పును.

అడవిపందుల కోరల సందులలో దుంపలనలుసులు ఇరికికొనగా ఋషికుమారులు వానిని తీసివైతురు. జింకలు ఋషులకొరకు తమ కొమ్ములతో నేలను త్రవ్వి అనేకములైన కందమూలములు తీసి పెట్టును.

ఆశ్రమమునకు వచ్చు ముసలివారు గ్రుడ్డివారునైన మునులను కోతులు చేయిపట్టుకొని లోనికి తీసికొనివచ్చుట బయటకు తీసికొని పోవుట యచటి యందమైన దృశ్యము. మానవ హృదయమునకు హాయిగాదోచు దృశ్యము. "పరిచిత శాఖామృగకరాకృష్టి ప్రవేశ్యమాన నిష్కాస్యమానజరదంధతాపసం"

లేళ్ళు తమ నాలుకలతో ఋషికుమారుల మేనులను తడవుచుండును. "ఏణీ జిహ్వోపల్లవోపలిహ్యమాన మునిబాలకమ్."

ఏ గూటి చిలుక ఆ గూటిపాటయే పాడునట్లు అచటి చిలుకలు వషట్కారములు బాగుగా నేర్చుకొన్నవి. వాని చెవులలో నిప్పుడును మునులుచేయు హోమములందలి స్వాహా స్వధావషట్కారములే కదా వినిపించునది. "అనవరత శ్రవణ గృహీతవషట్కార వాచాల శుకకులమ్."

మునులు సరోవరములతో జలకలశములు పూరించుకొను ధ్వని మేఘధ్వని యని మెడలు పైకెత్తి నెమళు లాలకించుచుండును. ఇన్ని మనోహరములైన మున్యాశ్రమ సహజములైన దృశ్యములు ఎంత వివరముగా చిత్రించునో ఆ చిత్రించుటలో వివిధవిధ గద్యపదబంధములను చిన్న సమాసములతో, నచట నచట పెద్దసమాసములతో వివిధములైన విభక్తుల విఱుపులతో కూర్చిన పెద్ద పెద్ద విశేషణముల పరంపరలతో, నలంకారములతో చిత్రమైన శబ్దార్థ సంయోజనముచే పాఠకుని చిత్తమును తదాశ్రమమునందెట్లు నిలుపునో, యొక రాజకులమును వర్ణించునపుడును నట్లే అచటికి తగిన వాతావరణమునంతయు మూసపోయును. ఆ ఆచార వ్యవహారములు, ఆ రాజాశ్రితుల వినయ వినమిత శరీరములు, చూపులలోని వంకరలు, అన్నియు వర్ణించును. “ఆగృహీత కనక వేత్రలతైః సితవార బాణైః సితాంగరాగైః సిత కుసుమశేఖరైః, సితోష్ణీషైః, సితవేష పరిగ్రహతయా శ్వేతద్వీపసంభవైరివ, కృతయుగ పురుషైరివ, మహాప్రమాణైః దివానిశం ఆలిఖితైరివ ఉత్కీర్ణైరివ తోరణస్తంభ నిషణ్ణైః ద్వారపాలైః అనుజ్ఞాత ద్వారదేశమ్”

రాజద్వారమునందు ద్వారపాలకు లున్నారు. వారు చెక్కిన బొమ్మల వలె కదలరు. మెదలరు. చేతిలో బంగారు బెత్తములు. ఒంటికి తెల్లని కవచములు, మేనికి తెల్లని మైపూతలు, తలపై తెల్లని తలపాగాలు, వానిపై తెల్లని పూలమాలలు – ఈ తెల్లని వేషముచే శ్వేతద్వీపమున పుట్టినారా యనునటులున్నారు. కృతయుగపురుషులవలె చాల యెత్తైన వారు. ఇక లోపల నిటు నటు దిరుగు వారవనితలు, పెంపుడు కస్తూరికా మృగముల పరిమళముల గుమగుమలు, ఆ రాజకులములో మనము కూడ కలిసిపోవుదుము. ఆ వాసనలు పీల్చుదుము. ఆ దృశ్యములు చూచుదుము.

రాజగృహములో తిరుగుచున్న వారవిలాసినుల సొగసులెంత విశదముగా వర్ణించును! "అమలమణిభూమి సంక్రాంతముఖ నివహ ప్రతిబింబతయా వికచ కమల పుష్పప్రకరమివ సంపాదయతా గతివశ రణిత నూపుర హారిహార్య రశనాస్వనముఖరేణ, స్కంధావసక్త కనక దండ చామరేణ, నిర్గచ్ఛతా ప్రవిశతాచ అనవరతం వారవిలాసినీ జనే నాకులితమ్"–

"మణులు పొదిగిన నేలపై వారిముఖములు ప్రతిబింబించి వికసించిన తామరపూలు చల్లినట్లున్నవి. వారి నడకల యొడుపుచే కాలి యందెలు చేతి కంకణములు నడుముల మొలనూలి కింకిణులు ఘల్లు మనుచున్నవి. బంగారు పిడుల చామరములను వారు భుజములపై పెట్టుకొని ఆరాజమందిర శాలలలోనికి వచ్చుచుందురు పోవుచుందురు." తెలుగులో చెప్పిన నింత విడదీయవలసివచ్చెనుగాని సంస్కృత సమాసములలో ఈ వర్ణనమంతయు నొక పూలహారమువలె, నొక గజ్జెల తోరణమువలె, నొక బంగారు కాంతిప్రవాహమువలె, రమణీయ శబ్ద సంవిధానముతో భావ సౌందర్యముతో హృదయమున మెత్తగ స్పృశించు శయ్యాసౌభాగ్యముతో ముచ్చటగానున్నది.

ఈ రీతిగా చెప్పుచు బోయినచో ప్రతివాక్యముకూడ బాణుని వర్ణనాశిల్పమునకు మచ్చుతునకవలెనే యుండును. అందుచే గ్రంథము లోని ప్రతివాక్యమును వివరింతుమా? ఆయన యొకవాక్యమునందు చూపిన సొగసు మరియొక వాక్యమునందు మరియొకరీతిగా చూపును. బాణుని వాణీవిలాసములు ప్రతిపద మనోహరములు. అంత నిశితమైన పరిశీలనము, అంతటి యాలంకారికమైన రచన, యన్ని విధములైన భావముల పోతలు మరి యే కవి యందును కనలేము.

శ్లేషలు సుబంధుడు వాడెను. గద్యకవు లందరును వాడిరి. బాణుడును వాడెను. ఈయన శ్లేషలు వట్టి వర్ణనకు మాత్రమే కాదు.

కథాసూత్రమున సంవలితములై యుండును.

తారాపీడుని భవనము "శివభవనమివ ద్వారావస్థిత దండపాణి ప్రతీహార గణము." కాశీ విశ్వనాథుని మందిరమువలె ద్వారమునకిరు ప్రక్కల దండపాణులైన ప్రతీహారులుకలది. దండపాణి యముని కాలభైరవునకుకూడ పేరు. ప్రమథగణములు ప్రతీహారరూపములు.

అంతకంటె నద్భుతముగా బాణుడు తన గద్యముతోనే రాజ భవనమును పోల్చెను.

"ఉత్కృష్టకవి గద్యమివ వివిధవర్ణశ్రేణి ప్రతిపాద్యమానానేకాభినవార్థ సంచయమ్" ఒక మహాకవియొక్క గద్యము తన స్వతంత్రమైనరీతిలో కూర్చబడిన అక్షరముల విన్యాసముతో ననేకములైన క్రొత్తక్రొత్త యర్థముల నెక్కడికక్కడ ఆశ్చర్యముగా ప్రకటించినట్లు రాజగృహముకూడ బ్రాహ్మణాది వివిధ వర్ణములవారిచే వివిధములైన యర్థసమూహము (బ్రాహ్మణులు విద్యాధనముతో, వేదస్వరూపార్థముతో, క్షత్రియులు శౌర్యముచేత, వైశ్యులు ధనరాసులతో, శూద్రులు సేవాధనముతో) ఇట్లనేక విధముల సేవించుచుండిరి.

ఆశ్లేషలు రాజభవనమును మహాభారతముతో వ్యాకరణముతో యదువంశముతోనైక్యభావమును పొందించినవి. రాజభవనమును మహాభారతముతో పోల్చుట వ్యాకరణముతో పోల్చుటయేమి? అది యెట్లు సాధ్యము? "మహాభారతమివానంత గీతాకర్ణనానందిత నరం" ఆ రాజభవనము మహాభారతమువలె అనంతముగా గీతశ్రవణముచే నానందించిన నరులు గలది. అనంతుడనగా మహావిష్ణు స్వరూపుడైన శ్రీకృష్ణుడే. ఆయన గీతాబోధను విని యానందించిన నరుడు అర్జునుడు. రాజభవనమున ననంతముగా నిరంతరముగా గీతాగానము (సంగీతశ్రవణము) వలన నరులు ఆనందించుచుందురు.

"వ్యాకరణమివ ప్రథమ మధ్య మోత్తమ విభక్తి స్థితానేకాదేశ కారకాఖ్యాత సంప్రదానక్రియావ్యయ ప్రపంచసుస్థితమ్" అని భవనమును వ్యాకరణముతో పోల్చెను. రాజభవనమునకు అన్వయించు నపుడు "వీడు సర్వగుణసంపన్నుడు. దాన యోగ్యులలో ప్రథముడు, వీడు వానికంటె నించుక తక్కువ గుణవంతుడు – మధ్యముడు, వీడు ఉత్తమ గుణసంపదచే మధ్యమునకంటె నుత్తముడైన దానయోగ్యుడు ఈ రీతిగా యాచకజనవిభాగము చేయుటయే విభక్తి. ఆ ప్రకారముగా అనేకాదేశకారకుల (వీని కిది యిమ్ము అని ఆదేశించు పురుషుల) చే, ఆఖ్యాతములైన (చెప్పబడిన) సంప్రదానక్రియా (చక్కగా దానము చేయవలసిన) వ్యయప్రపంచము (ఆధిక్యము) చే సుస్థితమైనది. అనగా కీర్తిచే వెలుగొందినది. ఇది రాజభవన లక్షణము. ఇక వ్యాకరణ లక్షణము స్పష్టమే– ప్రథమ మధ్యమ ఉత్తమ పురుషలు, ఆఖ్యాతము అనగా తిఙంతమైన పదము. సంప్రదానము చతుర్థీకారకము, క్రియా క్రియాబోధకములైన భ్వాది శబ్దములు, అవ్యయములు, ఈ ప్రపంచముతో (సమూహముతో) సుస్థితమైనది వ్యాకరణము; కారకపదము నందే సంప్రదానము కూడ చెప్పబడినను విడిగా చెప్పుట శ్లేష ప్రయోజనము కొఱకు.

అది సరే! బాణుని శ్లేషఘటనలో నిట్టి చమత్కారములు శాస్త్రవిషయములతో ముడిపెట్టబడి యుండుట యొక చమత్కారము.

మంత్రిని వర్ణించుట కూడ నిట్టి శ్లేష చమత్కృతినే చూపును. శుకనాసుడు – "జరాసంధ ఇవ ఘటితసంధి విగ్రహః త్ర్యంబక ఇవ ప్రసాధిత దుర్గః సలిలనిధిరివ మహాసత్త్వనివాసః" అని చెప్పబడెను. సంధి రాజులమధ్య జరుగునది. విగ్రహము అనగా యుద్ధము. రాజులకు సంధిని కూర్చువాడు, యుద్ధములను నిర్వహించువాడు–మంత్రి. కూర్చబడిన సంధి (అతుకు) చే విగ్రహము (ఆకారము) ఏర్పడినవాడు జరా

సంధుడు. శబ్దమాత్రముచే జరాసంధునితో పోలిక. ఇచట నొక ధ్వని కూడ చెప్పవచ్చును. జరాసంధుడు కృష్ణునకుకూడ నలవిగాని శక్తి కలవాడు. ఈ మంత్రి అంత దుస్సాధుడని ధ్వని.

త్ర్యంబకుడు దుర్గాదేవిని ప్రసన్నురాలిని చేసికొనును. ఈ మంత్రి శత్రుదుర్గములను నేర్పుగా బట్టి సాధించును. కనుక శబ్దమాత్రముచే త్ర్యంబకునితో సామ్యము, అర్థముచే భిన్నత. ఇక్కడ కూడ పరరాజుల దుర్గము లీతనికే వశమగుట దుర్గ ఈశ్వరునకే యిల్లాలగుట యెంత సహజమో యంత సహజమని ధ్వని. త్ర్యంబకుడనగా మూడు కన్నులు గలవాడు. ఫాలాక్షుడు. త్రిపురముల దుర్గములను సాధించిన శివుని వంటి పరాక్రమశాలి యని. జ్ఞానచక్షువు అని.

సలిలనిధి— సముద్రము. దానియందు మహాసత్త్వములు (గొప్ప జలచరములు) ఉండును. ఈ మంత్రియును మహాసత్త్వము (గొప్ప బలము) కలిగి యుండుటచే సముద్రునితో పోలికగలవాడు. సముద్రునిలోని మహాసత్త్వములు వెలికి గనరానివి. అట్లే యీతని శక్తియు నిగూఢమైనది. సముద్రునివలె గంభీరుడనియు ధ్వని. బాణుని యీ శ్లేష ఘటనచే పైకి విరోధముగా గనిపించు పోలిక సహజముగా సమర్థింపబడుచుండును. బాణుడు ఈ విద్యలో సాటిలేనివాడు.

శృంగార రసపోషణలో నిట్టి శబ్దాలంకారములు, యమకములు దుష్కరశబ్దభంగ శ్లేషాదులను ఎంత సమర్థుడైన కవి ప్రయోగించినను నది స్ఖాలిత్యమే కాగలదని ధ్వన్యాచార్యులు చెప్పియు బాణుని కాదంబరి అట్టి స్ఖాలిత్యమునకు గురికాలేదని కాదంబరీ దర్శనావసరమున శ్లేష ప్రయోగమును ధ్వనివిషయికముగా సమర్థించిరి. అది బాణుని శ్లేష ఘటనకు కలికితురాయి.

కథలో – చంద్రాపీడుడు రెండవ పర్యాయము కాదంబరిని చూడబోయెను. అపుడామె హిమ గృహమున విరహవ్యథాకులితయై

యున్నది. చంద్రాపీడుడు ఆమె తాపకారణమును గూర్చి ఒక ప్రశ్న వేయును.

"దేవి! జానామి కామరతిం నిమిత్తీకృత్య ప్రవృత్తోఽయమవిరళ సంతాపతీవ్రో వ్యాధిః సుతను! సత్యమ్ – న తథా త్వామ్ ఏష వ్యథయతి యథాస్మాన్! ఇచ్ఛామి దేహదానేనాఽపి స్వస్థామత్ర భవతీం కర్తుమ్"

"ఓ దేవీ! నీకు ఈ అవిరళ సంతాప తీవ్రమయిన వ్యాధి – కాం+అరతిం నిమిత్తీకృత్య ప్రవృత్తః – ఏ అనిష్టము వలన కలిగెను? అనెను. ఇందులో వ్యంగ్యమున్నది. అది కాం+అరతి; కామ రతి అన్న యమకమునుండి, భంగశ్లేషనుండి. కాం+అరతిం అన్నప్పుడు ప్రశ్న. కామరతిం – అన్నప్పుడు నిశ్చయార్థము. ఈ...వ్యాధి నీకు కామ రతి (మన్మథ భావోద్దీపనము) వలన నని తలచుచున్నాను. ఇక్కడ శబ్దశ్లేష.

రెండవ వాక్యమునందు అర్థశ్లేష పెట్టినాడు. ఓ సుతనూ! ఈ వ్యాధి (ఈ కామరతి) నన్ను బాధపెట్టినంతగా నిన్ను బాధించుటలేదు. అనును – ఇచట వక్తృబోద్ధృ ఉభయనిష్ఠమె "కామరతి" యే వ్యంగ్యము. అలంకారములను రసోన్ముఖముగా తీర్చుటలో కవి పూర్ణ ప్రయోజనము నిట్లు సాధించెను. ఉభయులందును మన్మథతాపము సమానకోటిలో నున్నది. కాళిదాసుని దుష్యంతు డనినట్లు–

"అకృతార్థేఽపి మనసిజే రతి ముభయ ప్రార్థనాకురుతే" సంయోగము లేకపోయినను నాయికానాయకులు పరస్పరము సమానమైన ఆకాంక్షను కలిగియున్నచో అదియే రతిని గూర్చును. ఇచట ఆ వ్యంగ్యము రసపరముకాగా శ్లేషను బాణుడు రసపథములలో నుత్తమకోటికి గొనిపోయినాడు. ఆ తరువాతి వాక్యమునందలి శ్లేష అలంకారమేకాదు అర్థగుణముకూడ. "ఇచ్ఛామి దేహదానేనాఽపి స్వస్థా

మత్ర భవతీం కర్తుం" నా శరీరమును సమర్పించియైనను నిన్ను స్వస్థురాలిని చేయుటకు సిద్ధమే యున్నాను. సంభోగమునకు దేహదానమే వలయును. దేహత్యాగమన్నచో అమంగళార్థము వచ్చును. వ్యంగ్యము చెడును. ప్రాణదాన మనలేదు. దేహత్యాగ మనలేదు. దేహదాన మనినాడు. సంయోగపరమార్థము ఆ పదప్రయోగమున ధ్వని సిద్ధాంతమునకు మకుటాయమానమైన మచ్చుతునుక. "రమణీయార్థ ప్రతిపాదకశ్శబ్దః కావ్యమ్" అన్న పండితరాయని మాటచే నిదియే యొక కావ్యము.

బాణుని వర్ణనలలో నొక ప్రణాళిక యున్నది. విశేషణ పరంపరలతో బహువ్రీహిసమాసములతో వర్ణనము ప్రారంభించును. ఉపమానోత్ప్రేక్షలతో వివిధ గద్యబంధములవై చిత్రితో వర్ణన కొనసాగించును. ఆ ఉపమాన పరంపరల తరువాత ఇతిహాస కథలతోడి మహాపురుషులతోడి అభేదమును వర్ణ్యవస్తువునకు కల్పించుటకై శ్లేషానుప్రాణిత విరోధాభాసాలంకారములను పరంపరగా గుప్పించును. మరల కొన్ని యుపమానములు చెప్పును. అవి అల్ప సమాసములతోనో, అసమాసములతోనో ఘటించును. వర్ణన బహువ్రీహి సమాసములతో ముగించును. ఉపమాన పరంపరలంటినిగాని యచట ఉత్ప్రేక్షలు, రూపకములు, దీపకములు నుండును. అన్ని యలంకారములకు మూలము ఉపమానమేకదా! శ్లేషకూడ ఉపమానమును సాధించుటకే!

సాహిత్యము యొక్క సర్వలక్షణము నిట్లు నిక్షేపించిన మహాకవి కనుకనే గద్యమును పద్యముకంటె హృద్యముగా తీర్చి పలికెను.

బాణుని శ్లేష ఘటనా నైపుణ్యము జ్యోతిర్లోకములను స్పృశించిన దనినచో అతిశయోక్తి కాదు. హారీతుని వర్ణించుచు "నక్షత్రరాశిరివ చిత్రమృగకృత్తికాశ్లేషోపశోభితః" అని చెప్పును. హారీతుడు

నక్షత్రరాశివలె చిత్ర విచిత్రవర్ణములుగల మృగకృత్తికా (లేడి చర్మము) ఆశ్లేష (ధరించుటచే) చే శోభిల్లుచున్నాడనెను. నక్షత్రరాశితో పోలికయెట్లు? ఏయే నక్షత్రములయొక్క కూడికవలెనున్నాడితడు? 'చిత్ర' అనునది పదునాల్గవ నక్షత్రము, మృగమ్- అనునది మృగశిర యన్న యయిదవ నక్షత్రము, (నామైక దేశేనామగ్రహణమ్) కృత్తికయన్నది మూడవనక్షత్రము; ఆశ్లేషయన్నది తొమ్మిదవ నక్షత్రము. ఇట్లు శ్లేషచే ఉపమను సాధించినాడు. హారీతుని నక్షత్రరాశితో పోల్చుటలో చిలుకకు హారీతునియందు గల ప్రీత్యతిశయము ధ్వనించుచున్నది.

ఇట్లే పుండరీకుని చూచిన మహాశ్వేతయందలి ప్రీత్యతిశయము నొక హేతూత్ప్రేక్షలో వ్యక్తపరచెను.

"సకల జగన్నయనానందకరమైన చంద్రబింబమును సృష్టించియు లక్ష్మీలీలానివాసములైన కమలములను సృష్టించియు ప్రజాపతి యీతని ముఖబింబములను సృష్టించుటకు వలసిన కౌశల్యమును అభ్యసించినట్లు తోచును. లేనిచో ఈ సదృశ వస్తుసృష్టికి కారణమేమై యుండును? అంతేకంటెను మరియొక వర్ణనమున్నది. అది శాస్త్రీయమైన విషయముతో ముడివడినది. శృంగార రసాలంబనమైన నాయకునియందు నాయిక అట్లుభావించుట చాల రమణీయము. అద్భుతము. కథాంతర్హోపదేశకము. అది యెట్లో పరిశీలింతము- "అలీకం చేదం యథాకిల సకలాః కలాః కలావతో బహుళపక్షే క్షీయమానస్య సుషుమ్నా నామ్నా రశ్మినా రవి రాపిబతీతి, తాః ఖల్వస్యగభస్తయః సమస్తవపురిదమావిశంతీతి, కుతోఽన్యథా రూపాపహారిణే క్లేశబహుళే తపసి వర్తమానస్య ఇదం లావణ్యమ్"-

సూర్యుడు సుషుమ్నా యను నొకానొక తనకిరణముచే కృష్ణపక్షమున క్షీణించుచున్న కళానిధియైన చంద్రుని యొక్క సకల కళలను పీల్చుకొనుచుండునని పురాణములు చెప్పు మాట

యుబద్ధము. అట్లైనచో ఆ చంద్రుని సమస్తకళలు సీతని శరీరము నందెట్లు తరుగక నిలిచియున్నవి. అందునను మేని సొగసును హరించు మిక్కిలి క్లిష్టమైన తపోమార్గమునందున్న యీతని కీలావణ్య మెట్లు సిద్ధించును?" ఇది యంతయు నతిశయోక్త్యలంకార మగును. కాని కథాతత్త్వమునుబట్టి యీతడు బ్రహ్మ[illegible]మైన చంద్రుని ప్రతిబింబము. ఈ విషయము కథాతత్త్వము నమశీలించిన ప్రకరణ మున చెప్పబడినది.

వర్ణనములలో లోకమునగల యాచారములను అచ్చటచ్చట ధ్వనింపజేయును. "అశ్వీయమందురా పరిభ్రష్టాగ్రైరవలుప్తభవనదాడి మీఫలై రాఖండితాంగణ సహకారపల్లవై రభిహత నబ్జవాపున కిరాత కరతలాచ్ఛిన్నాని భూషణాని వికిరద్భిః కపిభి రాకులీకృతేన" గుఱ్ఱపుశాలలనుండి కట్లు త్రెంచుకొనివచ్చిన కోతులు భవనప్రాంగణమునందలి దానిమ్మచెట్ల పండ్లను మామిడిచెట్ల చివురులను కొరికి పడవేయుచుండగా గూనివారు పొట్టివారు నైన కిరాతజాతి పరిచారకులు తమను పట్టికొనరాగా వారు ధరించిన కంకణములను లాగికొని విసరివైచు చున్న కోతులతో అల్లకల్లోలముగనున్నదట రాజభవన ప్రాంగణము. ఇది స్వభావోక్త్యలంకారము ఎట్లైనది? గుఱ్ఱములకు దృష్టి తగులకుండ కోతులను గుఱ్ఱపుశాలలవద్ద కట్టివేయుట అశ్వపాలకుల యాచారము. ఇది నిగూఢముగ నందులో నున్నది. బహుశాస్త్రములను లోకాచార ములను నీ రీతిగా ధ్వనింపజేయును. స్వభావోక్తులలో కొన్ని చెప్పరాని గ్రామ్య దృశ్యములను కూడ సహజత్వమును రూపుకట్టించుటకై కాబోలు! బాణుడు చెప్పనుగాని వదలడు. అంతఃపురములలో చిలు కలు గోరువంకలు పెంచబడుచుండును. ఆ చిలుకలు గోరువంకలు సురత ప్రసంగములను స్పష్టముగా ప్రకటించుచుండగా నంతఃపురస్త్రీలు

సిగ్గుపడుచుండురట. "శుకశారికాప్రకాశిత సురత విస్రంభాలాప లజ్జితా వరోధజనేన" అని చెప్పెను.

ఇట్టి సహజత్వమును రూపు కట్టించుటకు కవియందలి పరిశీలనా దృష్టి కారణము. తెల్లవారుఝామున ఆకాశమువన్నె ముసలిపావురపు రెక్కల వన్నెవంటి వన్నె- బూడిదరంగు కలదిగా చెప్పెను. "రజన్యామల్పావశేష పాండుతారకే జరత్పారావత పక్ష ధూసరే నభసి"- ఆ సమయమున తారాపీడుడు కలగనెనని చెప్పెను.

"కరికలభ భుజ్యమాన సల్లకీ కషాయ గంధః" ఏనుగు గున్నలు అందుగు చెట్ల ఆకులు నములుచున్న వగరువాసనలు, (ఏనుగులకు ఇష్టమైన తిండి) "వనమహిష విషాణకోటి కులిశభిద్యమాన వల్మీకధూళి" అడవి దున్నల కొమ్ముల మొనలతో పొడవబడుచున్న పుట్టలనుండి లేగిన దుమ్ము. "క్రోడకుల దశ్యమాన భద్రముస్తారసామోదః" అడవి పందులు నమలుచున్న తుంగదుబ్బుల నురుగుల వాసనలు, ఆటవికులకు తెలిసినట్లే బాణునకును బాగుగా తెలియునేమో!

విలాసవతి సంతానముకొఱకై పూనిన వ్రతములను చేసిన పూజలను, పడినపాట్లను వర్ణించుపట్టున బాణుడు లోకవ్యవహారము నెంతయో విస్తృతమైన పరిశీలనతో గ్రహించి వర్ణించి చెప్పెను.

కావ్యములో వర్ణనములుండవలెనన్న నిబంధనము సాహిత్య లక్షణముచే నెంతముఖ్యమో జీవితమును సమగ్రముగ చిత్రించుటకంత యవసరము.

సుందరుడైన పురుషుని చూచుటకై స్త్రీలు పొందు తహతహను సాధారణముగా కవులు రాజసందర్శన ప్రసంగములందు అంతఃపురముల లోని కోలాహలముగా వర్ణింతురు. చంద్రాపీడుని దర్శించుటకై యంతఃపుర స్త్రీలు ప్రాసాదములలో కిటకిటలాడిరి. "లత్తుకలద్దిన వారి యడుగులముద్రలు పడి భూమి చివురుటాకుల మయముగా నుండెను.

సాలక్తక పదకముల విన్యాసైః పల్లవమయైరివక్షితితల మంగనానా మంగప్రభా ప్రవాహేన లావణ్యమయమివ నగరమ్"- శరీరకాంతుల ప్రవాహములచే రాచనగరమంతయు లావణ్యమయముగా నుండెను. చంద్రాపీడుని చూచు తమకమున జెప్పపాటెఱుంగని కన్నులతోనున్న యా యువతీజనహృదయములు అద్దములవలె, జలాశయములవలె స్ఫటిక మణిమయములవలె నుండెను. వానిలో చంద్రాపీడుని యాకృతి ప్రతిబింబించెను. వారిలో మన్మథభావములు చెలరేగెను. ఒకరినొకరు పరిహాసము లాడికొనిరి. రహస్యములు చెప్పుకొనిరి. తత్తరపడిరి. అసూయలు పొందిరి. ఎత్తిపొడుపులు దెప్పిపొడుపులు, విలాసములు, ఈరికలెత్తిన కోరికలు- వీనితో వారి యాలాపములు అతి రమణీయములుగా నున్నవి. ఒకతె మరొక పరవశురాలైన చెలిని హెచ్చరించుచున్నది. "అంతస్సంకల్ప రచిత సురత సమాగమ సుఖరస నిమీలిత లోచనే! సముస్మీలయలోచన యుగళమ్ అతిక్రామత్యయమ్"- "మనసున సంకల్పించిన ఆతనితోడి సురత సమాగమ సుఖ పారవశ్యమున కనులు మూతవడినవేమో అతడు వెళ్ళిపోవుచున్నాడు. కన్నులు తెరువుము చూడుము." ఇవి చక్కని భావచిత్రములు. స్త్రీల వర్ణనములలో బాణుని భావములు రసవాహినులు.

"ఆర్ద్రాలక్తక రసపాటలిత చరణపుటాః కమలపరిపీత బాలాతపా ఇవ నలిన్యః" "తడి యారని లత్తుకరసముతో ఎఱుపారిన పాదయుగములతో ఉదయభానుని కాంతిని గ్రోలిన పద్మలతలవలె నున్న స్త్రీలు తొందఱపాటుచే జాఱిన మొలనూళ్ళు కాలికి అడ్డము తగులగా గొలుసులతో కట్టివేసిన ఏన్గులువలె మెలమెలగా నడచు హొయలు గలవారు.

"పయోధరాంతరాళగళిత ముక్తాలతాః తదను విమలస్రోతో జలాంతరిత చక్రవాకమిథునా ఇవ ప్రదోషశ్రియః" సాయంవేళ వియో

గము పొందిన చక్రవాక మిథునములమధ్య నదీజలమువలె తమయెడము లేని పయోధరములమధ్య ముత్యాలహారము లిరికికొనిన కాంతలరూప ములిట్టి వనేకములు మనోహరముగా చిత్రించబడెను.

అభిసారికలకు పరిజనులతో పనిలేదని తత్కారణములు వర్ణించును. "సమారోపిత శరాసనలస్తక సాయకోఽనుసరతి కుసుమాయుధః" "దూరప్రసారితకరః కరమివ కర్షతిశశీ" "ప్రస్ఖలన భయాత్పదే పదేఽవలంబతే రాగః" "లజ్జాంప్రష్ఠతః కృత్వాపురః సహేంద్రియైర్ధావతి హృదయమ్ నిశ్చయమారోప్య నయత్యుత్కంఠాః" పుష్పబాణుడు తన ధనుస్సు ఎక్కుపెట్టి వెంట వచ్చును. చంద్రుడు తన పొడవైన కరములను ఊతగానిచ్చి గుంజుకొనిపోవును. సడలిపోకుండ అడుగడుగునను రాగము ఆదుకొని నిలబెట్టుచుండును. లజ్జను వెనుకకు నెట్టి యింద్రియములపై స్వారి చేయుచు హృదయము ముందు పరుగెత్తును. ప్రియసమాగమము నిస్సంశయమని చెప్పి ఉత్కంఠ గమ్యమునకు గొనిపోవును.

చంద్రాపీడుని తొలుత చూచినప్పుడు కాదంబరియందలి సంభ్రమమును చాల పదునుగా వర్ణించును. ఒకే వాక్యమున ఏకక్రియాన్వయముతో ఏకైక భావముయొక్క త్రివిధమైన లక్షణములను సూచించును.

"దృష్ట్వా చ తం ప్రథమం రోమోద్గమః తతో భూషణరవః తదను కాదంబరీ సముత్తస్థౌ." ఆతనిచూడగనే మొదట గగుర్పాటు (రోమాంచము) తరువాత ఆభరణముల గలగల, ఆ పిమ్మట కాదంబరి నిలుచుండుటయు జరిగెను. ఈక్రమమున మొదటినుండియు మన్మథభావోదయమే ప్రముఖమైనదన్న ధ్వని యున్నది. మొదట సాత్త్వికోదయము, తరువాత సంభ్రమము, ఆ తరువాత లోకపు మర్యాద. ఈ ప్రథమదర్శనమున కాదంబరియందు పొడమిన మన్మథభావములను వర్ణించుటలో ముగ్ధానాయికా లక్షణమును బాణుడు పరమ సుకుమార

ముగా ధ్వనింపజేసినాడు. మన్మథుని వలననే మేనికి చెమట పట్టెను. అది లేచుటలోని తొందఱవలన నన్నుమిషతో క్రమ్ముకొన్నది. ఊరువులు అదరుటచే నడక సాగలేదు. ఆ అపకీర్తి తన కాలి యందెల రవళిని అనుసరించవచ్చిన హంసల గుంపుపై పడినది. (అనగా హంసలు కాలికి అడ్డమువచ్చుటచే నడక సాగనియుట్లయ్యెనన్న మిష దొరికెను. ఆ అపకీర్తి హంసలది.)

నిట్టూర్పులవలననే చీరె కొంగులు రెపరెపలాడినవి అవి చామరములు వీచిన గాలి కన్నటులాయెను."

స్త్రీలమధ్య పరిహాసములాడువేళ నాయకుని నవ్వు సొగసు "స్ఫురిత కపోలోదరము" లందు చూపెను. నవ్వుచేత ఉబ్బిన చెక్కిళ్ళ కదలిక ఎంతసొగసైన పరిశీలన!

హేమకూటమునుండి తిరిగివచ్చిన మరునాడు కాదంబరి పంపగా కేయూరకుడు చంద్రాపీడునివద్దకు వచ్చెను. కాదంబరిపై చంద్రాపీడునికి గల ప్రీతి కేయూరకునిపై ప్రసరించిన క్రమము వర్ణించుటయు రమణీయమైన ప్రకారము. "ప్రథమమపాంగ విసర్పిణా చక్షుషా, తతో హృదయేన, తతో రోమోద్గమేన, పశ్చాద్భుజాభ్యాం ప్రధావితమ్ ప్రసృతమాలిలింగ గాఢమ్"- మొదట వాలు వాలు చూపుతో, తరువాత హృదయముతో ఆపైన రోమాంచముతో ఆ పిమ్మట సాచిన బాహువులతో కేయూరకుని గాఢముగా కవుగలించుకొనుటకు పరుగులెత్తెను. కేయూరకుడు శృంగారస్థాయి భావమైన రతికి ప్రతీక అని ముందు రసోల్లాస ప్రకరణమున గమనింప నగును.

రాజుల చూపులలోనే పరిజనులకు హెచ్చరిక లుండును. "గచ్ఛంశ్చ ఉభయతః కించిత్కుంచి దివ తిర్యగ్వలిత వదనః పరిజనం విలోకయాం బభూవ." చంద్రాపీడుడు నడచుచు మెడ నటు నిటు ప్రక్కకు త్రిప్పి పరిజనమును చూచెను. ఆ చూపులోని యర్థము ప్రతీహారులకు తెలియును. వారు రాజునకు ఏకాంతము వలయునని గ్రహిం

౨౭. దూరముగా వెళ్ళిరి. ఆ ఏకాంతమున కేయూరకునితో చంద్రా పీడుడు కాదంబరీవృత్తాంతమునుగూర్చి యడిగెను.

బాణుడు కొన్ని వర్ణనముల నెంత సుదీర్ఘముగా చేయునో అంత క్లుప్తముగా నట్టి భావములను వర్ణించును. ఈ వర్ణనలు చాల క్లుప్తముగా నున్నవి. మూడు నాలుగు పదములే. ఈ కుదింపు పాత్రయొక్క కేవిని తెలుపును.

ప్రకృతి మానవ మనోభావములకు దర్పణము. మన మనసులో నెట్లుండునో అట్లే ప్రకృతిలోని మార్పులు మనకు సమన్వయించుచునే యుండును. కథానుగుణమైన చంద్రోదయ వర్ణనములో బాణుడీ రహస్యమును స్ఫురింపజేసెను.

అదే మొదటిసారిగా చంద్రాపీడుడు మహాశ్వేత నచ్ఛోద సరోవరమువద్ద శివాలయములో చూచినాడు. మహాశ్వేత తనగోడు చెప్పుకొనుట, అందుచే నామె మనస్సు కలతపడుట, ఆ తరువాత తన చెలికత్తెయైన కాదంబరికి తనపై గల ప్రేమనుగూర్చి చెప్పుటయు జరిగెను. ఆనాడు చంద్రోదయ మెట్లుండెను?

ఉదయించిన చంద్రునిలో మచ్చ ప్రస్ఫుటముగా నున్నది. అది శోకాగ్నిచే దగ్ధమైన మహాశ్వేత హృదయములోని మధ్యభాగమువలె నున్నది.

మునికుమారుడైన పుండరీకుని వధించిన మహాపాపము మూట కట్టుకొన్నట్లున్నది. చాలకాలముగా దక్షుని శాపాగ్నిచే కరుడుగట్టిన మచ్చను చూపుచున్నట్లున్నది. చిక్కగా విభూతి పులుముబడి తెల్లగా నుండి నల్లజింక తోలుతో సగము కప్పబడిన పార్వతీదేవి వామస్తనమువలె నున్నది. ధూర్జటి జటామండల చూడామణియైన చంద్రుడుదయించగా నానాడట్లనిపించెను. కొంచెము ముదిరిన రాత్రిలో చంద్రుడు ఆకాశముపై సముద్రములో నిసుకతిన్నెపై కూర్చున్నట్లున్నాడు.

సప్తలోకములకు నిద్రామంగళ కలశమువలె నున్నాడు. కలువలు విచ్చుకొన్నవి. దిక్కులు తెల్లబడినవి. తెల్లని శంఖమువలె స్వచ్ఛముగా నున్నాడు. తెల్లని యాతపత్రమువలె నున్నాడు. మానినుల మానములకు శత్రువు. చంద్రుని కాంతులనుండు నక్షత్రముల కాంతులు సన్నగిల్లుచున్నవి. ఈరీతిగా చంద్రోదయము ప్రసంగోచితముగా నున్నది.

ఉజ్జయినీ నగర వర్ణనము, విదిశానగర వర్ణనము, మహాకాళ నాథుని వర్ణనము ఒకటేమిటి బాణుకు వర్ణింపనిది లేదు. వర్ణించినది మనోహరముగా చిత్రించకున్నది లేదు. అవియన్నియు కాదంబరిని చవి చూచినవారు స్వయముగా పనిగట్టుకొని తెలిసికొని నిరంతరము భావించి యానందించవలసినవి.

తండ్రివలెనే కుమారబాణుడును వర్ణనలలో నిపుణుడు. తండ్రి పెట్టిన యొరవడిలో ననేక వర్ణనములు చేసెను. కథను ముగించవలసినవాడు తాను. అందుచే పూర్వకథను నిశితముగా ననుశీలించెనో లేక తండ్రి చెప్పెనో! మరల బాణుడే కుమారరూపమున ఆవర్ణనలు చేసెనా యనిపించును; కథలో పత్రలేఖ, కేయూరకులవంటి పాత్రలయొక్క స్వరూపస్వభావములను వారి వర్ణనలనుండి గ్రహించవలెను. పత్రలేఖ వర్ణనయు, కేయూరకుని వర్ణనయు ప్రక్క ప్రక్కల పెట్టి చూచినచో నిరువురియందు సమానతలు ప్రత్యేకతలుగోచరించును. ఈమె చంద్రాపీడునకు తాంబూలకరంకవాహిని. అతడు కాదంబరీ వీణావాహకుడు. ఈపాత్రలను కుమారబాణుడు తండ్రివలెనే పోషించెను. ఆవిషయము రాబోవు ప్రకరణమునందు చర్చింతును. ఇచట నీప్రసక్తి నెందుకు తెచ్చితిననగా బాణుడు కాదంబరీ కథాశిల్పమున ప్రతిపాత్రను నొక భావప్రతీకగా తీర్చెను. ఆ పాత్రలు కొన్ని జంటలుగా వర్ణించును. పుండరీకుడు కపింజలుడు, మహాశ్వేత కాదంబరి, చంద్రాపీడుడు వైశంపాయనుడు.

ఈ వర్ణనముల గూర్చిన పరామర్శమింతటితో ముగించి మిగిలిన వర్ణనములను ఉదాహరించిన వర్ణనముల క్రమములోపోల్చి చూచుకొనుట స్వానుభవానందమునకు మూలమగును. శృంగార భావ వర్ణనములగూర్చి ప్రత్యేక ప్రకరణమున చర్చించబడినది.

ఈ బహువిధములైన వర్ణనములతో తళతళలాడుచున్న కాదంబరీ సౌందర్యమునకు మూలము తదంతర్గతమైన ఆత్మభూతమైన రసము. తన కథాపరమార్థమైన లక్షణమున కభిముఖీనమైన వర్ణనము, ఆవర్ణనమును మూర్తిగట్టించు గుణాలంకార పాకవిశిష్టమైన శబ్దార్థ సంయోజనమును లేనిచో కావ్యార్థ భావనాజన్యమైన చిత్తవృత్తి విశేషమైన రసవ్యవహారమే లేదు.

బాణుని వర్ణనలు రసమార్గమునకు సోపానములు.

"ఇతివృత్తవశాయాతాం త్యక్త్వా ననుగుణాం స్థితిమ్
ఉత్ప్రేక్షాఽప్యన్తరాభీష్ట రసోచిత కథోన్నయః॥
"సంధి సంధ్యంగ ఘటనం రసాభివ్యక్త్యపేక్షయా
నతు కేవలయా శాస్త్రస్థితి సంపాదనేచ్ఛయా"

[ధ్వన్యా-3-11,12-329 పుట.]



# 6

# కాదంబరీ కథాతత్త్వము

"చత్వారి శృంగాత్రయోఽస్య పాదాః
ద్వేశీర్షే సప్తహస్తా అస్యత్రిధాబద్ధో
వృషభో రోరవీతి మహాదేవో మర్త్యాం ఆవివేశ."

"As there is nothing beautiful but Intelligence and as there is no Intelligence without a soul, He placed a soul into the body of the world and made the world an animal.
As soon as that vast animal began to move, live and think, God looked upon His work and was glad."

— Plato

రజోజుషే జన్మని సత్త్వవృత్తయే స్థితౌ ప్రజానాం ప్రలయే తమః స్పృశే
అజాయ సర్గస్థితి నాశహేతవే త్రయీ మయాయ త్రిగుణాత్మనే నమః॥

[కాదంబరి - 1 శ్లో - బాణుడు]

రజోగుణయుక్తుడై సృష్టికి, సత్త్వగుణోపేతుడై స్థితికి, తమోగుణ నిష్ఠుడై ప్రలయమునకు, కారకుడై యున్న త్రిగుణాత్మకుడు త్రిమూర్తియు నైన పరబ్రహ్మమునకు నమస్కారము.

## కాదంబరీ కథాతత్త్వము

"కాదంబరి" యనుపేరు పెట్టుటచే కథలో ప్రాముఖ్యము కాదంబరికే యన్నది స్పష్టము. కాని యీ కథయందు మహాశ్వేతా వృత్తాంతము కూడ ప్రముఖముగా వర్ణింపబడినది. మహాశ్వేతా వృత్తాంతమే లేనిచో కాదంబరి లేదు. కథ లేదు.

మహాశ్వేతావృత్తాంతమైనను పుండరీకుడు లేనిదే లేదు. పుండరీకుడు పుట్టియుండనిచో అసలుకథయే లేదు. కథకుమూలభూతమైనపాత్ర పుండరీకపాత్ర. ఈ పాత్ర కల్పనలో కవి తన కథాబీజము నంతయు నిక్షేపించెను.

పుండరీకుని జన్మలక్షణము : మహాతపస్వియైన శ్వేతకేతువు త్రిలోకసుందరుడు. ఒకనాడాయన యాకాశగంగలో దేవతార్చనకు పద్మములను కోసికొనుటకై దిగుచుండెను. పద్మములు లక్ష్మని వాసములు గదా ! అచట లక్ష్మి యున్నది. ఈయనను చూచినది. దర్శనమాత్రమున నామెకు సురతసమాగమసుఖము కలిగినది. తత్ ఫలముగా పుత్రుడు కలిగెను. ఆ పుత్రుని లక్ష్మి శ్వేతకేతువునకే సమర్పించెను.

"భగవన్! గృహాణ తవాయ మాత్మజః" "ఇతడు నీయాత్మజుడు. గ్రహింపుము"-అన్నది. ముని వానిని తనకుమారునిగా స్వీకరించెను.

పుండరీకమునుండి పుట్టుటచే వానికి పుండరీకుడని నామకరణము చేసెను. ఉపనయనాదిసంస్కారములు జరిపి వానిని సకలవిద్యావంతుని గావించెను.

పుండరీకుని జన్మప్రకారమిట్లుండుటలో నౌచిత్యమేమి ? లక్ష్మిదేవి శ్వేతకేతుమహర్షి సౌందర్యమును జూచిన మాత్రమున సురత

సమాగమసుఖము పొందినదా ? ఇది సముచితమేనా ? ధార్మికమేనా ? శాస్త్రసమ్మతమేనా ? అట్టిలక్ష్మీదేవి లోకమున కారాధ్యదైవమా ? ఇట్టికల్పనచేసిన కవికావ్యము అసత్కావ్యము కావలసియున్నది కదా! కాని కాదంబరీకావ్యము పండితలోకమున మన్ననలు పొందినదే! దానికి కారణమేమి ? అసలు ఇది అనౌచిత్యమా ! ఇవి యన్నియు నాలోచించినచో బాణుడు కాదంబరీ కథావస్తునిర్మాణమున ఒకనిగూఢమైన తాత్త్వికరహస్యమునిమిడ్చెనని స్పష్టమగును. అది వేదసమ్మతమైనది. శాస్త్రవిహితమైనది. యోగసిద్ధమైనది.

శ్రీమహాత్రిపురసుందరీపర దేవతాతత్త్వప్రతిపాదకమైన "కామకలావిలాస" మనుగ్రంథమున్నది. అందు మహేశ్వరుడు "ప్రకాశమాత్ర తనుః" అనియు పరాశక్తి "శివరూపవిమర్శనిర్మలాదర్శః" అనియు చెప్పబడెను. అనగా పరమాత్మ బింబమనియు, పరమేశ్వరి ఆ బింబము ప్రతిఫలించు నద్దమనియు నర్థము. పరబ్రహ్మము తన సమక్షము నందుండు పరాశక్తి యందు ప్రతిబింబించుట స్వాభావికము. ఈ ప్రకాశ బిందువును బ్రహ్మద్యోతకముగాను, చంద్రమండలాత్మకముగాను శాస్త్రము చెప్పుచున్నది. "విమర్శబిందువు" శక్తిద్యోతకము, అగ్ని బీజము. సూర్యబింబము అద్దమున ప్రతిబింబించినపుడు అద్దమునుండి వెలువడిన మరియొకబింబము మిశ్రబిందువు. ఈ మిశ్రబింబము, బింబ ప్రతిబింబములనుండి ఏర్పడినది. "ప్రధానసూర్యమండలమొకటి. అద్దమందుప్రతిబింబము రెండవది. గోడయందున్న తేజోబిందువు మూడవది. ఈ మూడవ బిందువుయొక్క ఉత్పత్తికి సూర్యబింబమును అద్దమును సమానకారణములుగా నున్నవి. ఏది లోపించినను ఈ మూడవబిందువు కలుగనేరదు." అటులనే జగదుత్పత్తికి ఈశివశక్తులు ఇద్దఱును సమాన కారణములుగా నున్నారని చెప్పిరి. బింబమునకెదురుగా నద్దమున్నప్పుడు అద్దమునకెదురుగా బింబమున్నప్పుడు మాత్రమే స్వాం

తర్గతప్రతిబింబప్రకాశతకు అద్దము సమర్థమై యున్నది. అటులనే పరా శక్తికిని పరమశివసాన్నిధ్యము లేనప్పుడు లినయుండియుండియున్న ప్రపం చోల్లసన సామర్థ్యము సంభవింపనేరదు. అట్లే పరమశివునకును పరా శక్తి సంయోగములేనిది స్వరూపజ్ఞానము కలుగనేరదు. కాన కామేశ్వరీ కామేశ్వరద్వంద్వమువలన సకల జగజ్జాలము నుత్పన్నమగుచున్నది అని యాగ్రంథమున వివరింపబడియున్నది.

శ్వేతకేతు వున్నాడు. లక్ష్మియున్నది. శ్వేతకేతువును చూచిన మాత్రమున లక్ష్మికి సురతసమాగమసుఖము కలిగినది. ఆమెకు ఏది ఆసనముగానుండెనో ఆ పుండరీకముననే పుత్రుడుదయించెను. ఈపుత్రు నందు శ్వేతకేతులక్షణ మున్నది. లక్ష్మీలక్షణమున్నది. ఇతడు మిశ్ర ప్రకృతి. ఈ మిశ్రబిందువునుండి మరియు నెన్నో బింబములుదయించును. ఇచట శ్వేతకేతువు పరమేశ్వరునకు ప్రతీక. లక్ష్మి పరమేశ్వరీప్రతీక. పుండరీకుడు "స్ఫుటశివశక్తిసమాగమబీజాంకురరూపము"- పుండరీకు డన్నపేరు, రూపము, గుణములను గూర్చి తరువాత విచారింతము.

ఇప్పుడు విచారింపవలసినది బాణుడు— ఇట్టికల్పనను ద్దేశించి కావలెననియే యిట్లుచేసెనా? ఇందుకు బాణుని వాక్యములే యనుశీ లించుట యుచితము.

"అస్తి ఖలు సకలత్రిభువన ప్రఖ్యాతకీర్తిః అత్యుదార తపాః సురాసుర సిద్ధ బృందవందిత చరణయుగళో మహాముని: దివ్యలోక నివాసీ శ్వేతకేతుర్నామ. తస్య చ భగవతః సురాసుర లోకసుందరీ హృదయానందకరమ్ అశేష త్రిభువన సుందరమ్ అతిశయిత నలకూబ రమ్ రూపమాసీత్......... కదాచిత్ .........తం కమలవనేషు సతత సన్నిహితా వికచ సహస్ర పత్ర పుండరీకోపవిష్టా దేవీ లక్ష్మీర్ద దర్శ. తస్యాస్తు తమవలోకయన్త్యాః ప్రేమమందం ముకుళితేనానంద బాష్పభరతరంగతరలతారేణలోచన యుగళేన రూపమాస్వాద

యస్యాః......మన్మథ విక్రృతమ్ మన ఆసీత్, ఆలోకనమాత్రేణ చ సమాసాదిత సురత సమాగమ సుఖాయా స్తస్మిన్నే వాసనీకృతే పుండరీకే కృతార్థతాసీత్ తస్మాచ్చ కుమారః సముదపాది...తతస్తము త్సంగే నాదాయ" "భగవన్! గృహాణ తవాయమాత్మజః" "ఇత్యుక్త్వా తస్మై శ్వేతకేతవే దదా."

పై గద్యమునందు శ్వేతకేతువునకు వాడబడిన విశేషణము లన్నియు ఈ క్రింది శివశక్తితత్త్వ ప్రతిపాదకములైన శ్రీ విద్యారహస్య గ్రంథమైన కామకలావిలాసమునందు చెప్పబడిన మొదటి రెండుసూత్రములతో పోల్చి చూచుకొనవలెను.

"సకల భువనోదయస్థితిలయ లీలావినోదనోద్యుక్తః
అంతర్లీన విమర్శః పాతు మహేశః ప్రకాశమాత్రతనుః॥
[కా. క. వి. సూ. 1]

శ్వేతకేతువు సకలత్రిభువన ప్రఖ్యాతకీర్తి సురాసుర సిద్ధబృంద వందిత చరణయుగళుడు. ఈతని కీర్తికి మూలము "సకలభువనోదయ స్థితి లయమయ లీలావిలాసి" యైన పరమేశ్వరుని విలాసమువంటి విలాసమే. పుండరీకుని మూడుజన్మలకు మూలకారణమాయన. ఆతని ప్రతిజన్మము నందలి స్థితిని కనిపెట్టియున్న వాడాయన. అతని నిజస్వరూపలబ్ధికై శాపప్రాప్త శరీరములను లయింపజేసిన వాడాయన.

పుండరీకమనగా పరమేశ్వరుని నాభికమలమునకు ప్రతీక. కాదంబరీ కథాప్రపంచమున తొలిసృష్టి పుండరీకుడే. అచటినుండి వానిమూలమున బహువిధపాత్రములు, వానిలోకములు నామరూప గుణములు నివి యన్నియు విస్తరించినవి. మరియు శ్వేతకేతువు సురాసుర లోకసుందరీ హృదయానందకరమైన రూపము కలవాడు. అనగానేమి? సురాసుర లోకసుందరీ హృదయముచే గ్రహింపబడు రూపసంపద గలవాడు, అనగా సుందరీహృదయము అద్దము. ఇతని రూపము ప్రకాశమాత్ర

తనువు. మరియు పరమేశ్వరుడు "అంతర్లీన విమర్శః"- విమృశ్యత ఇతి విమర్శః- ప్రపంచః అంతర్లీనః అంతర్గతో యస్య సః- శ్వేతకేతువు సురాసురలోకసుందరీ హృదయము నుత్తేజపరచు అంతర్లీనమైన శక్తి కలవాడు. ఆయన మహాముని. ఇట్టి ప్రకాశమాత్రమైన తనువు లక్ష్మి కనులలో బడినది.

"లోచన యుగళేన రూపమాస్వాదయన్త్యా మన్మథ వికృతిమ్ మన ఆసీత్." రూపగ్రహణ సామర్థ్యము ఆదర్శమునందున్నది. పరాశక్తి "శివరూప విమర్శనిర్మలాదర్శః" ఇచ్చట లక్ష్మి శివస్వరూపుడైన శ్వేతకేతు రూపవిమర్శ నిర్మలాదర్శము. ఈ ఆదర్శలక్షణము ఈమె లోచన యుగళముచే సూచితమైనది. ఆయనను చూడవలెనని యీమెగాని ఈమెను చూడవలెనని యాయనగాని యారాటపడినది లేదు. కాని యద్దము తన సన్నిధిలోని వస్తువులను తనలో గ్రహించుట స్వాభావికము. అద్దముచే గ్రహింపబడుటకు బింబముయొక్క ప్రయత్నముండవచ్చును. ఉండకపోవచ్చును. అద్దమున్నచో ప్రతిబింబించుట బింబస్వభావము. అందుచే నిచట శ్వేతకేతువు రూపము త్రిలోకసుందరీహృదయముచే గ్రహింపబడుట స్వాభావికము. అద్దము ఎదుర నున్నచో దృశ్యముయొక్క సర్వలక్షణము నద్దమునందు గోచరించును. అపుడు అద్దము దృశ్యమును తనయందు చూపును. తనయందు ప్రతిబింబించిన దృశ్యము బింబముదేకాని తనదికాదు. అది అద్దమని తెలిసినప్పుడు అందలి దృశ్యము బింబముదే. కనుక లక్ష్మి "ఆలోకన మాత్రేణ చ సమాసాదిత సురతసమాగమ సుఖ" మైనది - అనుట అద్దమునందలి ప్రతిబింబలక్షణమని గ్రహించవలెను. ఈ ప్రతిబింబమున కాధారమైన యద్దముయొక్క యాధారమే లక్ష్మి కూర్చుండిన పుండరీకము. అద్దము యొక్క "కృతార్థత" దృశ్యమును చూపుటయే. "తస్మిన్నేవాసనీకృతే పుండరీకే కృతార్థతాసీత్ తస్మాత్స కుమారః

సముపాది" ఆ పుండరీకమునుండి (అద్దముయొక్క చిత్రమునుండి) కుమారుడు (ప్రతిబింబము – ఆత్మావై పుత్రనామాసి) పుట్టెను. ఈ ప్రతిబింబము బింబములేనిదే యద్దమునుండి పుట్టదు. కనుక దీనికి బింబము నద్దము కూడ కారణములే– కనుకనే "గృహాణ తవాయమాత్మజః" అన్న లక్ష్మి వాక్యమునందలి యాథార్థ్యమును శ్వేతకేతుముని కాదనలేదు. సృష్టిహేతువైన తాను పుండరీకుని స్థితికారకుడు కూడనాయెను. వానిని సకలవిద్యా నిష్ణాతుని జేసెను. "బ్రహ్మాత్వే సృజతే లోకాన్ విష్ణుత్వే పాలయత్యపి రుద్రత్వే సంహరత్యేవ త్రిస్రోఽవస్థాః స్వయమ్భువః" అన్న స్మృతి యిచ్చట స్మరింపదగినది.

"సాజయతి శక్తిరాద్యా నిజసుఖమయ నిత్యనిరుపమాకారా
భావి చరాచర బీజం శివరూప విమర్శ నిర్మలాదర్శః." (కా.క.వి.సూ. 2)

ఇచట పరమేశ్వరి "నిజసుఖమయ నిత్య నిరుపమాకార" అని చెప్పబడినది. ఆమెయే భావి చరాచరబీజము. శివసంయోగమున నీమెయందు భావి చరాచర బీజత్వ మేర్పడుచున్నది. "నిజసుఖమయ నిత్య నిరుపమాకారా". ఇట్లు చెప్పినందున నిజసుఖము బ్రహ్మానంద స్వరూపము. ప్రపంచమందు సర్వానుభవములోనున్న సుఖములు విషయ సుఖములు. ఇవి మరియొక వస్తుసంబంధమువలన కలుగునవి. అనిత్యములు. ఇవి బ్రహ్మానందముయొక్క ప్రతిబింబములుగా నున్నందున బింబభూతమైన సుఖము నిజసుఖమనియు ప్రతిబింబములు మిథ్యలనియు ప్రతిబింబ కారణములు నిజమైన వస్తువులనియు సర్వానుభవముగా నున్నది. అట్టి బ్రహ్మానందమే స్వరూపముగా గలది సృష్ట్యాదిని అంతమునందును కలదిగాన "నిత్య" యనబడుచున్నది. తనకు సమానము గాని యధికముగాని యగు మరియొక వస్తువులేనిది. అనగా "ఏకాకి" యని తేలుచున్నది." [చూ. కామకళావిలాసము.]

శ్వేతకేతువు లక్ష్మియు శివశక్తులనగానే "బహుస్యామ్ ప్రజాయేయేతి" (తైత్తిరీయము)

"తదైక్షత బహుస్యామ్ ప్రజాయే యేతి" (ఛాందోగ్యము)
"సం ఈక్షత లోకాను సృజత" (ఐతరేయము)
"స తస్మిన్నాకాశే స్త్రియ మాజగామేతి" (బృహదారణ్యకము)
ఇత్యాది శ్రుతులను స్మరింపవలెను.

సర్వశక్తి "పరబ్రహ్మ" అను శ్రుతివలన విమర్శాత్మకమైన బ్రహ్మ వస్తువునందు సకలశక్తులు నిబిడీయున్నవి. బ్రహ్మాండావిర్భావకాలము సమీపించినప్పుడు నిస్తరంగ సముద్రమందు తరంగములవలెను, రజ్జువునందు సర్పభ్రమవలెను, శుక్తియందు రజతభ్రాంతివలెను, స్థాణువందు పురుషారోపణవలెను; ఆత్మయందు స్పందశక్తి యుద్రేకించినది. అదియే "ఈక్షణకాలము" అని వ్యవహరింపబడుచున్నది. ఆ స్పందమే "ఇచ్ఛాశక్తి" యనబడును. అట్టి సంకల్పము కలిగిన వెంటనే ప్రతిబింబకారణమగు జ్ఞానశక్తి పురోభాగమునందావిర్భవించినది. అదియే విమర్శబిందువుగా నున్నది. మొదట చూపించిన ప్రకాశబిందువునందు లీనముగానున్న విమర్శశక్తి భావి బ్రహ్మాండాదిని కార్య నిర్మాణము కొఱకు ఆ ప్రకాశబిందు ప్రభయే ప్రతిబింబముగా ఈ విమర్శబిందువు స్పష్టమైన భేదము నభేదమును కలదియై యావిర్భవించినది. ఈ ప్రతిబింబమునకు ప్రకాశబిందువే కారణము. నిజమైన వస్తువు కాన ప్రథమ బిందువునకు కారణములేదు. ఈ విమర్శబిందువు తనయందుదయించిన ప్రతిబింబమునకు ఆదర్శమువలె కారణమును కార్యరూపమైన ప్రతిబింబమును తానే యగుచున్నందున భావి బ్రహ్మాండమునకు కార్యకారణరూపముగా నున్నదని తెలియుచున్నది.

[చూ. కా. కళా.. వి]

ఇట్టి తత్త్వమును భావించి బాణుడు పుండరీకపాత్రను సమస్త కథకు మూలభూతముగా సృష్టించెను. పరమేశ్వరసంకల్పము వంటిదే కవిసంకల్పము.

ఇక్కడ లక్ష్మి యని చెప్పనేల? ఆ లక్ష్మి యనెడు నామెకు సదాశివ సంయోగరూపమైన ఈ వ్యాఖ్యానమునకు పొంతనయెట్లని సందేహము కలుగవచ్చును. "బృహన్నారదీయము" నందలి ఈ శ్లోకమును చూతము—

"ఉమేతి కేచిదాహుస్తామ్ శక్తిం లక్ష్మీం తథాపరే
భారతీత్యపరే చైనామ్ గిరిజేత్యంబికేతి చ."
ఇత్యాదిగా నున్నది.
కాళికాపురాణమున
"మాయైకా భిన్నరూపేణ కమలాఖ్యా సరస్వతీ
సావిత్రీ సా చ సంధ్యా చ భూతకార్యశ్చ భేవతః"

అని యున్నది. లక్ష్మి, ఉమ, శక్తి, భారతి, మాయ, సావిత్రి, సంధ్య, అన్నియు ఆ పరాశక్తి నామములే.

బింబము సత్యము. అది సత్త్వగుణవిశిష్టము. ప్రతిబింబము దాని ఛాయ. అది తమోగుణము. ఈ సత్త్వతమోగుణముల సమ్మేళనమున రజోగుణమేర్పడుచున్నది. తమలపాకునకు ముక్తాచూర్ణసంయోగమున తాంబూలమునందెఱుపువచ్చినట్లు. ఈ మిశ్రబిందువు పుండరీకుడు రజోగుణవిశిష్టుడు. ఈ గుణములు భిన్నములు, నభిన్నములును. రజోగుణము వ్యక్తినిష్ఠమెప్పుడు సత్త్వతమోగుణము లుండవని కాదు. దానిభాగ మత్యధికమనియే!

పుండరీకుని వాసనలు : ఉత్పత్తికి లోకదృష్టాంతముగానున్న పుండరీకము కథలో పాత్రగా పుండరీకుడైనాడు. అహంకారమునుండి అన్నితత్త్వములు ఆవిర్భవించినట్లే వీనియందు సర్వేంద్రియములు గుణ

ములు జన్మసంస్కారసముపాత్తములైనవి. ఆ వాసనలగుత్తియే ప్రకృతి. (నందనవన దేవతారూపమున) యీతనికి పారిజాతపుష్పములగుత్తిని ఆ సౌందర్యమునకు తగినదని చెప్పియిచ్చినది. వాసనలచే మానవుడు కర్మబంధమున తగుల్కొనుచున్నాడు. ఒకసూర్యుడు అనేకఉపాధుల యందు అనేకములుగా ప్రకాశించుచున్నట్లు ప్రతిబింబమునుండి అనేక ప్రతిబింబములు కూడ నేర్పడుచున్నవి. ఇవి మూలబింబము యొక్క కాంతిప్రసారముచే ప్రకాశించునవి.

పుండరీకుడు అచ్ఛోదసరోవరమున స్నానమునకై వచ్చెను. ఈతనిరూపమెట్లున్నది ? "సకలత్రిభువనదర్శనాభిరామము"గానున్నది. ఇది తండ్రిలోని లక్షణము.

మహాశ్వేత ఆకర్షణ : ఈ పారిజాతపుష్పముల గుత్తినుండి వచ్చినవాసనలు మహాశ్వేతి నాకర్షించెను. తండ్రిరూపము లక్ష్మిని ఆకర్షించినట్లు ఈతని యీ వాసనలు మహాశ్వేతనాకర్షించినవి.

విధి యనగా పరమేశ్వరసంకల్పము కదా! ఆ విధిప్రాబల్యముచే జీవుని యందలి ప్రవృత్తులు సంస్కారములు నేర్పడును. ప్రతి కర్మకు ఫలముండును. వనదేవత పూలగుత్తి నిచ్చినది. మునికుమారుడు బ్రహ్మచారి. పూవును ధరించుటేమి! బలత్కారముగా ఆమె యీ పూలగుత్తిని చెవిలో తురిమినది. ఈ కర్మవాసన తనయందొక యాకర్షణకు మూలమైనది. మహాశ్వేత యీతనిని వెదకికొనుచు వచ్చినది. మరల నిచట ద్వంద్వము. మహాశ్వేత-పుండరీకుడు. ఈ పరిమళమున కామె మోహపడినది. అనగా మొదట వాసనలచే ఆకర్షణ. ఈతనిని చూచిన తరువాత ఇతని రూపమునందు మహాశ్వేత మోహపడినది. పుండరీకుడామెను చూచి మోహపడినాడు. ఈ వాసనలంతయిష్టమైనచో ఈగుత్తి నీవే ధరింపుమని యామె చెవిలో తురిమినాడు. అప్పుడేమైనది ?

బ్రహ్మచర్యస్ఖలనము : మునికుమారునిలోని బ్రహ్మచర్యము స్ఖలితమైనది. తనకు తెలియకుండ జరుగుచున్నది. అదియే యీతని చేతిలోని స్ఫటికాక్షమాల జారిపోవుట. ఆ జారిపోవుచున్న స్ఫటికాక్షమాలను (బ్రహ్మచర్యమును) మహాశ్వేత తనదిగా చేసికొన్నది. ఆమె దానిని తనకంఠమున ధరించినది. ఆమె తల్లి స్నానము చేసి యింటికి పోవుచున్నది. మహాశ్వేత పోవలెను. అప్పుడామె కంఠమున ఈతని స్ఫటికాక్షమాల (బ్రహ్మచర్యము) తగుల్కొని యున్నది. కపింజలుడు (పుండరీకుని మిత్రుడు) ఈతని బ్రహ్మచర్యస్ఖాలిత్యమును గుర్తించినాడు. "ఏమిరా! నీ వివేకమేమైనది? నీ చదువేమైనది?" ఇత్యాదిగా చివాట్లు పెట్టినాడు.

అక్షమాల - ఏకావళి : పుండరీకుడు లేనికోపమును తెచ్చుకొని "అది కాదుమిత్రమా! ఈమె నా అక్షమాలను కాజేసికొనిపోవుచున్న యపరాధమును సహించ లేకున్నాను" అన్నాడు. ఆమెను జూచి "నాఅక్షమాలనీయకుండ నడుగైనకదలుటకుపీలులే"దని చుంబన భావస్ఫూర్తితో (అదురుచున్న పెదవులతో) మందలించెను. అప్పుడామె "ఇదిగో! స్వామీ! మీ అక్షమాల" అని యిచ్చినది. ఆమె యేమిచ్చినదో తానేమి గ్రహించెనో! తెలిసికొను స్థితిలో నున్నాడా? అదియే గ్రహించెను. అది యేమి మాల? ఆమె మెడలోని యొంటిపేట ముత్యాలహారము. ఈతని అక్షమాల ఆమె మెడలోనే యున్నది. ఇది యొక చిత్రమైన సన్నివేశము. ఈ అక్షమాలావినిమయమున మహాశ్వేతాపుండరీకులబ్రహ్మచర్యవినిమయము సూచితమైనది. ఇచట మహాశ్వేతా పుండరీకులకు బింబప్రతిబింబభావము కూడ సూచితమైనది. ఇది యెట్టిది? మిశ్రబిందువు నందును ప్రకాశమున్నది. ఈ ప్రకాశము ప్రకాశవిమర్శబిందువులనుండి వచ్చినది. ఇప్పుడు జీవసృష్టిలో

మిథునభావమెట్లేర్పడుచున్నదో! దీని పరస్పరానుబంధ మెట్టిదో ఈ అక్షమాల ఏకముక్తావళీ వినిమయమున కవి సూచించెను.

ఇంత తాత్త్వికమైన విషయమును శృంగారరసము పొంగులెత్తెడు సన్నివేశమునందు నిక్షేపించుట బాణునకే చెల్లినది. ఇది శృంగారరసము. మహాశ్వేతాపుండరీకులు ఆలంబనవిభావములు. ఈ మాలల వినిమయము ఉద్దీపనవిభావము. అహో! ఆ మన్మథభావవిజృంభణమేమి! ఆ ప్రేయసీప్రియులేమి! అచట సహృదయుడు శృంగారరసమహోదధిలో మునిగి పోవును. ఈ తత్త్వవిచారణ రసాస్వాదనలో నుండదు. కాని విమర్శకుడు ఈ వృత్తాంతము ననుశీలించును. సత్యము బ్రహ్మపదార్థము వంటిది. సన్నివేశము లోకము వంటిది. జగత్తు మిథ్య. బ్రహ్మ సత్యము. మహాశ్వేతాపుండరీకుల ప్రణయము వారితో నంతమైనది. కాని వారి వృత్తాంతము నందలి సత్పదార్థమైన యీ తత్త్వము నిత్యమైన సత్యము. ఈ సత్యము చుట్టును నల్లిన కథ లోపలి జీవము చేత ప్రకాశవంతమైనది.

ఈ స్థితివలన ఆ కథ కాలమున నిలిచినది. అందరు లోకము నందే రమింతురు. కాని యీ రమింపజేయువాడు భగవంతుడని తాత్త్వికు లెరుగుదురు. తాత్త్వికులను విశ్వసించినవారు నమ్ముదురు.

లోకమునందలి శరీరములకు శైథిల్యమున్నది. అవి కాలము చెల్లినచో నశించునవి. కావ్యశరీరము కవి వాగమృతముచేత క్షతి లేనిది. ఇందలి పాత్రలు కవిచే సృష్టింపబడుటయేగాని వానికి క్షతి లేదు. కవి యనగా నట్టి కావ్యములు వ్రాసినవాడే కవి.

ఈ మహాశ్వేతా పుండరీకుల వృత్తాంతము నందలి ప్రాణభూతమైన తత్త్వము ఆ పాత్రలను నేటికిని సజీవముగానుంచినది. వారి స్థానము శృంగార రసాలంబనముగా శాశ్వతమైనది. లోపల ఈ సద్విషయమున్నదికదా! ఇదియే యందలి జీవము.

కాదంబరీ-చంద్రాపీడులు :

కాదంబరీ చంద్రాపీడులున్నారు. చంద్రాపీడుడు చంద్రుని యవతారము. చంద్రుడు స్వయంద్యోతనుడు. బ్రహ్మద్యోతకమైన శ్వేతకేతువు వలెనే చంద్రుడును ప్రకాశబిందువు. చంద్రాపీడుడు శాపలక్షణముచే పార్థివమైన తనువుకలవాడు- తేజోలోకమున ఆతని దివ్యత్వమే భాసించినది. అట్టి ప్రకాశబిందువు గంధర్వలోకమున కన్యకాంతఃపురమును ప్రవేశించినది. ఆ కన్యకాంతఃపుర మెట్లున్నది ?

"అసంఖ్యేయ నారీ శతసహస్ర సంబాధమ్, స్త్రీమయ మపర మివ జీవలోకమ్, ఇయత్తాం గ్రహీతు మేకత్ర త్రైలోక్యస్త్రైణమివ సంగృహీతమ్ అపురుషమివ సర్గాంతరమ్,......అంగనా ద్వీప మివ అపూర్వముత్పన్నమ్......అనేక కల్పకల్పనార్థ ముత్పాద్యస్థాపితమివ అంగనాకోశమ్ అతి విస్తారిణా యువతిజన లావణ్యప్రభాపూరేణ ప్లావిత దిగంతరేణ సించతేవామృత రసవిసరేణ దివసమ్" ఈవర్ణన మేమి! పరమాత్మ తాను రెండుగా నైనప్పుడు ఒక భాగము పురుష భాగము రెండవది స్త్రీ భాగము.

"స వై నైవరేమే తస్మాదేకాకీ న రమతే
స ద్వితీయ మైచ్ఛత్, స హైతావాన
యథా స్త్రీ పుమాంసౌ సంపరిష్వక్తౌ
స ఇదమేవాత్మానం ద్వేధా పాతయత
పతిశ్చ పత్నీ చా భవతామితి" [బృహదారణ్యకమ్]

ఈ కన్యకాంతఃపురము పుంజీభూతమైన స్త్రీ లోకము. ఇది ఆదర్శము (అద్దము) యొక్క చిత్రము. "శివరూప విమర్శ నిర్మలాదర్శః" అటువంటిది. ఇందు బింబగ్రహణసమర్థమైన యొక లక్షణమున్నది. ఆ లక్షణములయొక్క మూర్తియే కాదంబరి. "కల్పలతా నివహేనేవ కన్యకాజనేన పరివృతాం......మహా వరాహదంష్ట్రావల

మ్బిసీమివ మహీం...... త్రిభువనేనేవ పరివృతామ్......" కాదంబరి యట్లున్నది. పుంజీభూతమైన స్త్రీ సౌందర్యము కాదంబరి. ఆ యద్దము నందు పుంజీభూత పురుషసౌందర్యము చంద్రాపీడుడు ప్రతిబింబించి నాడు. చంద్రాపీడుని యందామె సౌందర్యము ప్రతిబింబించినది. దాని వలన నతడు పొందిన సుఖమెట్టిది? ఆతనికది సురతసమాగమసుఖమును కల్పించినది.

"దేహప్రభా సంపర్కమపి సురతసమాగమసుఖమకల్పయత్"- ఈ ఉపమానమును శ్వేతకేతు సందర్శనమున లక్ష్మీదేవి పొందిన యనుభూతితో సమన్వయించి చూచుకొనవలెను. లక్ష్మి విషయము చూడుడు. "ఆలోకనమాత్రేణ చ సమాసాదిత సురతసమాగమసుఖా యాః తస్మిన్నేవాసనీకృతే పుండరీకే కృతార్థతాసీత్"- అచట ఏ పద ములు ఏ అనుభూతి వర్ణనము చేసెనో యిచటను నట్లే! ఈ ప్రథమ సమాగమము నందలి విశేషముచేత- "చంద్రమా మనసో జాతః" అన్న వైదికమైన చంద్రుని తత్త్వమును ప్రాతిపదికగా జేసికొని కవి యిచట చేసిన చంద్రాపీడ పాత్రకల్పనము భావింపవలసియున్నది.

కాదంబరి తల్లి మదిర. ఆమె అమృతమునుండి యుత్పన్నమైన అప్సరసల జాతికి చెందినది. కాదంబరియొక్క అమృతమయమైన లక్షణ మిది. చంద్రుడు అమృతమయుడు. ఈ ఉభయులయందు సహజమైన యమృతత్వ లక్షణమిట్లున్నది. ఇచట చంద్రాపీడుడు చంద్రుని యవ తారము. పార్థివమైన లక్షణమితనిలో నున్నది. అచ్ఛమైన యమృత వికారము కాదంబరి. కనుక ఆమె యందు దేహప్రభయున్నది. అది యమృతమయమైనది. చంద్రాపీడుని యందు తత్ప్రభా సంపర్కమే సురత సమాగమ సుఖము కల్పించినది. అనగా నమృతము చంద్రుడు సహజ సంయోగము పొందినట్లున్నది. సృష్ట్యాదియందు ప్రకాశబిం

దువునుండి విభాగము పొందిన మూలశక్తి పరాశక్తి స్వరూపము. అది తేజోమయము.

"ఆదిత్యవర్ణం సువర్ణజ్యోతిః"- అని వేదమున వర్ణింపబడినది.

ఈ పారమేశ్వరీ శక్తికి సువర్ణజ్యోతీ రూపమునకు ప్రతీక కాదంబరి. అచ్ఛమైన చంద్రుడు బ్రహ్మాద్యోతనుడే. శాపముచే నవతారమునెత్తిన చంద్రుడు అనగా చంద్రాపీడుడు విలాసవతియందు ప్రతిఫలించి యుదయించినవాడు. అందుచే నిచట చంద్రాపీడునియందు మిశ్రబిందులక్షణ మేర్పడినది. ఈ మిశ్రబిందువునం దేమున్నది? చంద్రత్వము + పార్థివమైన తనువు. ఈ పార్థివమైన తనువునందు అమృతమయ ప్రభాసంపర్కముచేత దివ్యత్వమేర్పడినది. "దివ్ - ప్రకాశే"- చంద్రాపీడుని శరీరమునకు కాదంబరీ సంపర్కమున నిట్టి కాంతి యేర్పడుచున్నదని యింకను స్పష్టముగా కవి సూచించిన ఘట్టమును చదువుదము.

వైశంపాయనుడు చనిపోయెనన్నవార్త విన్నంతనే చంద్రాపీడుని హృదయము బ్రద్దలయ్యెను. అతనిశరీరము నేలబడెను. అప్పుడతని పరిజన మతనిమూర్తిని చూచి గగ్గోలుపడిరి. "భగ్నేవాస్యగ్రీవా న మూర్ధానం ధారయతి ... నాంతఃప్రవిష్టతారకే సమున్మీలయతి విలోచనే న వా యథావస్థితపతితానాం గాత్రాణామావరణం కరోతి. "అతని మెడ వ్రాలిపోయినది. గ్రుడ్లు లోనికిపోయి కన్నులు తేలవేసినాడు." ఆ స్థితిలో కాదంబరివచ్చి యాతని చరణములను స్పృశించినది. "తత్కరస్పర్శేన ఉచ్ఛ్వసితఇవ చంద్రాపీడదేహాత్ ఝడితి తుహినమయమివ సకలమేవ తం ప్రదేశం కుర్వాణం, అవ్యక్తరూపం కిమపి చంద్రధవళం, జ్యోతిరేవోజ్జగామ." ఈమెతాకుటతోడనే ఆ శరీరమునందు చైతన్యము వచ్చినది. ఆతని శరీరమునుండి యేదియో యవ్యక్తరూపమైన హిమమయమైన చంద్రునివలె తెల్లనైన జ్యోతి వెలువడినది. ఆమె స్పర్శలోని యమృతలక్షణమది. చంద్రుని మాటలు ఆకాశ

మున వినిపించినవి. "అమ్మాయీ! మహాశ్వేతా! నీ యొక్క పుండరీకుని శరీరము నా లోకమున నా తేజస్సుచే రక్షింపబడుచు శాపవిమోచనానంతరము నీసమాగమమునకై కాపాడబడుచున్నది. ఈచంద్రాపీడ తనువు నా తేజోమయమైన శరీరము. "మత్తేజోమయమ్ స్వతఏవావినాశి" సహజముగా నశింపని లక్షణముకలది. ఈ కాదంబరీస్పర్శచే ఆప్యాయమానమగుటచే మరి క్షతియే లేదు. పరకాయప్రవేశము చేసిన యోగిశరీరము వంటిదిది." అని చెప్పెను. ఈరీతిగా చంద్రాపీడునియందు కాదంబరీస్పర్శము అమృతమయమైన ప్రభావమును కల్పించినది. కథలోని ప్రధానపాత్రలు మహాశ్వేతాపుండరీకులు కాదంబరీ చంద్రాపీడులు రెండుజంటలు.

వీరి కథ యంతయు ప్రణయకథయే. చంద్రుడే చంద్రాపీడుడైనాడు, చంద్రుని ప్రతిబింబము పుండరీకుడైనాడు. "వికీర్ణతరమానన్నావృతపదమ్ మునిత్వం''

కాదంబరి అమృతమునుండి పుట్టిన అప్సరసకూతురు. మహాశ్వేత చంద్రకిరణముల నుండి పుట్టిన అప్సరసకూతురు. కాదంబరి యమృతము. చంద్రాపీడుడు అమృతపు గూడు. పుండరీకుడు చంద్ర ప్రతిబింబము. మహాశ్వేత చంద్రకిరణజాలము. చంద్రకిరణజాలమునందు చంద్రునిప్రభావమున్నది. చంద్రప్రతిబింబమునందు చంద్రత్వభ్రాంతి యున్నది. ఈరెండును నట్టివి? లోకమున ప్రతిమానవునియందు భగవదంశ యున్నది. అట్టిది. లౌకికమానవమిథునలక్షణమునకు ప్రతీక—మహాశ్వేతాపుండరీకమిథునము. మాయావరణమున ప్రవేశించిన పరమాత్మ చంద్రద్యోతనుడని శాస్త్రము చెప్పుచున్నది. అట్లే మాయావరణమునందలి పరమేశ్వరుని స్త్రీభాగము అగ్నిద్యోతనము. ఇది సృష్ట్యాది పరమేశ్వరసంకల్పసిద్ధమైన మిథునమునకుప్రతీక— కాదంబరీ చంద్రాపీడుల జంట.

ఆదిదంపతులైన లక్ష్మీనారాయణులు గౌరీశంకరులు సరస్వ చతుర్ముఖులు అనపాయులు. వారి సృష్టియైన యీ జగత్తులోని అశేషజీవజాలమునందలి స్త్రీపురుషుల జీవితము కర్మపరంపరాబద్ధము. పుట్టుచునే జీవులలో కర్మానుబంధమేర్పడుచున్నది. వాసనలు పెరుగుచున్నవి. వీనిలోబడి పుణ్యపాపములు చేసి జీవుడు సుఖదుఃఖములు పొందుచు అనేకములైనజన్మల నెత్తుచున్నాడు. ఈ జన్మలకు అంతులేదు. దివ్యజన్మము కావచ్చు. మనుష్యజన్మము కావచ్చు. తిర్యగ్జన్మము కావచ్చు. క్రిమికీటకాదిజన్మము కావచ్చు.

జీవితమే శాపము. బంధము. జ్ఞాని దీనినుండి విముక్తుడగుచున్నాడు. అజ్ఞాని మరియు శాపములలో బంధములలో కూరుకొని పోవుచున్నాడు. తానే కాదు. తనతోబాటు ఈ సంసారచక్రమున భగవంతుడు కూడ నున్నాడు. ఆ భగవంతునకు ఎన్ని రూపములు! ఎన్ని లక్షణములు! ఎంత సంసారము!

కృష్ణుడుగా పుట్టును. తల్లి దండ్రి యుందురు. అన్న యుండును. చెల్లెలుండును. ఇది యంతయు పరమేశ్వరుని లీల. సంకల్పానుగుణము. మాయావరణమున జొచ్చిన భగవంతునకైనను నిది తప్పదు. కాని యాయన కది తెలియును. మామూలు మనుష్యులకు తెలియదు. మామూలు మనిషిగా భగవంతుడే యవతరించినను నాయనకు కూడ తెలియదు. శ్రీరాముని యవతారమంతియే కదా! "ఆత్మానం మానుషం మన్యే రామం దశరథాత్మజమ్"– అన్నాడు. "కోఽహం?కుతోఽహం?" ఇవి యేవియు తెలియవన్నాడు.

ఈ కాదంబరి కథలో నేమిదైనది. పుండరీకుడట్లు పుట్టెను. మహాశ్వేతను జూచుట ప్రేమలోపడుట జరిగెను. ఇదియంతయు స్వయంకృతముగా కన్పించును. వెనుక విధి యున్నది. ఆ విధియొక్క బలీయస్త్వము. మహాశ్వేతా విరహమునకు తట్టుకొనలేక చంద్రకిరణముల

బాధ భరింపలేక చంద్రుని తిట్టెను. "జన్మ జన్మల నీవు కూడ నా వలెనే ప్రేమ భంగముచే చచ్చెదవుగాక!" ఇందు చంద్రుని దోష మేమున్నది? వెన్నెలకాయుట యాతని ధర్మము- విధి. అది తనకు బాధ యైనది. చంద్రుడేమి చేయగలడు? ఈ తిట్టినవాడు తేజస్వి. ఋషి. ఆదిఋషు లెవ్వరు? పరమాత్మతో నభిన్నముగ నున్నవారు. ఏక కాలికులు. వీరి ప్రభావము తపస్సిద్ధమైనది.

"ఋషీణాం పునరాద్యానాం వాచమర్థోఽను ధావతి" ఈ పుండరీకుని శాపము చంద్రుని భూలోకజన్మకు హేతువైనది. చంద్రు డేమన్నాడు. నీవుకూడ నాతో సమాన సుఖదుఃఖములు పొందుదువనెను. అందుచే పుండరీకునకు మరి రెండు జన్మలు తప్పలేదు. ఈ జన్మల నుండి చంద్రునకు తనయంతతాను విముక్తి కలిగించుకొను శక్తి యున్నది. పుండరీకుడు శ్వేతకేతువువలన పుట్టెను. లక్ష్మి తల్లి. ఈతని విముక్తికి వారి దయ యుండవలెను. వారి కృషి యుండవలెను. వారి తపస్సుండవలెను. పరమేశ్వరానుగ్రహ పాత్రమైన మానవజీవితము ముక్తి పొందును. అట్టిది పుండరీకుని జన్మ.

చంద్రుడు తనయంత తాను పుట్టెను. పరమేశ్వరుని యొక్క రూపము బ్రహ్మ. మరియొక రూపము చంద్రుడు. శాపాంతమున చంద్రాపీడుని శరీరము చంద్రప్రభామయమయ్యెను. పుండరీకుని శరీరము చంద్రప్రభావమున శిథిలము గాకుండెను. దానికి చంద్రుడే కారణ మయ్యెను.

మహాశ్వేతాపుండరీకుల గొడవయే లేనిచో కాదంబరీ చంద్రాపీడుల కథ లేదు. ఇక శూద్రకునికథయెక్కడిది? వైశంపాయనుడన్న చిలుకకథ యెక్కడిది? మంత్రికుమారునికథ యెక్కడిది? మూలకథను పరామర్శించినప్పుడు విషయమిట్లున్నది.

ఇది కథ కాదు. మానవ జీతమును గూర్చి మహాకవి చేసిన వ్యాఖ్యానము. జన్మపరంపరలు మానవునికెట్లు కలుగుచున్నవి ? పుణ్య పాపములేమి ? రాజెవడు ? మంత్రియెవడు ? ఈ మొదలైన విషయ మంతయు పరామర్శించినచో మనము విధిచేతిలోని బొమ్మలమని భగ వంతుని లీల యీ సృష్టియని గ్రహింపగలము. ఈ కథయంతయు నిట్లు జరుగుట యేమి ? దీనికి వ్యాఖ్యానమేమి ! కవి యింతగాఢముగా నాలోచించెనా లేదా ఇది యంతయు తానిట్లూహించితినని యీ భగవల్లీలను కథారూపమున చెప్పితినని కాదంబరీకథాప్రణేత శుకనాసు నిచే తారాపీడునకు చెప్పించిన మాటలు విన్నచో తెలియును.

"దేవ ! విచిత్రేఽస్మిన్ సంసారే సంచరత్సు సుఖదుఃఖమయేషు దేవతిర్యగ్యోనిమానుషేషు త్రిగుణాత్మనః ప్రధానస్యాపి పరిణామాత్ పర మాణ్వాదే రాబ్రహ్మాండపర్యంతస్య ఉత్పత్తిస్థితిప్రళయకారణస్యేశ్వర స్యేచ్ఛయా ధర్మాధర్మసాధనానామిష్టానిష్టఫలసంబంధకారిణాం కర్మ ణాం వా శుభాశుభానాం విపాకస్వభావాద్వా స్వయమేవ అనేకప్రకా రముత్పాద్యమానస్య తిష్ఠతో వినశ్యతో వా నియతవృత్తేః స్థావరజంగ మస్య న కదాచిదవస్థా సా యా న సంభవతి-తత్కృతోఽయం దేవ స్యాత్రవస్తుని విమర్శః"— ఈ సంసారమతివిచిత్రము. సుఖదుఃఖమ యమై దేవతిర్యగ్యోనిమానుషజన్మములు వర్తిల్లును. త్రిగుణాత్మకమైన ప్రధానమైన ప్రకృతియొక్క పరిణామముచే పరమాణువునుండి బ్రహ్మాండపర్యంతము ఉత్పత్తిస్థితిప్రళయకారణుడైన ఈశ్వరునియొక్క సంకల్పానుగుణముగా ధర్మాధర్మసాధనములు, ఇష్టానిష్టఫలానుబంధు లునైన శుభాశుభకర్మల యొక్క పరిపాకముచే స్వభావముచే అనేక ప్రకారముగా పుట్టుచు గిట్టుచు నుండు స్థావరజంగమమైన జీవజాలము నందు నెన్నడుగాని వచ్చుటగాని యిట్టి స్థితి యుండును ఉండదు అని యున్నదా - ఇది జగల్లక్షణము. ఈ సంసారవిషయమున విమర్శయేల?

చంద్రాపీడుని వృతిచే పరితపించుచున్న తారాపీడునకు శుకనాసుడు చేసిన హితబోధలో బాణుడు తనకథాసూత్రమునకు వ్యాఖ్య కూడ ధ్వనింప జేసినాడు.

తనకథాతత్త్వసూత్రము త్రిగుణాత్మకమైన త్రయీమయమైన పరమేశ్వరతత్త్వమునే యనుబంధించి యుండుటను బాణుడు కావ్యారంభమున మంగళాచారణశ్లోకమునందే సూచించెను.

"రజోజుషే జన్మని సత్త్వవృత్తయే స్థితౌ ప్రజానాం ప్రళయే తమస్స్పృశే
అజాయ సర్గస్థితినాశహేతవే త్రయీమయాయ త్రిగుణాత్మనే నమః"

రజోజుష్టమైన చిలుకజన్మ మానవజన్మ, శాపనివృత్తికి దోహదకారియైన అచ్ఛోదసిద్ధాయతనకేంద్రము, శాపజన్మలలయముచే స్వస్వరూపముల బొందిన వారి కథాంతము— అనుమూడుమార్గములనున్న కాదంబరీకథాస్వరూపము కూడ ఈ శ్లోకమునందలి పరమేశ్వరలక్షణముతో నొప్పినది.

మూడు జన్మల చర్చ : విమర్శకులను దృష్టిలో పెట్టుకొనియే కవి కథానిర్మాణమున మిక్కిలి జాగరూకుడై యుండును. ఈ కాదంబరీకథలో శాపములచే రెండు జన్మలెత్తిన వారికథలు గలవు. ఈ జన్మలు కాక వారి స్వస్వరూపజన్మ తొలిసృష్టి యుండనే యున్నది. ఒక్కే జీవుడు మూడుజన్మలెత్తును. మూడు జన్మలలో మూడు ఉపాధులు (శరీరములు). ఉపాధుల చుట్టును మానవజీవితచక్రము. జీవుని చుట్టును త్రికాల (భూతభవిష్యద్వర్తమానరూపమైన) చక్రము. రెంటిని సమన్వయించునది భగవల్లీల విధి.

1. చంద్రుడు ——> చంద్రాపీడుడు ——> శూద్రకుడు
(రాజకుమారుడు) (విదిశారాజు)

2. పుండరీకుడు —> వైశంపాయనుడు —> వైశంపాయనుడు
(మంత్రి కుమారుడు) (చిలుక)

దివ్యుడైన యమృతమయుడైన చంద్రుడు ఉత్తమరాజవంశ మున శాపవశమున చంద్రాపీడుడుగా జన్మించెను. అదే శాపప్రభా వమున అతడే శూద్రకుడుగా పుట్టెను.

చంద్రునకు శాపమిచ్చినవాడు శ్వేతకేతుమునికుమారుడైన పుండరీకుడు. ఈ శాపమే కథకు మూలము. ముని సత్త్వగుణసంప న్నుడై యుండవలసిన శాంతమూర్తి. కాని అతడు కామవశుడై రజో గుణయుక్తుడయ్యెను.

"కామ ఏషః క్రోధ ఏషః రజోగుణ సముద్భవః
మహాశనో మహాపాప్మా విద్ధ్యేన మిహ వైరిణమ్"

[భగ-3వఅ-36శ్లో]

మనుష్యుడు తనకిష్టము లేకున్నను ఎవరిచేతనో ప్రేరేపింపబడి బలాత్కారపూర్వకముగా పాపాచరణకుద్యుక్తుడగుచున్నాడు. ఇది రజోగుణము నుండి కలిగినది. ఉపశాంతి లేనిది. అత్యుగ్రమునగు కామము. అది తీరనిచో క్రోధము. దీనికంటె వానికి శత్రువు మరి యొకటి లేదు. పొగచేతనిప్పు, మురికిచేతఅద్దము, మావిచేతగర్భమునం దున్న పిండమును కప్పబడునట్లు కామముచేత ఈ వివేకబుద్ధి ఆవృత మగుచున్నది. [భగ-3వఅ-36, 37, 38, 39 శ్లో]

అంతటి మునికుమారుడును కామవశుడై చంద్రతాపమును తట్టుకొనలేక పోయెను. మహాశ్వేతవచ్చులోపలనే చంద్రునితిట్టుచు మరణించెను. క్రోధముతో తమోగుణము ఆవరించినది. ఇది పుండరీ కుని పతనప్రకారము. సత్త్వమునుండి రజస్సునకు రజస్సునుండి తమము నకు పతనము. అదిసరే!

శ్వేతకేతుమహర్షి యంతటి వానిపుత్రునకు మదనతాపమును తట్టుకొనుశక్తి లేదా? అంతటి వానికి ఇట్టి అల్పవీర్యుడెట్లు జన్మించెను? కథ కనుక ఏదో శాపవృత్తాంతము మొదలైనవి కల్పించుట యిట్లుం

డెనా? అటు కాదు. జాబాలిని అతనికుమారుడు హారీతుడడిగెను–
"తాత! మహానయం విస్మయో మే కథయ కథమస్య మునిజాతౌ
వర మానస్య తాదృశీ కామపరతా జాతా యయా జీవితమపి న సంధా
రయితుం పారితమ్ కథం చ దివ్యలోకసంభూతస్య స్వల్ప
మాయుః సంవృత్తమ్"

"తండ్రీ! నాకిది యాశ్చర్యముగా నున్నది. మునిజాతికి చెందిన వీనికి ఇంతటి కామపరత్వమెట్లేర్పడెను? చచ్చిపోవునంతటి కామమా? అదియుకాక దివ్యలోకమున బుట్టినవాడు ఇంతటి అల్పాయుష్కుడెట్లయ్యెను? చెప్పరే!"యని ననవిచేసెను. అప్పుడు జాబాలి ఏమని చెప్పెను? "నాయనా! దీనికి సమాధానము తేటతెల్లమే! వీడు కామ రాగమోహమయమైన అల్పసారమైన కేవల స్త్రీవీర్యముచేత పుట్టిన వాడు. వేదములు చెప్పుచున్నవికదా! "యాదృశాద్వై జాయతే తాదృగేవ భవతీతి". ఎట్టివారివలన జన్మించునో అట్టిగుణములతోనే ఆ పుట్టిన వాడుండును. (పుల్లమామిడి టెంకనుండి పుల్లమామిడిచెట్టే పుట్టుచున్నట్లు) ఆయుర్వేదశాస్త్రము కూడ ఏమి చెప్పుచున్నది? అల్పసారమైన కేవల స్త్రీ వీర్యమువలన జన్మించినవాడు స్థైర్యహేతువైన సారభూతమైన పురుషవీర్యపుష్టి లేనందున తల్లి గర్భముననే మరణించును. లేదా పుట్టినను ఎక్కువకాలము బ్రతుకడు. ఈ పుండరీకుని చరితమును నిట్టిదేకదా! కనుక పుండరీకుడు మరణించుటలోగాని కామ క్రోధపరుడగుటలోగాని మూలము వాని జన్మ. మునియైనవాని పతనమిట్లున్నది. ఈ పూర్వజన్మ లక్షణములు వానికి మానుషజన్మములో కూడ సంక్రమించినవి. కామపరత్వము వాసనారూపమైన వాని జీవసంపుటిలో నుండెను. ఇచట వాని పతనమునకు ఈ జన్మహేతువు కాదు. వెనుక జన్మయే! నాటి అనుబంధమే! ఈ జన్మమున వీని మృతి శాపము వలన. మానుషజన్మము వచ్చుట చంద్రుని శాపమువలన. ఈ జన్మ

కాలమంతయు శాపమే! అనగానేమి? జీవితమే శాపము- మరల మహా శ్వేత ఇచ్చిన శాపమువలన చిలుకజన్మ మెత్తెను. శాప నివృత్తిపర్యం తము ఆ జన్మలేదు. "కామ కర్మాన్వితోఽవిద్యాభూతవేష్టితో జీవో దేహాంతరం ప్రాప్య లోకాంతరం గచ్ఛతి. ప్రాక్కర్మపరిపాకేనా వర్తాంతరకీటవద్విశ్రాంతిం నైవ గచ్ఛతి. సత్కర్మపరిపాకతో బహూనాం జన్మనామంతే నృణాం మోక్షేచ్ఛా జాయతే. తదా సద్గురుమాశ్రిత్య చిరకాలసేవయా బంధాన్మోక్షం కశ్చిత్ప్రయాతి." [కా.క.వి.-భగవ్యా] కామ కర్మాన్వితుడై అవిద్యాభూత వేష్టితుడైన జీవుడు దేహాంతర మును పొంది లోకాంతరముల కేగుచున్నాడు. ప్రాక్కర్మ పరిపాక ముచేత నీటి సుడిలో పడిన పురుగువలె అనేక జన్మవలయములందు యాతనలు పొందుచున్నాడు. సత్కర్మ పరిపాకముచేత బహుజన్మల యందు పరిశుద్ధుడైనచో వానికి ముక్తి కావలెనన్న బుద్ధి పుట్టును. కోటానుకోట్ల జనులలో నేయొక్కడో యిట్టి తెలివి గలిగి సద్గురువు నాశ్రయించి సేవించి యీ జన్మబంధములనుండి విముక్తుడగుచున్నాడు. ఈ పుండరీకునకు గురువు తండ్రి. వీని బంధముల విముక్తికి ఆయన దివ్యలోకమున సత్కర్మానుష్ఠానము చేసినాడు. ఆయుష్కరమైన యనుష్ఠానము నెఱపినాడు. వీనికి మూడవజన్మ శాపజన్మ తీరి మరల దివ్యలోకవాసము లభించినది. మహాశ్వేతారూపమైన ముక్తికాంతా సమాగమమున ఆనందమున లీనమైనాడు.

పుండరీకుడు చిలుకజన్మమెత్తుటయే ఘోరము. అందులో చం డాలుర చేతిలో పడుట, పూర్వజన్మస్మృతి వచ్చి విరహోత్కంఠతతో కాలము వెళ్ళబుచ్చుట అన్నియు ప్రతిమానవుడు తన జీవితములో పొందు సుఖదుఃఖములనుగూర్చి వెనుకజన్మల కర్మ పరిపాకమును స్మరింపజేయుటకు ప్రచోదకము. ఈ పుండరీకుని ముక్తి ఎన్ని విషయ ములతో ముడివడి యుండెను? తల్లిదండ్రుల యనుగ్రహము. మహా

శ్వేతా తపశ్చర్య. భగవానుడగు చంద్రుని ఆప్యాయనము. ఇవి యన్నియు వీని విషయమున నిట్లు సమన్వయించినవి సరియే!

చంద్రుడేమి పాపము చేసెను? ఏమి కామ పరతంత్రుడయ్యెను. ఇది ఋషి శాపశక్తి. ఆ వాక్కు అవితథము. ఇందులో చిత్రమున్నది. చంద్రుడు మనస్సే. విరాట్పురుషుని మనస్సు. అనుభవస్థానము. సర్వేంద్రియ ప్రవర్తకుడు. పుండరీకునియందలి యింద్రియ ప్రవృత్తి కామోద్దీప్తిని పొందుటకు హేతువైనాడు. పుండరీకుడు తట్టుకొనలేని తనస్థితికి మూలకారణమైనది తనమనస్సని తెలిసిన బుద్ధిగలవాడు. బుద్ధిచే మనస్సును తిట్టినాడు. యథార్థమునకు మనోబుద్ధులు రెండును నొక్కటే! బుద్ధిచే తాడితమైన మనస్సు, మనస్సుచే పిహితమైనబుద్ధియు సమానము లైన అనుభవమునే పొందును. మామిడిపండు తినవలెనని మనసు పడినాడు. అది దొరకలేదు. అప్పుడేమిచేయును? దొరకని మామిడిపండుపై కోరిక రేపిన మనస్సును నిందించికొనును. ఈ నిందించునది యెవరు? సూక్ష్మభేదమే కాని యిదియు మనస్సే! ఆశను పెంచు నొకతత్త్వము మనస్సున కొకవైపున నున్నచో నింకొకవైపున దానిని పొంది సుఖించునదియో పొందక దుఃఖించునదియో యగు తత్త్వముండును. ఇది విడివడని జంట. రెండుగా తోచెడి ఏకైకతత్త్వము. పరమేశ్వరుని సంకల్పము - మానవుని యనుభవము నిట్లే ముడివడియున్నవి. Man proposes God disposes అని చెప్పుకొనుచు మనము సాగించుచున్న జీవిత యాత్రలోని అసలుకథ యిదియే!

ఇంద్రాయుధము : మానుషావతారమెత్తిన చంద్రుడే చంద్రాపీడుడుకదా! ఇతని తత్త్వము ఆశ రేకెత్తించుట. సంకల్పించుట ఈ సంకల్పమునకు దానిబలమునకు జవమునకు ప్రతీకగా కథలో ఇంద్రాయుధమన్న అశ్వము యొక్క పాత్ర కల్పించబడినది. ఇంద్రునియొక్క ఆయుధమనగానేమి? ఇంద్రియము.

"ఇంద్రస్య ఆత్మనః లింగం ఇంద్రియమ్"—అని అమరకోశ గురుబాలప్రబోధికావ్యాఖ్య. జ్ఞానేంద్రియ, కర్మేంద్రియ, అంతరింద్రియములు త్రిలోకములు. ఈ యింద్రాయుధము కిన్నరమిథునమును జూచుటకై యూరాటపడిన చంద్రాపీడుని సుదూర ప్రాంతములకు గొని పోయినది. ఏబది యోజనముల దూరము అనతి కాలమున పోవుట అది మనస్సు యొక్క తొందర. ఇంద్రియములు మనస్సును గుంజుకొని పోవు తీవ్రత. విషయాకృష్టుడైన మానవుని వివేకశూన్యత కిది దృష్టాంతము. లౌకికముగా మానవమనస్తత్త్వము. ఈ రీతిగా చంద్రాపీడుడు అచ్ఛోదసరోవరప్రాంతములకు చేరిన సన్నివేశమును మూలముగాగొని బాణుడు కథను అటువైపునకు మళ్ళించగలిగెను.

మనస్తత్త్వమునే కాదు. పూర్వజన్మానుబంధియైన అతని జీవగత వాసనలుగూడ అతడటువైపు పోవుటకే హేతువులైనవి. ఈ హేతువులు అవ్యక్తములు. అతని కోరిక వ్యక్తము.

ఆ యింద్రాయుధమన్న గుఱ్ఱములోని జీవుడున్నాడు. అతడెవడు? పూర్వజన్మలో పుండరీకుని మిత్రుడైన కపింజలుడు. ఆతనికి శాపము వలన గుఱ్ఱపుజన్మ కలిగినది. శాపమెందుకు ? గుఱ్ఱపుజన్మయే పొందనేల? విరహతాపమునకు తట్టుకొనలేక పుండరీకుడు చంద్రుని శపించి మరణించెను. మిత్రుని యాపద తొలగించు నుపాయము తెలిసికొనుటకు శ్వేతకేతువు వద్దకు కపింజలుడు తొందరగా పోవుచుండెను. ఆ తొందరలో పొరపాటున చూడక ఒకదివ్యుని విమానమును ఆకాశమున దాటిపోయెను. ఆ దివ్యుడు శపించెను. "ఓరీ ! గుఱ్ఱమువలె నన్ను దాటి కొనిపోతివి. నీవు గుఱ్ఱపుజన్మయే యెత్తరా !" అనెను. కోరికలు వలదురా యని పుండరీకునికి హితబోధచేసిన కపింజలునకు కూడ కోరికల లంపటత్వము తప్పలేదు. అతని కోరికయేమి ? మిత్రుని యాపదతొలగించవలెనన్న తహతహ. అంత సత్త్వగుణసంపన్నుడు రజోగుణావిష్టు

డైనాడు. తొందరచే ఎదుటి వస్తువును కూడ చూడలేనంత గ్రుడ్డి వాడైనాడు. అదియే తమోగుణము. అచటినుండియే పతనము. ఏ భావము వలన పాపము చేసెనో దానికి తగినశాపము- జన్మ. తెలిసిన బడి శాపజన్మమున తన మిత్రునకుదగ్గరగానుండునట్లు నవరింపుకోరెను. అందుచే పుండరీకుడు శుకనాసుని కుమారుడైన వైశంపాయనుడుగా పుట్టగా తాను రాజకుమారుడైన చంద్రాపీడుని వాహనమైనాడు. వైశంపాయనుని వాహనమే కావచ్చుగదా ? ఆతని పూర్వజన్మనుబట్టి ఆతడు శాపజన్మమునన్నైనను ఉత్తమోత్తమస్థితిని పొందుట న్యాయము. కనుక హయరత్నముగనే జన్మించెను. సముద్రము నుండి పుట్టెను. అనగా అయోనిజమైన గుఱ్ఱముగా పుట్టెను. బాణుడు తన పాత్రలను సృష్టించుటలో ఎన్ని యౌచిత్యములను ఎన్ని శాస్త్రరహస్యములను ఎన్ని తాత్త్వికవిషయములను దృష్టిలో పెట్టుకొనెనో! కొన్నిమాత్రము నా అల్పశక్తికి తోచినవి గమనించిననే యాశ్చర్యమగుచున్నది.

కపింజలుడు గుఱ్ఱముగానైనందున వానిలోపలిజీవుడు తనపూర్వ జన్మవాసనలచే వాయువేగమనోవేగములతో అచ్ఛోదసరోవర ప్రాంత మునకే చంద్రాపీడుని గొనిపోయెను. చంద్రాపీడునకు తెలియదు కాని గుఱ్ఱపుజన్మలో కూడ కపింజలునకు పూర్వజన్మస్మృతి యున్నది. నోటితో చెప్పలేడుగాని అనుకూలములైన చేతలు చేసెను. ఇంద్రియ ములు గుఱ్ఱములే! మనస్సునకు ఇంద్రియములకుసంబంధము కూడ రౌతు నకు గుఱ్ఱమునకు నున్న సామ్యమే. ఈ గుఱ్ఱము కవి కల్పనలో నున్న ప్రయోజనమును కూడ సాధించునది. "ఇంద్రియాణి మనోబుద్ధిరస్యాధి ష్ఠాన ముచ్యతే" (భగ-3వఅ 40 శ్లో)

కర్మానుసారిణియైన చంద్రాపీడుని బుద్ధిని ఆతని శాపజీవిత విముక్తి సహకృతముగా చేయుటలో దైవానుకూల్యమునకు సాధనము కపింజలుడైనాడు.

"సంజ్ఞాతు మే తురంగత్వేనాపి న వ్యపగతా. యేనాయం మయాస్యైవార్థస్యకృతే కిన్నరమిథునానుసారీ భూమిమేతామానీతో దేవశ్చంద్రమసోఽవతార శ్చంద్రాపీడః" గుఱ్ఱపుజన్మలో కూడ నాకు వెనుకటి జన్మస్మృతి పోలేదు. అందుచేతనే ఈ ప్రయోజనసాధనకను కూలముగా చంద్రావతారుడైన చంద్రాపీడుని యీ చోటికి గొని వచ్చితిని" అని శాపాంతమున కపింజలుడే మహాశ్వేతాదులతో చెప్పెను.

ఈ చంద్రాపీడ వైశంపాయనుల మొదటి శాపజీవిత అనంతరము రెండవసారి శాపజీవితము చాలక్లిష్టమైనది. చంద్రాపీడుడు అచ్ఛోద సరోవరమువద్ద వైశంపాయనుని మృతి తెలిసినవెంటనే విగతజీవుడైనాడు. అచటికెందుకు వచ్చెను ? కాదంబరిని కలిసికొనుట ప్రధాన ప్రయోజనము. వైశంపాయనుని కెదురుపోయి తోడ్కొని రావలె నన్న మిషతో తల్లిదండ్రులవద్ద ననుజ్ఞగొనివచ్చెను. కాదంబరీ సమాగమప్రాప్తి లేకయే వైశంపాయనుని మృతి వినినంతనే శాపవశమున విగతజీవుడయ్యెను. విదిశానగరములో శూద్రకుడుగా పుట్టెను. అతడు రాజయ్యెను. పూర్వజన్మస్మృతి లేదు. కాని జీవగతసంస్కారము లన్నియు వెనుకజన్మలోనివే! లక్షణమంతయు చంద్రలక్షణమే. మానవాకారములోనున్న సకలదేవతామూర్తి. కానీ యెందరంతఃపురస్త్రీ లున్నను "వనితాసంభోగసుఖపరాఙ్ముఖు"డై రాత్రిబంవళ్ళు గడిపెను. ఎన్నోసంవత్సరములు గడిపెను. జీవితమే శాపముగా గడిపెను. ఈ జన్మలోగూడ శాపలక్షణముచే చంద్రుడును పుండరీకుడును ప్రియా సమాగమసుఖము పొందకయే ఆ సుఖమునకై యారాటపడుచు మరణించవలెను. ఇరువురియందు నేకకాలమున నీ సమానలక్షణము నను సంధించుసూత్రమేది ? ఆ సూత్రము వెనుకజన్మలో కపింజలుడైనాడు ఇంద్రాయుధరూపమున.

ఈ జన్మలో లక్ష్మియైనది— చండాలకన్యకారూపమున. లక్ష్మి ఎవరు? దైవానుకూల్యమునకు ప్రతినిధి. శ్వేతకేతువు పంపగా వచ్చినది. "దైవం మానుషరూపేణ" అనుట యిట్టిదే. ముక్తి, పరమేశ్వరానుగ్రహము లేనిదే సమకూడదు. పరమేశ్వరానుగ్రహము సత్కర్మానుష్ఠానముచే, ఉపాసనచే, తపస్సుచే సిద్ధించునది. కాదంబరియు మహాశ్వేతయు అచ్ఛోదసరోవరతీరమున శివాలయము వద్ద తపస్సు చేయుచున్నారు. తారాపీడుడు మృత్యుంజయోపాసన చేయుచున్నాడు. శుకనాసుడట్లే చేయుచున్నాడు. శ్వేతకేతువు దివ్యలోకమున కుమారుని కొరకై ఆయుష్కరమైన యనుష్ఠానమున నిమగ్నుడై యున్నాడు. ఆయనకు పరికరములుగా కపింజలుడు లక్ష్మియు నున్నారు. ఇట్లు దివ్యౌఘము— సిద్ధౌఘము— మానవౌఘము వారి ముక్తికి బలవత్సాధనములై దివ్యలోకము నుండి గంధర్వలోకము నుండి, మానవలోకమునుండి కథావలయము తిరుగుచున్నది.

మూడుచోట్ల వాతావరణమునందు శాపవిముక్తిసహకారకములైన భావములున్నవి. ఆ భావముల కుపస్కారకమైన స్థితియున్నది. గంగానది, నందనోద్యానము, శ్వేతకేతునిఆశ్రమము దివ్యలోకము— ఇది యొక ప్రపంచము— అచ్ఛోదసరోవరము, చైత్రరథమనువనము, శివాలయము, పాశుపతవ్రతధారిణియైన మహాశ్వేత. హేమకూటప్రాంతము, చంద్రకాంతిచే నాప్యాయితమైన చంద్రాపీడుని శరీరము, కాదంబరి— ఇది మరియొక ప్రపంచము.

శూద్రకుడు, వింధ్యాటవి, పంపాసరోవరము, జాబాలియాశ్రమము, చండాలకన్యక, వైశంపాయనుడన్నచిలుక, విదిశాపట్టణము— ఇది యింకొక ప్రపంచము.

దివ్యాదివ్యములైన కథాసూత్రములతో అల్లుకొనియున్న ఒక జీవలోకము యొక్క సమగ్రగోళమున ఈ మూడు ప్రపంచములు సంవలితములై యున్నవి.

చంద్రాపీడుని శరీరమునందు జీవము లేకున్నను ఆ శరీరము చెడకుండ నుండుటయేమి ? దానిని కాదంబరీస్పర్శ దీప్తము చేయుట యేమి ? పుండరీకుని శరీరము చంద్రమండలమునుండి మరల యథా పూర్వముగా మహాశ్వేతను వచ్చి కలియుటయేమి ? అంతయు చంద్ర కళావిద్యతో ముడిపెట్టబడియున్న విషయమా ? అందుకు తగిన యాధారములు కథలో వర్ణనలో కవి నిక్షేపించినట్లు నాకు తోచు చున్నది. కాని యీ మంత్రశాస్త్రవిషయము తద్రహస్యవేత్తలైన మహానుభావులెవరో చెప్పవలెను. నా తలంపునకు మూలములైన బాణుని వాక్యములు మాత్రముదాహరింతును.

ముందు కపింజలవృత్తాంతమును మరికొంత తఱచి చూతము. చంద్రాపీడునకు ఇంద్రాయుధము వాహనముగా నున్నది. కాని యీ యింద్రాయుధము కపింజలుని యొక్క శాపావతారము. అయినను పూర్వజన్మస్మృతి యున్నది. అందుచే చంద్రాపీడుడు చంద్రుడే యన్న పరిజ్ఞానము కలవాడు. అతని శాపవిముక్తికి తోడ్పడవలసిన యాత్మీ యుడు.

"మన ఏవ మనుష్యాణాం కారణం బంధమోక్షయోః
బంధాయ విషయాసక్తం ముక్త్యై నిర్విషయం స్మృతమ్"

బంధములో నున్న చంద్రునకు చంద్రాపీడజన్మనుండి విముక్తి రావలెనన్నచో నతనిమనస్సే అతనికి తోడ్పడవలెను. చంద్రాపీడుని మనస్సు ఇంద్రాయుధసహాకృతమై యున్నది. అందువలన మానుష లోకబంధముల నుండి చంద్రుని దూరముగా గొనిపోయినాడు. అతని స్వస్వరూపపరిజ్ఞానమును కలిగించు సిద్ధభూమికి గొనిపోయినాడు.

"బంధురాత్మాత్మన స్తస్య యేనాత్మైవాత్మనా జితః
అనాత్మనస్తు శత్రుత్వే వర్తేతాత్మైవ శత్రువత్"

[భగ-6అ-6శ్లో]

"శుద్ధమగు మనస్సే మనుష్యునకు యథార్థ మగుహితమును గూర్చు మిత్రము (ముక్తికి కారణము) విషయాసక్తమగు మనస్సే మనుష్యునకు పరమశత్రువు.

ఇచట కపింజలుడు దైవానుకూల్యమునకు ప్రతీక. పూర్వజన్మ స్మృతి కలవాడు. వేదమున అశ్వమును వజ్రి అని చెప్పిరి. అనగా ఇంద్రుని ఆయుధము. కపింజలుడు శాపావతారమున గుఱ్ఱము. ఆ గుఱ్ఱముపేరు ఇంద్రాయుధము. తైత్తిరీయ బ్రాహ్మణమున—

"వజ్రీ వా ఏషః యదశ్వః యదశ్వం పురస్తాన్న

యతి । జాతానేవ భ్రాతృవ్యాన్ప్రణుదతే. ఇతి"

[తై. బ్రా. 1-1-5]

అనగా అర్థమేమి? సాయనాచార్యుల వారిట్లు వివరించిరి. "వజ్రవద్యుద్ధే శత్రువినాశ హేతుత్వాత్ అశ్వో వజ్రీ"- "వజ్రమువలె యుద్ధమున శత్రువినాశ హేతువగుటవలన అశ్వము వజ్రి."

చంద్రాపీడునకు శత్రువేది? అతని శాపకృతమైన మానుష జన్మము. ఈ కపింజలుడు తత్పరిహారమున కుపకరించు మార్గమున నతనిని కొనిపోయినాడు. అశ్వమును ఇంద్రియములకు ప్రతీకగా భగవద్గీత చెప్పినది.

సమయాచారమతమున "కామీకలాం కామరూపాం చికిత్వే కామరూపశ్చ కామః, పరిస్రుతం ఝషమాజంపలం చ భక్తాని యోనిస్సుపరిష్కృతాశ్చ, నివేదయన్ దేవతాయై మహాత్యై స్వాత్మీకృతే సుకృతీ సిద్ధిమేతీతి" [కామ- క- వి- లో ఉదాహృతమైన త్రిపురోపనిషత్తులోని సూత్రము - శ్రుతి] అను శ్రుతి నిచట అనుసంధించుకొనవలెను. "సహస్రారాంతర్గత స్రవదమృతధారను జీవభావమును,అవిద్యను,

అవిద్యవలన కలిగిన యింద్రియములను ఈ సమష్టికి కారణవస్తువును వేరు వేరుగా స్పష్టముగా తెలిసికొని త్రిమూర్తులకన్న పూర్వమున్న దేవతకు పరాదేవతకు సమర్పించుచు తాను పరమాత్మ స్వరూపముగా భావించిన పుణ్యపురుషులు బ్రహ్మభావమును పొందుచున్నారని" యీ శ్రుతి తాత్పర్యము [ కామ- క- విలా- 156 పుట].

మన కథకు వర్తము: స్రవదమృతధార చంద్రునిలోని అమృతత్వము. అతని జీవభావము చంద్రాపీడత్వము. ఇంద్రియ సమూహము ఇంద్రాయుధము. పై శ్రుతిలో "పరిస్రుతం" అన్నది సంవిన్మయామృతము. "ఝషం" అన్నది జీవపరమైనది. నదియందు మహామత్స్యము అవ్వ యొడ్డునుండి యీవలియొడ్డుకు ఈవలియొడ్డు నుండి యవ్వలి యొడ్డునకు సర్వదా సంచరించుచుండును. అట్లే జీవుడును నిద్రనుండి జాగ్రదవస్థకు జాగ్రదవస్థనుండి నిద్రావస్థకు ఈ జన్మనుండి మరొక జన్మకు నిట్లు యాతాయాతము కలిగియున్నందున జీవునకు మహామత్స్య దృష్టాంతమును జెప్పిరి. అతడే యిచట చంద్రాపీడాంతర్గత జీవుడు.

ఈ జీవునియొక్క అవిద్యారూపము - ఇంద్రియసమూహము. అదే ఇంద్రాయుధము. ఈ మూడును భిన్నరూపముగా నున్నవి. లౌకికముగా ఇంద్రాయుధము చంద్రాపీడుని సుదూరమునకు గొనిపోవుటయే ఇంద్రియవశుడైన మానవుని దుఃఖమునకు హేతువు.

"ఆత్మకృతానాం హి దోషాణాం నియత మనుభవితవ్యం ఫలమాత్మనైవ." చేసికొన్నవారికి చేసికొన్నంతమహాదేవ అనుకొన్నాడు చంద్రాపీడుడు. కాని తననక్కడకు గొనిపోయినది యేది? "బుద్ధిః కర్మానుసారిణీ" ఇచట బుద్ధిని విధికి అనుకూలముగా చేసిన కపింజలుడు ఆతనికెంత యుపకారము జేసెనో తరువాత గాని చంద్రాపీడునకు తెలియలేదు. అప్పుడాతని మనోభావమెట్టిది? "అహో! జగతి జంతూనాం

అసమర్థితోపనతాన్యాపతంతి వృత్తాంతాంతరాణి." "అహో! ఈ లోకమున అనుకోనకుండ విశేషములైన యనుభవములు మానవులకు సంప్రాప్తించుచుండును. నేను ఆ కిన్నర మిథునము వెంటబడుట యేమి! అందువలన కదా! ఇంతటి మనోహరమైన మానవులకు అగమ్యమైన దివ్యజనసంచరణోచితమైన ప్రదేశమునకు వచ్చితిని. నీటికై వెదకుచు సిద్ధజనులు సేవించు సరోవరమును జూచితిని. ఆ తీరమున దివ్యమైన సంగీతమును వింటిని. మానుష దుర్లభదర్శనయైన దివ్యకన్యకను చూచితిని. ఈ యుపకారమంతయు వివేకముతో కూడిన (పూర్వ స్మృతి గల) ఇంద్రాయుధమువలన కలిగినది. ఇచట కపింజల పాత్ర – అశ్వరూపమున మనస్థానమైన చంద్రుని సంకల్పరూపమైన యవయవముగా నైనది.

"అజామేకాం లోహిత శుక్ల కృష్ణాం, బహ్వీం ప్రజాం జనయంతీగ్ం సురూపా మితి"– లోహిత శుక్ల కృష్ణమైన అనగా త్రిగుణాత్మకమైన అజా – ప్రకృతి అవిద్యయే. [కామ– క – విలా – 156 పు] "పరిస్రుతం, ఝషం, ఆజంపలం" అని వెచుకచెప్పిన త్రిపురోపనిషత్తులోని "ఆజంపలం" అజాయా ఇదం ఆజం– పలం ఇంద్రియ సమూహమ్– ఆజంపలమ్. అవిద్య దాని యవయవములు ఈ శబ్దముచే చెప్పబడినవి. ఆ శబ్దమును సంకేతముగా గొని కపింజల నామమును కవి ఆ పాత్రకు పెట్టియుండును.

పుండరీకునకు సన్మార్గ ముపదేశించినది కపింజలుడే. చంద్రాపీడునకు చంద్రత్వమునకు ఆస్పదమైన బుద్ధిసంయోగరూపమున నున్నదియు నతడే– భగవద్గీతలో యోగభ్రష్టుడు పూర్వజన్మమునందలి యభ్యాసముచేతనే తనకు తెలియకుండగనే ఆ పూర్వయోగమును పొందు బుద్ధికలవాడగును అని చెప్పబడినది.

"పూర్వాభ్యాసేన తేనైవ హ్రియతే హ్యవశోఽపి సః
జిజ్ఞాసురపి యోగస్య శబ్దబ్రహ్మాతి వర్తతే" [భగ-6అ-44శ్లో]

ఈ దివ్యలోకమునకు చేరిన తనకు ఐహికజీవితము నుండి యింకను దూరమైన తన సహజమైన అమృతస్థానము దగ్గరైనది. ఆ యమృతస్థానము దగ్గరగుటకు శుద్ధసత్త్వగుణము కావలెను.

అచట దక్షిణామూర్త్యుపాసనాపరురాలైన కన్యనుచూచెను. "ప్రతిపన్న పాశుపతవ్రతాం కన్యకాం దదర్శ" ఈమె తదమృతస్థానమైన హేమకూటము (మేరుశిఖరము) నందలి కాదంబరీరూపమైన అమృత స్థానమునకు చేరుటకు హేతువైనది.

"మూలాధార స్వాధిష్ఠానములపైన అగ్నిమండలము. మణిపూర అనాహతములపైన సూర్యమండలము. విశుద్ధి యాజ్ఞాచక్రముల పైన అమృతస్థానమయిన చంద్రమండలము. సుషుమ్నానాడి స్వాధిష్ఠానాగ్నిదీప్తిని ఈషట్కమలములనుండి దారమువలె వేధించుచు అమృతధారాస్థానమగు సహస్రారమునకు గొనిపోవును. అచట ఈ అగ్ని యొక్క ఉష్ణాధిక్యము అమృతవృష్టి వలన శమించును. ఈ వృష్టివలన కలిగిన శీతాధిక్యము ఈ అగ్ని వలన శాంతించును. కాన సమశీతోష్ణమై ప్రాణులకు సుఖము కలిగించును." అని యోగవిషయము.

[చూ. కామ. కళా. వి. 96పు]

చంద్రాపీడునకు మూలాధారము ఉజ్జయిని. స్వాధిష్ఠానము సువర్ణపురము. అచ్ఛోదసరోవరము, సిద్ధాయతనమునుండి వచ్చిన వీణానాదము-మణిపూర, అనాహతస్థానములు.

గంధర్వలోకవృత్తాంతము, పదునాలుగుగంధర్వకులములజ్ఞానము, అమృతసముత్పన్నయైన కాదంబరి యొక్క యునికి గూర్చిన జ్ఞానము, ఆతనికి కలిగినది మహాశ్వేతవలననే. అదియే సూర్యమండలము. జ్ఞానమునకు ప్రతీక. హేమకూటమున కన్యాంతఃపురము చేరుట అది

ఆజ్ఞా విశుద్ధి చక్రముల చేరుట. అచట సహస్రదళపద్మమునందలి అమృతబిందువు కాదంబరి. అచట చంద్రాపీడుడు కాదంబరీ దేహ ప్రభాసంపర్కముచేతనే సురతసమాగమసుఖమును బొందెను. అమృత స్థానమైన కాదంబరి స్వాధిష్ఠానాగ్ని యయిన చంద్రాపీడుని సంయోగ మున సమశీతోష్ణమైన బిందుస్థానమునందు సర్వాత్మనా ఐక్యతను భజించినది. "దర్శనాదారభ్య శరీరస్యాప్యయమేవ మే ప్రభుః"– అని కాదంబరి మహాశ్వేతతో అన్నమాట గమనార్హము.

చంద్రాపీడుడు కిన్నరమిథునమును చూచి యుద్విగ్నుడయ్యెను. అది యింద్రియప్రకోపము. అది ప్రజ్వలించిన అగ్ని. అది స్వాధిష్ఠా నము నందలి (సువర్ణపురమందలి) చంద్రాపీడుని స్థితి. కిన్నరమిథున దర్శనముచే జ్వలించిన దర్శనాగ్ని నిర్మానుష్యమైన యరణ్యమున బడి కైలాసగిరిప్రాంతమును చేరినది. ఇంతవరకును ఆ అగ్నియొక్క తపన, ఉష్ణాధిక్యము, తీవ్రస్థాయిని పొందినది. ఈ ఉష్ణాధిక్యముచే ప్రాణ మెండిపోవుచున్నది. దీనికి ఉపశాంతి కావలె. దానికై వెదుక నారం భించెను. వట్టి జలము కొఱకు చూచెను. అతనికి వట్టి జలము కాదు. సిద్ధజనోపస్పృష్టమైన జలము, పుష్కలముగా నున్న సరోవరమే లభించి నది. ఆ సిద్ధులు పరమహంసలు. షట్కమలముల మధుపానముచే ఆనందమును భజించు చున్నవారు కాబోలు! బాణుడు ఆ విషయ మును ధ్వనింపజేయుచున్నాడా అన్నటుల ఒక వాక్యము వ్రాసెను. "కమలమధుపానమత్తానాం చ శ్రోత్రహారిభిః కలహంసానాం కోలా హలైః ఆహూయమాన ఇవ"– కమలమధుపానముచే మత్తిల్లిన కల హంసల మనోహరములైన కోలాహలముచే ఆహ్వానింపబడుచున్న ట్లుగా అతడు సరోవరమును ప్రవేశించెను. ఇక ఆ సరోవర మెట్లున్నది?

"మణిదర్పణమివ త్రైలోక్యలక్ష్మ్యాః స్ఫటికభూమిగృహమివ వసుంధరాదేవ్యాః అవతారమివ జలాకారం గగనతలస్య......చంద్రా

తపమివ రసతా ముపేతం...... స్వచ్ఛతయా మునిమనోవృత్తిభిరివ సజ్జనగుణైరివ హరిణలోచనప్రభాభిరివ ముక్తాఫలాంశుభిరివ నిర్మితం ............ సర్వదా సిద్ధవధూధౌతకల్పలతావల్కలపుణ్యోపకృతోదకమ్......" ఇట్లున్నది. ఈ సరోవరజలముతో ఆ అగ్ని యొక్క ఉష్ణాధిక్యము నియమిత మగుచున్నది. ఆ అగ్ని విశుద్ధి పొందుచున్నది. ఇది "దృష్టేఃఅతిమనోహరమాహ్లాదకం"_ షట్కమలములలో మణిపూరస్థానము. చంద్రాపీడుడిక్కడ విశ్రాంతి తీసికొనిన శిలాతలమున్నది. దానిపై కమలదళములతో ప్రస్తరము కల్పించుకొని కూర్చున్నాడు. ఏదియో నాదము విన్పించుచున్నది. మొదట ఇంద్రాయుధముచే ఆ నాదము గ్రహింపబడినది. ఎట్లు గ్రహింపబడినది ? "ఉన్ముక్తకబలేన, నిశ్చలశ్రవణపుటేన, తన్మయీభూతేన, ఉద్గ్రీవేణ ఇంద్రాయుధేన ప్రథమమాకర్ణితమ్"_ ఇంద్రాయుధమనగా ఇంద్రియ సమూహమని చెప్పుకొనుచునే యున్నాము కదా! మనస్తత్త్వమైన చంద్రాపీడుని యందు ఆ కమలదళాస్తరణమునందు కూర్చున్న వేళ వినిపించిన నాదము మొదట యింద్రియముల నుండి తరువాత మనసునకు చేరుచున్నది. ఈ యింద్రియసంయమన మెట్లున్నది? 'ఉన్ముక్తకబలేన'_ నిరాహారీ_నిరాహారముగా నున్నది. "నిశ్చలశ్రవణపుటేన"_ శ్రవణేంద్రియ మచట లగ్నమై యున్నది. "తన్మయీభూతేన" అచట ఏకాగ్రత ఏర్పడినది. "ఉద్గ్రీవేణ"_ కంఠము పైకెత్తబడి యున్నది. ఈ వర్ణనములో "తస్మాత్త్వమింద్రియాణ్యాదౌ నియమ్య భరతర్షభ పాప్మానం ప్రజహి హ్యేనం జ్ఞానవిజ్ఞాన నాశనమ్" [భగ_3అ_41 శ్లో]

("భరతర్షభ ! అర్జునా ! నీవు మొదట యింద్రియసమూహమును నిగ్రహించి జ్ఞానమును విజ్ఞానమును నశింపజేయు పాపమును ఈ కామమును విడువుము")_ ఈ యింద్రియసంయమనమే యిచట సూచితమైనది. "శ్రద్ధావాన్ లభతే జ్ఞానమ్" [భగ_4అ_39 శ్లో] దీనికి కావల

సిన స్థితి చంద్రాపీడునకు లభించినది. ఇంద్రాయుధ మిచట నాతని యింద్రియస్థానముగ నే గ్రహించవలెను.

"ఏకాకీ యతచిత్తాత్మా
శుచౌ దేశే ప్రతిష్ఠాప్య స్థిరమాసనమాత్మనః
నాత్యుచ్ఛ్రితం నాతినీచం చైలాజినకుశోత్తరం
తత్రైకాగ్రం మనః కృత్వా యతచిత్తేంద్రియక్రియః
ఉపవిశ్యాసనే యుంజ్యాద్యోగ మాత్మవిశుద్ధయే॥
సమం కాయశిరోగ్రీవం ధారయన్ అచలం స్థిరః
సంప్రేక్ష్య నాసికాగ్రం స్వం దిశశ్చానవలోకయన్"

[భగ-6- 10, 11, 12, 13]

ఇంద్రాయుధము ఉద్గ్రీవముగా నున్నది. గుఱ్ఱమునకు ఆ స్థితి లోనే నాసికాగ్రావలోకనము సాధ్యము. బాణుడిచట చేసిన యీ వర్ణనమంతయు యోగి యొక్క ధ్యానస్థితితో అన్వయించునదే. విన పడిన దేమి ? "వీణాతంత్రీ ఝుంకారమిశ్రమైన అమానుషగీతశబ్దము." ఇంత ఏకాగ్రతయున్న గాని ఆ శబ్దము వినపడలేదు. ఇది అనాహత నాదమా ! ఈ నాదము విని యాకమలినిదళ స్రస్తరమునుండి లేచి "గీతసంపాతసూచితమైనదిక్కు" నందు దృష్టిని ప్రసరింపచేసినాడు. ఆ శబ్దము దూరమునుండి వచ్చుచున్నది. "అతిదవీయస్తయా"- ఆగీత శబ్దము వినిపించుచున్నదిగాని అది పుట్టుచున్న చోటు కనిపించుటలేదు. అప్పుడు [గీత ధ్వని ప్రభవజిజ్ఞాసయాహృత గమన బుద్ధిః దత్తపర్యాణ మింద్రాయుధమారుహ్య] గీతధ్వనిప్రభవస్థానము తెలిసికొనవలెనని బుద్ధి కలిగినది. ఇంద్రియములు ఆవిషయమున నేకాగ్రములైనవి. ఈ నాదము వచ్చుత్రోవను పోవుచుండెను.

అది తమాలనీలమైనది. కానుగుచెట్ల గుబురులతో చీకటిగా నున్నత్రోవ. గుహాలక్షణముకదా ! నాదము విన్పించుచున్నది. తుమ్మె

దల ఝుంకారము వినపడుచున్నది. కుసుమపరిమళము వచ్చుచున్నది. అచ్ఛోదసరోవరముయొక్క దక్షిణతీరము నుండి పశ్చిమతీరమునకు వచ్చినాడు. అచట ఆ సరస్సు చంద్రప్రభయన్న పేరుగలది. అచట సిద్ధాయతన మున్నది. అదియే అనాహత చక్రము. అచట కైలాసగిరి యొక్క పాదపుకాంతి వెన్నెలవలె వ్యాపించి యున్నది. అచట నున్న త్ర్యంబకమూర్తి అమలముక్తాశిలాఘటితలింగము. అచట యోగిని యున్నది. దక్షిణామూర్త్యుపాసనాపరురాలు. ఆమెయు పద్మాసనము నందున్నది. "ఉపరిచిత బ్రహ్మాసనాం" ఈ పాశుపతవ్రతధారిణియైన కన్యక ఆ ప్రదేశమును చంద్రమయముగా చేయుచున్నది. కైలాస గిరినే తెలుపు చేయుచున్న శరీరకాంతితో ప్రకాశించుచున్నది. ఆ వర్ణన మంతయు మూర్తీభవించిన సత్త్వలక్షణమును చెప్పునదే. అచ్ఛోదసరోవరమునద్దనే ఆ స్వాధిష్ఠానాగ్ని యందు ఉష్ణాధిక్యము పోయినది. ఇప్పుడీమెయొక్క ఈ సత్త్వగుణప్రభావముచే సీతనిస్థితి యెట్లున్నది? అగ్నియందు దాహకత్వలక్షణమును పరిహరించి సత్త్వ ముచే శుద్ధిచేసినప్పుడే అది సహస్రారమునందలి అమృతస్రావమునకు సమర్థకమగును. మహాశ్వేతాసత్త్వగుణప్రభావమెట్లున్నది? "తపః ప్రభావప్రగల్భయా దృష్ట్యా సమాశ్వాసయతీవ, పుణ్యైరివస్పృశంతీ, తీర్థజలైరివ ప్రక్షాలయంతీ, తపోభిరివపావయంతీ, శుద్ధిమివకుర్వాణా" తన తపః ప్రభావప్రగల్భమైన దృష్టితో సమాశ్వాసించుచున్నది. అతని పుణ్యములతనికి చేర్చుచున్నట్లున్నది. తీర్థజలములచే కడిగివేయుచున్న ట్లున్నది. తపస్సులచే పవిత్రునిచేయుచున్నది. పాపక్షయముచే శుద్ధి చేయుచున్నట్లున్నది."

ఇది యేమిలక్షణము? నాదము ప్రాణాగ్నిసంయోగమున నేర్పడుచున్నది. ఈ నాదముచే బుద్ధిగుహయందు సిద్ధుడైన వానిలక్ష ణము చంద్రాపీడున కేర్పడినది. ఆమె తపఃప్రభావమితనికి ప్రత్యక్ష

మైనది. తాను యోగసాధకుడు. ఆమె యోగసిద్ధురాలు. సిద్ధునకు, సాధకునకుగల సామ్యమిచట మహాశ్వేతా చంద్రాపీడుల సమావేశమున స్ఫురించుచున్నది. మహాశ్వేత తనపూర్వగాథ చెప్పి నప్పుడు ఆమె యందు దుఃఖము– దానిమూలమున తపనయు కలిగినవి. సంతప్త చేతస్సులకు సుధాస్రావము లేదు. పుండరీకవియోగమున సంతప్తురాలైన యీ మెకు చంద్రుడుచేసిన ఉపదేశమున్నది. అదియేమి ? నీవుసంతపించవద్దు. నాయందు నీయభీష్టమైన పుండరీకశరీరము ఆప్యాయితమగుచున్నది. తత్సమాగమము నీకు లభించును. అందులకై వేచియుండుమనిచెప్పెను. అనగా నేమి ? తాను ఏ లక్ష్యము సాధింపనెంచెనో తదున్ముఖమైన తపోవ్యగ్రతలో నుండవలెను. పుండరీకుని యందలి సౌందర్యము ముని యొక్క సౌందర్యము. ఆతని స్ఫటికాక్షమాల తానుధరించి అతనికి తన యొంటిపేట ముత్యాలహారము నిచ్చెను. అది మెడలో ధరించియే అతడు ఉపరతుడయ్యెను. అది మెడలోనుండగనే చంద్రమండలమునకు గొనిపోబడెను. ఈమెమెడలో స్ఫటికాక్షమాల యుండెను. ఆ సరోవర తీరవనమున ఆతని కమండలమును దండమును గ్రహించి ఆతనివ్రతమే తాను ధరించెను. పరమాత్మయందైక్యముగోరు యోగికి కావలసిన లక్షణమిదియే.

> "ప్రశాంతాత్మా విగతభీర్బ్రహ్మచారి వ్రతే స్థితః
> మనస్సంయమ్య మచ్చిత్తో యుక్త ఆసీత మత్పరః"

[భగ. గీ. 6అ 14 శ్లో]

అచట భగవానుడేమిచెప్పెనో ఇచట చంద్రుడును మహాశ్వేత కదియే చెప్పెను. చంద్రాపీడుడు మనుష్యావతారములో నున్నాడు. ఈస్థితిలో నాతనిది సాధకావస్థయే ! సిద్ధలక్ష్యము మహాశ్వేత. పరామర్శించగా చంద్రాపీడునకేమి తోచినది ? ఈ కిన్నెరమిథునము వెంట పడివచ్చుట నా మూర్ఖత యనుకొంటిని. ఇదియు మంచికే వచ్చెను. ఈ మహాశ్వేత యేమిచెప్పిన అది తనకు ఆజ్ఞవంటిది. కాదంబరీవృత్తాం

తము చెప్పినది. కేయూరకుడు వచ్చి కాదంబరీసమాశ్వాసనమునకై మహాశ్వేతను రమ్మని చెప్పెను. మహాశ్వేత కాదంబరీసమాశ్వాసన మెట్లు చేయును? ఆమె కేమియూహతట్టెనో! చంద్రాపీడునికూడ హేమకూటమునకు రమ్మన్నది. అది చూచి తీరవలసిన పట్టణమని చెప్పినది. ఆచెప్పుటలో ఒక రహస్యముగూడ చెప్పినది.

గత్వా హేమ కూటం..........దృష్ట్వా చ మన్నిర్విశేషాం కాదంబరీం" అన్నది. అచ్చముగా నావంటి కాదంబరినే చూతువుగాని అన్నది. అనగా నేమి? తాను విరహిణి. కాదంబరి కూడ విరహిణి. ఒకటే భేదము. మహాశ్వేతది వియోగము. కాదంబరిది అయోగము.

యోగ్యవస్తువుతోడి సంయోగ అభావమే అయోగము. యుక్త వస్తువులని పరిచ్యుతియే వియోగము. పుండరీకుడు కనిపించనంత వరకు తనలో సంయోగమునకు ప్రేరణలేదు. అతడు కనిపించిన తరువాత అతనితోడి సంయోగమునకు పడిన ఆరాటమునకు అంతేలేదు. ఇట్టి స్థితి కాదంబరికి చంద్రాపీడ దర్శనమున నేర్పడును. ఈ విషయము మహాశ్వేతకు బాగుగా తెలియును. కనుకనే యేమన్నది? హేమ కూటమున ఒక్కరోజునుండి "అపనీయ తస్యాః కుమతి మనోమోహ విలసితమ్"- ఆ కాదంబరియొక్క మనస్సులోని నాపైగల దుష్టవ్యామోహమును తొలగించి వత్తువుగాని రమ్మన్నది. కాదంబరికి తనతోడి అనుబంధము పారమార్థికమైనది కాదు. నైమిత్తికము. దేనితోడి సం యోగమునకామె జన్మించినదో ఆ యోగము సిద్ధించుటయే జీవిత పర మార్థము. ఈ విషయమున తాను అనుభవసిద్ధురాలు. కనుక కాదం బరీ చంద్రాపీడుల కుభయులకు గురుస్థానమున నున్నది. తల్లిదం డ్రులు చెప్పినను వినని కాదంబరి మహాశ్వేత చెప్పినచో వినును.

చంద్రాపీడునకును అట్లే అయ్యెను. ఏమన్నాడు? "భగవతి ! సర్వానాత్ర ప్రభృతి పరవానయం జనః కర్తవ్యేషు యథేష్ట మశంకితతయా నియుజ్యతాం"— ఓపూజ్యురాలా! నన్ను చూచినది మొదలు నేను నీవాడనైనాను. ఏమిచేయవలెనో నీవు నిశ్శంకముగా నన్నాదేశింపవచ్చును— అనినాడు. బయలుదేరినాడు. ఆజ్ఞయైనది. ఇక హేమకూటమున కథ. అది ఒక ప్రభామండలము. సౌందర్యచక్రము. అమృతకుంభము. "స్త్రీమయ మపరమివ జీవలోకం, ఇయత్తాం గృహీతుం ఏకత్ర త్రైలోక్యస్త్రైణమివ సంగృహీతం......జ్యోత్స్నా మయమివ ఘటిత సన్నివేశం"— అది ఒక స్త్రీమయమైన జీవలోకము. త్రైలోక్యమునందలి స్త్రీలందరను లెక్కకొరకు ఒకచోటను చేర్చబడినట్లున్నది. వేలకొలది చంద్రమండలములతో నిర్మింపబడినట్లున్నది. వెన్నెలతో చేయబడినట్లున్నది. అట్టి స్త్రీలోకమధ్యమున "శ్రీమంటపము." ఆ శ్రీమండప మధ్య భాగమున మరియొక మండలమున్నది. అచట అనేక సహస్ర సంఖ్యలో నున్న ఆభరణముల కాంతులచే నొప్పిన కన్యకాజనము ఆమెచుట్టును కల్పతలవలె నున్నారు. (పరమేశ్వరి శ్రీ చక్రబిందుమండల నివాసిని.)

కాదంబరీ వర్ణనమంతయు—

"త్వదీయం సౌందర్యం తుహినగిరికన్యే తులయితుం
కవీంద్రాః కల్పంతే కథమపి విరించిప్రభృతయః" [సౌ. ల. 12 శ్లో]

ఆమె సౌందర్యము వర్ణించుట బ్రహ్మాదులకుకూడ నలవికాదు. బాణుని వర్ణన చదివినచో ఇక ఆ తల్లి (పరమేశ్వరి) సౌందర్యమింకెంత గొప్పగానుండునో మరియు నూహించుకొనవలెను.

కాదంబరీ సందర్శన ప్రథమక్షణమునుండియు సుధాస్రావానుభూతియే చంద్రాపీడునియందు, కాదంబరియందును నట్టి యపూర్వ సుఖస్పర్శానుభూతియే యుండెను. మహాశ్వేత కాదంబరి తల్లిదండ్రులను కలియుటకై పోయినది. అప్పుడు చంద్రాపీడుడు ప్రమదవనము

నందలి క్రీడాపర్వతక మణిమందిరమున విడిదిచేసెను. కాదంబరి తన ప్రాసాదమున నున్నది. ఆతడు మణిమందిరశిఖర మధిరోహించెను. కాదంబరి ప్రాసాదశిఖరము నధిరోహించెను. వారి పరస్పరవీక్షణాను భవము సంయోగపరమార్థమైనది.

ఈ స్థితి మొదటినుండియు నున్నది. తొట్టతొలుతగా కాదంబరిని చూచినప్పుడు చంద్రాపీడుని స్థితియేమి? "దృష్ట్వా కాదంబరీవదన చంద్ర లేఖాలక్ష్మీకస్యసాగరస్యేవామృతం ఉల్లలాసహృదయమ్" – చంద్ర లేఖను చూచిన సాగరమునందు వలె నీతని హృదయమున అమృతము పొంగులెత్తెను. ఆమె దేహప్రభాసంపర్కముకూడ సురతసమాగమ సుఖ మును కల్పించెను. ఇక కాదంబరి "దర్శనాదారభ్య శరీరస్యాయమేవ ప్రభుః" చూచినది మొదలు తన శరీరమునకు సర్వమునకు నతడే ప్రభువు. తండ్రివద్దనుండి పిలుపు వచ్చుటతో మహాశ్వేత వెళ్ళవలయును. మరి చంద్రాపీడుని నెక్కడనుండుమని చెప్పవలెను? ప్రమదవనమున క్రీడాపర్వతకమణిమందిరమున విడిది చేయించిరి. అది ఎక్కడ నుం డెను? సరిగా కన్యకాంతఃపుర ప్రాసాదమున కెదురుగా నుండెను. గవా క్షమునుండి కాదంబరి చూచుచుండెను. మణిమందిరమున చంద్రా పీడుడుండెను. కొంతతడవునకు "ఉపవ నాలోకనాకుతూహలాక్షిప్త చిత్తు"డై క్రీడాపర్వతక శిఖరము నధిరోహించినాడు. కాదంబరి చూచెను. మహాశ్వేత యింకను రాలేదు అన్నవంకతో ఆమెకొరకు చూచుటకన్నట్లు తాను తనసౌధ శిఖరముపై నెక్కెను. ఇచట బాణు డొక చిత్రమైన వర్ణన చేసెను.

"శశిమండల పాండురేణాతపత్రేణ హేమదండేన నివార్యమాణా తాపా" – ప్రొద్దుటివేళ గనుక ఎండ కాయుచుండెను. ఆమెకు చంద్ర మండలమువంటి గొడుగు పట్టిరి. అది ఆతపత్రము. దానికాడ హేమ దండము. ఈ నివారింపబడుచున్న ఆతపమేమిటి? చంద్రాపీడ దర్శన

ప్రభృతి కాదంబరియం దతర్గతముగా చెలరేగిన అగ్ని. మన్మథాగ్ని. ఇది చంద్రాపీడునితో వచ్చినది.

స్వాధిష్ఠానమునుండి దాహకత్వ లక్షణముతో బయలుదేరి మహాశ్వేతయొక్క సిద్ధాయతనమున శుద్ధి పొందిన అగ్ని. అది యోగ సంబంధము. అట్లుంచుదము. కాని జ్ఞాపకముంచుకొనవలసిన విషయము. ఆ అగ్ని సహస్రారమునందలి అమృతకుంభమును తన యుష్ణశక్తి చే స్రవింపజేయును. ఆ సుధాస్రావము ఈ ఉష్ణాధిక్యమును స్పర్శక్షమము చేయును. ఆ యానందము అనుభవమునకు వచ్చినచో పునః పునః ఆ యానందమునే జీవులు కోరుచుందురు.

కాదంబరీ చంద్రాపీడుల పరస్పర వీక్షణమునందలి అనుభవలక్షణమట్లుండెను. వీరు ఈ శిఖరారోహణము చేయుటకు మూలమెవ్వరు? గురువు - మహాశ్వేత. గురువుగారు కాదంబరి తల్లిదండ్రులతో మాటాడి వచ్చిరి. ఏమి మాటాడెనో కవి చెప్పడు. ప్రాసాదమునుండి దిగి కాదంబరి మహాశ్వేతను కలిసికొనెను. గురువును నిర్లక్ష్యము చేయరాదు. చంద్రాపీడుడు తనమణి మందిరముననే భోజనాదికములుపూర్తి చేసెను. అది మధ్యాహ్నవేళ. అప్పుడొక చిత్రము జరిగినట్లు బాణుడు వర్ణించెను.

"చంద్రాపీడుడు లతామండపమున మరకత శిలాతలమున కూర్చుండి యుండెను ఆ పగటికాంతిని అతి విస్తారమయిన ఒక తెల్లని కాంతి జలప్రవాహముతో వలె ముంచివైచుచుండెను. తెల్లని తామర తూడుల వలయము ఎండను త్రాగివైచుచున్నట్లుండెను. పాలసముద్రము భూమి నావరించుచున్నట్లుండెను. దిగంతములు చందన రస వర్షముచే తడిసిపోవుచున్నట్లుండెను. ఆకాశము అమృతముతో పులుము బడుచున్నట్లుండెను." [సంస్కృత కాదంబరి - 575_576 పు] అట్టి

కాంతివెంట నిరువైపుల మదలేఖయు తరలికయు తనవైపే వచ్చుచుం డిరి. ఆ కాంతితో వారు తన దగ్గరకు వచ్చుసరికి ఆ కాంతికి కారణ మేమో అతనికి తెలిసెను. అది ఒక హారము. (హారరూపమున సం గృహీతమైన కాదంబరీరూపము) ఈ హారముయొక్క వర్ణనమునకు అంతప్రాముఖ్యమిచ్చి బాణుడు వ్రాసెను. మదలేఖ చంద్రాపీడునకు కాదంబరి పంపిన యుపహారమని దానిని నివేదించెను. ఆతనిచే నా హారమును పరిగ్రహింప జేయుట కామె చేసిన ప్రసంగ మతిమనోహ రము. ఆ హారమును తాను గ్రహించినచో మహాశ్వేత ప్రియ వియో గార్తయై యుండగా తాను సుఖపడలేనని చెప్పిన కాదంబరిని గూర్చి మహాశ్వేత ఏమనుకొనును? తనను గూర్చి ఏమనుకొనును - ఈ సం దేహ మతనికి లేకుండుటకే "యిదిగో యీ తరలిక ఆ మహాశ్వేత పం పినందునే వచ్చినది. ఇది ఆమె కిష్టము. ఇందు మహాశ్వేతయొక్క ప్రమేయముకూడ నున్నది. నీవు దీనిని పరిగ్రహించక తప్పదనియిచ్చెను. ఆ హారము పేరు "శేషహారము." పాలసముద్రమును చిలికినప్పుడన్ని రత్నములు వచ్చినవి. ఒక్కటిమాత్రము మిగిలిపోయినది. ఎవరికంటను బడలేదు. ఆ శేషమే యీ శేషహారము. విష్ణువు కంటబడినచో కౌస్తుభమును విడిచి దీనినే తనసొమ్ము చేసికొనెడివాడు.

ఇక ఆ హారవర్ణనమును పరిశీలించినచో ఆ హారమున కిరువైపుల నున్న మదలేఖా తరలికలను గమనించినచో బాణుడిందులో నేదో రహస్యము పెట్టినట్లు తోచును.

కర్మానుష్ఠానపరుడైన వేదవిదుని, తన్నియమమును అనుశాసిం చునట్టి తత్త్వము. ఈ తత్త్వము మూడురూపములు. ఇడా - సరస్వతీ - భారతీ. లోకమున ఇడా సుషుమ్నా పింగళనాడులని చెప్పుదురు. ఇచట కాదంబరీ చంద్రాపీడుల సంయోగము యోగపరమైనదని భావించు చుంటిమికదా! ఈ విషయమును మరింత నిగూఢముగా తరచి చూచుట

మంత్ర శాస్త్రరహస్యవేత్తలయిన మహానుభావులకు సాధ్యమేనోగాని నాకు కాదు. వీరి యనుబంధమునకు ఈ శేషహారమునకు సంబంధ మున్నదన్న విషయము విస్మరింపకుండుటయే మనకు అవసరము.

పుండరీకుని మెడలో మహాశ్వేతయొక్క ఒంటిపేట ముత్యాల హారమున్నదన్న విషయముకూడ మరువరాదు.

మహాశ్వేత కంఠమున పుండరీకుని స్ఫటికాక్షమాల యున్నద నియు విస్మరింపరానిది.

ఈహార వృత్తాంతములలో కొంత కథ నడచినది. మదలేఖ ఆ హార మును "ఇది కాదంబరియొక్క ప్రథమ ప్రణయప్రసర" మని ఆతని వక్షః స్థలమున ధరింపజేసెను.

ఆ వక్షః స్థలమెట్లున్నది? మేరుపర్వతముయొక్క సానువువలె నున్నది. ఈ హారము దానిపై నక్షత్రమాల వలె నున్నది. "తారా చక్రమివ చామీకరాచలస్యతటే తంత స్య వక్షః స్థలే బబంధ." ఈ హారమునతడు ధరించి క్రీడాపర్వతకమునందుండగా తూర్పుకొండపైన (ఉదయగిరి) చంద్రునివలె నుండెను. ఆ శోభ చూచుటకై మరల కాదంబరి తనసౌధశిఖరముపైకి పోయెను. చంద్రాపీడు డప్పుడు ఎక్కడ కూర్చుండెను? ప్రమదవనమున క్రీడాపర్వతక మణిమందిరమున. ఇప్పుడు కాదంబరి ఎవరినిచూచుచున్నది. సౌందర్యలహరిలోని యీ శ్లోకమును భావించుదము.

> "సుధాసింధోర్మధ్యే సురవిటపి వాటీ పరివృతే
> మణి ద్వీపే నీపోపవనవతి చింతామణి గృహే
> శివాకారే మంచే పరమశివ పర్యంకనిలయాం
> భజంతి త్వాం ధన్యాః కతిచన చిదానంద లహరీమ్." [సౌం. ల. 8 శ్లో]

శివాకారమైన మంచమునందు చిదానందలహరియైన పరమేశ్వరి వలె నున్నది ఆ హారము చంద్రాపీడుని వక్షః స్థలమున. మరియు ఈ శేషహారమును ధరించిన చంద్రాపీడునియందు సహస్రారమునందలి

బిందుస్థానమున నున్న సాదాఖ్యమైన చిత్కళతో కూడిన శివలక్షణ మున్నది. చిదానంద లహరివలె నున్నాడు. ఈ కాదంబరి యెక్కడో లేదు- ఆ హారమే ఆమె- ఆమె హృదయము మనోహారము.

హిమ గృహమున మన్మథార్తయైయున్న కాదంబరిని చూచుటకై కేయూరకునివెంట రెండవసారి వచ్చిన చంద్రాపీడుడు ఆమెను చూచినప్పటి వర్ణనయు నిచట స్మరింపదగినది – ఆమె మన్మథ భావము లెంత యుద్దీపకములుగాం నున్నవనగా నామెయే మన్మథజనని వలె నున్నది. బాల (కన్యక) యైనను – "బాలాం మన్మథ జననీం చ, మృణాళినీ మభ్యర్థిత తుషార స్పర్శాంచ" అని వర్ణన ముగించును.

బాల అనగా కన్యయని – కన్య మన్మథ జనని యెట్లగును? మన్మథ భావోద్దీపనము కలిగించు లక్షణముచే మన్మథజనని- విరోధాభాసము సమకూడినది. బాలాం, మన్మథ జననీం అనుటలో బాణుడు నిగూఢముగా నామె వర్ణనలలో తాను చూపిన తత్త్వలక్షణమును స్మరింపజేయుటకా యన్నట్లు శ్లేషను ఘటించినాడేమో! విచార్యము.

ఈ వర్ణనమునందు ప్రధానముగా కాదంబరియందు శృంగారరస పరిపూర్ణత్వమునే కవి చెప్పెను. చంద్రాపీడునకు మన్మథార్తయైన యామె యట్టిశృంగారసపరిపూర్ణగనే భావితయగుటయే పరమార్థము. అమ్మవారినిగూర్చిగూడ "శృంగారరససంపూర్ణాయై నమః" "హర నేత్రాగ్నిసందగ్ధకామసంజీవనౌషధ్యై నమః" అనియే చెప్పిరి. ప్రస్తుత శృంగారరసమునకు భంజకమైన భావనకాదు. కాదంబరియందు కదంబ వనవాసినియైన అంబలక్షణమును వాఙ్మాత్రముగా కూడ స్పష్టముగా విరోధాభాసాలంకారము నాశ్రయించి స్ఫురింపజేసెననుటలో దోషము లేదని మనవి. "బాలాం మన్మథ జననీం" అని ప్రత్యేకముగా పేర్కొనెనుగదా! "మృణాళినీ మభ్యర్చిత తుషారస్పర్శాం చ" అనియు నెనెను, మరల నాశృంగారభావమునే స్ఫురింపజేయును.

కథను ఈ పరమార్థమునకు గొనిపోవుటకై బాణుడు చంద్రాపీడుని జీవలక్షణవర్ణనమునుండి ఆతని పరిణతాకారము నభివర్ణించు వివిధదశలయందును నతనియందు చంద్రప్రభ, చంద్రకళ, చంద్ర జ్యోత్స్న, చంద్రసుధాలేపన, లక్షణస్ఫురణయు ప్రాకట్యమునుగల యుపమానములను, నుత్ప్రేక్షలను, రూపకములను గుప్పించుచుండెను.

బాణుడనేకవర్ణనములననేక అలంకారములతో కూర్చుటయున్నది. కాని కథానుబంధియైన విషయము నాతడు స్పష్టములైన స్ఫూర్తులతో నింపియే యుంచును.

తారాపీడుడు గర్భభరాలసయైన తనరాణిని—

"ఆసన్నపూర్ణచంద్రోదయామివ, పౌర్ణమాసీనిశామ్"

పూర్ణచంద్రు డుదయింపనున్న పున్నమరాత్రివంటిదానినిగా చూడవలెనని యుబలాటపడుచుండెను.

ఆయనకు కల యేమివచ్చెను ?

"విలాసవత్యాః......ఆననే సకలకలాపూర్ణమండలం శశినం ప్రవిశన్తమద్రాక్షీత్"— విలాసవతిమొగమునందు సకలకలాపూర్ణమండలుడైన చంద్రుడు ప్రవేశించుట చూచెను. ఇక్కడ ఒకవిషయము మనవి చేయుదును. "కలాపూర్ణమండలు" డనగా అన్నికలలతో నిండినవాడనియేకదా అర్థము. మరి "సకల" కలాపూర్ణమండల మనేనేమి ? నిష్కలుడైనచంద్రుడు సాక్షాత్పరబ్రహ్మము— నిర్గుణుడు. సకలుడు సగుణుడు. నిర్గుణబ్రహ్మద్యోతనుడైన చంద్రుడు కలాపూర్ణుడే. సకల కలాపూర్ణుడు మాయావరణమును జొచ్చిన సగుణుడు. అందుచే నిట "సకలకలాపూర్ణమండల" మైనది.

విలాసతి గర్భవతియగుట యెట్లుండెను? "సరస్సులో చంద్రబింబము ప్రతిఫలించినట్లుండెను. సరసీమివ ప్రతిమాశశీ వివేశగర్భో విలాసవతీం."

ఈ లోకోత్తరమైన యీతని కాంతి జన్మాంతర సిద్ధమైనది. బ్రహ్మమే కలాత్మకుడుగా చంద్రుడని చెప్పకొంటిమికదా! ఈ తత్త్వమును వెల్లడించు నుపమానముతో ఈతని జన్మప్రకారమును బాణుడు వర్ణించెను.

"ఇరమ్మద మివ మేఘమాలా సకలలోక హృదయానంద కారిణం విలాసవతీ సుతమసూత."

నీలతోయద మధ్యస్థమైన విద్యుల్లేఖతోడి సామ్యము గమనార్హము. శుకనాసుడు శిశువుయొక్క లక్షణములను పేర్కొనునప్పుడును ముందు చంద్రలక్షణమునే పసిగట్టెను. విద్యావంతుడైన చంద్రాపీడుని చూచి పౌరజనము నమస్కరించుట యొక మంత్రాధి దేవతకు చేసిన నమస్కారమువలె నున్నది. "నమోఽస్మై రూపాంతరధారిణే భగవతే చంద్రాపీడ చ్ఛద్మనే పుండరీకాక్షాయ."

యువరాజుగా పట్టాభిషిక్తుడైనప్పుడు మేరుశృంగమును చంద్రుడువలె చంద్రాపీడుడు బంగారు సింహాసనము నధిరోహించెనని చెప్పెను.

"కాంచనమయం శశీవ మేరుశృంగం చంద్రాపీడః సింహాసనమారురోహ"

ఈతడు దిగ్విజయయాత్ర పూర్తిచేసి సువర్ణపురమునుండి ఏకాకియై చేసిన ప్రయాణమెట్టిది?

"ఉత్తరేణ సువర్ణపురం సీమంత లేఖాపృథివ్యాః సర్వజనపదానాం"

"తతః పరతో నిర్మానుష్య మరణ్యమ్"

"తచ్చాతిక్రమ్య కైలాస గిరిరితి"

కైలాసగిరి

అరణ్యమ్
↑
సువర్ణపురమ్

మరల తిరిగివచ్చునప్పుడు తాను వచ్చిన త్రోవ యంతయు చూచుకొనుచు వచ్చెను. శూన్యారణ్యము, చండికామందిరము, అటు నుండి యుజ్జయినివైపు పయనము. తాను ఏరోజున అచ్ఛోదసరోవర మునకు చేరెనో అచట తన సేనయంతయు వచ్చియుండెను. ఆ మరు నాటి యుదయము కేయూరకుడు తనకొఱకై వచ్చుచుండెను. కేయూ రకునివలన కాదంబరి యవస్థను దెలిసికొని తాను హేమకూటమునకు మరల బయలుదేరెను. ఈసారి పత్రలేఖనుగూడ గొనిపోయెను. పత్ర లేఖ కాదంబరి కోరికపై హేమకూటముననే యుంచబడెను. చంద్రా పీడుడొక్కడే తిరిగి వచ్చెను. ఈ రాకపోకలలోని రహస్యమేమి? మహాశ్వేతకు తెలియును. సంయోగానంతరము వియుక్తులైనవారి యందు పునః సంయోగాభిలాష నిరంతరముగాను తీవ్రముగను నుం డును.

స్వాధిష్ఠానమునందలి యగ్ని సహస్రారమున సుధాస్రావమును కలిగించినది. ఇచ్చట ఆ సంయోగమునందలి సుఖచ్యుతి కాదంబరి సహించలేదు. వియోగముచే సంతాపము. "దేహమందగ్ని మూడు స్థానములందున్నది. జ్ఞానాగ్ని, దర్శనాగ్ని, కోష్ఠాగ్ని యని. జ్ఞానాగ్ని స్థానము మనస్సు. దర్శనాగ్నిస్థానము ఇంద్రియములు. కోష్ఠాగ్ని సానము దహరాకాశము." జ్ఞానాగ్ని స్థానమైన మనస్సు (చంద్రా పీడుడు) తనవద్దనుండగా దర్శనాగ్ని తనను తపింపజేయదు. ఈ మనస్సు దూరమైనది. అప్పుడు కలిగిన తాపము ఇంద్రియబాధకము.

"సంతప్తచేతస్కులకు సుధాస్రావము లేదు. ఉష్ణ మోహములు-అగ్నిగుణములు; కామక్రోధములు - వ్యోమాంశములు; భయ దుఃఖ మోహములు - తమోరూపములు; ఇవి యన్నియు జీవధర్మములు గావున ఈ గుణము లుద్రేకించియున్నప్పుడు ఉష్ణాధిక్యమువలన సహస్రారమునుండి సుధావృష్టి కలుగ నేరదనియు నదివరకున్నదియు హరించు ననియు పైన చెప్పిన గుణము లుద్రేకించక అంతఃకరణ శాంతిగానున్నప్పుడు సహస్రారమునుండి యమృతస్రావమగు"నని చంద్రకలాజ్ఞానము అను గ్రంథము నుదాహరించుచు కామకలావిలాసమను గ్రంథమున వివరింపబడినది.

ఈ సంతాపము చంద్రాపీడునకున్నది. వియోగమునందలి యీ తాపముపశమింపవలెనన్న అంతఃకరణమును తపస్సుచే నియమించుకొన వలెను. ఈ జ్ఞానము లేనప్పుడు అవిద్యాకృతమైన కామ క్రోధాదుల తాపము బాధించునదే. వెంటనే చంద్రాపీడుడు హేమకూటమునకు బోయెను. తన ఇంద్రాయుధమునెక్కియే పోయెను. పత్రలేఖనుగూడ తోడ్కొనిపోయెను.

కాదంబరి యస్వస్థతనుగూర్చి చంద్రాపీడుడు వేసిన ప్రశ్న "కామరతిం నిమిత్తీకృత్య ప్రవృత్తోఽయ మవిరళ సంతాప తీవ్రో వ్యాధిః" ఇచట వ్యంగ్యము ప్రధానము. కామరతి వలననే యీ సంతాపము. మరి వేఱు అరతి యేమియు లేదు. ఆమె హిమ గృహమున నున్నది. ఆమె హిమగృహమున నుండవలసిన యవసరము చంద్రాపీడుని సందర్శనయోగముచే కలిగినది. అప్పుడుగాని కాదంబరి మహాశ్వేతనుగూర్చి చేసిన ప్రతిజ్ఞ "కుమతి మనోమోహ విలసితమ్"- తన చిత్తభ్రాంతి విలసితమని యామెకు తెలిసిరాదు. అందుకనియే మహాశ్వేత మొదట చంద్రాపీడుని హేమకూటమునకు రావలసినదని చెప్పుచు "దృష్ట్వా చ మన్నిర్విశేషాం కాదంబరీం, అపనీయతస్యాః

కుమతి మనోమోహం విలసితమ్ ఏకమహో విశ్రమ్య శ్వో భూతే ప్రత్యాగమిష్యసి" అని చెప్పినది. మహాశ్వేతయందు కాదంబరికి గల యనుబంధము భ్రాంతిజన్యము. చంద్రాపీడునితోడి యనుబంధము సత్యము. మిథ్యయైన లోకమును సత్యమని భ్రాంతిపొందు జీవుడు సంసారలంపటుడై నట్లే మహాశ్వేతయందు కాదంబరి వ్యామోహం పడినది. మహాశ్వేత సత్యమును చూపినది. కాదంబరిలో భ్రాంతి తొలగినది. భ్రాంతిమూలకమైన ప్రతిజ్ఞయు పటాపంచలైనది. ఇప్పుడామె యనుబంధము తాపము ఆ సత్పదార్థముతోడి సంయోగమునకు.

శేషహారము చంద్రాపీడున కుపహారముగా నిచ్చినది. అది యాతడు తనప్రక్కక్రింద పెట్టి మరచి వచ్చినాడు. ఆతనికావిస్మృతి యెట్లు కలిగెను? తన జీవుడు మనస్సు ఇంద్రియములు అన్నియు కాదంబరినే గ్రహించినవి కాగా తదన్యమునందు ఆతనికి విస్మృతి కలిగినది. ఈ హారముగూర్చి యాతడు స్మరించులోననే కేయూరకుడాహారమును తీసికొనివచ్చెను. ఈ హార మేమిచేసినది. కాదంబరికడకు మరల గొని పోయినది. ఈ హారము శ్రీ విద్యామణి. అది యాతని చెంతనుండగా ఆతడు సర్వాత్మనా తదనుష్ఠానపరుడై యుండును. హేమకూటము నుండి తిరిగి యుజ్జయినికి వచ్చునపుడు రక్తధ్వజము, చండికాలయము, జరద్ద్రావిడ సందర్శనము చంద్రాపీడునకు కలిగినట్లు బాణుడు వర్ణించెను. ఈ ప్రయాణము ఒక పగలు శూన్యాటవిగుండ జరిగినది. ఇది శూన్యమైన యటవియేమి? ఇది జీవితమున వ్యర్థమైన సమయము వంటిది. తాను జీవితమునందలి యున్నతోన్నతమైన యొక యనుభవము నుండి మరల నైహికమునకు వచ్చుచున్నాడు. ఈ శూన్యాటవి వర్ణన తరువాత రక్తధ్వజ వర్ణనమున్నది. రక్తధ్వజము లోకమున తమోగుణాభిభూతులైన కొందరు దురాచారపరులు నిర్వర్తించు తామస

శక్త్యనుష్ఠానమునకు పతాక ప్రతీక. దానికెదురుగా చండిక అమ్మ వారి గుడి యున్నది. చాల భీషణమైన విగ్రహము. ఆ వర్ణనమంతయు నల్లని యెఱ్ఱని పరికరముల, పరిసరముల మొత్తములతో నిండి యున్నది.

అచట నొక జరద్ద్రావిడ ధార్మికుడున్నాడు. దాంభికుడు. ధూర్త పాశుపతవ్రతధారి. ఘోటక బ్రహ్మచారి. ఘోటకమనగా గుఱ్ఱము. గుఱ్ఱమునకు ఆడుగుఱ్ఱము కనిపించనంతవరకే బ్రహ్మచర్యము. కనిపించెనో దాని కాముకత్వమునకు అంతులేదు. ఈ ముసలి ద్రావిడుడు అట్టి వాడు. వీనివద్ద స్త్రీవశీకరణచూర్ణములు, పిశాచములను పలికించు నాఠ్యాటములు, దోమలు గుంయి్ మన్నటుల ఏదో తలనాడించుచు అవ్యక్తముగా పాడుచుండుట, "మశకక్వణితాను కారి కిమపి కంపితోత్తమాంగం గాయతా" చికాకు పడుచుండుట— తన ముఖభంగీ వికారముతో చండికాదేవినిగూడ వేళాకోళముగా దెప్పిపొడుచుట ఇత్యాది లక్షణములతో నున్న ఆ కపటయోగి దాంభికయోగి చంద్రాపీడుని సేనలు తన ప్రశాంతత కేదో భంగము చేసినట్లు చీదరించుకొనెను. సైనికులు వానినేమైన చేయగలరు. కాని చంద్రాపీడుడు వారిని నివారించెను. ఆతనికి ఈ ముసలి ద్రవిడుని జూచిన నవ్వువచ్చెను. బాణుడిచటనే మనకు కన్నులకు గట్టినట్లు యోగసాధకులలో నెంతభేదముండెనో చూపించెను. వేదబాహ్యమైన యనుష్ఠానముతో తామసములైన క్షుద్రమంత్ర తంత్రములతో వామాచారము బూనిన శాక్తేయాపశదులవలన మహావిషయమైన శక్త్యుపాసనా లక్షణమంతయు లోకమున భయంకరమైనదిగా కనిపింపజేసిన తామసప్రకృతియొక్క వర్ణనమది. ఈ దృశ్యములన్నియు కిన్నరమిథునమునుగూర్చి గుఱ్ఱముపై పరుగెత్తుచున్నప్పుడు చంద్రాపీడునకు కనిపించలేదు. ఆతని మనసు లక్ష్యముపై నిలిచి పరుగెత్తినది. ఇప్పుడు అతని మనస్సంతయు హేమ

కూటముననే యున్నది. ఇంద్రియములు గృహోన్ముఖములైనవి. వీనికి గోచరించినవానిలో నాతనికి నిష్ఠలేదు. కాని లోకము కన్పించు చున్నది.

కైలాసగిరి సత్త్వగుణ విశిష్టము. దానిక్రింద రజోగుణము. ఇం కను క్రింద తమోగుణము. ఉన్నతస్థానముననున్న వానికి క్రిందవన్నియు నంటవు. బాణుడు విస్తృతముగా చంద్రాపీడుని యీ తిరుగు ప్రయాణ మునుగూడ నీరీతిగా వర్ణించుటలో తాను తన గ్రంథమునందు ఏయే వర్ణనము లెందుకు చేయుచుండెనో అది యంతయు సమగ్రముగా పాఠ కుడు భావించుకొనుటకు అవకాశము కల్పించుటకో యన్నట్లుండెను.

కాదంబరి కథలో శృంగారరసమును వదలి యీ వేదాంత మం తయు చెప్పుట కవియొక్క సాహిత్యశక్తికి వంచనము కదా! అని కొం దరు విమర్శకులనవచ్చు. కాని మనము వేదమంత్రములు చదువుచు న్నాము. వాని అర్థము తెలియదు. అప్పుడు పొందెడి ప్రయోజనమేమి? ఈ వేదపాఠకులు నావారని వేదము సంతోషించును. వారిపై తన యను గ్రహము చూపును. కాని వానికి అవి వట్టి మంత్రములుగా చిలుకవలె పలుకునపుడు వానియందధికార మేర్పడదు. అర్థభావన చేసినవారికి ఆ మంత్రములు మరియు ప్రీతిదాయకములగును.

"ఉతత్వః పశ్యన్న దదర్శవాచం
ఉతత్వః శృణ్వన్ న శృణోత్యేనాం
ఉతోత్వస్మై తన్వం విసస్రే
జాయేవ పత్య ఉశతీసువాసాః"

[ఋగ్వేదము 10-71-4 నిరుక్తము 1-19-భారతీనిరుక్తి]

అర్థభావన చేయనివాడు వేదవాక్కును చూచియు చూడని వాడే. వినియు విననివాడే అగుచున్నాడు. తదంతర్గతమైన భావమేమి?

ఏ లక్ష్యముచే అతడీకల్పన జేసినాడు ? దీని ప్రయోజనమేమి ? అని ఆలోచింపవలెను.

ఒకడు నదిలో స్నానము చేయుచున్నాడు. వానికి స్నానమే ప్రయోజనము. నదిలో పట్టిజలమే వానికి కన్పించుచుండును. మరొకడు అది బ్రహ్మామృతానందరసపూర్ణమని భావించును. అప్పుడు వానికది తన స్వస్వరూపమును తేటపఱచి దేవతలను దర్శింపజేయును. స్కాంద పురాణములో కృష్ణామాహాత్మ్యమునుగూర్చిన శ్లోకమిట్టిదున్నదని భారతీనిరుక్తిలో చదివితిని–

"బ్రహ్మామృతానందరసేన పూర్ణాం
జలేన పూర్ణామివ మేనిరేఽజ్ఞాః
త్వాం త్వావగాహామి పిబామి కృష్ణే!
దేవాన్ ఋషీన్ తర్పయిష్యే పితౄంశ్చ"

ప్రాకృతజనుల దృష్టిలో ఈ కృష్ణానది జలప్రవాహపూర్ణముగ మాత్రమే కన్పట్టును. కాని వాస్తవముగానిది బ్రహ్మామృతానందరస పూర్ణము. భారతీనిరుక్తికారులు కావ్యమునందు శాంతరసప్రాముఖ్య మును గూర్చి యిట్లుచెప్పిరి.

"కావ్యములలో శృంగారాదిరసములతోపాటు శాంతరసమున కును స్థానము కలదు. స్థానముండుటే కాదు. ప్రాణులకు శాంతము స్వాభావికము. శృంగారాదు లాగంతుకములు. కాన శాంతము ప్రకృతి రసము. శృంగారాదులు వికృతిరసములు. వికృతిరసములకు తుదకు ప్రకృతిరసమునందే లయము అని యాలంకారికులు చెప్పుదురు. ఈ శాంతరసము శ్రుతిప్రతిపాదితతత్త్వజ్ఞానమునకు మిగుల దోహదకారి యగును. అట్టి శాంతమును రససార్వభౌమమని కీర్తించుటయు శ్రుతి సిద్ధరసస్వరూపమును గుర్తింపజేయుటయందు ఆలంకారికులకుగల తాత్ప ర్యమును నభివ్యక్తము జేయును."

"భావావికారారత్యాద్యా శాంతస్తుప్రకృతిర్మతః
వికారప్రకృతేర్జాతః పునస్తత్రైవలీయతే
స్వంస్వం నిమిత్తమాసాద్యశాంతాద్భావః ప్రవర్తతే
పునర్నిమిత్తాపాయే తు శాంతఏవప్రలీయతే"— అభినవగుప్తులు

అచ్ఛముగా జీవితమెట్టిదో మహాకవి సృష్టించిన కావ్యమును నట్టిదే. వ్యుత్పన్నుడైన కవియొక్క భావన యోగనిష్ఠుడైన ముని యొక్క ధ్యానమువంటిది. వ్యుత్పన్నుడు తాను సంగ్రహించిన వివిధ శాస్త్రార్థముల సమన్వయించి భావించును. ముని తన సర్వమనోవ్యాపారమును ఏకాగ్రముచేసి ధ్యానించును. ఇరువురి గమ్యమును నొక్కటే— ఆనందము.

కవియొక్క భావనావ్యాపారము రసానందపర్యవసాయి. మునియొక్క ధ్యాననిష్ఠ బ్రహ్మానందపర్యవసాయి. కోటినదులు ధనుష్కోటిలో కలిసినట్లు సర్వరసములు శాంతరసమునందే లయించును. కళాత్మకమైన కావ్యమున కవి రసపరిష్కారమున సమగ్రదృష్టికలవాడైనచో శృంగారరసమునే వర్ణించునుగాక తన్నిగూఢమైన తత్త్వమును సత్యప్రతిపాదకమైన శాంతాత్మతోడనే ప్రతిపాదించును. ఆ పరమార్థ భావన చేసినవానికి బ్రహ్మసాక్షాత్కారమువంటి రసానందస్థితి కలుగును.

బాణుని కాదంబరిలో చంద్రాపీడునికథ శృంగారరసప్రధానమే. కాని చంద్రునికథ సకలరసాశ్రయము. చంద్రాపీడుని శరీరమునందు ఎంత కళయుండెనో ఆతని జీవునియందు అంత తత్త్వముండెను.

అట్లేకాదంబరీ కావ్యమునందు శృంగారరసమునే పోతపోసెను. ఆరసమునబడి ధ్యానమగ్నుడైనవానికి మూలతత్త్వమైన చంద్రుని ఈ సర్వరసపర్యవసాయియైనలక్షణమే గోచరించును.



# 7

# కాదంబరీ రసోల్లాసము

రసో వై సః
రసగ్గ్ హ్యేవాయం లబ్ధ్వాఽనందీ భవతి.

# కాదంబరీ రసోల్లాసము

"నిరంతర రసోద్గార గర్భసౌందర్యనిర్భరాః
గిరః కవీనాం జీవన్తి న కథామాత్రమాశ్రితాః" [కుంతకుడు]

"కావ్యజీవితము కథపై కాదు రసముపై నాధారపడి యున్నది. నిరంతముగా రసము జాలువారు సౌందర్యనిర్భరములైన కవుల కావ్యములే సహృదయావర్జకము లగును. వట్టి కథ కావలెనన్నచో ఇతిహాసములు చదువుకొన్న చాలు."

"కవినా కావ్యముముపనిబధ్నతా సర్వాత్మనా రసపరతంత్రేణ భవితవ్యమ్"......న హి కవే రితివృత్తమాత్ర నిర్వహణేన కించిత్ప్రయోజనమ్ ఇతిహాసాదేవ తత్సిద్ధేః" అని ధ్వన్యాచార్యులు కవులు రసనిర్వహణమే ప్రధానలక్ష్యముగాగొని కావ్యములు నిర్మించవలెనని కావ్యమున రసమే జీవమని చెప్పెను.

రసవంతమైన కావ్య మనగా లోకమున శృంగారరసప్రధానమైనదనియే ప్రతీతి. రసములను పేర్కొనుటలో మొదట శృంగారమునే ఆలంకారికులు గ్రహించిరి.

"శృంగార హాస్య కరుణ రౌద్ర వీర భయానకాః
బీభత్సాద్భుత శాంతాశ్చ రసాః నవ ఇతిస్మృతాః"

అన్నారు. శృంగారమున కిట్టి యగ్రతాంబూలము నిచ్చుటకు కారణము సంసారులకు లోకమున శృంగారరసమే సన్నిహితమైనదియు, కమనీయమైనదియు నగుటయే! "శృంగారరసో హి సంసారిణాం నియమేనానుభవ విషయత్వాత్ సర్వరసేభ్యః కమనీయతయా ప్రధానభూతః" అని పేర్కొనిరి. లోకమున శృంగార రసముయొక్క ప్రాచుర్యమును బట్టియే కవులు రసవత్కావ్య నిబంధనమున శృంగార రసమునే ఆశ్రయింతురు. భోజుడు తన శృంగార ప్రకాశమున "శృంగార ఏక ఏవ రసః" అని కావ్యనిబంధనమున శృంగారముయొక్క యుత్కర్షను

ప్రబోధించినాడు. ధ్వన్యాచార్యులును కావ్యజగత్తున మాధుర్య సంపాద కత్వమున శృంగారమే మిక్కిలి ప్రహ్లాదనమైన రసమని పేర్కొనిరి.

"శృంగార ఏవ మధురః పరః ప్రహ్లాదనోరసః
తన్మయం కావ్యమాశ్రిత్య మాధుర్యం ప్రతితిష్ఠతి"

అనెను. కవులకు, ఆలంకారికులకు, లోకమునకు శృంగార రస మున్న అంత ప్రీతి.

కాదంబరివంటి లోకోత్తర సౌందర్యవతిని; చంద్రాపీడునివంటి సకల కళాపూర్ణుని నాయికానాయకులుగా నెన్నుకొనిన బాణుడు తన కథాకావ్యమునందు శృంగారరసమును మేరుశృంగోన్నత పీఠమున నిలిపి రసరాజ్యాభిషేకము జేసెను.

తన కావ్యమున శృంగారరస సమగ్ర స్వరూపమును వినూతన పరిష్కార బంధురముగ దీర్చుటలో మహాశ్వేతా పుండరీకుల ప్రణయ వృత్తాంతమును విలక్షణముగా చిత్రించెను.

జీవితమునుగూర్చి సమగ్రానుశీలనము జేసిన బాణుడు లోకధర్మ మును కావ్యధర్మముతో మేళవించుటలో నవరసబంధురమైన జీవిత ములో నాయారసముల పట్టును గుట్టును భావించి పరిష్కరించిన కథా సంవిధానము ఆశ్చర్యజనకము.

యథార్థమునకు లోకమున శృంగారముకంటె మానవజీవితాను భవమున కరుణరసము చాల సన్నిహితమైనది. ఈ విషయమును రాముని జీవితముతో సమన్వయించి భావించిన భవభూతి "ఏకో రసః కరుణ ఏవ" అనినాడు.

రాజతరంగిణిలో కల్హణుడు శాంతరసమునకు మూర్ధాభిషేకము జేసెను.

"క్షణభంగిని జంతూనాం స్ఫురితే పరిచింతితే
మూర్ధాభిషేకః శాంతస్య రసః సోఽత్ర విచార్యతామ్".... రాజతరంగిణి

(శ్రీ)మదభినవగుప్తపాదులు శృంగారాదులు వికృతిరసములని శాంతము ప్రకృతిరసమని పేర్కొనిరి.

"భావా వికారా రత్యాద్యాః శాంతస్తు ప్రకృతిర్మతః
వికారః ప్రకృతేర్జాతః పునస్తత్రైవ లీయతే॥
స్వం స్వం నిమిత్తమాసాద్య శాంతాద్భావః ప్రవర్తతే
పునర్నిమిత్తాపాయే తు శాంత ఏవ ప్రలీయతే॥"

ప్రాణులకు శాంతము స్వాభావికము. శృంగారాదు లాగంతుకములు. కాన శాంతము ప్రకృతిరసము. శృంగారాదులు వికృతిరసములు. వికృతిరసములకు తుదకు ప్రకృతిరసమునందే లయము అనిచెప్పిరి.

జీవితమును సూక్ష్మముగా ననుశీలించిన మహానుభావులు దర్శించిన యనుభవ పరమార్థము లట్లుండెను.

లోకమునకు ప్రియమైనది శృంగారరసము. అనుభవింపక తప్పనిది కరుణరసము. హితకారియైనది శాంతరసము. మిగిలిన రసముల యనుభవము తత్తన్నిమిత్తాను గుణాపతితము. కరుణ, శాంత, శృంగారములు మాత్రము మానవజీవితమున తఱచు అనుభవములోనున్న రసములు.

జీవితమునకు వ్యాఖ్యానప్రాయములైన మహాకవుల కావ్యములలో నానావిధరస నిబంధనము నుండక తప్పదు — లోకధర్మము ననుసరించి. మరి కావ్యధర్మము ననుసరించినచో కావ్యమున ప్రధాన రసమేదో యొకటియే యుండవలెను.

"ప్రసిద్ధేఽపి ప్రబంధానాం నానారసనిబంధనే
ఏకో రసోఽంగీ కర్తవ్యస్తేషా ముత్కర్షమిచ్ఛతా" [ధ్వన్యా-3-21]

ప్రబంధమున నానారసనిబంధనము ప్రసిద్ధమైనను ఒక రసమునే అంగిరసమును చేయవలెనన్న యాలంకారిక ప్రమాణము కాదంబరీ ప్రబంధమున శృంగారమును పరాకోటిలో నిలిపినది.

కాని లోకవృత్తము సహజముగా చిత్రించవలెనన్నచో కరుణ శాంతములనుకూడ కవి సముచిత ప్రాధాన్యముతో నిరూపించవల యునుగదా! బాణుడీ విషయమున చాల నవధానచిత్తుడై యుండెను. తన కావ్యకథ మానవలోకమునుండి, సిద్ధలోకము నుండి, దివ్యలోకము నుండి యల్లుకొనిపోయినకథ. మూడు రసములకు మూడు లోకములు చాలును. వానిని సమన్వయించుట బాణునకే చెల్లినది.

ఇక కథాముఖమున బాణుని రసపరిష్కారమును భావింతము కాదంబరీ కథాప్రపంచమున మహాశ్వేతా వృత్తాంతము వచ్చువరకు శృంగార రసప్రసక్తియే లేదు. "కథాముఖము"న శూద్రక వృత్తాంత వర్ణనము నందు శృంగార రసము పరిహరింపబడినది. రాజు వనితా సంభోగసుఖపరాఙ్ముఖుడు. చండాల కన్యకావర్ణనమేగాని మరియొక కాంత వర్ణనముకూడ లేదు. అక్కడ ప్రధానముగా చెప్పబడినది వైశంపాయనుడన్న చిలుక వృత్తాంతము. చిలుక కథలో కరుణరసము గుండెలు పిండివేయును. దానికి ఓదార్పు జాబాలి మున్యాశ్రమమున లభించినది. అచట కథలో శాంతరసము తొంగిచూచినది. తన కథను చెప్పిన చిలుక భయానకబీభత్సాద్భుత శాంతరసములను కరుణరస మునకు అంగభూతములుగా జేసినది. శూద్రకమహారాజు, చిలుకరూప మునున్న వైశంపాయనుడు తమ పూర్వజన్మల స్మృతిలోని అనుబం ధము తెలిసినంతనే మరణించిరి. దానితో నచట కరుణరసముత్కృట కోటికి పోవలసియున్నది. కాని కవియొక్క ప్రజ్ఞాబాణము కథను విప్ర లంభశృంగారమునకు మళ్ళించెను. ఏక్షణమున శూద్రకునకు జన్మాంత రీయకమైన స్మృతి కలిగెనో అప్పుడాతని తాపము కాదంబరీ విషయిక మైన విప్రలంభమున కలిగిన మన్మథదశా చరమకోటికి చేరినది.

"అథ రాజ్ఞస్తద్వచనమాకర్ణ్య సంస్మృత జన్మాంతరస్య సఖే వైశంపాయనాఖ్య పుండరీక! దిష్ట్యాతుల్య కాలమేవావయోః శాపావ సానం సంజాతమ్' ఇత్యభిదధత ఏవ_

ఆకర్ణాకృష్ట కార్ముకో మకరకేతు రగ్రతః పరమాస్త్రం కాదంబరీం కృత్వా జీవితాపహరణాయ ప్రతిరోధక ఇవ నిరుద్ధ సర్వాశోన్తరా పదం చకార। తత్ప్రదాక్రాంతి నిర్వాసిత మివ కాదంబరీ శరణముపజగామాంతః కరణమ్!" [కాదంబరి ఉత్తరార్ధము–205 పుట]

మన్మథుడు కాదంబరిని అస్త్రముగా జేసి శూద్రకుని యందు ప్రవేశించినాడు. శూద్రకుని యందు మన్మథావస్థలు పరంపరగా వర్ణితములైనవి. "అంతర్జ్వలిష్యతో మదనదహనస్య ధూమోపహతమివ వేపమానాధరకిసలయమ్ శోషమగాత్...... ఆర్ద్రీస్యదారుణోద్రవ ఇవ దహ్యమానస్యాంగేభ్యో తిరగమత్స్వేదః...... మదనశరకీలితానీవ తావత్తైవక్షణే నాంగాని పరవశాన్యజయంత..." [కా. ఉ. 206]

ఈ మన్మథావస్థా పరంపరావర్ణనలో కుమారబాణుడు తండ్రిని మరపింపజేయు ధారాళమైన మార్గణ మార్గము జూపెను. అంతటి మదనానలము చిలుకరూపమునన్న పుండరీకు నందును మహాశ్వేతోత్కంఠచే చెలరేగెను. "కాష్ఠీభూత దేహస్య దాహాక్షమో ఝటిత్యేవారురోహ పరాం కోటిం కామానలో రాజ్ఞ ఏవ తుల్యావస్థస్య మహాశ్వేతోత్కంఠయా పుండరీకాత్మనో వైశంపాయనస్యచ"

[కాదం. ఉత్తర. పు. 209]

ఈరీతిగా కాదంబరీ కావ్యమున మర్త్యలోకమున జరిగినకథలో 'కథాముఖమున' చిలుకవృత్తాంత మొక్కటి చెప్పబడి కరుణరసము ప్రధానముగా ప్రవర్తిల్లెను. తరువాత కథాంతమున ఈ ప్రాధాన్యము శూద్రకుని విప్రలంభావస్థావర్ణనముచే శృంగారమునకు మళ్ళింపబడెను.

లోకవృత్తముననుసరించి తొలుత మాత్రము కరుణరసమే వైశంపాయన (చిలుక) వృత్తాంతముద్వారా పాఠకుని స్పృశించును.

ఇక్కడ కథావిభాగమును గుర్తుంచుకొనవలెను. చిలుక చెప్పిన కథలో శూద్రకుని మృతి ప్రసక్తి లేదు. తన కష్టదశను జీవితకథను

మాత్రమే చిలుక చెప్పును. చిలుకజన్మలోని కథ మాత్రమే చిలుక చెప్పగలిగినది. అక్కడ కరుణరసమే.

చిలుక యొక్క పూర్వజన్మకథను జాబాలిముని చెప్పెను. ఆయన కథను ఉజ్జయినీ వర్ణనతో ప్రారంభించును. మహాకాలాధివాసము ఉజ్జయినియొక్క ప్రధానలక్షణముగా చెప్పుటలో ముని శాంతరసమును చిందించెను. రాణియైన విలాసవతియొక్క సంతాన కృతమైన దుఃఖమును వర్ణించుటలో కరుణరసమువికించియు రాజు ఆమెను ఓదార్చినవైఖరిలో శాంతరసమునే విస్తరించెను.

శుకనాసోపదేశమున యౌవనప్రభవములైన దోషములు, లక్ష్మీగతదోషములు విస్తారముగా వర్ణించి సాంసారికములైన ప్రలోభములనుండి దట్టుకొనుటకు వలయు నిర్వికారచిత్తత్వమున కుపస్కారకమైన శమదమాదిగుణ ప్రాముఖ్యముపన్యసించి శాంతరసమునకు చోటవ కల్పించెను.

ఇంద్రాయుధమువంటి అపూర్వాశ్వసందర్శనమున చంద్రాపీడునిలో కలిగిన విస్మయసంభ్రమావేగమును వర్ణించుచు–

"దైవతాన్యపి హి మునిశాపవశాదుజ్ఝిత నిజశరీరాణి శాపవచన బలోపనీతాని ఏతాని శరీరాంతరాణి అధ్యాసతఏవ" ఇత్యాది ఆతని భావపరంపరలో "మహాత్మన్ ! అర్వన్ ! యోఽసి సోఽసి నమోఽస్తుతే" అని దేవతాభావనాత్మకమైన నమస్కారముతో శాంతరసమునే కొలిచెను.

తరువాతికథలో "పత్రలేఖా" ప్రవేశము వర్ణింపబడినది. ఈమె "కించిదుపారూఢ యౌవన" చంద్రాపీడుని తాంబూలకరంకవాహినిగా అతని తల్లిచే నియుక్తురాలైనది. సాధారణ పరిజనులవంటిది కాదు. బాలికవలె లాలింపబడవలె. చాపల్యమునుండి స్వచిత్తవృత్తివలెనే మరల్పబడదగినది. శిష్యురాలివంటిది. ఆప్తమిత్రురాలివలె చూచుకో

దగినది" ఇటువంటి యౌవనవతి తన దేహప్రభతో భవనమును ధగధగ లాడించునది. చంద్రాపీడుని ప్రాసాదమున నతనిసేవకై నియోగింపబడి నది- ఆనాడు పత్రలేఖ చంద్రాపీడుని చూచినది మొదలు అతనిసేవించ వలెనన్నకోరిక ఆమెలో చెలరేగినది. "దర్శనేనైవ సముజాతసేవారసా నదివా న రాత్రౌన సుప్తస్య న ఆసీనస్య నోత్థితస్య నభ్రమతః న రాజకులగతస్యఛాయేవ రాజసూనోః పార్శ్వం ముమోచ" - రాత్రి యనక పగలనక రాజప్రాసాదమునక ఎప్పుడుపట్టిన ఎక్కడపట్టిన రాకుమారునితో నీమె యుండవలసినదే- ఈ అనుబంధము చాలచిత్ర మైన యనుబంధము. పత్నిగాదు ప్రియురాలుకాదు దాసికాదు. పురుషునికి సహచరి నిత్యసహచరి. బాణుడు ఈ పాత్రసృష్టిలో పురుషునిలో అంతర్గతమై ఉద్బుద్ధముకాని స్థితిలో నిద్రాణముగానున్న 'రతి' యను స్థాయిభావమునకు అభిన్నమయిన లక్షణమును నిరూపించెను అని నాకు తోచుచున్నది. ఉజ్జయినిలో ఈమె చంద్రాపీడుని జీవితమున ప్రవేశించు ఈ వర్ణనఘట్టమున మేల్కొనని శృంగారముయొక్క నిమీలితదశ సూచితమైనది. ఈ పాత్ర ఈ రసవిషయము తరువాత మరల చర్చింతును. ఇప్పటి ప్రసక్తి ఏమనగా జాబాలి చెప్పుచున్న ఉజ్జయినీ కథలో శాంతము ప్రధానముగా స్ఫురించుచుండగా ఈ పాత్ర వర్ణనమున శృంగారమునకు పట్టు చిక్కిన విషయము గుర్తుంచుకొన దగినదినియే. ఇంద్రాయుధముకూడ కథను శృంగారరసమునకు పరువెత్తించు గుఱ్ఱమే. చంద్రాపీడునిలోని యౌవనపరిపూర్ణతకు శృంగార రసాలంబనమునకు ఈ ఇంద్రాయుధము పత్రలేఖయు పరిపోషకములు —— ఈ సామగ్రి గర్భేశ్వరత్వము, అభినవ యౌవనత్వము, అనుపమరూపత్వము, అప్రతిమ శక్తిత్వము—— ఇవి యన్నియు కామ పురుషార్థసాధనపరములు శృంగార దశోన్ముఖములు గమనించియే శుకనాసుని యుపదేశము వీనికి కళ్ళెము వేసినది.

తరువాత దిగ్విజయగాథ చక చక మాటలతోనే గడచినది. రస విషయమచట వర్ణితము కాలేదు.

కిన్నరమిథునదర్శనముతో శుకనాసుని ధర్మోపదేశపు కళ్ళెమును విదలించుకొని కథాతురంగము అచ్ఛోద సరోవర ప్రాంతమునకు లంఘించినది. అచట మహాశ్వేతా సందర్శనము యౌవనపు పొంగుకు ఆనకట్టయైనది. ఆ దశలో కథ మరల శాంతరస ప్లావితమైనది. మహాశ్వేతా వృత్తాంతము శాంతమును సిద్ధాయతనమున నుంచి అచ్ఛోద సరోవర ప్రాంత చైత్రరథ వనమున శృంగార విహారమును జేయించినది. మహాశ్వేతా పుండరీకుల ప్రణయసన్నివేశములో "మన్మథుని వింటి నారిని తన జందెముగా దాల్చిన బ్రహ్మచారి - వాని ఎడమ చేతిలో తొడిమతోడి సురపొన్నకాయవంటి కమండలము, కుడిచేతిలో మన్మథవియోగార్తయైన రతీదేవి కన్నీటిబిందువుల జాలువంటి స్ఫటికాక్షమాల, వాని చెవిలో వనలక్ష్మి నవ్వినట్లున్న పారిజాతపు పూలగుత్తి సురతపరిశ్రాంతయైన రతీదేవి మేనిపైని తెల్లని సాత్త్వికస్వేద కణజాలమువంటిది; వానిని జూచి స్తంభించిపోయినదో, శిలయై శిల్పమైనదో, బొమ్మయైనదో, కట్టివేయబడినదో, మూర్ఛలో గొయ్యవారినదో, తెలియనిస్థితిలోనున్న మిసిమి యౌవనపు పొంగుల బాలామణి; ఈ జంటకు అనేక సురత సమాగమ లాస్యలీలోపదేశోపాధ్యాయుడైన మన్మథుడు అదృశ్యరూపుడై నేర్పిన రతిరసనిష్యంద విలాసములు" కన్నులగట్టినట్లు కలగాంచిన రూపము ముందట నిల్చినట్లు బాణుని మనోహర శృంగారవర్ణనము. ఆ ప్రేయసీ ప్రియులు ఏకముక్తావలీ స్ఫటికాక్షమాలల వినిమయము, వారి ప్రేమభంగము, విరహము, నాయకుని లోకాంతరప్రాప్తి తత్ప్రతీక్షాపరమైన నాయికా వియోగదుఃఖోల్బణత్వము - రసవాహినులు నాట్యము చేయును.

శాంతమూర్తియైన మహాశ్వేత తనగాథను చెప్పిన దయా: దుః ఖము భరింపలేక సంక్షుభిత మనస్కయై కరుణరస ముప్పొంగించినది. ఆపై చంద్రాపీడుని సాంత్వనవాక్యములు "అచింత్యో హి మహాత్మనాం ప్రభావః, బహుప్రకారాశ్చసంసార వృత్తయః ... ... అనేక విధాశ్చ కర్మణాం శక్తయః" వంటివి శాంతరసపోషకములైనవి. మహాశ్వేతా పాశుపతవ్రత ధారిణీత్వ లక్షణము, సిద్ధాయతనము, అచ్ఛోద సరోవరము, మహాశ్వేతా తపఃప్రభావము, సత్త్వగుణ సమున్మీలన పరమైన వర్ణనములన్నియు కేంద్రమున శాంతరస నిధానములైనవి. కథాతత్త్వమను ప్రకరణమున నిచటి ప్రశాంతత, మహాశ్వేత వైరాగ్యము, సిద్ధాయతన ప్రభావము పరామర్శింపబడెను. శాంతరసమునకీ సామగ్రి బహుధాపుష్టి నిచ్చినది.

వైశంపాయనుని చిలుక జన్మతో ప్రారంభించిన కథలో కరుణ రసము; ఈ సిద్ధాశ్రమమున శాంతరసము. కాదంబరీ కథాప్రవాహమున రెండు సరోవరములు _ పంపాసరోవరము; అచ్ఛోద సరోవరము పంపలో కరుణము, అచ్ఛోదమున శాంతము.

ఇక్కడనుండి కథ గంధర్వలోకమునకు బోయినది. కథాగమనమును వైఖరిని మనము గుర్తుంచుకొనవలెను. మొదట మర్త్యలోకమున, తరువాత సిద్ధాశ్రమమున- అక్కడనుండి (గంధర్వ) దివ్యలోకమునకు పోవుచున్నది.

ఎందుకు పోవుచున్నది? అచట నొక మానస సరోవరమున్నది. కాదంబరీ మానసమే ఆ సరోవరము. కథ అచ్చటికెందుకు పోవుచున్నది? "కాదంబరియొక్క మనోమోహ విలసితమును" తుడిచి పెట్టుటకు పోవుచున్నది. మహాశ్వేత దుఃఖములోనుండగా తాను వివాహము చేసికొననని కాదంబరి శపథముచేసి కూర్చున్నది. మహాశ్వేత

తోడి ఆమె యీ యనుబంధము అజ్ఞానవిలసితము. ఇది అయోగ్య వస్తువుతోడి అనుబంధము. కాదంబరియొక్క మనోమోహ విలసితము యోగ్యవస్తు దర్శనముచే విగళితమగును. ఆ సంగతి మహాశ్వేత యను భవములోనున్నది. దీనినిగురించి ముందు ప్రకరణమున చర్చించితిమి.

ఒక్కరోజు హేమకూటముననుండి కాదంబరి మనోమోహ విలసితమును తొలగించి వత్తువుగాని రమ్మన్నది.

అది మానసికమైన పరిణామమునకు చెందినది. మనస్సుల మథన మచ్చట ప్రధానమైనది. మనస్సు మథింపబడును. అది మన్మథుని కార్యము. కాదంబరీ మనోగతమైన మహాశ్వేతా హేతుకమైన మోహపుతెర తొలగినగాని ఆమె చిత్తవృత్తి స్వస్వరూపానుసంధా నాభిముఖీనము కాదు. ఆమె స్వరూపము నామెకు చూపుటకే చంద్రా పీడుని గొనిపోయినది మహాశ్వేత. కేయూరకుడు కాదంబరీ వీణావాహ కుడు. మహాశ్వేతను కాదంబరీ మనోమోహమునుగూర్చి తెలుపుటకై వచ్చిన పదునారేండ్ల పసిమిపడుచు లేబ్రాయపు గంధర్వకుమారుడు. చంద్రాపీడునకు పత్రలేఖ ఎట్లో కాదంబరికి ఈతడట్లు - కాదంబరీ హృదయగత రాగమునకు వైఖరీ నాదమువంటివాడు. ముందుగాపోయి మహాశ్వేతతో నొక రాకుమారుడు వచ్చుచున్నాడని చెప్పినవాడు. వానివలన వినినది మొదలు కాదంబరి చంద్రాపీడునిగూర్చి యూహిం చుకొనుచున్నది. ఆతనిని చూడగనే కేయూరకుడు చెప్పిన లక్షణము లన్నియు సరిపోల్చుకొన్నది. చంద్రాపీడుడు అద్దము. మనోజలధిని పొంగులెత్తించు చంద్రుడు. ఆ జలధిని మథించు మన్మథుడు. అంౖదై క్యమగు రసస్వరూపుడు. తద్దర్శనమున కాదంబరి యేమగును ?

"రసగ్గ్ హ్యేవాయం లబ్ధ్వా నందీ భవతి"

ఆ రస స్వరూపమేమి? "శృంగార ఏక ఏవ రసః" కవి కరుణ రస మును మర్త్యలోకమున వదలి, శాంతరసమును సిద్ధలోకమున ప్రతిష్ఠించి

గంధర్వలోకమున స్వచ్ఛమైన మధురమైన కమనీయతా నిధానమైన శృంగారరసమును పొంగులెత్తించును.

గంధర్వలోకమును మించిన శృంగార రసోద్దీపనము మరియొకటి యుండదు. "యోషిత్కామా వై గంధర్వాః" [శతపథ-3-2-4-3] "స్త్రీ కామా వై గంధర్వాః" [ఐతరేయ 1-27]. అందునను కథానాయకుడు చంద్రాపీడుడు చేరినది కన్యాంతఃపురమును. శృంగార రసాలంబనమైన స్త్రీ ప్రకృతి సర్వస్వమది. "శృంగారమయమివ, సౌందర్యమయమివ, సురతాధిదైవతమయమివ, కుసుమశరమయమివ, కుతూహలమయమివ, సౌకుమార్యమయమివ"— అచట స్త్రీ సౌందర్య సర్వస్వము కాదంబరి, పురుష సౌందర్య సర్వస్వము చంద్రాపీడుడు.

ఏవం విధ శృంగారరససామగ్రీ సముల్లసితమైన ఈ ప్రణయ వృత్తాంతము నతి విస్తారముగా కవి వర్ణించును. అంతయు అభిలాషాత్మకమైన అన్యోన్యప్రాప్తీచ్ఛా దశయందే సాగినది. దేహ ప్రభా సంపర్కమేగాని మనస్సంగమేగాని చక్షూరాగమే గాని యీ నాయికా నాయకుల సంయోగము దైహికమైన దశకు రాకయే నాయకుడు జన్మాంతరమును పొందును. ఇట్టి పరిణామమునకు బోవు కథయందు శృంగార రసమును అనౌచిత్య దోష జుష్టము కాకుండ చేయుట అందునను అంగిరసముగా పరిపుష్టము జేయుట యన్నది కవి ప్రతిభా సముల్లాసము.

ఈ కథ దివ్యాదివ్యమైన కథ. "దివ్యమానుష్యాయాం తు కథాయామౌచిత్యయోజన మవిరుద్ధమేవ" — అన్న ధ్వన్యాచార్యుల సూచన గమనార్హము.

చంద్రాపీడుడు మానుషావతారముననున్న చంద్రుడు. శాపముచే నవతారమెత్తినవాడు. కాదంబరి దివ్యాంగన. చంద్రాపీడుడు

అచ్ఛోద సరోవరమునుండి, సిద్ధాయతనమునుండి మహాశ్వేతా ప్రభావమున ఈ గంధర్వలోకమునకు చేరగలిగెను. ఈతనియందచ్ఛమైన దివ్యత్వము మరియొక శాప జీవితానంతరమునగాని సిద్ధింపదు. శాప విముక్తి సమనంతరముగా కాదంబరీ చంద్రాత్మక చంద్రాపీడ శరీరముల సంయోగమును కవి నిరూపించును.

ఈ శాపతనువునందు చంద్రుని ప్రభాజాలము దివ్యకాంతా తను ప్రభా సంపర్కయోగ్యముగా నున్నది. ఈ శాపతనువునందు చంద్ర జీవము విగతమైనప్పుడు అది వట్టి మానుష దేహమువలె శైథిల్యమును పొందెను. ఆ దశలో కాదంబరి సహగమనమున కుద్యుక్తురాలై యా తనువు పాదములు స్పృశించి యొడిలో దాల్చినంతనే యా చంద్రాత్మకమైన దేహజ్యోతి తచ్ఛరీరమును అవినాశిగా చేసినది. ఆ యుపాధి యుండలి జీవుని లోకాంతరగమనమును ప్రవాస లక్షణముగా జేసి ప్రవాస హేతుకమైన నాయికా విప్రలంభ శృంగారమును కవి నిరూపించినాడు. లేదా - "ఏక దేశస్థితయోరపి అనురాగే సత్యపి దైవప్రతిబంధాత్ విరహ హేతుక" మైన విప్రలంభముగానైన గ్రహింపవచ్చును.

అది సరే. అసలు సురతలక్షణములేని యీ కాదంబరీ చంద్రాపీడులయొక్క శృంగార స్వరూపమేమి? అయోగ శృంగారమును అంగిగా గ్రహించుటయా? ఇట్టి ప్రశ్నలకు అవకాశము లేదు. ధ్వన్యాచార్యుల వివరణము చూతము.

> "న చ సంభోగ శృంగారస్య సురతలక్షణ ఏవైకః ప్రకారః,
> యావదన్యేఽపి ప్రభేదాః పరస్పర ప్రేమదర్శనాదయః
> సంభవంతి, తే కస్మాదుత్తమ ప్రకృతివిషయే న వర్ణ్యంతే."

సంభోగ శృంగారమును వర్ణించుటకు సురతలక్షణమొక్కటే మార్గముగాదు. పరస్పర ప్రేమ దర్శనాదులైన యితర ప్రభేదములనేకములున్నవి. ఉత్తమ ప్రకృతుల శృంగార వర్ణనమున నిదియే

యుదాత్తమార్గము—అని వారి యభిప్రాయము. ఇట్లు చేయుటలో గొప్పయౌచిత్యముకూడ నున్నది. అది ప్రకృత్యౌచిత్యము.

"అకృతార్థేఽపి మనసిజే రతి ముభయ ప్రార్థనా కురుతే"

"అహో! చేష్టానురూపికా కామి జన చిత్తవృత్తిః"— ఇత్యాది దుష్యంత వాక్యములలో కాళిదాసు సురతరహితమైన సంభోగవైభవ మును సూచించినట్లు గ్రహించుచున్నాము.

ఇట్టి యుదాత్త లక్షణముతో సంభోగశృంగారమును వర్ణించుట దానిని పరిపుష్టము జేయుటయు చాల మనోహరమైన సన్నివేశకల్పన ములలో బాణుడు నిరూపించెను.

కాదంబరి ముగ్ధానాయిక. లజ్జావిజితమన్మథ. ఆమెచే చంద్రా పీడునకు తాంబూల మిప్పించుటకు మహాశ్వేత చాల బలవంతముచేయ వలసివచ్చెను. అప్పుడైనను నామెలోని లజ్జ ఎంతో అవరోధముగ నే యుండెను. మహాశ్వేత నుండి దృష్టిమరల్ప లేదు. శరీరమున కంపము. కనులలో తత్తర. బరువైన నిట్టూర్పులు. మన్మథుడు జలకమాడించు చున్నట్లు మేన సాత్త్విక స్వేదప్రవాహము; ఆ ప్రవాహమున మునిగి పోదు నేమో! నన్నాదుకొనుమన్నట్లు సాధ్వసపరవశురాలై పడిపోదు నేమో! నని చంద్రాపీడుని శరీరము నాలంబనము చేసికొనుటకో యన్నట్లు తాంబూలమును బూనిన తన చివురాకు వంటిచేతిని చంద్రా పీడునివైపు ప్రసరింపచేసినది.

ఆమె లోని కుమతిమనోమోహవిలసితము జారిపోయిన లక్ష ణము ఈ లజ్జాభావములో సువ్యక్తమైనది. మహాశ్వేత సాక్షి.

కాదంబరీగత లజ్జాభావము తిరోహితమగుట కుపస్కారకమైన శుక శారికా ప్రణయ కలహప్రసక్తి యొకటి మనోహరమైనది. తరు వాత నే—

నాయికా నాయకులందలి ప్రణయము సమానకోటికి చెందిన లక్షణము. క్రీడా పర్వతక శిఖరముపైన చంద్రాపీడుడు కన్యాంతఃపుర సౌధశిఖరముపై కాదంబరియు నిలచినప్పటి వారి హావభావములలో ప్రకటితమైనది.

తం విలోకయన్తీ తేన చ విలోక్యమానా మహాన్తమపి కాల మతిక్రాంతం నాజ్ఞాసీత్" ఈ స్థితి యేమిటి? వీరి శిఖరములకెట్లు చేరిరి? మహాశ్వేత కాదంబరి తల్లిదండ్రులను చూడబోయినప్పుడు వీరిశిఖరము లందుండిరి.

మహాశ్వేతను గూర్చిన మోహావిలసితము కాదంబరిలో లేదు. ఆస్థితిలో ఈ శిఖరములందు వారి హృదయములలో స్వస్వరూపసాక్షా త్కారమునకు దోహదమైన లక్షణమేర్పడినది. శృంగారరసము శిఖర మున కెక్కినస్థితి.

కాదంబరి మదలేఖా తరళికలతో తన శేషహారమును చంద్రా పీడున కుపాయనముగా క్రీడామందిరమునకు బంపెను. ఆ హారమెంత రమణీయముగా నున్నది! "నక్షత్రమాలాభరణమివ మదనద్విపస్య, జీవితమివ జ్యోత్స్నాయాః మందాకినీ ప్రవాహమివ సురయువతి కుచ పరిమలవాహినీం"—— అన్నియు దివ్యలక్షణములే! మన్మథుడన్న యేనుగునకు నక్షత్రమాలికాభరణము వలెనున్నది. వెన్నెలయొక్క జీవితమువలె నున్నది. సురయువతికుచముల మైపూతలవాసనలు గుబా ళించు మందాకినీ ప్రవాహమువలె నున్నదాహారము. బాణుడు శృం గారరసమునకు కల్పించినమూర్తి ఆ హారమని చెప్పనగును. [శూద్రక మహారాజు నాశీర్వదించిన చిలుకచేత అతని రిపుస్త్రీలు విముక్తాహార ముగా విరహవ్రతము పూనినట్లు చెప్పెను. హారముచే శృంగారము సూచితమైనది. మహాశ్వేత ఒంటిపేటముత్యాలహారమును పుండరీకున కిచ్చినది. ఇచట శేషహారము- ఇది బాణుని కల్పనలో శృంగారము యొక్క హారరూపక్రమము.]

ఈ శేషహారవృత్తాంతము నందలి నిగూఢమైన తత్త్వము కథా తత్త్వమను ప్రకరణములో పరామర్శింపబడినది.

గంధర్వలోకమునుండి తిరిగి స్కంధావారమునకు చంద్రాపీడుడు వచ్చునప్పటి యాతని స్థితి యెట్లుండెను ?

"తన్మయేన మానసేనాసహ్యా విరహదుఃఖానుశయ లగ్నామివ పృష్ఠతః, కృతమార్గగమననిరోధామివ పురస్తాత్ వియోగాకుల హృదయోత్కలికావేశోత్క్షిప్తామివనభసి, సమ్యగాలోకయితుం వదనం విరహాతురమానసామివస్థితా మురఃస్థలే, తామేవ మృగలోచనాం దదర్శ"

గుఱ్ఱమునెక్కి బయలుదేరినాడు. మనసుకాదంబరీమయమై యున్నది. ఆమె విరహదుఃఖము సహింపలేక తన వెన్నంటి వచ్చుచున్నదో; తన మార్గము నిరోధించుచు ముందు నిలచినదో, వియోగాకులమైనహృదయము గగనమున తనను విసరివైవగా తనపై యాకాశమున నవతరించినదో, విరహాతురమానసయై తనముఖమును చూపుటకై వచ్చి వక్షస్థలము నాక్రమించినదో యున్నట్లు కాదంబరి తనను అన్ని దిశల క్రమ్మివైచినట్లున్నది. విగళితవేద్యాంతరమైన స్థితియిది. సంకల్పరూపసంయోగ బహుప్రకారమది. ఈ రీతిగా తనను కాదంబరి సర్వతః క్రమ్మియున్నటుల భావనామగ్నుడై యుండిన యాతనికి శేషహారము బహిరలంకారమెట్లు గుర్తుండును ? కాదంబరి తనయందంతర్లీనమైనహారము. స్కంధావారమునకు చేరిననాడంతయు పత్రలేఖతో నామెను (కాదంబరిని) గూర్చిన ప్రసంగముతోనే గడచినది. రాత్రియంతయు నామెను గూర్చిన తలపులతోనే జాగరణము. హేమకూటమున కాదంబరికి కూడ నదియే యనుభవము. మరునాడుదయమే కేయూరకుడు హారము తీసికొనివచ్చినాడు. మరియునెన్నో యుపాయనములుగొనివచ్చినాడు. కాదంబరివిరహా మేదశకు వచ్చెనో చెప్పినాడు. ఆమెను హిమగృహమున నుంచవలసివచ్చెను. ప్రపంచమునందలి ఎం

తటి చల్లదనమును నామె తాపోపశమనమునకు జాలలేదు. చంద్రాపీడుని దర్శనమైనచాలు. మరల రెండవసారి కేయూరకునితో హేమకూటము నకు వచ్చినాడు. ఈసారి పత్రలేఖను గూడ వెంటగొనివచ్చినాడు. ఈ రెండవసారి హేమకూటమునకు చంద్రాపీడుడు వచ్చుటలో రసపర మార్థమేమి !

హేమకూటమునకు మొదటవచ్చినప్పుడు అయోగశృంగారము -పరస్పరవీక్షణ, భాషణ, సంకల్పాదులచే సంయోగశృంగారము వర్ణిత మైనది. చంద్రాపీడుడు స్కంధావారమునకు వచ్చినప్పుడు నాయికా నాయక విరహదశ, పునరాగమనము పునః సంయోగము. ఇది శృం గారరసము యొక్క సమగ్రసముల్లాసము.

మహాశ్వేత తోడి వియోగమున కాదంబరికి ఈ తాపము లేదు. ఈ సంయోగవియోగములచే పుట్టిన ఆనందము దుఃఖము సహజము. కాదంబరీ మహాశ్వేతల యనుబంధము మిథ్య. ఈ భేద నిరూపణము హిమగృహ వృత్తాంతమున నున్నది. అనగానేమి? చంద్రాపీడుని విర హమున కాదంబరికి తాపాధిక్యము. కాదంబరీ విరహమున చంద్రా పీడునకు తాపాధిక్యము. చంద్రాపీడుని తాపాధిక్యము శూద్రకజన్మలో చంద్రాపీడ జన్మస్మృతి కలిగినప్పుడు అభివర్ణితమైనది. ఆ తాపము మన్మథదశలలోని చివరిదశ యైన మరణమునకు మూలమై చంద్రాత్మక జీవుడు ధరించిన శూద్రకతనువు వినాశమైనది. ఆ జీవుని అసలు తనువు అచ్ఛోద సరోవరప్రాంతమున శివాలయము చెంత కాదం బరీ సంవీక్షణమున నున్నది. ఆ జీవుని తాపము ఈ తనువునందు సం క్రమించుచున్న స్థితిలో మధుమాసవేళ కాదంబరి మదనోత్సవమున తమకము పట్టలేక చంద్రాపీడ తనువును కౌగలించుకొనినది. శూద్రక దేహభ్రంశముచే ముక్తుడైన శాపరహితుడైన జీవుడు చంద్రాపీడుని తనువులో విరహతాపముతో ప్రవేశించెను. కాదంబరీ స్పర్శము

తాపము లేని ఆనంద స్థితిలో నాతని మేల్కొలిపినది. గంధర్వలోకమున హిమగృహములో కాదంబరియొక్క తాపమును తన దేహదానముచే నైనను దీర్చుచున్నాడు. ఇప్పుడు తన తాపము ఆమె దేహదానముచేతనే తీర్చినది. ఉభయులును పరస్పరము దేహదానము చేతనే తమతమ తాపముల నపనయించుకొనుట సంయోగ పరమార్థము. జన్మాంతరము పొందిన నాయకుడు మరల పూర్వస్మృతిచే ప్రియాసంయోగమునకు దేహముదాల్చుట అమృతమయమైన చంద్రత్వ లక్షణము. శృంగార రసోద్దీపన విభావమైన చంద్రుడు ఆలంబన విభావమగుట యది యీ కథలోని నాయకుని విలక్షణత. జన్మాంతరములందు పూర్వస్మృతి కలిగి వియోగవ్యథాకలితులైన నాయికా నాయకులు ఆలంబన విభావములుగా నుండుటయు ఈ కావ్యమునందలి శృంగారరసస్థితి యొక్క విలక్షణత. యథార్థమునకు నలుబది యేబదేండ్ల కాలము విరహావస్థలో గడుపుట యన్నది మానుషలోకములందు శృంగారరసస్థితికి అనుకూలమైనదశ కాదు. అది కరుణరసమే కావలెను. మరణహేతుకమైన నాయికానాయకుల విరహము మానుషౌఘమున కరుణరసాలంబనమే. కాని యీ నాయికానాయకుల స్థితి వేరు. చంద్రాపీడుడు చంద్రుని శాపావతారము. ఆ చంద్రాపీడ శరీరము మిత్రుడైన వైశంపాయనుని మరణముచే శిథిలమైనది. ఆ శిథిలమైన శరీరమునందు కాదంబరీ స్పర్శము చంద్రమయమైన తేజోదీప్తిని ప్రభవింపజేసినది. ఆ శరీరములోనికే శూద్రకజన్మనుండి ముక్తుడైన చంద్రాపీడునిలో జీవరూపుడుగానున్న చంద్రుడు ప్రవేశించినాడు. అప్పు డాశరీరము చంద్రునియొక్క దివ్యమైన శరీరమైనది. కాదంబరీ చంద్రాపీడులయం దిట్లు దివ్యత్వము పరిపూర్ణముగా సిద్ధించినది. అది వారి శారీరకమైన

సహజ సంయోగౌచిత్యము. చంద్రునకు అమృతముతోడి సంయోగము సహజము.

ఐనను తాను చంద్రాపీడుడన్న స్మృతిగల ఆ శరీరధారి విలాసవతీ తారాపీడులను తల్లిదండ్రులవలెనే భావించి నమస్కరించినాడు. అనగా విలాసవతీ తారాపీడుల కుమారుడు కాడితడు. మానుషౌఘమున నున్న స్థితిలో తారాపీడుడు విలాసవతియు ననుభవించినది పుత్ర విరహకృతమైన దుఃఖమే! వారు కరుణరసాలంబనములే.

కాని దివ్యౌఘమునకు చెందిన చంద్రునకు కాదంబరికి త్రికాలాబాధ్యమైన స్థితి యున్నది. వారి విరహము విప్రలంభశృంగారస్థితియే.

అందుకనియే చంద్రాపీడుని మరణముచే దుఃఖితురాలైన కాదంబరియందు శృంగార రసాలంబనత్వము విచ్ఛిన్నము కాకుండ లోక ధర్మమునకు విరుద్ధము కాకుండ శృంగారకరుణములకు విరోధముచే అనౌచిత్యదోష మంటకుండ కవి ఆ ఘట్టమును చాల నిపుణముగ నిశిత విమర్శనాపటువైన అనుశీలనముతో లెస్సగా పరిపోషించెను. [కుమార బాణుడు బాణునితో సమానమైన రససిద్ధాంత సమాలోచనాపరుడు కనుకనే కాదంబరి కావ్యము మనకు సమగ్రరూపమున దక్కినది].

ఆ స్థితిలో నాయిక కాదంబరి మూర్తీభవించిన శోకమై మదలేఖతో "అస్మిన్ సమయే మరణమేవ మే జీవితమ్, జీవితమ్ పునర్మరణమ్" ఈదశలో నేను మరణించిననే బ్రతికిపోదును. బ్రతుకుటయే నాకు మరణము అనును. ఇంతకుమించిన కరుణరస సన్నివేశ మేముండును? తన ప్రియునితో సహగమనమునకు చితి సిద్ధముచేయుమన్నది. సహగమనము సంతోషపూర్వకముగా చేయుటకు సిద్ధపడినయామె "ఉత్పద్యమాన పులక కేసరోద్భాసిన్య సమసాధ్వసానిలాహతోత్కంపోత్తరంగ్యమాణానంద వేగోర్మితరలా సంగలత్స్వేద మకరంద బిందు నిష్యం

దిసి ముకులాయమాన నయనకుముదా! కుముదినీవ చంద్రాపీడ చంద్రాస్తమయ విధురా"- రోమాంచము, కంపము, స్వేదము, నిద్ర ఇత్యాది దుఃఖ దశలు పొందినది. ప్రియునితో సహగమన భాగ్యమునకు ఆనందాశ్రువులు వెల్లుబికినవి. ఇంతటి కరుణరస సన్నివేశము మూర్తిగట్టించిన కవి శృంగారరసము నేమిచేసినాడు? కాదంబరీ చంద్రాపీడుల ప్రథమ దర్శనవేళ పొంగులెత్తిన రసతరంగిణు లీ కరుణ రసములో మునిగిపోవలసిన దేనా?

శృంగారము ప్రధానమని యిచటి సన్నివేశమునందలి సహజత్వమును భంగించునా?

విరోధిరసములైన శృంగార కరుణముల నిట్లు ఏకత్ర సమావిష్టముల జేయుట యుచితమా?

కావ్యధర్మమునకై లోక ధర్మమును భంగించుటయు అనౌచిత్యమే కదా!

జీవిత సహజ లక్షణము వ్యాఖ్యాతము కావలెనన్నచో లోక ధర్మమునే కవి కొనసాగనిచ్చును.

ఆమె సహగమనసంకల్పమున హృదయవల్లభుని చెంతకు పోయినది. ఆ స్థితిలో కూడ ఆమె ప్రియుని చూడగా "సమాగమసుఖమివానుభవంతీ" సంభోగ సుఖమువంటి యనుభూతినే పొందుచున్నది. అతని తలపై పూవులుచల్లి పూజించినది. "స్రవత్స్వేదామృతార్ద్రాభ్యాం కరాభ్యాం" స్వేదామృతము జాలువారుచున్న చేతులతో నతని చరణములనెత్తి తనయొడిలో నుంచుకొనినది. ఇది సహజత్వము. స్వభావోక్తి.

ఆ స్పర్శయొక్క ప్రభావమామెకు తెలియదు. అచటనున్న ఎవరికిని తెలియదు. ఆమె అప్సరస. అమృతసంభవ. "తత్కరస్పర్శేనోచ్ఛ్వసిత ఇవ చంద్రాపీడ దేహాజ్ఝటితి తుహినమయ మివ సకలమేవ

తం ప్రదేశం కుర్వాణ మవ్యక్తరూపం కిమపి చంద్రధవళం జ్యోతిరే వోజ్జగామ." చంద్రాపీడుని శరీరము నందొక చైతన్యము వచ్చినట్లు ఆ దేహమునుండి చంద్రకాంతివలె తెల్లనైన జ్యోతి ఆ ప్రదేశమునం తను హిమమయము చేయుచున్నట్లు వెలువడినది. ఇది గంధర్వలోక స్త్రీ స్పర్శలక్షణము. ఆమె యందలి సహజధర్మము. కవి యీ మలు పుతో కరుణ నుండి అద్భుతమునకు త్రిప్పినాడు. మానుషౌఘమునుండి కథ దివ్యౌఘమున బడినది. కరుణము దూరమునకు తొలగి అద్భు తము వచ్చినది. అటునుండి దివ్యశృంగారమునకు మ్రొగ్గినది. దివ్యలోక మున కేవలము శృంగారమే. వివిధ రసప్రసక్తియు అచ్ఛోద సరో వరము వద్ద నున్నది.

మరి మహాశ్వేతా పుండరీకుల వృత్తాంతమేమి? మొదట వారి ప్రథమ సమాగమము శృంగారరసోల్బణము. అంతటి శృంగారము పుం డరీకుని మరణముతో కరుణరసమునకు మళ్ళినది. కాని చంద్రుడు మహాశ్వేతను ఆశ్వాసించిన లక్షణముచే పుండరీకునితోడి పునస్సమా గమప్రాప్తి గూర్చిన ఆశ మహాశ్వేతయందు శృంగార రసాలంబన విభావ ధర్మమునే పొందవచ్చును. కాని కాదంబరికి చంద్రాపీడుని శరీరము కన్నులయెదుట దీప్తి తరుగకుండ కనిపించుటచే నేర్పడిన విభావ ధర్మము ప్రియుని శరీరము సమక్షమున లేని మహాశ్వేతయందు కల్పిం చుట న్యాయ్యము కాదు. ఇది ప్రవాసహేతుకమైన విప్రలంభముగా పరిగణింపవచ్చునుకదా అని యనువారుందురు. కాని అట్లుకాదు.

కవి కల్పించిన చిత్రమైన యొక సన్నివేశమున్నది. దానిచే మహాశ్వేతను శాంతరసాలంబనముగానే చేసినాడు. వైరాగ్యాదినా నిర్వికారచిత్తత్వము శమము. ఆశమము ఆమెయందు పుండరీకవియోగ జన్యమైన వైరాగ్యముచే నేర్పడిన జ్ఞానముచే గలిగినది. ఆమె తప స్సిద్ధురాలైనది. భిక్షాకపాలమున వృక్షములు ఫలభిక్ష పెట్టినవి. మరియు

మహాశ్వేతా పుండరీకుల ప్రథమ సంయోగ ప్రసంగమున స్ఖలితమగు చున్న బ్రహ్మచర్యముతో బాటు చేతినుండి జారిపోవుచున్న అతని స్ఫటికాక్షమాలను ఆమె గ్రహించినట్లు ఆతనికి తన యొంటిపేట ముత్యాలహారమును ఆమె యిచ్చినట్లు కవి సన్నివేశము కల్పించెను. అనగానేమి? ముని యందలి బ్రహ్మచర్యము ఈమెకు దక్కినది. ఈమె యందలి రాగము ఆమె ముత్యాలహారము రూపమున వాని కంఠము నకు తగులొక్కనినది. ఆ బ్రహ్మచర్యము యొక్క ప్రభావముచే నీమె యందు వైరాగ్యము సిద్ధించినది. పుండరీకునియందు ఈమె రాగలక్ష ణము చాంచల్యము, రతివిషయిక చిత్తవృత్తియు, ప్రబలమైన సంస్కా రముగా ఆతని ప్రతిజన్మమునందును వెంటబడి యతని పతనమునకు దుఃఖమునకు హేతువైనది.

మహాశ్వేత యందు సంక్రమించిన బ్రహ్మచర్యము శమాది షట్కసంపత్తియు నీమెను పాశుపతవ్రతధారిణిని చేసినది. ఆ శివాలయ మున దక్షిణామూర్త్యుపాసనా పరురాలైనది. ఆమె శాంతరసమున కాలంబనమని చెప్పుటలో నెట్టి విప్రతిపత్తియు లేదు. ఈ తీరుగానే బాణుడామె వర్ణనమును దీర్చెను. ఆ సిద్ధాశ్రమప్రాంతముననే కాదంబరి చంద్రాపీడుని విగతజీవమైన శరీరమును కాపాడుకొనుచున్నది. మహా శ్వేతను గురువుగా భావించినది. విప్రలంభ శృంగారమునకు ఆలంబన మైన చంద్రాత్మక చంద్రాపీడ సమారాధనా తత్పరయై యున్నది.

మహాశ్వేత మాత్రము శివుని యందు భావమును లగ్నము చేసి నది. రెండు దశలయందు మాత్రమే ఆమె శాంతరసమయమైన చిత్త వృత్తికి విక్షేపము కలిగినది.

1. చంద్రాపీడునకు తన ప్రణయ వృత్తాంతమును చెప్పుకొను నప్పుడు పుండరీకుని మరణమునకు తాను హేతువగుటవలని దుఃఖాతి శయముచే ఆమెయందు కరుణరసము మూర్తిగొన్నది.

2. వైశంపాయనుడు అచ్ఛోద సరోవరప్రాంతమున విహరించుచు తనను జూచి సంభోగ విషయేచ్ఛా ప్రకటనము చేసినప్పుడు ఆమె రౌద్రమూర్తి యైనది. వైశంపాయనుని సంభోగ విషయకేచ్ఛా విశేషమేకత్రానురాగవిషయమై రసాభాసమున కాస్పదమై మహాశ్వేతయందు దది శత్రుకృతాపచారముగా పరిణమించి యామెమనస్సును ప్రజ్వలింపజేసి శాపాగ్నిచే నతనిని దగ్ధుని జేసినది.

శాంతమూర్తియైన మహాశ్వేతయందిట్టి చిత్త విక్షోభ మేల కలిగెను? దానికి కారణములు రెండు. మానుషౌఘమునందలి సహజమైన రాగబంధముయొక్క వైఫల్యముచే నేర్పడిన దుఃఖము. రెండవది క్రోధ ప్రభవమైన సమ్మోహము. కరుణమును శాంతముచే తట్టుకొనవచ్చు. రౌద్రమునకు దుఃఖమే ఫలము. అది క్రూరకర్మ. శాంతించదు. తన ప్రియునే తాను చంపుకొనినదని తెలిసికొనినప్పుడామె పొందిన పరితాపము మరియొక చిత్తవిక్షోభము. లౌకికములైన వాసనలయందు శాంతమూర్తులను గూడ క్షోభపెట్టు నీ సన్నివేశములు సహజములు.

ఈ అచ్ఛోద సరోవరప్రాంతముననే చంద్రాపీడ వియోగ సంతప్తుడైన తారాపీడుడు మృత్యుంజయోపాసనాపరుడై విరాగియై పుత్ర పునర్జన్మ ప్రతీక్షాబద్ధ బుద్ధియై యుండెను. ఆ పుత్రుడు కనిపించిన తరువాత కూడ నితడు వైరాగ్యముసే భజించెనుగాని మరల సంసారమున బడలేదు.

అట్లే శుకనాసుడు సంసారముయొక్క అసారతనుగూర్చి ప్రసంగించుటలోనే యాతని శాంతరసమయాత్మ తత్త్వము మొదటినుండియు వ్యక్తమగుచునే యుండెను. మరియొక విషయ మిక్కడ చెప్పక తప్పదు.

పత్రలేఖ-కేయూరకుడు : చంద్రాపీడుని తాంబూలకరంకవాహిని

పత్రలేఖ. కాదంబరీవీణావాహకుడు కేయూరకుడు. ఈయుభయుల వర్ణనములు వీరికినాయికానాయకుల తోడి యనుబంధము గమనించినచో బాణుడుశృంగారరస ఆలంబన విభావములందొక చిత్రమైన లక్షణమును వెలికితీసి భావరూపమున మూర్తికట్టించినట్లు స్ఫురించును

పురుషునియందలి నిద్రాణమై యుండు రత్యాఖ్యమైన స్థాయీ భావము పత్రలేఖ. పురుషునిలో స్త్రీ గూర్చిన యిచ్ఛా లక్షణము.

స్త్రీ యందలి నిద్రాణమై యుండు రత్యాఖ్యమైన స్థాయీ భావము కేయూరకుడు. స్త్రీలో పురుషునిగూర్చిన యిచ్ఛాలక్షణము.

ఈ పాత్రలసృష్టిలో బాణుడీ తత్త్వముల నుద్దేశించెనని చెప్పుటకు వారి వర్ణనములు, వారికి కథలో గల ప్రసక్తియు గమనార్హములు.

తాంబూల రాగము (ఎఱుపు) రంగు. వీణా రాగము నాదము. రాగము - రంగు - మేనికి పులుముకొనునది. రాగము - అనురాగము ప్రేమవిషయికమైనది. నాదమయమైన రాగము శ్రోత్రముచే గ్రహింపబడునది. నాయకుని సహచరియైన పత్రలేఖ నాయికకు ఆత్మీయురాలగుట దూతికా లక్షణమును మించిపోయినది. అంతటి సౌందర్యవతియు, నిత్యము తనను నీడవలె అంటిపెట్టుకొని తిరుగునదియు నైన పత్రలేఖను చంద్రాపీడుడెన్నడును కౌగలించుకొనలేదు. ఒకప్పుడు మాత్రమే కౌగలించుకొనెను. ఎప్పుడు? కాదంబరి కోరికపై కొన్ని దినములు ఆమె కాదంబరివద్దనుండి తిరిగివచ్చినది. ఆ నాడు చంద్రాపీడుడామెను హృదయమునకు హత్తుకొనెను. పత్రలేఖను కాదంబరియు నిశ్లేషులుము కొన్నది. "నా కన్నులో కన్ను; మేనిలో మేను; చేతిలో చేయి, మాటలో మాట" యీ రీతిగా కాదంబరి తనలో నతికికొనిపోయినదని చం

ద్రాపీడునకు పత్రలేఖ చెప్పెను. చంద్రాపీడుడు కేయూరకునివలన నేకాంతమున కాదంబరీ హృదయానురాగమును గూర్చి తెలిసికొనును. నాయికలకు పదునారేండ్ల సుందరులైన యువకులు మదన సందేశహార కులుగా నుండుట నెచ్చటను వినము. ఆ వీణ కాదంబరీ హృదయము. తన హృదయమునందలి రాగము కేయూరకుని పలుకు. ఆ వీణ తనలో భాగము. చంద్రాపీడుని మరణముచే సహగమనమునకు సిద్ధపడిన తాను తనవస్తువులన్నియు అందరకు దానము చేయుటకు విభాగించి ఎవరెవరికి ఏయే వస్తువులీయవలెనో మదలేఖకు చెప్పును. తన వీణను మదలేఖనే గైకొనుమని చెప్పును. కేయూరకుడేమగును? తానేమగునో కేయూరకుడదియే యగునని స్ఫూర్తి. ఈ పత్రలేఖా కేయూరకుల పాత్రల తత్త్వములు రసమయములు. చారుతాపాదకములు. పత్రలేఖ రోహిణియొక్క అవతారమనగా కథానాయకుని మూలతత్త్వమునందలి రతి స్వరూపమే కదా!

రసనిర్వహణమున ఆలంకారికులు చెప్పు లక్షణములనుమాత్రము పాటించి సహజత్వమునకు అనుచితమగు కల్పనముచేయు మడికట్టుకొని కూర్చుండు కవులయందు లోకవృత్తానుగుణమైన కథారసనిబంధన ముండదు.

విరోధిరసములు పరస్పరపోషకములగుట, మిత్రరసములు పరస్పరభంజకములగుట; నానారసములు ఏకత్రావస్థితము లగుట; వీని విషయమున శాస్త్రమునకంటె కవి యనుభవసిద్ధమైన మనోధర్మము నుండి భావితమైన రసనిబంధనము ప్రతిభాసముల్లసితమైన తత్సన్నివేశ నిబంధనము కావ్యమున రమణీయములైన రసోత్కర్షా హేతువులు.

కాదంబరీ కావ్యమున బాణుడు కథావస్తువును త్రిపథగమనమున తీర్చెను.

ఒకటి మానుషౌఘము.

రెండవది సిద్ధౌఘము.

మూడవది దివ్యౌఘము.

మానవ జీవితమున "ఏకోరసః కరుణ ఏవ" అన్నదే యథార్థమైన రసపరిష్కారము. "క్షీణే పుణ్యే మర్త్యలోకం విశన్తి." పుణ్యక్షయముచే జీవులు మర్త్యలోకమున పుట్టుచున్నారు. జీవితమే శాపము. అట్టి జీవితమున దుఃఖమే సహజము. బాల్యము, వార్ధకము రెండును జీవితముయొక్క ప్రారంభదశయు అంత్యదశయు. మాతృగర్భము నుండి ముక్తికై తపించి పుట్టుచున్నాడు. పుట్టగనే ఏడ్చుచున్నాడు. వార్ధకమున చచ్చుచున్నాడు. చచ్చి బ్రతికియున్నవారి నేడిపించుచున్నాడు. ఈ మధ్య బ్రతుకులో కొంత నవ్వును. కొంత క్రీడించును. కామక్రోధాదులతో అర్థకామపురుషార్థసాధనముతో సతమతమగుచు కొంచెము సుఖము ఎక్కువ దుఃఖము పొందుచు కరుణారసమునకే సన్నిహితుడగుచున్నాడు. మిగిలిన రసములు తత్తన్నిమిత్తములైన తాత్కాలికానుభవసిద్ధములు.

మానవలోకము కర్మభూమి. కర్మరజోగుణ సంభవము. వేదాంతులు దానిఫలితమును దుఃఖమందురు. ఇచట మానవుడు కరుణరసాత్ముడు.

నూటికి కోటికొక్కడు సిద్ధికై తపించును. దుఃఖమునుండి ముక్తుడు కాగోరును. వాడు జ్ఞానియై సత్యము దర్శించి శాంతాత్ముడగుచున్నాడు.

ఇక భోగలోకములున్నవి. అచట భోగమే! భోగమునకు తగిన వయస్సు త్రిదశత్వము. ముప్పదియేండ్ల ప్రాయము. దుఃఖమిశ్రముగాని సుఖము. పుణ్యావశమున ప్రాప్తించు ఆ దశలో మానవుడు దివ్యుడగు

చున్నాడు. అప్పుడతని భోగము మధురమైనది. శృంగారరసాలంబన మగుచున్నాడచ్చట.

బాణుడు తన కథను కథానాయకుల మూడుజన్మల గాథగా మలచుటలో జీవితమును గూర్చిన యీ విభాగదృష్టి కలిగి యుండె ననుట న్యాయము.

ప్రధానరసము నాయికానాయకుల ప్రణయానుబంధియైన శృంగారమే.

కరుణరసము, శాంతరసము కూడ మనుషోఘమున సిద్ధాఘమున తమ ప్రాధాన్యమును కలిగియే యున్నవి.

కాదంబరి శృంగారరస సంపూర్ణ. చంద్రుడు సకల కలాపరిపూర్ణుడు. మానవులలోని దివ్యాంశము లే వారు. చంద్రుడు అమృతమయుడు. కాదంబరి అమృతము. మానవుని గమ్యము ఆ అమృతమే. మనస్సే చంద్రుడు. అందులోని అమృతమే కాదంబరి.



# "బాణోచ్ఛిష్టమ్ జగత్సర్వమ్"

"బాణోచ్ఛిష్టమ్ జగత్సర్వమ్" అన్న ఆభాణకము జగత్ప్రసిద్ధ మైనది. సాహిత్యమున బాణుడు తన తరువాతి కవులకు మిగిల్చిన వర్ణన కాని పదబంధ చమత్కృతిగాని విషయముగాని మరి యేమియు లేదు. వర్ణ్యవస్తువు నెన్ని యుపమానములతో ఉత్ప్రేక్షలతో రూపకములతో బహువిధాలంకారములతో నలంకరించవలెనో అన్నియు పరంపరగా గుప్పించి యలంకరించును. వానిలో ఔచిత్యము, రసభావ మహిత మైన శైలీవిన్యాసము ఎన్ని తీరులనుండవలెనో అన్ని తీరులలోను సమ కూర్చును.

నవరసమయమైన జీవితము చిత్రించుటలో సర్వరసముల నుచిత రీతి తీర్చుటలో నతని కతడే సాటి. బాణుని తరువాతి కవులు చాల మంది గద్యమునే కావ్యమార్గమున విశిష్టమైనదిగ నెన్నుకొనిరి. దండి తన "అవంతి సుందరీ" ప్రబంధమును బాణుని అనుకరణలోనే తీర్చెను. దండికి ప్రతిష్ఠ గూర్చినది "అవంతి సుందరి" యే ననుటలో అతిశ యోక్తి లేదు. సుబంధుడు కూడ బాణుని తరువాతి వాడనియే చారిత్ర కుల నిర్ణయము. ఆతని ప్రత్యక్షర శ్లేషమయ ప్రపంచ విశ్వాస వైద గ్ధ్యము బాణుని భిక్ష అనుట అతిశయోక్తి కాదు. హర్షచరితలో బాణుడు వాసవదత్తా ప్రబంధమును గూర్చి చేసిన ప్రశంస మహా భాష్యములో పతంజలి పేర్కొనిన వాసవదత్తా ప్రబంధము గూర్చి కావచ్చు నని చారిత్రకులనిరి.

ధనపాలుని "తిలకమంజరి" ని గూర్చి యిదివరకు ముచ్చటించితిని. బాణుని కాదంబరిని అనుకరించుటలో నగ్రతాంబూలము ఈ "తిలక మంజరి" దే. వాదీభసింహుడు వ్రాసిన గద్యచింతామణిలో జీవంధరు నకు చేయబడిన ఉపదేశము కాదంబరిలో "శుకనాసోపదేశము" నకు అను

కరణ. ఆంధ్రుడైన వామనభట్ట బాణుడు రఘునాథ చరితము సలాభ్యుదయము, వేమభూపాల చరితము మున్నగు కావ్యములు వ్రాసెను. అతనిలో మిక్కిలిగా బాణుని అనుకరణ కనపించును. చంపూ కావ్యరచయితలు గూడ బాణుని అనుకరించిరి. నలచంపువులో సాలంకాయనుడన్న మంత్రి నలునకు చేసిన యుపదేశము శుకనాసోపదేశమునకు అనుకరణము. అది చక్కని అనుకరణము. వర్ణనలలోకూడ ఈతడు బాణుని అనుకరించి ఉషోవర్ణనమును గంగా యమునా సంగమముగా చిత్రించి యమునా త్రివిక్రముడన్న కీర్తి సంపాదించెను. బాణుని అనుకరణ ప్రభావమది.

కథలను కథలలో పేని అల్లుట కాదంబరినుండి నేర్చుకొన్న కవులెందరో యున్నారు. నేమిదేవుని శిష్యుడైన సోమదేవుడు వ్రాసిన యశస్తిలక చంపువు అట్టిది. భోజుని రామాయణ చంపువు వక్రోక్తిలో శ్లేషఘటనలో కాదంబరిని లక్ష్యముగా గొనిన విధము వ్యక్తమగును.

కథాకథన సంవిధానములో కాదంబరి ననుకరించుట కవులకు పరిపాటి యైనది. సోడ్ఢలుడు వ్రాసిన ఉదయసుందరీ కథలో ఒకచిలుక కథను చెప్పుట కాదంబరి అనుకరణమే! ఈ సోడ్ఢలుడే బాణుని సర్వేశ్వరునిగా స్తుతించినవాడు– వాగీశ్వరుడని, అర్థేశ్వరుడని, రసేశ్వరుడని.

మన ప్రసిద్ధులైన తెలుగు కవులు నాచన సోమన, శ్రీనాథుడు, పెద్దన, తెనాలి రామకృష్ణుడు, పింగళి సూరనయు బాణుని ప్రభావమునకు గురియైనవారే! శ్రీనాథుడు "శివరాత్రి మాహాత్మ్యము" లో సుకుమార చరితమును ఆతని జన్మ వృత్తాంతమును బాణుని కాదంబరి వర్ణనలకు అనువాదముగా చేసెను. సంతానములేని రాణి మనస్తాపము సంతానమునకై ఆమె ఆచరించిన వ్రతములు కాదంబరి అనుకరణములే !

పెద్దనగారి "వక్షోభాగ నిక్షిప్త డింభక వల్గత్ ప్లవగీ కదంబము" వంటి వర్ణనలు, సమాస ఘటనలు బాణుని పై పెద్దనగారికి గల

మోజును చాటునదే. పెద్దనగారి గద్యములు "వాచాల తులాకోటి కలకలాహూయమానము" గా బాణుని శైలిని ఆత్మీయమును చేసికొనినవే! పింగళి సూరన కళాపూర్ణోదయ కథానిర్మాణము బాణుని అడుగుజాడలలో సాగినదే! ఇందరిపై తన ప్రభావమును జూపిన కవులు చాల అరుదు.

బాణుడు కాదంబరీ కావ్యమునందు రాజుల వర్ణనలలో వ్యక్తుల స్వరూపములలో సాముద్రిక శాస్త్రమునకు అనుగుణములైన లక్షణములు, జ్యోతిశ్శాస్త్ర విషయములు నిక్షేపించెను.

రాజులయొక్క వినోదములలో సాహిత్యపరములైనవి యెన్ని విధములుగా నుండునో నవి యన్నియు పేర్కొనెను. సంగీతశాస్త్ర విషయమున కొన్ని రహస్యములను చొప్పించెను. ఉదాహరణకు వైశంపాయను డన్న చిలుకను వర్ణించుచు "వేదితా గీత శ్రుతీనాం" అని చెప్పును. చిలుకకు వేదము వచ్చునని చెప్పుట కాదచ్చట. శ్రుతి అనునది సంగీతశాస్త్రి విషయము. శ్రుతులు ఇరువది రెండనుటకు -

"సప్తస్వరా స్త్రియోగ్రామా మూర్ఛాశ్చైకోన వింశతిః
తానాం ఏకోన పంచాశత్ ద్వ్యధికా వింశతిః శ్రుతిః"–
యీ శ్లోకము ప్రమాణముగా నున్నది.

వరరుచి బృహత్సంహితలో చెప్పిన గజ, తురగ, పురుష, స్త్రీ లక్షణములు, వివిధ జంతు లక్షణములు వృక్ష లక్షణములు శాస్త్రోక్త రీతిలో ఈతడు గ్రహించి తన వర్ణనలందు ప్రామాణికమైన లక్షణముతో నిక్షేపించెనని పరిశీలనచే తెలియగలదు.

బాణుడు తన వర్ణనలలో ఉపమానములుగా చెప్పిన అనేక పురాణపురుషులు, బహు పురాణగాథలు, ఐతిహాసిక వృత్తములు - ఒకటేమిటి యెక్కడెక్కడ యే వేదగాథలనుండి, ఉపనిషత్తులనుండి

మెంత మూరుమూల గ్రంథములనుండి సేకరించెనో వ్యాఖ్యాతలు వెదకి తెలిసికొనవలసి వచ్చెను.

వేటలోని సమస్త విషయము అనగా జంతువుల మనఃప్రవృత్తులు, వానిని పట్టుకొను పద్ధతులు, అవి తిను ఆహారమునందలి వాసనలు, లక్షణములు, అడవులలో వివిధజాతుల వృక్షముల, గుల్మముల నైసర్గికమైన వర్ణనమును తన యనుభవముచే గాని, శాస్త్రములచే గాని సమన్వయించియే చెప్పును. రాజప్రాసాదముల వివిధ మందిరముల దేవతాయతనముల వర్ణనములలో వట్టి ఊహాచిత్రములు కాక వాస్తు శిల్పశాస్త్రలక్షణములను బట్టియే చేసెనని తద్‌జ్ఞులు చెప్పుదురు. తన సమకాలీన దేశ నగర స్వరూప స్వభావములను వర్ణనలలో నితడు బహుధా ప్రకటించెను.

రాజప్రాసాదముల శిల్పమెంత చక్కగా చెప్పునో యెన్ని వివరములతో నెంత విశదముగా చెప్పునో అంత విలక్షణముగను పక్షుల గూళ్ళనుగూర్చి కూడ చెప్పును. ఎన్ని పక్షుల జాతులు కలవో అన్నియు వర్ణించును.

సూర్య చంద్ర కిరణములలోని వివిధ కాలముల వన్నెలు, ఆకాశపు రంగులు, వివిధ ఋతువులలో ప్రకృతియొక్క ప్రత్యణువు లక్షణములు పూసగ్రుచ్చినట్లు వర్ణించి చెప్పును. ఎన్ని యని చెప్పవలెను? భూమ్యాకాశముల మధ్యనున్న సమస్త విషయములను దేనిని వదలి పెట్టినట్లు కన్పించదు. శృంగారాది రసములలో వివిధసంచారి భావములను సాత్త్వికభావములను – ఆ యా యాలంబనముల చిన్ని కదలిక యందును కొలిచినట్లు చెప్పును.

ఇక కథచెప్పినా అందులో వైదికమైన అర్థములకు పొసగుడల యుండును. బౌద్ధమతము, జైనమతము, వామాచారము మున్నగు

బహువిధ మతములను గూర్చిన రహస్యములో, వ్యాఖ్యానములో గుప్తపరచి యుంచును.

ఈ కాదంబరీ కథనే కృష్ణయజుర్వేదీయ సంహిత ననుసరించి వాజపేయ యాగమునకు సమన్వయించి చెప్పుటకుకూడ నవకాశమున్నది. ఇందు కాశ్మీరశైవమును గూర్చిన శాక్తేయ మతప్రసక్తి చాల నున్నది.

(శ్రీ) విద్యావిషయికముగా నేను కథను కొంత సమన్వయించు కొంటినని చెప్పితిని.

ఇన్ని విషయములను గూర్చి యొక రసవంతమైన కథను చెప్పుట బాణునకే చెల్లినది. తాను ఏమి చెప్పినను రసవంతముగనే చెప్పును. చెప్పినది సాహిత్యశిల్పముకి దృష్ట్యా ధగద్ధగాయమానముగనే తీర్చును. రసభావోత్కర్షను కోటిక్కెంచియే చెప్పును.

కొందరు కవులు ఏదోయొక విషయముపై తమ ప్రీతిని పురస్కరించుకొని తమశక్తియుక్తులన్నియు నచటనే కుప్పవోయుదురు. వారికి మిగిలిన విషయములు పట్టవు. రసముజోలికి పోరు. "దృశ్యంతే చ కవయోఽలంకార నిబంధనైక రసా అనపేక్షిత రసాః ప్రబంధేషు"– అని ధ్వన్యాచార్యులు ఈ విషయమునే గుర్తుచేసిరి. ఒకరికి ప్రత్యక్షర శ్లేషపై మోజు, మరొకరికి వక్రోక్తియే ప్రాణము. ఇంకొకరర్థగౌరవమును, మరొకరు లలిత పదబంధమును, ఇంక కొందరు దీర్ఘ సమాస రచనను, ఇట్లు వారి వారి చిత్తముల వచ్చినట్లు ఆయా విషయముల పైననే కావ్యమును నిర్మించ దలచు వారుందురు. ఆ కావ్యముల యందు ఆ లక్షణము ప్రత్యేకముగా మెరసి పోవుచునే యుండును. కాని కావ్యజీవితప్రాయమైన రసముండదు. అట్టికావ్యములు సహృదయుల హృదయముల స్పృశింపక కేవల గ్రంథాగారములబడి మగ్గుచున్న వెన్నియో కలవు.

ఈ కాదంబరీ కావ్యము ఇన్ని విషయములతో జతపడియున్నను కథను మ్రింగివేయునన్ని వర్ణనములున్నను బహుశబ్ద పాండిత్య పటుత్వమున్నను పాఠకుని ప్రతిమలుపునుండియు రసము వైపునకే గొనిపోవును. కాదంబరిలో కావ్యత్వము ప్రతిపదమున నున్నది. ఆ పదముల కూర్పులో నున్నది. వానిచే చెప్పబడిన యర్థమున నున్నది. రసభావ యుతముకాని శుష్కమైన వాక్యవిన్యాసము కాదంబరియందు కన రాదు.

బాణుడు తాను కథనెట్లు భావించెనో చెప్పెను. సంగీతపు మధుర ధ్వనులతో చెవికింపు గొలుపు సరసాలాపములతో ప్రేమచే ఉప్పొంగిన డెందముతో తనకు తానై శయ్యకు చేరిన క్రొత్త పెండ్లికూతురు ప్రియుని హృదయమునందు ఎంత అనురాగమును కలిగించునో, ఉల్లాసమును పెంచునో అంత యానందమును కథాకావ్యము సహృదయునకు కలిగించునని తాను చెప్పదలచిన కావ్యముయొక్క రసస్థితిని దానివలన సహృదయునకు కలుగు అనుభూతిని భావించి చెప్పెను. కాదంబరి అందుకే జనుల చిత్తమునందు అంతటి మత్తు కలిగించినది. పెండ్లి చేసికొనిన కదా! పెండ్లికూతురు శయ్యకు చేరునది. కావ్యమును చదివిన కదా; చూచిన కదా! భావించిన కదా! తద్రసము తెలియునది.

"స్ఫురత్కలాలాప విలాసకోమలా
కరోతి రాగం హృదికౌతుకాధికమ్,
రసేన శయ్యాం స్వయమభ్యుపాగతా
కథా జనస్యాభినవా వధూరివ"



# కాదంబరి - కథాసంగ్రహము

[కాదంబరీ కథాసంవిధానము గూర్చి చెప్పుకొంటిమి. సంస్కృతములో కావ్యము చదువనివారికి కథ తెలియవలయును కదా! అందుచే సంక్షేపముగా కథ చెప్పవలయును. కథను సంక్షేపించి చెప్పుటలో ముఖ్యాంశములు విడువకుండ క్రమము తప్పకుండ కథాసూత్రము తెగకుండ నుండవలెను. అందులకే ప్రయత్నపడుదును.]

శూద్రకుడను రాజుండెను. అతనిలో రాజలక్షణములన్నియు మూర్తీభవించి యున్నవి. అతని రాజధాని విదిశాపట్టణము. ఎందరో త్రైలోకసుందరులైన అంతఃపుర స్త్రీలుండిరి. ఆతనికి సంతానములేదు. యౌవనవంతుడయినను ఆతడు స్త్రీసంభోగసుఖపరాఙ్ముఖుడై యుండెను. రాత్రింబవళ్ళు మిత్రులతో మంత్రులతో పండితులతో కావ్యశాస్త్రకళావినోదములతో కాలముపుచ్చుచుండెను.

ఒకనాడతడు సభామండపమున నుండగా ఒక చండాలకన్య పంజరమున ఒక చిలుకను గొని వచ్చెను. "ఈ చిలుక పేరు వైశంపాయనుడు. సకలశాస్త్రార్థము లెరిగినవాడు. పురాణేతిహాసకథలు చక్కగా చెప్పును. సంగీతసాహిత్యాది వివిధకళాకుశలుడు. ఇదియది యననేల సర్వము తెలిసినవాడు, సకలభూతలరత్నము" అని చెప్పి రాజునకు సమర్పించెను.

ఆ చిలుక మనుష్యభాషణములో స్పష్టమైన ఉచ్చారణతో తన దక్షిణచరణమును ఆశీర్వాదముద్రతో పైకెత్తి ఆర్యావృత్తమున రాజునాశీర్వదించెను. "ఓరాజా! నీ శత్రుస్త్రీలస్తనయుగ్మము కన్నీళ్ళతో స్నానముచేసి హృదయములోని శోకాగ్నికి దగ్గరగానుండి విముక్తాహారముగా విరహవ్రతమును ఆచరించుచున్నట్లున్నది." అనెను. రాజును, సభాసదులును చిలుక యేమి! ఇంతస్పష్టముగా, విశదముగా,

రసవంతముగా, సమయోచితముగా, అభినయాత్మకముగా మాటాడు చేమి ? అని ఆశ్చర్యపడిరి. కుమారపాలితుడన్న మంత్రి "చిలుకలు తొలుత అట్లే మాటాడుచుండెడివి. అగ్ని శాపముచే వానికి స్పష్టముగా పలుకు శక్తి పోయినది. ఇప్పుడీ చిలుక యిట్లుపలుకగలుగుట ఆ జాతి లోని పూర్వలక్షణమే"నని చెప్పెను. ఆ చిలుకను రాజునకిచ్చినవెంటనే చండాలకన్యక అచటనుండి వెడలిపోయెను. ఆమె వెంట పంజరమును గొని వచ్చిన వృద్ధుడు కూడ వెడలి పోయెను. రాజు మధ్యాహ్న సమయమగుటచే చిలుకను అంతఃపురములోనికి బంపి తానుకూడ భోజ నాదికమునకు బోయెను. మధ్యాహ్నమున రాజు తన "భుక్త్వాస్థాన మండపము"న పంజరమును దెప్పించి ఆ చిలుకను నీవెవరు ? నీ కథ యేమి ? అని యడిగెను, అప్పుడా చిలుక తన కథనిట్లు చెప్పెను.

**చిలుక చెప్పిన కథ :** "వింధ్యాటవిలో ఒక పెద్ద శాల్మలీవృక్ష మున్నది. ఆ చెట్టు తొఱ్ఱలో నాతల్లియు తండ్రియు కాపురముండిరి. నేను పుట్టిన వెంటనే నా తల్లి ప్రసవ వేదనచే మరణించినది. నా తండ్రి నన్ను చాల కష్టపడి పెంచుచుండెను. ఇంతలో ఒకనాడు వేటకై బోయవాండ్రు ఆ అడవి నంతయు నల్లకల్లోలము జేసిరి. ఆ శబరసేన పోయినతరువాత అందులోని ఒక వృద్ధుడు మేమున్న చెట్టుపైకెక్కి గూళ్ళలో నుండి పక్షులను మెడనులిమి క్రింద పడవైచు చుండెను. అప్పుడు నేను నా తండ్రి పొట్టకు కరుచుకొని భయపడు చుంటిని. వాడు నా తండ్రిని గూడ మెడమెలిచి వీపు నేలకు కొట్టు కొనునట్లు క్రిందకు విసరివైచెను. నా తండ్రి చనిపోయెను. నేను మాత్రము ఆయన పొట్టకు కరుచుకొని యుండి నందున ఎట్లో బ్రతికి బైట పడితిని. ఆ ఎండుటాకులలో పండుటాకులలో దాగికొని యుండి ఆ బోయవాడు పక్షులను మూట గట్టుకొని పోయిన తరువాత నేను మెల్లగా దప్పిక దీర్చుకొనుటకై నీటికై వెదకి కొనుచుంటిని. అప్పుడు పంపా సరో

వరమున స్నానము చేయుటకై పోవుచున్న హారీతుడన్న మునికుమారుడు అలసిసొలసి యెండలో నడవలేకున్న నన్ను జూచి జాలిపడి తన చేతులలోనికి దీసికొనెను. కొలనులో నీరు తనవ్రేలితో నానోట చుక్కలు చుక్కలుగా పోసి నా ప్రాణమును తేర్చెను. అతడు నన్ను తన ఆశ్రమమునకు గొనిపోయెను. అచట మహాప్రభావశాలియైన యతని తండ్రి కనిపించెను. ఆయన జాబాలి మహాముని. ఆయన చుట్టును చాలమంది మహాత్ములు సేవించుచుండిరి. "ఈ చిలుక నెక్కడ నుండి తెచ్చితి"వని మునులు హారీతు నడిగిరి. ఆతడు నేరు తనకు కనిపించిన విషయమంతయు చెప్పెను.

హారీతుని మాటలు విని జాబాలిముని నావైపు చూచెను. ఆయనకు నవ్వు వచ్చెను. "వీడు తన స్వయంకృతాపరాధముచే పాపకర్మకు ఫలమనుభవించుచున్నా" డనెను. మునులందరు "వీడేమి చేసెను? వీని కథయేమి" అని అడిగిరి. జాబాలి వీని కథ చాల ఉన్నది. ఇప్పుడు అనుష్ఠాన వేళ కదా! రాత్రికి చెప్పెదను అని గడువు పెట్టెను. మునులందరు రాత్రి కాగానే జాబాలి చుట్టును చేరిరి. జాబాలి చిలుక యొక్క వెనుకజన్మ కథను చెప్ప మొదలిడెను.

జాబాలి చెప్పిన కథ :- ఉజ్జయిని పట్టణము కలదు. మహాకాలనాథుడైన శివుడచట వేంచేసియున్నాడు. ఆ పట్టణమును రాజధానిగా చేసికొని తారాపీడుడను రాజు సమస్త భూమిని ఏకచ్ఛత్రముగా పాలించుచుండెను. అతని పట్టపురాణి విలాసవతి. మంత్రి శుకనాసుడన్న బ్రాహ్మణోత్తముడు. అతని భార్య "మనోరమ". రాజుకు సంతానము లేదు. మంత్రికిని లేదు. ఒకనాడు విలాసవతి మహాకాలనాథుని దర్శనమునకు పోవుచుండగా "అపుత్రస్య గతిర్నాస్తి" అను పురాణ ప్రవచనము చెవుల బడెను. సంతానము లేని యామెకు మిక్కిలి దుఃఖము కలిగెను. అంతఃపురమున క్రుమిలిపోవుచున్న యామెను రాజోదార్చెను.

దేవతలను అధికముగా పూజింపుము. ఋషులను మరియు నెక్కువ సేవింపుము. వ్రతములు పూనుము. మున్నెందరో రాజులు సంతానము లేనివారు ఋషుల ప్రభావమునఆశీర్బలమున సంతానవంతులైరి కదా! అని దశరథాదుల కథలు చెప్పి విశ్వాసము కలిగించెను. విలాసవతి అన్నియు జేసెను. ఒకనాటిరాత్రి రాజునకు కలలో పున్నమచంద్రుడు తన రాణి ముఖము లోనికి ప్రవేశించుచున్నట్లు కల వచ్చెను. అదే రోజున శుకనాసునకును ఒక కల వచ్చెను. ఎవడో బ్రాహ్మణుడొక తెల్లతామరను తన భార్య మనోరమ యొడిలో నుంచినట్లు కలగనెను. ఈ కలలు రెండును తెల్లవారుజామున వచ్చినవి. శుకనాసుడు వీనికి ఫలముండి తీరునని చెప్పెను. రాణియు మంత్రి భార్యయు గర్భవతులైరి. ఒకే ముహూర్తమున ఇరువురును కుమారులను ప్రసవించిరి. రాజు తన కుమారునకు చంద్రాపీడుడని పేరు పెట్టెను. మంత్రి తన కుమారుని వైశంపాయనుడనెను.

ఇరువురు కుమారులు పెరుగుచుండిరి. చౌల ఉపనయనాది సంస్కారములు యథావిధిగా జరిగెను వారి విద్యాభ్యాసమునకు రాజు ప్రత్యేకముగా నొక విద్యాలయముచు కట్టించెను. ఆ కుమారులిద్దరు అన్నివిద్యలు, కళలు, శాస్త్రములు, వేదవేదాంగములు, అస్త్ర శస్త్రాది ప్రయోగములు, గుఱ్ఱపు స్వారి, యుద్ధ వ్యూహములు అన్నియు నేర్చిరి. చంద్రాపీడునకు, వైశంపాయనునకు ప్రాణస్నేహమేర్పడెను. ఒకనాడు వలాహకుడన్న సైన్యాధ్యక్షుడు ఇంద్రాయుధమన్న గొప్ప గుఱ్ఱమును తెచ్చి విద్యామందిరము ముందు నిలిపెను. విద్యాభ్యాసము పూర్తిచేసిన చంద్రాపీడుడు తండ్రి యాజ్ఞతో ఆ గుఱ్ఱము నెక్కి వైశంపాయనాదులతో ఇంటికి వచ్చెను. విద్యాభ్యాసమునకు పోయి చాలకాలమునకు ఇంటికి వచ్చిన కుమారుని జూచి రాజునకు, రాణికి అత్యంతానంద మాయెను. రాణి కుమారునికి తాంబూలకరండ

వాహినిగా కులూత దేశ రాజపుత్రిని పత్రలేఖను పంపెను. ఆ తరువాత రాజాతనిని యువరాజును చేయ తలపెట్టెను. చంద్రాపీడుడు శుకనాసుని దర్శనార్థము రాగా శుకనాసుడతనికి సదుపదేశము చేసెను. యువకుడు, ధనవంతుడు, రూపవంతుడు, అనుపమ శక్తిమంతుడునై వానికి ఎట్టి ఉపదేశము చేయవలెనో అట్టి ఉపదేశమును చేసెను. చంద్రాపీడుడు అన్నియు తెలిసినవాడే. కాని యౌవనము వలన కలుగు దోషములకు గురికావలదని మంత్రి యతనికి మిక్కిలి బోధించెను.

రాజు కుమారుని యువరాజుగా చేసెను. వైశంపాయను డతనికి మంత్రి ప్రాయుడయ్యెను. యువరాజు దిగ్విజయ యాత్రకు బయలుదేరెను. అతని వెంట వైశంపాయనుడు. మూడు సంవత్సరములలోనే చంద్రాపీడుడు తూర్పు, దక్షిణ, పశ్చిమోత్తరములయందు దిగ్విజయము సాధించి ఉత్తర దిక్కున హేమకూట ప్రాంతమున సువర్ణపురమనుచోట స్కంధావారముతో విడిసెను. అచట నుండి ఒకనాడు రాజకుమారుడు వేటకు బోయెను. ఇంద్రాయుధము నెక్కి అడవిలో దిరుగుచుండగా దూరమున అతనికి ఒకానొక కిన్నర మిథునము కన్పించెను. ఆ కిన్నర మిథునమును సమీపించవలెనని వెంటబడెను. ఇంద్రాయుధము తీవ్రజవమున అరువదిక్రోసుల దూరముగొని పోయెను. కిన్నర మిథునము చిక్కలేదు. ఆ జంట పర్వత శిఖరము పైకిపోయి అదృశ్యమాయెను. చంద్రాపీడుడు నిరాశచెంది మరల వెనుకకు మరలి దక్షిణపు దిక్కుగా ప్రయాణము సాగించెను. గుఱ్ఱము, తానుకూడ అలసిపోయిరి. దాహము వేసెను. ఆకిన్నర మిథున మెవరో తానెవరో! వారి కొరకై తాను వెంటాడనేల? ఇత్యాది పశ్చాత్తాపముతో చంద్రాపీడుడు తన గుఱ్ఱమును ఒక చెట్టుకు కట్టివైచి నీటి కొరకు చూచెను.

**అచ్ఛోద సరోవరము-మహాశ్వేతా దర్శనము :** అతనికి అచ్ఛోదమన్న అతి రమణీయమైన సరోవరము కన్పించెను. అందులో

స్నానముచేసి, నీరు త్రావి గుఱ్ఱమునకు గూడ నీరు త్రాగించి దాని ముందుగడ్డివేసి ఒకరాతితిన్నెమీద కూర్చుండెను. ఇంతలో అతనికిమధుర సంగీతగానము వీణాధ్వనితో వినిపించెను. అప్పుడు తనగుఱ్ఱమునెక్కి ఆ ధ్వని వచ్చినవైపు పోయెను. అది ఒక శివాలయము. ఆలయములో శివు డెంత తెల్లగా నుండునో అంత తెల్లగానున్న ఒకచక్కని కన్య కనిపించెను. ఆమె వీణాగానముతో శివారాధనతత్పరయై యున్నది. గీతాలాపా నంతరము ఆమె రాజపుత్రునకు స్నేహపూర్వకముగా స్వాగతము పలికెను. ఆమె అడుగగా తాను అచ్చటికి చేరిన వృత్తాంతము నంతయు రాజకుమారుడు చెప్పెను. ఆమె తన భిక్షాకపాలమును గొని ఆశ్రమ వృక్షములనీడలో తిరిగినది. కొద్దిసేపటిలోనే వృక్షములన్నియు రాల్చిన పండ్లతో ఆమె భిక్షాకపాలము నిండినది. రాజకుమారు డామె తపో మహిమకు చకితుడయ్యెను. తన గుఱ్ఱమును తెచ్చి దగ్గరగా కట్టివైచి దాని జీను తొలగించి తాను స్నానముచేసి వచ్చెను. ఆ అమృతప్రాయ ములయిన ఫలములను మహాశ్వేత సమర్పింపగా భుజించెను. మహాశ్వేత ఆహారాదికము ముగించుకొని వచ్చెను. అపుడు చంద్రాపీడుడు ఆ దేవ కన్యకను "ఇంత సౌందర్యవతివి నీవు ఇట్టి కఠోరమైన బ్రహ్మచర్య వ్రతము పాటించుటకు కారణమే"మని యడిగెను. అపుడు ఆమె తన వృత్తాంతము చెప్పసాగెను.

మహాశ్వేత సంగతి : "నా పేరు మహాశ్వేత, మేము గంధ ర్వులము. మా అమ్మ పేరు గౌరి. ఆమె చంద్రకిరణములనుండి జన్మిం చిన అప్సరోజాతి స్త్రీ. మా నాన్న గంధర్వరాజు ఆయనపేరు హంసుడు. అసలు మా గంధర్వకులములు పదునాలుగున్నవి.

బ్రహ్మమానససంభూతలయిన అప్సరసలు ఒకవంశము, వేద ముల నుండి యింకొక జాతి అప్సరసలు పుట్టిరి. మరియొకజాతి అగ్ని వలన పుట్టినది. వాయువు వలన యింకొక జాతి. అమృతము కొరకు

పాలసముద్రమును చిలికినపుడు పుట్టిన వారిదొకజాతి. ఇంకొక జాతి సూర్యకిరణములనుండి అవతరించినది. మరియొకటి చంద్రకిరణముల నుండి పుట్టిన జాతి. భూమినుండి మరియొకజాతి, మెరపు తీవెల నుండి యింకొకజాతి. మరియొకజాతి యముని వలన నేర్పడినది. ఇంకొకజాతి మన్మథునివలన ఉత్పాదింపబడినది. ఈ పండ్రెండు వంశములు గాక దక్షప్రజాపతి కూతులయిన ముని, అరిష్ట అనువారికి గంధర్వుల సంపర్కమున బుట్టిన రెండు వంశములున్నవి. అందులో ముని అను ఆమెకు చిత్రరథుడు; అరిష్ట అను నామెకు హంసుడను నతడు జన్మించెను. హంసుడు గౌరియను అప్సరసను పెండ్లాడెను. ఆమె చంద్రకిరణములనుండి పుట్టిన అప్సరస. ఆ హంసుడు మా నాన్న. ఆ గౌరి మా అమ్మ. ఈ అభాగ్యురాలను నేను వారి కూతురను – మహాశ్వేతను.

ఒకనాడు మా యమ్మతోబాటు నేను అచ్ఛోదసరోవరమునకు వచ్చితిని. ఎచటినుండియో అద్భుతమైన పూలవాసన వీతెంచెను. అది ఎచటినుండి వచ్చుచున్నదాయని నేను వెదకుచుండగా మన్మథుని వంటి యొక మునికుమారుడు తన సహచరునితో కూడి వచ్చుచుండెను. ఆతని చెవిలో పూలగుత్తి యున్నది. ఆ పూలగుత్తి వాసనతో తోట అంతయు ఘుమ, ఘుమలాడుచుండెను. నేను వానికినమస్కరించి ఆతని సహచరుని అడిగితిని. ఈయన ఎవ్వరు? ఈచెవిలోని పూలగుత్తి ఏచెట్టుది? అని. ఆ మిత్రుడు "ఈతడు శ్వేతకేతు మహర్షి కుమారుడు. ఆముని సౌందర్యమునకుముగ్ధురాలయిన గంగానదిలోని తెల్లతామరలో(పుండరీకము) నుండిన లక్ష్మీదేవికి సంకల్పమాత్రమున పుట్టినవాడు. పుండరీక మధ్యము నుండి పుట్టినవాడగుటచే పుండరీకుడన్నాడు. నందనవనదేవత యీతని సౌందర్యమునకు సముచితమని యీ పారిజాతపు గుత్తిని ప్రేమతో సమర్పించినది" అన్నాడు. ఇంతలో ఆప్రక్కనున్న మునికుమారుడు "ఓ కుతూహలిని! దీనిగురించి యింత ఆలోచన ఎందుకు? కావలెనన్నచో యిదిగో!

తీసికొమ్మని తానే నా చెవి కలంకరించెను. అప్పుడాతని చేతిలో నుండి రుద్రాక్షమాల జారిపోయిన సంగతి యాతడెరుగడు. దానిని నేను క్రింద పడకుండ గ్రహించి నా కంఠము నందలంకరించి కొంటిని. ఆతని లోని మన్మథవికారమును వాని మిత్రుడు గ్రహించెను. ఇంతలో ఛత్రగ్రాహిణి వచ్చి "రాజపుత్రి! అమ్మగారి స్నానమైనది. ఇంటికి పోవలెను. త్వరగా స్నానము ముగించి రమ్మ"ని నన్ను హెచ్చరించెను. అతనిని వదలి వెళ్ళుట నాకు మిక్కిలి కష్టమయ్యెను. ఎట్లో నేను స్నానమునకు పోబోతిని. తన మిత్రుడు మన్మథవశుడగుట గుర్తించిన మునికుమారు డతనిని మిక్కిలి మందలించెను. అప్పుడా పుండరీకుడు తన మిత్రునితో నిట్లనెను. "ఓయి కపింజలా! నన్ను గూర్చి అన్యథా తలంతువేల? ఈ గడుసుపిల్ల నా అక్షమాలను అపహరించిన నేరమును క్షమింపజాలను." అని కోపము నటించి చుంబనాభిలాషను పెదవుల కదలికలో చూపుచు నాతో "ఓసి చపలా! నా అక్షమాల నీయకుండ ఒక్క అడుగు వేయుటకు వీలు లేదు" అనెను. నేనాయనకు ఆ అక్షమాల వలెనేయున్న నా ఏకముక్తావళి నిచ్చి స్నానమునకు పోయి మా అమ్మతో బాటు ఇంటికి పోతిని. ఆ తరువాత మా పరిచారిక తరలికద్వారా ఒక లేఖపై ఆర్యాఛందములో నాతడు తన ప్రేమనిట్లు తెలిపెను. "తామరతూడు నాశజూపి మానస రాజహంసమును దూరమున కాకర్షించినటుల నీవు నా మానస సంజాతుడయిన మన్మథుని ముక్తాలతజూపి విరహాతురుని జేసి చాలదూరము గొనిపోయితివి" అని వ్రాసెను. ఆ ప్రేమలేఖజూచి నేను మిక్కిలి కలవరపడితిని. సాయంకాలమున రహస్యముగ మా ఛత్రధారిణి నాతో "ఓ రాజపుత్రీ! ఆ యిరువురు మునికుమారులలో నొకడు అక్షమాలను గొనిపోవుటకై ద్వారము వద్ద వేచియున్నా" డని చెప్పెను. అతడు కపింజలుడు. "ఓ దేవీ! నిన్ను చూచినది మొదలు మామిత్రుని పరిస్థితి చాల విచారకరముగా నున్నది. మా వాడు బ్రతుకుట నీచేతిలో నున్నది. మరి ఏమి చేయు

దువో నీదే భార"మనెను. ఆతడు ఇంకను చెప్పుచునే యుండెను. ప్రతీ హారి వచ్చి "అమ్మగారు వచ్చుచున్నా"రని చెప్పుటతో ఆతడు అచట నిలువలేక చక చకా వెళ్ళిపోయెను. మా అమ్మ వచ్చి వెళ్ళునరికి పున్నమచంద్రు డుదయించెను. నా విరహవ్యథ యినుమడించెను. తర లికతో ఆలోచించి ప్రమదవనముగుండ ఆ తాపసకుమారుని కలిసికొ నుటకు పోతిని. సరోవరము కన్పించుచుండగనే నాకు కపింజలుని ఏడుపు వినిపించెను. పోయి చూతును కదా! పుండరీకుడొక రాతి యరుగుపై పడి యుండెను. వాని తల పట్టుకొని కపింజలుడు కూర్చుండెను. నేను నిశ్చేష్టురాల నయితిని. ఆ తరువాత నేనేమయితినో నాకే తెలియదు." ఇట్లామె తనగోడు చెప్పుకొనుచునే మూర్ఛ పొందెను. చంద్రాపీడు డామెను మూర్ఛనుండి తేర్చెను. ఆమె తెప్పరిల్లుకొని మరల తనకథ చెప్పసాగెను. ఆతడు మరణించెను. నాకు కూడ చితి పేర్చుమని తరలి కతో చెప్పితిని. ఇంతలో ఆకాశమునుండి యొక మహాపురుషుడు దిగి వచ్చి పుండరీకుని శరీరమును గొని పోవుచుండెను. అప్పుడు కపింజలుడు "ఆగు మాగుము! ఎవడురా నీవు? నామిత్రుని ఎక్కడకు గొనిపోవుచుం టివి?" అని వానిని వెంబడించెను. నేను ప్రాణత్యాగమునకు సిద్ధముగ నుంటిని. అప్పుడా మహాపురుషుడు ఆకాశమునుండి "అమ్మాయీ మహా! శ్వేతా! నీవు ప్రాణత్యాగమున కొడిగట్టకు మమ్మా! పుండరీకుడు మరల వచ్చి నిన్ను కలియు" నని పలికెను. ఆ రీతిగా ఆశ్చర్య విషాద ములలో మునిగి నే నారాత్రి గడిపితిని. మరునా డుదయముననే లేచి సరోవరమున స్నానముచేసి అప్పటినుండి శంకర భగవానుని ఉపాస నతో కాలక్షేపము చేయుచుంటిని. నాకు చేదోడు, వాదోడు తరలి కయే" అని చెప్పి యామె మరల బోరున యేడ్చెను.

చంద్రాపీడుడు ఆమెకు పురాణగాథలు చెప్పి యోదార్చెను. "తరలిక యిప్పుడు ఎక్కడికి పోయె"నని యడిగెను.

కాదంబరి విషయము : మహాశ్వేత చెప్పెను. "ఓ మహాను భావా! అమృతసంభవలయిన అప్సరసలలో "మదిర" యన్న కన్యక యుండెను. ఆమెను గంధర్వరాజు చిత్రరథుడు వివాహమాడెను. వారికి "కాదంబరి" యను కన్నె పుట్టెను. ఆమె నాకు రెండవ హృదయము. నా కష్టదశను తెలిసికొని ఆమె దుఃఖపడి, "నా మిత్రురాలు దుఃఖ ముతో కుమిలిపోవుచుండగా నేను పెండ్లి చేసికొనను" అని ఒట్టు పెట్టు కొనెను. తన కూతురిట్టి ఒట్టు పెట్టుకొనుట గంధర్వరాజునకు కష్టముగా నుండెను. ఆయన యీనాటి ప్రొద్దున కాదంబరికి నచ్చచెప్పుటకై నా కొరకు కబురంపెను. ఆపనిమీదనే నేను తరలికను వారి వద్దకు పంపితిని."

మరునాడు మహాశ్వేత ప్రొద్దున జపము చేసికొనుచుండెను. చంద్రాపీడుడు కూడ తన యనుష్ఠానము తీర్చుకొను చుండెను. అప్పుడు తరలికయు ఆమెతో బాటు కేయూరకుడను కాదంబరీ వీణా వాహకుడును వచ్చిరి. అతడు కాదంబరి వివాహమున కొడంబడుట లేదన్న సంగతి చెప్పెను. మహాశ్వేత వానితో "నీవు పద. నేను వచ్చి మాటాడుదు" నని చెప్పి పంపెను. ఆమె కాదంబరిని చూడబోవుచు చంద్రాపీడునికూడ తనవెంట రమ్మని బలవంతము జేసెను. చంద్రాపీ డామెతో బాటు గంధర్వరాజధాని హేమకూటమునకు పోయెను. అచట కన్యకాంతఃపుర మునకు బోయెను. ఆ కన్యకాంతఃపురము స్త్రీ మయము. "అసంఖ్యేయ నారీ శతసహస్ర సంబాధం" స్త్రీమయమైన మరియొక జీవలోకము. పురుషులు లేని కేవల స్త్రీమయమైన సృష్టి. అపూర్వమైన అంగనా ద్వీపము. ఆ వర్ణనమంతయు మనోహరము.

అచట కాదంబరీ వదనచంద్రలేఖను చూడగనే సాగరమువలె ఆతని హృదయముప్పొంగెను. తన మిగిలిన యింద్రియములు కూడ కన్నులే అయినచో యెంత బాగుండెడిది! సృష్టిలోని సర్వ సౌందర్యమును బ్రహ్మ ఒక్క పోత పోసినాడు. ఇట్లు ఆలోచించుచున్న చంద్రా

పీడునకు ఆమె దేహప్రభా సంపర్కముగూడ సురతసమాగమ సుఖ ప్రాయమయ్యెను. కాదంబరి లజ్జతో అడుగు ముందుకు సాగక యెట్లో వచ్చి మహాశ్వేతను గట్టిగా కౌగలించుకొనెను. మహాశ్వేతయు ఆమెను మరింత గట్టిగా కౌగలించుకొని "చెలీ! కాదంబరీ! ఈతడు ఉజ్జయినీ రాజ కుమారుడు చంద్రాపీడుడు. కనపడినది మొదలు అతని సాధు స్వభావ ముచే నాయందు అకారణ బాంధవ్యము పూనెను. ఈ సౌందర్యరాశిని నీకు చూపవలెనని కొని వచ్చితిని. కాదంబరీ చంద్రాపీడులకు హృదయ ములలో మన్మథుడు తాండవింపసాగెను. మహాశ్వేత కాదంబరిచే చం ద్రాపీడునకు తాంబూల మిప్పించెను. నేటినుండి నా యీ జీవితము నీ చేతిలో పెట్టుచున్నానన్నట్లుగా ఆమె యతని చేతిలో తాంబూలముం చెను. ఇట్లు వారి ప్రథమ వీక్షణముననే ప్రేమలు పొంగులెత్తెను. చం ద్రాపీడునకు విడిది యేర్పాటు చేసిరి. రాత్రి కాదంబరి యచటికి పోయి ఆతనితో ప్రసంగించి వచ్చెను. మరునాడు ప్రాతఃకాలమున చంద్రా పీడుడు మందర ప్రాసాదాంగణమునం దామెను కలిసికొనెను. అచటి నుండి మహాశ్వేతా కాదంబరులవద్ద సెలవు దీసికొని చంద్రాపీడుడు తన సేనలను చేరెను. వైశంపాయనునకు జరిగిన సంగతంతయు జెప్పెను. ఆ మరునాడు ప్రొద్దుననే కాదంబరీ సందేశమును గొని కేయూరకుడు వచ్చెను. కాదంబరి విరహతాపమును తట్టుకొనలేని స్థితిలోనున్నది. వానితోపాటు చంద్రాపీడుడు మరల గంధర్వనగరమునకు పోయెను. ఈసారి తనవెంట తాంబూల కరండవాహిని పత్రలేఖను గూడ గొని పోయెను. గంధర్వనగరమున కాదంబరి మదనావస్థ చాల తీవ్రస్థాయిలో నుండెను. ఆమె హిమగృహములో నుండెను. అచట ఆమెతో నర్మ సంభాషణము జరిపి ఆమె కోరికపై పత్రలేఖనచటనే యుంచి మరల తన సేనను వచ్చి చేరుకొనెను. అచట ఒకదూత ఉజ్జయిని నుండి వచ్చి యుండెను. తండ్రి తారాపీడుడు తనను వెంటనే బయలుదేరి రమ్మని

లేఖ వ్రాసెను. సేనలను సేనాపతి కుమారుడు మేఘనాదునకు అప్ప గించి మీరు పత్రలేఖ వచ్చిన తరువాత రాజధానికి రండని ఆదేశించి తాను ఉజ్జయినికి పోయెను. కొన్ని దినములు గడచినవి. మేఘనాదు నితో బాటు పత్రలేఖ వచ్చి కాదంబరియొక్క విరహావస్థను, సందేశ మును చంద్రాపీడునకు చెప్పెను.

ఉత్తరార్ధ కథ :- తన కారణముగా కాదంబరి అట్టి శోచనీయ స్థితిలో నున్నదని తెలిసికొని చంద్రాపీడుడు బాధ పడుచుండెను. విర హముచే మిక్కిలి సంతప్తుడగుచుండెను. ఒకనాడతడు నగరము వెలు పల గుఱ్ఱములపై విహరించుచుండగా అకస్మాత్తుగా కేయూరకుడు వచ్చెను. కాదంబరీ విరహావస్థను అతడు చెప్పగా చంద్రాపీడుడు దుః ఖముచే మూర్ఛిల్లెను. తరువాత తెప్పరిల్లి "యిట్టి స్థితిలో నున్నచో నాకు వెంటనే కబురుచేయరాదా? నా ప్రాణములిచ్చియైన ఆమె తాప మును పోగొట్టి యుందును." అనెను. కేయూరకుడు అతనిని తొంద రగా ప్రయాణము కావలెనని చెప్పెను. తల్లిదండ్రులకు చెప్పకుండ ఎట్లు పోవుట? చెప్పినచో వారు పోనిత్తురో లేదో? ఆ వైశంపాయ నుని అచ్ఛోదసరోవరము కడనే వదలి వచ్చినాడాయె. ఇప్పుడు తనకు సలహానిచ్చు వారెవరు?

ఆ మరునాటి ప్రొద్దున తనసేనలు దశపురముదాక వచ్చినవని కబురు వచ్చెను. ఇకనేమి! వైశంపాయనుడు వచ్చును. అతనిని వెంబడి గొని కాదంబరి వద్దకు పోవుదునని తృప్తి పొందెను. కేయూరకుడు చంద్రాపీడునితో "ప్రభూ! తాము వైశంపాయనుడు వచ్చినతరువాత గంధర్వ నగరమునకు ప్రయాణమై వత్తురని తమ యాగమనమును ముందుగా కాదంబరికి యెరిగింతునని పోయెను. అతనివెంట చంద్రా పీడుడు తాను తప్పక వత్తునన్న విశ్వాసము కలిగించుటకై ముందుగా పత్రలేఖనుగూడ పంపెను.

తనమిత్రుడైన వైశంపాయనునకు ఎదురుబోయి స్వాగత మిత్తునని తల్లిదండ్రుల అనుమతిగొని, శుకనాసునకు జెప్పి చంద్రాపీడుడు వెళ్ళెను. దారిలోనే సేనలు ఎదురు వచ్చుచుండెను. సైనికులు చెప్పిరి. వైశంపాయనుడు అచ్ఛోదసరోవరతీరమునకు జేరి చిత్తవికారము పొందెను. స్నానభోజనములు మాని లతామండపమున గూర్చుండి మమ్ములను పొమ్మనెను. ఎంతబలవంతము చేసినను "నేను రాలేను. నా శరీరము మనస్సు నా వశములో లేవు. నా బదులు మీరు పొండు. రాజకుమారునకు సాహాయ్యము చేయుడు. నేను రా"నని మొండికి వేసెను. వానిని మూడురోజులు బతిమాలి బామాలినను లాభము లేక, నిరాశ చెంది తమకు నివేదించుటకై వచ్చుచుంటి" మని చెప్పిరి.

అకస్మాత్తుగా వానికి వైరాగ్యమేల కలిగెను ?" అని వేయివిధముల నాలోచించుచు చంద్రాపీడుడు ఉజ్జయినికి వచ్చెను. మరునాడు చంద్రాపీడుడు వైశంపాయనుని గొనివచ్చుటకై అచ్ఛోద సరోవరము వద్దకు పోవుటకు అనుమతి పొందెను. అతని తల్లి మనసులో నేదో భయము! ఎన్నిజాగ్రత్తలో చెప్పి త్వరగా తిరిగి రా. నాయనా ! అని ఆతనిని పంపించెను. అది వర్షఋతువు. దారిలో అనేక విఘ్నములు. అచ్ఛోదసరోవరమునుండి తిరిగి వచ్చుచున్న సైన్యాధ్యక్షుడు మేఘనాదు డెదురుపడెను. చంద్రాపీడుడు అచ్ఛోదసరోవరతీరమున వైశంపాయనుని చూచితివా ? యని యడిగెను. మేఘనాదుడు చెప్పెను.

"సరోవరమువద్దకు వైశంపాయనుడు వచ్చినసంగతి నాకు తెలియదు. కానీ గంధర్వనగరమునకు పోవుచున్న పత్రలేఖయు కేయూరకుడును నన్ను తొందరగా ఉజ్జయినికి బొమ్మని చెప్పిరి. మరియు రాజకుమారుడు గంధర్వనగరమునకు త్వరలో బయలుదేరుదునని వాగ్దానము చేసెను. వర్షాకాలముకనుక తల్లిదండ్రులు ఒప్పుకొని యుండరు. కనుక

నీవు పోయి విచారించుము. మేము నీ వెనుకనే వత్తుమని చెప్పెను. అది విని చంద్రాపీడునకు ఎన్నో ఆలోచనలు కలిగెను. ఈ వర్షాకాలము కాదంబరి యెట్లు గడుపునోగదా ! అని అనుకొనుచు అతికష్టము మీద, అచ్ఛోదసరోవరమును జేరెను. అచట నలుమూలల వెదకెను. వైశంపాయనుని జూడలేదు. వానివిషయము తెలిసికొందమని మహాశ్వేతవద్దకు పోయెను. అచట ఆమె శోకమూర్తియై యుండెను. తరలిక ఆమెను ఓదార్చుచుండెను. కాదంబరికి ఏమియు కాలేదుకదా ! యని గగ్గోలుపడుచు చంద్రాపీడుడు మహాశ్వేత యెందులకేడ్చుచున్నదని అడిగెను. ఆమె గద్గదఖిన్నకంఠియై "ఓయి మహానుభావా! నేను హేమకూటమునుండి యేదో జారవిడచుకొన్నదానివలె నిచటకు తిరిగివచ్చితిని. అటు నిటు తిరుగుచుండగా నీవంటి రూపవంతుడైన బ్రాహ్మణ యువకు డొకడు కన్పించెను. అతడు నన్ను చిరపరిచితునివలె సమీపించెను. ప్రేమించు మాటలు మాటాడెను. వానిని ఎన్నిమారులు నివారించినను వానిపద్ధతి మారలేదు. పున్నమనాడు రాత్రి వెన్నెలలో జగమంతా నిద్రలో మునిగి ఉన్నది. అతడు మదనవశుడై, శూన్యహృదయుడై నావద్దకు వచ్చి, "ఓ చంద్రవదనా! పుష్పబాణుని సైదోడయిన యీ చంద్రుడు నన్ను చంపుటకు సిద్ధపడినాడు. అందుచే నేను నిన్ను శరణువేడ వచ్చితిని" అనెను. నేను అసలే నాప్రియతముని విరహాముచే కుమిలిపోవుచుంటిని. వీడు చిలుకవలె ప్రేమాలాపములు చేయునేమాయని నాకు ఒడలు మండిపోయినది. అప్పుడు చంద్రునివైపు తిరిగి "ఓ సకలభువనచూడామణీ ! చంద్రా ! నా దైవమగు పుండరీకమునిని జూచినది మొదలు కలలోగూడ నేను అన్యపురుషచింత చేయనేని చిలుకవలె పలుకుచున్న యీ దుర్మార్గప్రేమాలాపి చిలుకజాతిలోనే పడుగాక" యంటిని. అంటినో లేదో ? మొదలునరికిన చెట్టువలెనాతడు క్రిందపడెను. ఆతనివెంటనున్నవారు గగ్గోలు పడిరి. నీ వాతని మిత్రుడవని వారివలన దెలిసికొంటిని," అని ఆమె సిగ్గుతో మొగము వంచు

కొని మరల బావురుమనెను- కాదంబరీవిరహముచేతనే జరుగవలసినది- ఈవార్త వినుసరికి చంద్రాపీడుని గుండె బ్రద్దలయ్యెను. అయ్యో! యిదియేమియని గొల్లుమనుచు తరలిక యేడువసాగెను, మహాశ్వేత స్తంభించిపోయెను. రాజకుమారుని పరిజనము గుండెలు బాదుకొని యేడ్చిరి. చంద్రాపీడుడు వచ్చెనన్నవార్త విని పత్రలేఖను తోడుగా దీసికొని కేయూరకునితోబాటు కాదంబరి యచటకు అప్పుడే వచ్చెను. ఏమున్నది! నిర్జీవమైన చంద్రాపీడుని శరీరము నేలపై బడియుండెను. ఆమె దుఃఖవివశురాలై నేలపైబడి తలబాదుకొనుచు నేడ్చెను. తాను కూడ ఆతనితో మరణించుటకు సిద్ధపడి చివరిసారిగా ఆతని రెండుపాదములను పట్టుకొనినది. ఆమెస్పర్శ తగులగనే బాగా యూపిరి తీసికొనినట్లు చంద్రాపీడుని శరీరమునుండి చందమామవంటి తెల్లనిజ్యోతి పైకి లేచెను. అశరీరిణియైన వాణి ఆకాశములో నిట్లుపలికెను.

"అమ్మాయి మహాశ్వేతా! నిన్ను మరల నోదార్చవలసి వచ్చెను. నీ పుండరీకుని శరీరము నా లోకమున నా తేజస్సుచే ఆప్యాయితమగుచున్నది. తిరిగి నీసమాగమము కొరకై భద్రము చేయబడినది. నా తేజోమయమైన యీ చంద్రాపీడ శరీరము కూడ నా రెండవ శరీరము. శాపదోషముచే ఆత్మ శూన్యమైనది. పరకాయ ప్రవేశము చేయు యోగుల శరీరమువలె నీతని శరీరమున మరల జీవుడు ప్రవేశించును. అందువలన మీకు విశ్వాసము కలుగుటకై యీ శరీరమును ఇచ్చటనే యుంచుచున్నాను. ఈ శరీరమునకు అగ్ని సంస్కారము చేయరాదు. ఆ జీవుడిందు మరల ప్రవేశించువరకు దీనిని జాగ్రత్తగా కాపాడుకొనవలెను" అని చెప్పెను.

అందరకు నాశ్చర్యమయ్యెను. అప్పుడు పత్రలేఖ హఠాత్తుగా "వాహనము లేకుండగనే స్వామి యొంటరిగా పోయెను. ఆ ప్రభువు లేని నీకుశోభలే"దని ఇంద్రాయుధమును గుంజుకొని పోయెను. అచ్ఛోద

సరోవరమున మునిగెను. వెంటనే సరోవరమునుండి లేచి కపింజలుడు మహాశ్వేత వద్దకు వచ్చెను. మహాశ్వేత సంతోషముతో నాతనికి నమస్కరించి వార్త లడుగగా కపింజలుడు చెప్పెను. "నేను ఆ రీతిగా నా మిత్రుడైన పుండరీకుని గొనిపోవుచున్న వాని వెంటబడి చంద్రలోకము నకు జేరితిని. నా మిత్రుని గొనిపోయినవాడు అతడే! సాక్షాత్తు చంద్రుడు. పుండరీకుని శరీరమును చంద్రకాంతపు రాతి అరుగు పైనుంచి ఓయి కపింజలా! నేను చంద్రుడను. వెన్నెల కాయుట నా విధి. నిరపరాధినైన నన్నితడు శపించెను— "నీ వలన ప్రియా విరహామునకు తట్టుకొనలేక నేను చచ్చుచుంటిని. నా వలెనే నీవును కర్మభూమియైన భారతభూమిలో జన్మ జన్మల ప్రేమించిన ప్రియురాలి సమాగమము పొందకయే చచ్చెదవు." అని శపించెను. శాపముచే నాకు మిక్కిలి కోపము వచ్చెను. నేను ప్రతి శాపమిచ్చితిని. "సరే కానిమ్ము నీవును నాతోబాటుగనే సుఖము దుఃఖము పొందుదువు" అంటిని. నాకోపము చల్లారుసరికి మహాశ్వేత గూర్చిన ఆలోచన నాకు జాలి గొలిపినది. నా శాపము దీరువరకు వీని శరీరము మాయకూడదు. దీనిని భద్ర పరచవలెను. అందుచే ఆ శరీరము నిచ్చటికి (చంద్రమండలమునకు) తెచ్చితిని. మరల సమాగమము జరుగునని మా అమ్మాయి మహాశ్వేతకు చెప్పి యోదార్చితిని. "జన్మ జన్మల నీవు ప్రియ సమాగమము పొందకయే చత్తు" వని మీ వాడిచ్చిన శాపము ప్రకారమే అతడును, నేనునుగూడ రెండు జన్మలెత్తవలసినదే! దీనికి ప్రతీకారమాలోచింప వలసినదని శ్వేతకేతు మహర్షికి చెప్పుము." అని యాతడు నన్ను బంపెను. నేను మిత్రుడు పోయెనన్న దుఃఖములో కంగారుగా పరిగెత్తుటలో ఆకాశమున బోవు నొక ఖేచరుని విమానమును లంఘించితిని. ఆతనికి కోపము వచ్చి గుఱ్ఱమువలె గంతులువేయుచు బోవు నీవు మర్త్యలోకమున గుఱ్ఱముగనే పుట్టుమురా యని శపించెను. శాపమును

మర్పించుమని అతనిని బతిమాలగా "ఉజ్జయినిలో సంతానముకొరకై తారాపీడుడన్న రాజు తపించుచున్నాడు. వానికి చంద్రుడు పుత్రుడుగా పుట్టును. నీ మిత్రుడు పుండరీకుడు ఆరాజునకు మంత్రియైన శుకనాసునకు పుత్రుడుగా జన్మించును. నీవు చంద్రుని యవతారమైన యీ రాజపుత్రునికి వాహనమైన నీ మిత్రునకు సన్నిహితుడ వగుదువు పొమ్మ" నెను. ఆ మాటలు చెవిని బడగనే నేను సముద్రములో బడితిని. అందులోనుండి గుఱ్ఱమునై బయటకు వచ్చితిని. పారశీక దేశపురాజు నన్ను తారాపీడునకు బహుమానముగా నిచ్చెను. పూర్వజన్మ ప్రభావముచేత వృత్తాంతమంతయు జ్ఞాపకము చేసికొనుచు నేనే చంద్రావతారుడైన చంద్రాపీడుని కిన్నర మిథునమును వెంటాడునప్పుడు ఇంతదూరమునకు గొనివచ్చితిని. నీ శాపముచే దగ్ధుడైన ఆ యువకుడు నా మిత్రుడు పుండరీకుడే. ఈజన్మలో అతడు మంత్రికుమారుడయ్యెను. వైశంపాయను డనిరి.

అది విని మహాశ్వేత "అయ్యో! జన్మాంతరమునందు కూడ నీ మరణమునకు నేనే కారణమైతిని" అని పుండరీకుని దలచుకొని విలపించినది. త్వరలో నేమీకు పునస్సమాగమము జరుగునని వారినోదార్చి కపింజలుడు శ్వేతకేతువు నొద్దకు పోయెను. అతడు పోయిన తరువాత కాదంబరి ఆ చంద్రాపీడుని శరీరమును రాతి యరుగుపై నుంచి ప్రతి దినము దైవమువలె పూజించుచు కాలము గడపుచుండెను. వర్షాకాలము గడచినది. చంద్రాపీడుని సమాచారమంతయు తారాపీడునకు తెలిసినది. శుకనాసునకు తెలిసినది. అందరు దుఃఖోద్వేగమున చచ్చుటకు సిద్ధపడగా, వారు మరల బ్రదుకుదురని ఆకాశవాణి ఓదార్చెను. చంద్రాపీడుని జూచుటకై ఉజ్జయిని జనమంతయు రాజుతో సహా అచ్ఛోద సరోవరము వద్దకు వచ్చిరి. చంద్రాపీడుని శరీరమునందు కళ తరుగకుండుటచూచి కాదంబరిపాతివ్రత్యము జూచి యందరు నాశ్చర్యపడిరి.

తారాపీడుడు, సామాన్య తాపసునివలె యాశ్రమభూమిలోనే యుండిపోయెను. వింధ్యాటవిలో ఈకథనంతయు జాబాలిమహర్షి ఋషులకు చెప్పెను. ఆ చిలుకవైపు చూచి నవ్వుచు "దివ్యలోకమునుండి శాపము పొంది శుకనాసుని కొడుకై వైశంపాయనుడన్న అతడే మహాశ్వేత శాపముచే చిలుకగా పుట్టినాడు"- అని చెప్పెను. జాబాలిచెప్పిన వృత్తాంతము నంతయు పూసగుచ్చినట్లు శూద్రకమహారాజునకు చిలుక చెప్పినది. మరియు నన్నది.

మరల చిలుక చెప్పిన కథ : జాబాలిమహర్షి నాపూర్వ కథ యంతయు చెప్పగనే నిద్రనుండి మేల్కొనినవానికివలె నాకుపూర్వము చదివిన అన్నివిద్యలు, పూర్వముచూసిన అన్నివస్తువులు తెలిసికొను తెలివి వచ్చెను. మనుష్యులకువలె మాటాడు శక్తియువచ్చెను. నేను మహర్షిని అడిగితిని."దయచేసి చంద్రాపీడుడెచట పుట్టియుండునోచెప్పు" డని అనగా ఆయన "ముందు ఎగిరెడిశక్తి రానిమ్ము! తరువాత చెప్పెదనులే" యనెను. తెల్లవారెను. మునులందరు వారి నిత్యానుష్ఠానమున నిమగ్నులైరి. ఇంతలో హారీతుడువచ్చి "నీ మిత్రుడు కపింజలుడు నిన్ను వెదకి కొనుచు వచ్చెను" అని చెప్పెను. కపింజలుడు కనబడెను. అప్పటి నాస్థితిని యేమనిచెప్పుదును ? కపింజలుడు, "నీ తండ్రి సుఖముగ నున్నాడు. అందరి శ్రేయస్సుకొరకై తపస్సు చేయుచున్నాడు. ఆయన యనుష్ఠానము పూర్తియగువరకు నీవు ఇక్కడనే యుండు"మనిచెప్పి చూచుచుండగనే ఆకాశములో నంతర్ధానుడయ్యెను. జాబాలిఆశ్రమములో నా కంతయు బాగుగనే యుండెను. కానీ పాడు బుద్ధి కొంచెము రెక్కలురాగానే ఆ మహాశ్వేతను చూడవలెనని, చంద్రాపీడుని చూడవలెనని యారాటపడితిని. ఆశ్రమమునుండి తప్పించుకొని మహాశ్వేతను చూచుటకై ఉత్తరపుదిక్కుగా ఆకాశమున ఎగిరిపోతిని. అంతదూరముపోవుటకు నాకు శక్తిచాలునా ? ఆకలి వేసి

నది, దాహము వేసినది. రొప్పుచు, రోజుచు దారిలో ఒకచెట్టుమీద విశ్రాంతి గైకొంటిని. మరునాడు ప్రొద్దుననే వలలో తగుల్కొని ఒక చండాలుని చేతిలో బడితిని. శబరుల దొరగారి కూతురు ఆ చండాల కన్యక నన్ను పంజరములో బంధించినది. కొన్నాళ్ళు గడచిన తరువాత నన్ను బంగారు పంజరములో బెట్టి తమవద్దకు గొనివచ్చి తమకు సమర్పించినది. ఈమె యెవరో ? నన్ను పంజరములో నెందుకు బెట్టినదో యామె నడుగవలెనని యనుకొనుచున్నంతలోనే నన్ను ఇచటికి దీసి కొనివచ్చినది. మీ వలెనే నేనుకూడ ఇది తెలిసికొనవలెనని కుతూహల పడుచున్నాను అనెను.

చండాలకన్య చెప్పిన కథ : శూద్రక మహారాజు చండాల కన్యకను పిలిపించి వివరము లడిగెను. అప్పుడు చండాలకన్యక ఓ కాదంబరీలోచనానందా! చంద్రా ! తమరు వీనియొక్కయు తమయొక్కయు పూర్వజన్మగాథ విన్నారు. చిలుకజన్మ మెత్తినను తండ్రిమాట వినక యీ దౌర్భాగ్యుడు తన ప్రేమకై ప్రాకులాడెను. నేను వీని జన్మకారకురాలైన లక్ష్మిని. వీనియొక్క దురదృష్టము దీరువరకు మర్త్యలోకమున వీనిని రక్షించుటకై చండాలకన్యకగా అవతరించవలసి వచ్చినది. అది వీని తండ్రి యాదేశము. వీనికిని, తమకును గూడ శాపము దీరు సమయమైనది. అందుచే మీరిరువురు మీ శరీరములను విడచి మీకిష్టమైన వారితో సమాగమ సుఖమును పొందుదురుగాక యని చెప్పుచునే యామె భూమినుండి యాకాశమునకు ఎగిరి మెరపు దీవెవలె అదృశ్యమయ్యెను.

జన్మాంతరస్మరణముతో రాజు, చిలుకయు తమ శరీరములు విడచిరి. అది వసంతఋతువు. చిత్తవృత్తులు శృంగార రసోద్దీపనము పొందినవి. కాదంబరి విరహోద్వేగము తట్టుకొనలేక చంద్రాపీడుని శరీరమును కౌగలించుకొనెను. ఆ కౌగిలిలోనే చంద్రాపీడ శరీరము

నందు జీవచైతన్య మేర్పడెను. ఆతడు కాదంబరికి తన కథను చెప్పెను. నీ యీ కౌగిలింతతో నేను నిద్రనుండి మేల్కొనిన వానివలె పునరు జ్జీవితుడ నైతిని. నా శూద్రకశరీరము పోయినది. నీ ప్రియసఖి మహా శ్వేతయొక్క ప్రియతమునకు గూడ శాపవిమోచన మైనది. అనుచుం డగనే ఆకాశమునుండి పుండరీకుని బట్టుకొని కపింజలుడు దిగివచ్చుచుం డెను.

ఇక్కడ నిట్లున్నది. అటు విలాసవతీ తారాపీడులు వచ్చి మహా నందములో మునిగియున్నారు. చంద్రాపీడుడు చంద్రాత్మకుడై నను తారాపీడుని తనయునివలెనే యుండెను. తల్లి దండ్రుల కాళ్ళకు మ్రొక్కినాడు. శుకనాస మనోరమలకు యిడుగో! మీ వైశంపా యనుడని వారి పుత్రునిగా జూపెను, అతడు పుండరీకుడు. అప్పుడే వచ్చిన కపింజలుడు శుకనాసునితో నిట్లు చెప్పెను. శ్వేతకేతుమహర్షి తమ కీ సందేశమును చెప్పుమని నన్ను బంపెను. "పుండరీక శరీరమును దాల్చినను ఈతడు మీ బిడ్డయే. నేను వీనిని పెంచితిని, పెద్దజేసితిని. కాని వీడు మీ వాడే. వీనికి మీమీద నెంతో ప్రేమ యున్నది. కనుక వీనిని వైశంపాయనునిగనే చూచుకొనుడు" అని.

మరునాడు గంధర్వరాజు చిత్రరథుడు అతని భార్య మదిర; హంసుడు, వానిభార్య గౌరియు వచ్చిరి. వారివెంట గంధర్వులందరును వచ్చిరి. చిత్రరథుడు చంద్రాపీడుని వివాహమునకై తారాపీడుని, విలాసవతిని అందరను గంధర్వరాజధానికి ఆహ్వానించెను. "ఓ గంధర్వ రాజా! నా సర్వస్వము నీ అల్లునకే యిచ్చుచున్నాను. నేను తపోవన ములో తపస్సు చేసికొందును. నా కోరిక యిదియే" అని తారా పీడు డనెను. చిత్రరథుడు అందరిని వెంటబెట్టుకొని తన రాజధానికి బోయెను. హంసుడుగూడ మహాశ్వేతతోబాటు తన రాజ్యమునుగూడ పుండరీకున కిచ్చెను, అందరు కలిసికొనిరి. కాని కాదంబరికి ఏదో కొఱతగా

నుండెను. అప్పుడు ఆమె చంద్రునితో (చంద్రాపీడుని) ఆర్యపుత్రా! మనమందరము విడిపోతిమి, కలిసికొంటిమి. కాని పాపము ఆ పత్రలేఖ యేమైనది? అనెను. అతడు చెప్పెను. "ఆమె రోహిణి. నేను శాపము వలన ఉజ్జయినిలో పుట్టితిని. నాపై ప్రేమతో ఆమెయు భూలోకమున అవతరించినది. ఇప్పుడామె నా చంద్రలోకముననే యున్నది. మనము చంద్రలోకమునకు పోయి అక్కడనే యామెను చూతము" అనెను. [చంద్రుడు మనస్సు. పత్రలేఖ మనసులోని స్థాయీభావము చూ. పుట 199]

చంద్రాపీడుడు రాజ్యభారమంతయు పుండరీకున కప్పగించి తన మాతాపితరులను సేవించుకొనుచు ఒకప్పుడు ఉజ్జయినిలో, మరొక ప్పుడు హేమకూటములో, అప్పుడప్పుడు పుండరీకుని లక్ష్మీనివాస సరోవరములలో విహరించుచుండెను. చంద్రుడు- కాదంబరి; కాదంబరి- మహాశ్వేతా; మహాశ్వేతా- పుండరీకులు; పుండరీక - చంద్రాపీడులు విడివడని జంటలై సుఖముగా నుండి పరమానందమును చూరగొనుచు కాలక్షేపము చేయుచుండిరి.



## అనుబంధము-1

# బాణుని మరొక గద్యకృతి — హర్షచరిత

బాణుని గద్యకృతులు రెండు. ఒకటి "కాదంబరి". రెండవది "హర్షచరిత".

ఈ మహాకవియొక్క కల్పనా సౌందర్యము "కాదంబరి" ని విశిష్టస్థానమున నుంచినది. అతని మొదటి కృతి 'హర్షచరిత' కూడ అతని ప్రతిభా నికషమే: గద్యకవిగా బాణుని గూర్చిన సమగ్రమైన అవగాహనకు హర్షచరితను గూడ భావించుట సముచితము. 29-12-75 తేదీన ఆకాశవాణి-విజయవాడ కేంద్రమునుండి ప్రసారితమైన నా ప్రసంగ వ్యాసమిది. ఆకాశవాణి సౌజన్యముతో యథాతథముగా ప్రకటితము —పేరాల భరతశర్మ.]

## హర్ష చరిత

గద్యకవిగా ప్రథమగణ్యుడైన భట్టబాణుడు హర్షచరిత వ్రాసి ఐతిహాసికులలోగూడ అగ్రగణ్యుడైనాడు. సంస్కృత సాహిత్యములో చారిత్రక కావ్యాలలో విశిష్టస్థాన మలంకరించిన కావ్యం హర్షచరిత. హర్షుడు అందరివలెనే ఒక మహారాజు. ఎందరు రాజులు కాలగర్భంలో కలిసిపోలేదు! కాని అసాధారణ ప్రజ్ఞావంతుడైన ఆస్థాన కవి వలన చిరస్మరణీయుడైనాడు హర్షుడు.

హర్షుడు ఎంత ఘనుడని తాను భావించాడో అంతఘనంగా అతని చరిత్ర వ్రాయాలని సంకల్పించాడు బాణుడు.

భారతకథవలె జగత్త్రియవ్యాప్తం కాజాలని కవి యొక్క కావ్యమూ ఒక కావ్యమేనా "కిం కవేస్తస్యకావ్యేన? సర్వవృత్తాంత గామినీ కథేవ భారతీ యస్య న వ్యాప్నోతి జగత్త్రయం" అన్న బాణుడు తాను చెప్పదలచిన కథ ఎంత ఉదాత్త సుందరంగా ఉండాలనుకు న్నాడో ఊహించవచ్చు.

"నవోఽర్థో జాతిరగ్రామ్యా శ్లేషోఽక్లిష్టః స్ఫుటోరసః
వికటాక్షర బంధశ్చ కృత్స్నమేకత్ర దుష్కరమ్."

అని కావ్యసమగ్ర సౌందర్యభావన చేశాడు. అపూర్వ కథా చమత్కృతి, అగ్రామ్య సహజోక్తివిలాసము, క్లిష్టతలేని అనేకార్థ ప్రతి పాదియైన శ్లేష; స్ఫుటమైన రసపరిష్కృతి; ఓజోగుణ గుంఫితమైన అక్షరబంధము— అన్నీ ఒకే కావ్యమున సమకూడడం చాల కష్టమ న్నాడు. ఏవంవిధ కావ్యకల్పనా మనీషియైన వాని రచన హర్షచరిత.

అందుకనే కుంతకుడు కథ చెప్పుకు పోతే లాభం లేదు. రస నిర్భరములైన కవులమాటలు కలకాలం నిలుస్తాయన్నాడు. "నిరంతర రసోద్గార గర్భసౌందర్య నిర్భరాః గిరః కవీనాం జీవంతి న కథామాత్ర మాశ్రితాః" అని.

హర్షచరిత ఆఖ్యాయికారూపమైన గద్యకావ్యం. "ఆఖ్యాయికా ఉపలబ్ధార్థా" అని అమరకోశం చెప్తున్నది. అంటే యథార్థకథను చెప్పేది అని అర్థం. కథ చెప్పేవాడే నాయకుడుగావుంటే అది ఆఖ్యాయిక అనీ, ఎవని కథనో కల్పించిచెప్తే అది కథ అనీ దండ్యాదులు పేర్కొన్నారు. తానువ్రాస్తున్నది ఆఖ్యాయిక అన్నాడు బాణుడు. హర్షుని కథ జరిగినకథే. అతని కథ కంటెముందు బాణుడు తన కథ చెప్తూ గ్రంథం ఆరంభించాడు. ఆఖ్యాయికారంభం యిలాగే ఉండడం సంప్రదాయమని అగ్నిపురాణంవల్ల తెలుస్తుంది.

ఎనిమిది ఉచ్ఛ్వాసాల హర్షచరిత్రలో మొదటి 2, 3 ఉచ్ఛ్వాసాలలో బాణుని ఆత్మకథ. మిగతాకథ హర్షునిది.

ఉభయకథలనూ ఉదాత్త గంభీరంగా చిత్రించడంలో బాణుని ప్రజ్ఞాచక్షువు బ్రహ్మలోకంనుండి వింధ్యాటవిదాకా విహరించి గ్రహించిన రమణీయ ప్రకృతిదృశ్యాలు, విద్వద్గోష్ఠుల వైభవాలు, దివ్యాదివ్య పాత్రల విభిన్నచిత్తప్రవృత్తులు, రాజకుటుంబాలలోని నానా రసాలంబనములైన సన్నివేశాలు, స్వామిభక్తుల త్యాగాలు, ఆటవికుల జీవిత మాధుర్యాలు, వివిధ మత సాంఘిక రాజకీయ సముదాచారాలు సంప్రదాయాలు నానారస సామగ్రి సముల్లాసంతో సహృదయులను ఆనందసాగరంలో ఉత్తుంగతరంగాలపైన ఉట్టూతలూగిస్తాయి.

"ఉపశ్లోక్యస్య మాహాత్మ్యదుజ్జ్వలాః కావ్యసంపదః" అని భామహుడన్నట్లు తనకథలో తన వంశంచేత తనఘనతను, రాజుకథలో అతని వంశౌన్నత్యాన్ని చాటే కల్పనతో అతని ఘనతనూ ఇనుమడింపజేస్తాడు బాణుడు.

బాణుడు వాత్స్యాయనవంశ సంభవుడు. వత్సుని నుండి వాత్స్యాయన వంశం అవిచ్ఛిన్నంగా రూపొందింది. వత్సుడు సాక్షాత్తు సరస్వతీ పుత్రుడైన సారస్వతుని సాహచర్యంలో సారస్వత సంపదను సమ

గ్రంగా చూరగొన్నవాడు. సరస్వతి భూలోకంలో అవతరించి ఒక కుమారుణ్ణి కనవలసిన గాథతో హర్షచరిత్ర ఆరంభం అవుతుంది. యథార్థానికి బాణుని కథకుగాని హర్షచరిత్రకు గాని ఆ గాథతో ప్రత్యక్షానుబంధం ఏమీ లేదు.

కావ్యారంభం సత్యలోకంలోని కమలాసనుని కొలువును వర్ణిస్తూ వాగ్దేవి భూలోకానికి అవతరించిన కారణకల్పనతో సాగటం సహృదయులకు ప్రియంగాను, ఆకర్షకంగాను వుంటుంది. లౌకికమైన కథను పౌరాణికమైన బీజంతో అంకురింపజేసి కావ్య గౌరవాన్ని పెంచడం కవి ప్రతిభాప్రాబల్యం.

బ్రహ్మ సభలో "ఉపమన్యు" డన్న మునితో వాదానికి దిగి దూర్వాసుడు సామగానం చేస్తూ స్వరం తప్పుగా పలికాడు. ముని శాపానికి భయపడి ఎవరూ పట్టించుకోలేదు. సరస్వతిమాత్రం నవ్వు ఆపుకోలేకపోయింది. ఆ నవ్వు ఆమె సర్వాంగములనుండి పుట్టినట్లున్నది. తాను ప్రత్యక్షంగా చూచినవానివలె ఆమె నవ్వును వర్ణించినాడు బాణుడు. ఆ నవ్వుతో ఆమె దూర్వాసుని శాపానికి గురిఅయింది. ప్రచండమైన కోపంతో బాగా ఎఱ్ఱబడిన ఆ ముని చూపు క్రోధదేవతకు తన రక్తంతో అర్ఘ్యమిస్తున్నట్లున్నది. శాపానుసారం సరస్వతి భూలోకంలో అవతరించాలి. కుమారుడు కలగడంతో ఆమెకు శాపం తీరుతుందని బ్రహ్మ ఆమెను ఓదారుస్తాడు.

ఈ వృత్తాంత కల్పనలో బాణుడు ఒకచక్కని గొప్ప వాఙ్మయమైన రహస్యాన్ని స్ఫురింపజేసినట్లుంది. సరస్వతి సకల వాగధిష్ఠానదేవత. వైదికమైనవాక్కు స్వరవిశిష్టమై అర్థావబోధక మవుతుంది. స్వరభంగంతో అనర్థాన్ని కల్పించిన దూర్వాసుడు వాక్కును కలుషితం చేశాడు. స్వరభంగం చేసినవాడు దూర్వాసుడైనా కలుషమైనది మాత్రం వాక్కు. కలుషమైనవాక్కు తదధిష్ఠానదేవతకు బాధాకరమైనది.

సర్వశ్వేతగా చెప్పబడే సరస్వతి శుద్ధసత్త్వగుణ విశిష్ట. ఆమెయందు రజస్తమస్సులు వ్యాపించినప్పుడు త్రైగుణ్యంపొందిన ఆదేవి లౌకికమైన సారస్వత సృష్టికి ఆలంబనమైంది. ఇది వాగనుశాసనుడైన బ్రహ్మ ఆదేశం, వాఙ్మయమైన అపరాధము వాగ్దేవికి అపచారమన్న హెచ్చరిక ఆ కల్పనలోని స్ఫూర్తి. సత్యలోక వాసినికి భూలోకవాసం పతనంగాని భూలోకానికి సరస్వతి అవతరణ శుభోదర్కంగదా! మహానుభావుల బాధలోకూడా లోకానికి ఉపకారమే జరుగుతుంది కాబోలు!

ఇక హర్ష కథా కల్పనలో బాణుడు చాలా చమత్కారాలు చేశాడు. అతనివంశం అత్యంత ప్రాచీనమని చెప్పడానికి "పుష్యభూతి" కథను కల్పించాడు. స్థాణీశ్వరమునకు ప్రభువైన పుష్యభూతి భైరవాచార్యుడన్న శైవగురుప్రసాదంవల్ల, బేతాళ సాధనతో విద్యాధరీ విద్యను పొందుతాడు. అతనికి లక్ష్మి ప్రసన్నురాలై, నీవొక మహావంశానికి కర్తవవుతావు. నీ వంశంలో హరిశ్చంద్రునివంటి ఘనుడు హర్షుడన్న రాజు ఉదయిస్తాడు. అప్పుడు నేను నా చేతిలోని యీ లీలాకమలాన్ని వదలి అతనికి చామర గ్రాహిణిని అవుతాను, అని చెపుతుంది. ఆరీతిగా హర్షుని కావ్యనాయకునిగా తీర్చడంలో దైవికఘటనను సుందరంగా కల్పించుతాడు.

"గుణాలంకార చారుత్వయుక్తమప్యధికోజ్వలం కావ్యం ఆశ్రయ సంపత్త్యా మేరుణేవామరద్రుమః"— గుణాలంకారములతో ఎంత శోభాయమానమయిన కావ్యమయినా ఉత్తమ నాయకునిపై రచింపబడితే అది మేరుపర్వతంపై నాటిన కల్పవృక్షంలాగా మరింత ఉజ్వలంగా వుంటుందని భట్టోద్భటుడు అంటాడు. అట్లాగే బాణుడు తన నాయకునియందు అత్యంతోత్కర్షను ఆపాదించడానికి యింకొక కల్పన కూడా చేసాడు.

అది ప్రభాకరవర్ధనుని రాణి యశోవతికి కలిగిన స్వప్నవృత్తాంతము. ఒకనాటి రాత్రి తెల్లవారుజామున తేజోరాసులైన యిరువురు కుమారులు కవచ, కిరీట, కుండలధారులై సుషుమ్నా కిరణంనుండి ఉదయించిన చక్కని పిల్లతో సహా ఆమె గర్భాన్ని చీల్చుకొని ప్రవేశిస్తున్నట్లు కలగంటుంది. ఆ తరువాత ఆమె గర్భవతి అవుతుంది. అప్పుడామె "ఉదరే తనయేన హృదయేచ భర్త్రా తిష్టతా ద్విగుణితామివ లక్ష్మీముపాహ" కడుపులో కుమారుడు, హృదయంలో భర్త వుండటాన ఆమె ద్విగుణితంగా రాజ్యలక్ష్మిని మోస్తున్నట్లున్నదిట. బాణుని యిట్టి వర్ణనాచమత్కృతులు ఎన్నో వ్యవధిలేక విడిచిపెడుతున్నాను. ఆ దంపతులకు క్రమంగా ఇరువురు కుమారులు ఒకకుమార్తె పుడతారు. వారిలో పెద్దవాడు రాజ్యవర్ధనుడు, ఆడబిడ్డ రాజ్యశ్రీ ఎన్నో అగచాట్ల పాలవుతారు. రాజు రాణి ముందే మరణించారు. ఒంటరివాడై నహర్షుడు శత్రువుల బారినుండి తప్పించుకొనిపోయిన రాజ్యశ్రీని వింధ్యాటవిలో కలుసుకొనటంతో హర్షచరిత్ర ఆగిపోతుంది.

హర్షుడి తరువాతి చరిత్రను బాణుడు వ్రాయలేదు. చరిత్ర ప్రకారం హర్షుడు రెండవపులకేశి చేతిలో చివరకు ఓడిపోయినట్లు తెలుస్తుంది. అతడు ఓడెనో గెలిచెనో ఎవరికి పట్టెను. బాణుని రచనలో మాత్రము అతడు మహానాయకుడు. చంద్ర, పురూరవ, నహుష, యయాతి, సుద్యుమ్న మాంధాత్రాది మహాచక్రవర్తులకంటె గుణవంతుడుగా నిలిచిపోయినాడు. ఇది కవి ప్రతిభాకల్పితమైన నాయకోత్కర్ష. "ద్విజానాం రాజా గురుదార గ్రహణ మకార్షీత్." ద్విజరాజయిన చంద్రుడు గురువు భార్యను చేపట్టిన దోషి. పురూరవుడు బ్రాహ్మణ ధనతృష్ణతో ప్రియమైన ఆయువును పోగొట్టుకొన్నాడు. నహుషుడు పరభార్యాభిలాషి అయిన మహాభుజంగుడయినాడు. భుజంగశబ్దంలో శ్లేష- విటుడని, సర్పమని. దశరథుడు ఇష్టరామోన్మాదంచేత మృత్యువును పొందాడు. ఇష్టుడైన రామునికొరకైన పిచ్చితో అని, ప్రియ

రాలయిన "రామ" కాంతావ్యామోహంలో పడియనీ శ్లేష. ఇలా ఏ రాజులో పట్టినా దోషం ఉంది, కాని మా మహారాజు హర్షునిలో మాత్రం ఇటువంటి దోషాలేమీ లేవు, అని కల్పిస్తాడు. బాణుడు. "కవేరల్పాపి వాగ్వృత్తిః విద్వత్కర్ణావతం సతి నాయకోయది వర్ణ్యేత లోకోత్తర గుణోత్తరః" కవిరచనలో పస లేకపోయినా లోకోత్తరగుణ విశిష్టుడైన నాయకుని వర్ణించిన కావ్యం విద్వాంసులకు వీనుల విందవుతుంది అని భోజరాజు అన్నట్లే ఎంత సామాన్యుడయిన నాయకుడైనా కవియొక్క ప్రతిభా ప్రాబల్యాన లోకోత్తరగుణ విశిష్టుడుగా చిత్రింపబడతాడు– అనడానికి బాణుని హర్షచరిత ఉదాహరణం.

ఉత్తమ పురుషుని చరితము వర్ణింపబడని కావ్యంయొక్క ముఖం చూడకూడదని విద్యానాథుడంటాడు. అంత తీవ్రవాదులైన ఆలంకారికుల ఒత్తిడికి మహాకవులు బాణునివంటివారు ఈరీతిగా నాయకోత్కర్షను కల్పించుకుంటారు. హర్షచరితలో నాయకోత్కర్షతో పాటు ఇతివృత్తకల్పనలో వైచిత్రి, నానారసపోషణము, సహృదయ హృదయావర్జకంగా వుంటుంది.

వ్యక్తి వివేక వ్యాఖ్యానంలో "రుయ్యకుడు" హర్షచరితను గూర్చి చేసిన ప్రస్తావన యీ సందర్భంలో స్మరింపదగినది.—

హేమ్నో భారశతాని వా మదముచాం బృందాని వా దంతినాం
(శ్రీ)హర్షేణ సమర్పితాని కవయే బాణాయ కుత్రాద్యతత్
యా బాణేన తు తస్య సూక్తినికరై రుట్టంకితాః కీర్తయ
స్తాః కల్పప్రలయే ఽ పియాన్తి న మనాజ్మనాగ్ పరిమ్లానతామ్"

భట్ట బాణకవికి శ్రీహర్షుడు సమర్పించుకొన్న బంగారపు మూటలు, మదగజముల గుంపు లీ నాడెక్కడున్నాయి. కానీ బాణుడు తన సూక్తి సుధలతో చిత్రించిన హర్షునికీర్తులు కల్పాంతమునగూడా మాసిపోనివిగదా!

—షేరాల భరతశర్మ.

అనుబం౹

## రచనలో ఉపకరించిన గ్రంథములు


1. కృష్ణయజుర్వేదీయసంహిత
2. ఐతరేయ బ్రాహ్మణము
3. శతపథ బ్రాహ్మణము
4. బృహదారణ్యకోపనిషత్తు
5. కామకలావిలాసము
6. భారతీనిరుక్తి
7. ధ్వన్యాలోకము
8. సౌందర్యలహరి
9. కావ్యాదర్శము
10. కావ్యాలంకార సూత్రవృత్తి
11. సాహిత్యదర్పణము
12. ప్రతాపరుద్రీయము
13. మనుస్మృతి
14. బృహత్కథామంజరి
15. భగవద్గీత
16. ఛందఃశిల్పము — డా॥ పాటిబండ మాధవశర్మ
17. కాదంబరి–ఏక్ అధ్యయన్
    — శ్రీవాసుదేవచరణ్ అగర్వాల్
18. కాదంబరి – కావ్యము
    చంద్రకలా విద్యోతిని వ్యాఖ్యతో
    (చౌకంబా 1961)

19. గురుబాలప్రబోధిక - అమరకోశము
20. ఔచిత్యవిచారచర్చ
21. శ్రీ లలితా రహస్యనామ సహస్రగూఢార్థదీపిక
22. వాల్మీకి రామాయణము
23. అలంకారశేఖరము
24. అప్పకవీయము
25. అభిజ్ఞాన శాకున్తలమ్
26. రాజతరంగిణి
27. ఉత్తరరామచరితము

నాపిత బాలకృష్ణ కవినాథుఁడు దైవికభావనా మహా
శ్రీ పరిణాహమాత్మసుతుఁ జెందఁగఁ జేసిన పుణ్యమూర్తి వా
ణీపతి లోకవాసమున నిచ్చలునాత్మ రమింపనుండ నా
నాపయి నీకటాక్షకలనమ్ము ఫలమ్ముగ వేంకటేశ్వరా !

వ్రాలితి నీపదాబ్జములపైనను గౌతమగోత్రజుండ, పే
రాలను లింగరాజ కవిరాజుని పౌత్రుఁడ బాలకృష్ణ ధీ
శాలికి రాజ్యలక్ష్మికిని సత్సుతుఁడన్ భరతాభిధానుఁడన్
మేలుఁగ నేలుకొమ్మ యలమేలు సతీప్రియ ! వేంకటేశ్వరా !

